వీరభద్రరావు, చిలుకూరి

జీర్ణ కర్ణాటకరాజ్యచరిత్రము, అను పేరుగల
శ్రీకృష్ణదేవరాయ చరిత్రము

ఏలూరు, 1903

Record no. 802

Vīrabhadrarāvu, Cilukūri

Jīrṇa Karṇāṭakarājyacaritramu, anu pērugala Śrīkṛṣṇadēvarāya caritramu

Ēlūru, 1903

Record no. 802

వీరభద్రరావు, చిలుకూరి, 1872-1939.
జీర్ణ కర్ణాటకరాజ్యచరిత్రము, అను పేరుగల శ్రీకృష్ణదేవరాయ చరిత్రము / చిలుకూరి వీరభద్రరావుచే రచియింపంబడినది.- 1st ed.- ఏలూరు : మంజువాణీ ముద్రాక్షరశాల, 1903.
294 p. ; 21 cm.
Record no. 802

Vīrabhadrarāvu, Cilukūri, 1872-1939.
Jīrṇa Karṇāṭakarājyacaritramu, anu pērugala Śrīkṛṣṇadēvarāya caritramu / Cilukūri Vīrabhadrarāvucē raciyimpambaḍinadi.- 1st ed.- Ēlūru : Mañjuvāṇī Mudrākṣaraśāla, 1903.
294 p. ; 21 cm.
Record no. 802






# KRISHNADEVARAYA CHARITRUM.



BY

CHILUKURI VEERABHADRARAU.

*Ellore.*





ELLORE,
MANJUVANI PRESS.
1903.

 [*Price 1-4-0.*

Printed by N. ChalapatiRau.

# జీర్ణకర్ణాటకరాజ్య చరిత్రము

అను పేరుగల

# శ్రీ కృష్ణదేవరాయ చరిత్రము.

ఇది

చిలుకూరి వీరభద్రరావుచే

రచియింపఁబడి

మంజువాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1903.



[*Price Rs. 1-4-0.*

First Edition 1000 Copies. Printed by N. C. Rau.

# పీఠిక.

మనదేశములో చరిత్రములను వ్రాయుసలవాటులేని కారణమున మనపూర్వుల యాచారవ్యవహారములను గుఱించిగాని రాజ్యాంగవిషయములను గుఱించిగాని సత్యములగు వృత్తాంతములను దెలిసికొనఁజాలకున్నారము. ఈవిద్యానగరచరిత్రమును వ్రాయవలెనని చిరకాలమునుండి నాకెంతో యభిలాషకలదు. ఈగ్రంథము వ్రాయునపుడు నాకు విశేషముగాఁ దోడ్పడినది రాబర్టుస్యూయలుదొరగారి [Robert Sewell. I. C. S. M. R. A. S. F. R. G. S] "మఱచిపోయినరాష్ట్ర" మను నర్థమిచ్చు A Forgotten Empire అనుగ్రంథము అయినను ఇతరగ్రంథములనుండి పెక్కువిషయములు గ్రహింపఁబడినవి. తఱువాత రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారియాంధ్రకవులచరిత్రయును, గురుజాడ శ్రీరామమూర్తి పంతులు గారి యాంధ్ర కవిజీవితములును మఱికొన్ని విదేశీయ చరిత్రకారులు వ్రాసిన హూణభాషాగ్రంథములును, పూర్వకవిప్రణీతములగు ప్రబంధములును నాకు సహకారులయినవి. స్యూయలుదొరగారు మనదేశచరిత్రములను వ్రాసిమనకు మార్గప్రదర్శకు లయినందులకు మనమెల్లఱమును కృతజ్ఞతచూపవలసియున్నయది. నే నీగ్రంథము వ్రాయుటకుఁ బ్రారంభించినది మొదలుకొని యంతరాయములెన్నో సంభవించి మనోవ్యాకులత్వమును గలిగించినవి కాని దైవానుగ్రహమువలన నెట్లో గ్రంథమునుముగించితిని. నాగ్రంథమును జక్కఁగా ముద్రించిన మంజువాణీ ముద్రాక్షర శాలాధికారులకుఁ గృతజ్ఞతా వందనములను దెలుపుచున్నాఁడను. చరిత్రమువ్రాయుటలో నిదియే ప్రథమప్రయత్నమగుటవలన నిందు పెక్కుదోషము లుండవచ్చును. రెండవకూర్పునందవియెల్ల సంస్కరించుకొందునని విన్నవించుకొనుచున్నాఁడను. బుద్ధిమంతులు గుణమునే గ్రహింతురుగాక!

చిలుకూరి వీరభద్రరావు.



# అంకితము.

సీ. సురుచిరాపస్తంబ-సూత్రుఁడై వాధూల,
మునిగోత్రజన్ముఁడై -భూమిపాల।
కాష్ఠానపూజ్యుఁడై -యాత్వేలవారిలో,
మాన్యుఁడై యుప్పారె-మహితయశుఁడు।
చిలుకూరిసాంబస-చివమణిపుత్త్రిల,
శెక్యంద్రఁగాంచెను-బెంపుమీఱ।
వారలలోఁబస-వనమంత్రిసకలవి,
ద్యాభూషణుఁడయి ప్ర-ఖ్యాతినొందె।

గీ. నట్టిప్రథితగుణునకు రా-మాంబయందుఁ।
బుట్టియీశ్వరభక్తుఁడై-పుణ్యశీలుఁ।
డై బహుకళాసమన్వితుఁ-డై కడింది।
పేరుగొనియెమజ్జనకుండు-వీరరాజు॥

సీ. కలలోననైనను-గర్వించిపతియాజ్ఞ,
మీఱిమెలఁగనిసా-ధ్వీలలామ॥
వికలాంగులనుగాంచి-వెతనొందియన్నవ,
స్త్రంబులఁదన్పెడు-సదయహృదయ।
వరులసొమ్మునుదృణ-ప్రాయముగఁదలంచి,
దరిఁజేరకుండెడు-ధన్యచరిత।

తనవారు పెఱవార-లనుభేదమింతయుఁ,
జూపకసమబుద్ధిఁ-జూచుసుమతి॥

గీ. మాటమాత్రముననయిన-మఱచిబొంకు।
పలికినిందఁబొందనిసత్య-వాగ్ధురీణ।
అట్టినాతల్లి సీతాంబ-నధికభక్తిఁ।
జేరిబహునమస్కృతులను-జేయువాఁడ॥

గీ. వారలయెడనాకుంగల-భక్తిఁదెలుప।
సకలబంధుజనంబులు-సన్నుతింపఁ।
గృష్ణదేవరాయచరిత్ర-మేనువారి।
కంకితము సేతుఁ బ్రాభవ-మతిశయింప॥



# జీర్ణకర్ణాటకరాజ్యచరిత్రము.

## మొదటిప్రకరణము.

పదమూఁడవ శతాబ్దము— అల్లా ఉద్దీన్ దండయాత్ర— హరిపాల దేవుని మరణము— తురుష్కులు దేవగిరినిజయించుట— ప్రతాపరుద్రుని విజయము— ఉల్గుఖానుని పరాజయము— ఢిల్లీచక్రవర్తి ప్రతాపరుద్రునితోఁ బోరాడుట— ప్రతాపరుద్రుని కారాబద్ధునిగాఁ జేయుట— మంత్రియుగంధరుని చిత్రకథ— మహమ్మదుటోగ్లాకు చక్రవర్తియొక్క క్రూరకృత్యములు— ప్రతాపరుద్రునిధనాగార రక్షకులగు హరిహరబుక్కరాయలు పాఱిపోవుట— ఆనెగొందిసంస్థానము— మాధవవిద్యారణ్యుల చరిత్రము— విద్యానగరము—



చరిత్రములలో నెల్ల సుప్రసిద్ధమగువిద్యానగర చారిత్రమింతవఱకు నాంధ్రప్రపంచమునకంతకు స్వప్నగతవృత్తాంతంబువగిదినున్నయది. దక్షిణహిందూదేశంబునఁ జంద్రధ్వజులప్రభ వెలుంగనీయక త్రిశతాబ్దము లడ్డుపడి నిలిచి కీర్తిప్రతాపముల నాసేతుహిమాచలపర్యంతము మాత్రమేగాక పశ్చిమ ఖండమునకు సైతము వ్యాపింపఁ జేసిన విద్యానగర రాజ్యలక్ష్మీవిలాసములు చరిత్రముననే యంతరించిన విధంబుఁ దలపోసిన నేయాంధ్రునకమితవిచారంబును గూర్పకపోదు? అకటా! ఈశ్వరసంకల్ప మిట్టిదనియల్పజ్ఞులమగు మనబోంట్లకెట్లు దెలియనగు? అట్టి విద్యానగర చరిత్రమున సుప్రసిద్ధిఁగాంచిన కీర్తిప్రతాపశాలియగు శ్రీకృష్ణదేవరాయని యద్భుతకథనంబు విన నెవ్వానికి మనోహరంబును గర్ణరసాయనంబును గావింపకుండును? ఈవిద్యానగరమునకు విజయనగరమని ప్రసిద్ధనామముగూడఁగలదు. విద్యానగర నిర్మాణమును

గూర్చిన చరిత్రము నొకించుకనిటఁ దేట పఱచినం గాని చదువరుల మనస్సరసీరుహంబులు వికసింపకుండుటయెగాక చరిత్రకారునియందుఁ గొండొకదోషారోపణముఁ జేయనవకాశముగనుపట్టకపోదు. పదమూఁడవ శతాబ్దాంతమునం దుత్తర హిందూస్థాన మంతయుఁ దురుష్కప్రభువుల పాలఁబడియనేక శతాబ్దములనుండి పాదుకొనియున్న ధనలక్ష్మికిఁ జలనము కలుఁగఁగానే దరిద్రదేవతా పీడితులై యనామకులై చిరకాలమునుండి తమపూర్వులుగాపాడుచున్న శౌర్యలక్ష్మిని సయితముఁగోలుపోయి కకావికలయి యాదేశపు ప్రజలు వారుపెట్టెడుబాములకు నెల్లఁదలయొగ్గిచూడ దిక్కు లేక మ్లేచ్ఛప్రతాపాగ్నికి మిడుతలంబోలె మ్రగ్గుచుండిరి. ఆకాలమునదక్షిణహిందూదేశమున మాత్రము శూరాగ్రేసరులగు హిందూరాజులు పెక్కండ్రు పరిపాలకులుగానుండి శతవిధముల మహమ్మదీయులతోడి సంపర్కము గలుగకుండఁ గాపాడుకొనుచుండిరి. మహారాష్ట్రదేశమునకు రాజధానియగు దేవగిరిపట్టణమును హరిపాలదేవుఁడను యాదవవంశజాతుఁడు పాలించుచుండెను. త్రిలింగదేశమును బ్రతాపరుద్రులను బేరుతోఁ గాకతీయ వంశజులగు క్షత్రియులేకశిలానగరమను నామాంతరముగల యోరుగల్లుపురము రాజధానిగాఁ జేసికొని భూరిపరాక్రమమున శత్రుజనభయంకరులయి ప్రజాపాలనముసలుపుచుండిరి.

పాండ్యరాజులు దక్షిణమధురాపురమునందును, చోళరాజులు కాంచీనగరమునందును, భళ్ళాణరాజులు ద్వారసముద్రము రాజధానిగా హొయిసల (Mysore.) దేశమునందును, గజపతులనెడు కళింగరాజులును రెడ్డిరాజులును, తూర్పుతీరమునఁ గటకము, రాజమహేంద్రపురము, కొండపల్లె, వినుకొండ, కొండవీడు, కనకగిరి, ఉదయగిరి మొదలుగాఁగలదుర్గములను బాలకులుగానుండి పాలించుచుండిరి. ఉత్తర హిందూస్థానమునఁ గాలునిలుపలేక ధనలక్ష్మి దక్షిణదిగ్భాగమునకుఁ బాఱివచ్చి తెలుంగునాయకుల శరణు వేఁడి



వారియండనుజేరియుండి మహమ్మదీయప్రభువులకు మోహాతిరేకమునుగలిగించుచుఁ జిత్తవిభ్రాంతులనుజేయఁగా వారలు నర్మదానదినిదాటి దక్షిణదిశాపథంబునకురాఁదొడంగిరి. ఢిల్లీపాదుషాయగు జిలాలుద్దీనునకు మేనల్లుఁడును, అయోధ్యానబాబునగు "అల్లాఉద్దీన్‌కిల్జీ" అనువాఁడు దక్షిణదిగ్విజయయాత్రకై దాడివెడలి వచ్చి దేవగిరినిముట్టడించెను. నాలుగుసంవత్సరముల కావలఘూర్జరమునుజయించెను. త్రిలింగదేశమునుబట్టుకొని ప్రతాపరుద్రునితోఁ బ్రబలయుద్ధముఁజేసి పరాజితుఁడయ్యెను. తదనంతర మాతనిసేనానాయకుండగు 'మలిక్కాఫర' నువాఁడుభూరిసైన్యముం గూర్చుకొనివచ్చి త్రిలింగదేశముపైఁబడి యోరుగల్లుముట్టడించి ప్రతాపరుద్రునిజయించి ద్వారసముద్రముఁజక్కడంచి తత్పరిపాలకులగు భళ్ళాణరాజులఁ బరాజితులనుజేసి తద్దేశమును స్వవశముఁ జేసికొని యెందునెదురులేక పశ్చిమతీరమునందలి కేరళదేశమునకుఁ బోయి యచట మసీదునొకదానిఁగట్టించి యటనుండి కన్యాకుమార్యగ్రమువఱకుఁజని రామేశ్వరమునకేగి హిందూదేవాలయములనుగూల్చి హిందువుల యైశ్వర్యమునంతనుజూఱఁగొని స్వదేశమునకు వెడలిపోయెనని చెప్పుదురు. పిమ్మటగొంతకాలమునకు "ముబారక్కు" నువాఁడు మఱల దేవగిరిపై దండెత్తివచ్చి దురదృష్టవంతుఁడైన హరిపాలదేవునిఁజెఱఁబట్టి బ్రతికియుండఁగానే వానిచర్మమొలిపించి శిరస్సుఖండించి దేవగిరిపట్టణ ముఖద్వారమునందుగట్టించి హిందువులకు వెఱపుకలిగించెను. హిందూదేశమున నాకాలమున నిట్టిచిత్రవధలకుఁ గఱవులేకుండెను. ౧౩౦౯ వ సంవత్సరమునఁదురక లేకశిలానగరమని పిలువంబడెడు నోరుగల్లుమీఁదికి దండెత్తివచ్చి యోడింపఁబడియు రెండవసారిజరిగిన యుద్ధమునందు విజయమునొంది ప్రతాపరుద్రునిచేత ఢిల్లీ పాదుషాకుఁ గప్పముఁ గట్టునటులఁ జేయఁగాఁ గాకతీయప్రభువుగొంతకాలముఁగప్పముఁగట్టియు మానుకొనఁగా నప్పటి ఢిల్లీపాదుషాయగు "టోగ్లాకుచక్ర

వారియందనుజేరియుండి మహమ్మదీయప్రభువులకు మోహాతిరేకమునుగలిగించుచుఁ జిత్తవిభ్రాంతులనుజేయఁగా వారలు నర్మదానదినిదాటి దక్షిణదిశాపథంబునకురాఁదొడంగిరి. ఢిల్లీపాదుషాయగు జిలాలుద్దీనునకు మేనల్లుఁడును, అయోధ్యానవాబునగు "అల్లా ఉద్దీన్ కిల్జీ" అనువాఁడు దక్షిణదిగ్విజయయాత్రకై దాడివెడలి వచ్చి దేవగిరినిముట్టడించెను. నాలుగుసంవత్సరములకావలఘూర్జరమునుజయించెను. త్రిలింగదేశమునుబట్టుకొని ప్రతాపరుద్రునితోడఁ బ్రబలయుద్ధముఁజేసి పరాజితుఁడయ్యెను. తదనంతర మాతనిసేనానాయకుండగు 'మలిక్కాఫర' నువాఁడుభూరిసైన్యముం గూర్చుకొనివచ్చి త్రిలింగదేశముపైఁబడి యోరుగల్లుముట్టడించి ప్రతాపరుద్రునిజయించి ద్వారసముద్రముఁజక్కడంచి తత్పరిపాలకులగు భళ్ళాణరాజులఁ బరాజితులనుజేసి తద్దేశమును స్వైవసముఁ జేసికొని యెంమనెదురులేక పశ్చిమతీరమునందలి కేరళదేశమునకుఁ బోయి యచట మసీదునొకదానిఁగట్టించి యటనుండి కన్యాకుమార్యగ్రమువఱకుఁజని రామేశ్వరమునకేగి హిందూదేవాలయములనుగూల్చి హిందువుల యైశ్వర్యమునంతనుజూఱఁగొని స్వదేశమునకు వెడలిపోయెనని చెప్పెదరు. పిమ్మటఁగొంతకాలమునకు "ముబారక్కు" నువాఁడు మఱలదేవగిరిపై దండెత్తివచ్చి దురదృష్టవంతుఁడైన హరిపాలదేవునిఁజెఱఁబట్టి బ్రతికియుండఁగానే వానిచర్మమొలిపించి శిరస్సుఖండించి దేవగిరిపట్టణముఖద్వారమునందుగట్టించి హిందువులకు వెఱపుకలిగించెను. హిందూదేశమున నాకాలమున నిట్టిచిత్రవధలకుఁ గఱవులేకుండెను. ౧౩౦౯ వ సంవత్సరమునఁదురక లేకశిలానగరమని పిలువంబడెడు నోరుగల్లుమీదికి దండెత్తివచ్చి యోడింపఁబడియు రెండవసారిజరిగిన యుద్ధమునందు విజయమునొంది ప్రతాపరుద్రునిచేత ఢిల్లీపాదుషాకుఁ గప్పముఁ గట్టునటులఁజేయఁగాఁ గాకతీయప్రభువుగొంతకాలముఁగప్పముఁగట్టియు మానుకొనఁగా నప్పటి ఢిల్లీపాదుషాయగు "టోగ్లాకుచక్ర

వర్తి" కోపోద్దీపితుఁడై ౧౩౨౧ వ సంవత్సరమునఁ బ్రతాపరుద్రుని శిక్షించుటకై తనకొడుకగు "ఉల్గుఖానునిఁ" బంపెను. కాని, ప్రతాపరుద్రుని పరాక్రమమునకు నోర్వంజాలక 'ఉల్గుఖానుఁడు' స్వరాష్ట్రమునకుఁ బాఱిపోయెను.

ఈ యవమానమును భరింపఁజాలక తురుష్కప్రభువులు పాదుషావలనఁ బ్రేరేపింపఁబడి యనేక సైన్యములం గూర్చుకొని తిరిగి వచ్చి త్రిలింగరాజ్యము నాక్రమించి ప్రతాపరుద్రునితోడఁ బిశాచములరీతిఁ బోరాడి యాతని నోడించి పట్టుకొని కారాబద్ధునిగాఁ జేసి ఢిల్లీనగరమునకుఁ గొనిపోయిరి. ఇది ౧౩౨౩ వ సంవత్సరమున జరిగిన సుప్రసిద్ధమైన చరిత్రాంశము. ఈప్రతాపరుద్రుఁడు యుగంధరమంత్రి బుద్ధిచాతుర్యమువలనఁ దప్పించుకొనివచ్చెనని చిత్రమైనకథ యొక్కటి చెప్పుదురు. తురుష్కులు ప్రతాపరుద్రునిఁ గొనిపోయినతరువాత మంత్రి యుగంధరుఁడు మనోహరమయిన పడవ నొకదానిని గట్టించి యాపడవనిండ రత్నఖచితములైన యాభరణములను వేసికొని వాణిజ్యమిషనుబూని గంగానదిమీఁదుగాఁబోయి ఢిల్లీనగరముఁ జేరి యమ్మకమునిమిత్తమై యమూల్యములగు రత్నాభరణములను దెచ్చితిమని పాదుషాకుఁ దెలియఁ బంపి పాదుషా వచ్చి చూచుటకై యొకదినమేర్పాటుచేయించెను. తానొక పిచ్చివాని వేషమును ధరియించి వీథులలోఁ దిరుగుచు కేటికిన్నిదినములకుఁ జక్రవర్తినిఁ గారాబద్ధునిఁగాఁ జేసి గొనిపోయెదవని యొక చింపిచేటలోఁ జాటుచు రాత్రులూరి వెలుపలనున్న యొక వటవృక్షముక్రింద శుచియై వంటచేసికొని భుజించుచు నటించుచుండెను. ఈ చందమునఁ బ్రతిదినమును జేయుచుండుట రాజభటులు చూచి యనుమానించి రాత్రులీతఁడు మఱ్ఱిచెట్టువంకఁ బోవుచుండుటఁ గనిపెట్టి ఒకనాఁడు పగలు గూఢముగాఁ బోయి చెట్టుమీఁదనెక్కి కూరుచుండియుండిరి. అతఁడు వెనుకటి రీతిగా నూరెల్లఁ దిరిగి వచ్చి శుచియై వంటచేసికొని తినుటకన్నము విస్తరిలో వడ్డించుకొన్నతరువాత నతని కావులింతయొకటి వచ్చెనఁట అప్పుడతఁడు వింతలేనిది యావులింత రాదనుకొని నిదానించిచూచి వెన్నెలలోఁ జెట్టునీడనుబట్టి పయినెవ్వరో మనుష్యులున్నారని దెలిసికొని పయివంకఁ జూడక వడ్డించుకొన్న యన్నముమీఁద వంట చేసిన కుండను బోర్లించి విస్తరిచుట్టును మువ్మాఱు ప్రదక్షిణములు చేసి ఢిల్లీ చక్రవర్తిని పట్టుకొని తమయూరు కొనిపోదుమని పెద్ద కేకవేసి తన చేతికఱ్ఱతోఁ గుండను బగులఁగొట్టి యన్నము తినక లేచిపోయెనఁట! వారలంతట నతఁడు పిచ్చివాఁడని నిశ్చయముచేసికొని వెడలిపోయి పాదుషాకాసమాచారమంతయుఁ దెలిపి తమ తమ పనులమీఁద నుండిరి. గడువుదినమునఁ బ్రతాపరుద్రునిఁ దనవెంట నుంచుకొని పరిమిత పరివారముతో ఢిల్లీపాదుషా పడవయొద్దకుపోవుటకు బయలుదేఱఁగా యుగంధరుఁడు చక్రవర్తినిప్పుడే పట్టుకొని పోయెదమని చింపిచేటతోఁ జాటుచు వెంబడించెను. పిచ్చివాఁడనిభావించుటచేత నలక్ష్యముచేసి రాజభటులు వెంటరానిచ్చిరి. చక్రవర్తిపరిజనులకుఁ దెలియకుండ యుగంధరుఁడు యోడనెక్కి చక్రవర్తి లోననుండఁగా, నిదే చక్రవర్తినిఁ బట్టుకొనిపోవుచున్నామని చాట మొదలుపెట్టెనఁట! చక్రవర్తి రత్నఖచితములైన యమూల్యాభరణములను బరిశోధించుచుఁ గొంతసేపు లోపలనుండి బయలకువచ్చి చూచునప్పటికి యోడ రేవువదలి బహుదూరము వచ్చియుండెనఁట.

అంతనతఁడు శత్రువుల కుతంత్రమును దెలుసుకొని త్రిలింగరాజ్యమును మఱలఁ బ్రతాపరుద్రునికిచ్చి సమాధానముచేసికొని యాతనిని విడిచిపుచ్చి తానుతప్పించుకొనివచ్చెనఁట! ఈకథ పరంపరగాఁ జిరకాలమునుండి యాంధ్రదేశమున వాడుకొనఁబడుచున్నది కాని గ్రంథస్థములగు నిదర్శనములేవియుఁగానరావు. ఢిల్లీపాదుషాయగు టోగ్లాకుచక్రవర్తి దౌష్ట్యముంగూర్చిన విచిత్రకథలు దేశమందంతట వ్యాపించి హిందువులగుండియల భేదించుచుండెను

టోగ్లాకుపద మాంబాలవృద్ధులకు భయంకరముగానుండెను. ఆకాలములో నద్దురాత్ముఁడుచేయు ఘోరహత్యలకు మేరలేకుండెను. ఈశ్వరసృష్టిలోని మానవకోటినంతనిర్మూలింప భూతలముననవతరించినకాలుని యపరావతారమోయనునట్లుగాఁ గ్రూరకర్ముఁడై నిర్దయాత్ముఁడై పాపభీతినించుకయులేక నిరపరాధులగు ప్రజలను పశువులనుబట్టి నఱికించువిధముననఱికించి రక్తనదులనుబఱపించి వినోదించుచుండెను. నిర్హేతుకముగా మనుష్యులనేట్టివధించు నీపాపాత్ముఁడు హిందువులచేమిక్కిలి గౌరవముతోఁజూడఁబడుగోవుల నేల నఱికింపకుండును? వేయేల! హిందువులమానప్రాణ ధనంబులకు రక్షణములేకుండెను. మహమ్మదు టోగ్లాకు ఢిల్లీసింహాసన మాక్రమించుకొన్న కొద్దికాలములోనే మొగలాయీలు వాయవ్య దిశనుండి పంజాబుదేశముమీఁదుగా నీదేశమునకుఁ దండోపతండములుగా వచ్చిఢిల్లీనగరముపైఁ బడినవార్తవిని వారలకు లెక్కలేని బొక్కసమునంతఁద్రోచిపుచ్చి రాజ్యము నిలుపుకొనెను. బంగాళాదేశమున "ఘియాసుద్దీను బహదూర" నువాఁడుకొంతకాలమునుండి టోగ్లాకునకు లోఁబడక స్వతంత్రాధికారమునుబొంది వంగదేశమునుబాలింపవలెనని ప్రయత్నించుచుండెను. వాఁడుచక్రవర్తినాణెములకు మాఱుగాస్వంతనాణెములను ముద్రించుచువచ్చెను. ఈ వార్తటోగ్లాకునకుఁ దెలియవచ్చి ౧౩౩౩ వ సంవత్సరమున వానిపై దండెత్తి పోయెను. వంగదేశమున ఘియాసుద్దీనుతోడ ఘోరయుద్ధములనేకములు సలిపి కట్టకడపటఁ గదనరంగమున వానినోడించి వానిజీవముండఁగానే వానిచర్మమొలిపించి యెండుకసవునకుఁ జుట్టఁబెట్టించి తలదిండుగాఁజేయించి యాక్రూరప్రదర్శనము డంబముగా దేశమునందంతట నగపఱచుచు రాజధానీ పరిపాలకులకు వెఱపుకలిగించి దిగ్విజయమునుబ్రకటించెను. మహమ్మదీయచరిత్రకారులాతని చరిత్రము ప్రపంచమునందలి చరిత్రములలో నెల్ల నద్భుతమగు చరిత్రమనివ్రాసిపెట్టిరి. మఱియునాతఁడుదారగుణము



కలవాఁడనియు, శాస్త్రజ్ఞులపాలిఁటికి మహాదాతయనియు, గొప్పవిద్వాంసుఁడనియుఁ జరిత్రములలో వ్రాసియుంచిరి. ఆతఁడురోగులకువైద్యశాలలును, దిక్కులేనిబిడ్డలకును, అనాథలగు వితంతువులకును శరణాలయములను గట్టించెననిచెప్పుదురు. వెండియునాతఁడు వక్తృత్వమునందారితేఱినవాఁడట. ఇంతియగాక తర్కజ్యోతిషగణితవైద్యశాస్త్రములయందసమాన ప్రావీణ్యము కలవాఁడఁట. ఇట్టిసుగుణములను గలిగియుండియుఁ దనప్రజలపట్ల దయారసమునులేశమాత్రమును జూపక కిరాతవృత్తిఁబూని వారి పాలింటి మృత్యుదేవతయై యుండెనని ఫెరిష్టాయను మహమ్మదీయుఁడు వ్రాయుచున్నాఁడు.

వాని జీవితకాలములో రాజభవనద్వారసమీపమున నేరాజకీయోద్యోగునియొక్కయో లేక యేనిరపరాధియగుమానవునియొక్కయో శవము పడియుండని దినము లేకుండెనఁట! ఇంతియుఁ గాక పిచ్చిపనులనేకములను గావింపుచుండెను. ఒకప్పుడు దినమునకుఁ గోటిరూకలుచొప్పున తనక్రింది ప్రభువులకు దానముచేయుచుండెను. మఱియొకప్పుడు శత్రువులగు మొగలాయీలకు లంచములు విరివిగానిచ్చి సాగనంపుచుండెను. వేఱొకప్పుడు మూఁడులక్షల డెబ్బదివేల సైనికులను పారశీకదేశమును జయించుటకై పంపఁగా వారలకు జీతబత్తెములు ముట్టనందున దండయాత్రను మానుకొని విడిపోయి దేశములమీఁదఁబడి దోచుకొనుచుండిరి. ఇంకొకప్పుడు లక్ష సైనికులను చీనాదేశమును జయింప హిమాలయ పర్వతములమీఁదుగాఁ బంపెనుగాని యందొకఁడైన బ్రదికియుండు భాగ్యమును టోగ్లాకు చూచియుండలేదు. అందఱును హిమాలయమునఁ జిక్కుకొని చచ్చిరి. హతశేషులగువారలొకఱిద్దఱు చావు తప్పించుకొనివచ్చినను జక్రవర్తి చేతిలో వారికి మరణము దప్పినదికాదు. బంగారునాణెములకు బదులుగా రాగినాణెములను వాడుకొనవలసినదిగా నాజ్ఞచేసెను. అందువలన లాభ

మదుగంటి దేశమున వర్తకము నిలిచిపోయినది. ధనాగారమంతరించుటఁజేసి వ్యవసాయకులనుబట్టి హింసింపఁగా వారలు భూములను విడిచి వర్తకమునకు మాఱుగా దారిదోపిడులను మొదలుపెట్టిరి. అందువలనఁ బట్టణములు, పల్లెలు, జనశూన్యములై దరిద్రదేవతకాలవాలములై యుండినవి. లక్షలకొలఁది జనులు క్షుద్బాధాపీడితులై దిక్కులేని పక్షుల విధంబున మలమలమాడుచుఁ జచ్చుచుండిరి. ఒక దేశమునఁ బ్రజలు తిరుగఁబడుటచేతఁ దన సైనికులను బంపి వేటాడించి చంపించెను. కన్యాకుబ్జములోని నివాసుల నెల్లఱను ముమ్మాఱు నఱికించెను. ఇట్టి వైపరీత్యములవలన దేశమంతయు క్షామదేవతపాలఁబడెను. ఒకప్పుడు దేవగిరినుండి వచ్చునప్పు డొకదంతమూడిపోఁగా దానిని బాతిపెట్టించి దానిపై గొప్ప గోరీనొకదానిఁ గట్టించుటకై విశేషద్రవ్యమును వెచ్చఁబెట్టించెను. దేవగిరి పట్టణమునకు దౌలతాబాదని పేరుపెట్టి యాఱువందల మైళ్ళ దూరముననున్న ఢిల్లీనగరమునుండి తన్నగరవాసులను దేవగిరికి రావలసినదని నిర్బంధపెట్టెను. అందఱును జక్రవర్తియాజ్ఞకు లోఁబడవలసినవారయిరి. బిడ్డలును, స్త్రీలును, వృద్ధులును, రోగులును బెక్కండ్రు మార్గమధ్యమునఁ బ్రాణములను విడిచిరి.

ఈ క్రూరవిధమును బ్రత్యక్షముగా వీక్షించిన "ఇబూబ చూటా" యనునాతఁడు "పురవాసులు ఢిల్లీనగరమును దత్క్షణమే విడిచిపెట్టవలెనని సుల్తాను గట్టడచేసెనుగాని ప్రజలు గొంతకాలము జాప్యముచేసినందున నెవఁడా పట్టణవాసియై యుండియు నిండ్లలోఁగాని వీథులలోఁగాని నిలిచి యుండునో వాఁడు మరణశిక్షకుఁ బాత్రుఁడగునని చాటఁబంచెను. అందఱును ఢిల్లీనగరమును విడిచిపెట్టిరి కాని వానిభటులొకయింటనొక గ్రుడ్డివానిని మఱొకయింటనొక దీర్ఘరోగినిఁబట్టికొని చక్రవర్తిముందుఁబెట్టఁగా నాతఁడు రోగిని మెట్టపైనుండి దూరముగా విసరివేయవలెననియు, గ్రుడ్డివానిని పదిరోజులపయనములోనున్న దౌలతాబాదున కీడ్చుకొనిపోవల



సినదనియు నుత్తరవుచేసెను. ఆప్రకారము జరిగింపఁబడెను. తుదకు గ్రుడ్డివానికాలొకటి మాత్రమాతని యాజ్ఞాప్రకారము గమ్యస్థానమునకుఁ దీసికొనిపోఁబడి విడిచిపెట్టఁబడినది. నేనుఢిల్లీనగరముప్రవేశించి యదిమిక్కిలిపాడుపడి యడవివలె నుంటఁ గనుఁగొంటిని." అనివ్రాసియున్నాఁడు. ఇతనినిజమైనపేరు "షేక్ అబూ అబ్దుల్లా మహమ్మదు" అని తెలియవచ్చినది. మహమ్మదుటొగ్లాకు చిత్రచర్య యింతటితోఁ దుదముట్టలేదు. అతఁడుమఱల నాయామండలములలోని ప్రజలనుఢిల్లీనగరమును నివాసముగాఁ జేసికొనవలసినదని పలువిధముల నిర్బంధపఱుపసాగెనుగాని వానియుద్దేశముపూర్ణముగా ఫలింపలేదు. నగరమిట్టిదురవస్థలోనున్న యాకాలమున నాతఁడు నిజాంతఃపురసౌధాగ్రమునకెక్కి నిప్పుయునుబొగయునులేని యాపాడుపట్టణమున నలుగెలంకులఁగలయంజూచి "ఇప్పుడుగదా నాహృదయము సంతృప్తిఁగాంచినది! నాయూహలు కొనసాగినవి" అని తనసంతోషమును దానుదెలుపుకొనుచుండెను.

మహమ్మదీయచరిత్రకారులీ టొగ్లాకుచక్రవర్తినిగుఱించియెట్టియభిప్రాయములు గలిగియున్నను నిరంతరకరుణాపరిపూర్ణములగు హిందూహృదయముల కీతనిప్రవర్తనము దుష్ప్రవర్తనముగానే గానుపించకమానదని నేనుదృఢముగానమ్ముచున్నాఁడను. ఒకవిధముగాఁజూచిన విజయనగర రాజ్యనిర్మాణమునకుఁ గారణభూతులు మహమ్మదు టొగ్లాకుచక్రవర్తియు, నాతనియనుచరులునని యునానిశ్చితాభిప్రాయము, ఈపురనిర్మాణమునుగూర్చిన కథలనేకములనేకవిధములుగా గ్రంథములలో వ్రాయఁబడియున్నవి. వానినన్నిఁటిని సమన్వయముఁజేయుటయు మిగులఁ గష్టముగానుండును. టొగ్లాకువంటి ముష్కరులగుతురుష్కులవలన ననుదినమునుబొందుచున్న కడగండ్లమూలముననే హిందువులు తమనివాసభూములను విడచి రక్షకస్థానముఁ గొండొకదానిఁగనిపెట్టవలసినవారైరి. దేవగిరికోటపరాధీనమైనది. ఓరుగల్లుశత్రువులకు రంగస్థలమయిపోయి

నది. హిందువులకునిలుచుటకు దావులేకపోయినది. హతశేషులయినవారికి సురక్షితమైనప్రదేశమొకటి కావలసివచ్చినది. అయ్యదియేవిద్యానగరము. ప్రతాపరుద్రుఁడు పరాజయమునొందినతరువాత నతనిధనాగారమునకు రక్షకులుగానున్న కంపభూపతికుమారులగు హరిహరరాయలు బుక్కరాయలునను నిరువురన్నదమ్ములు తుంగభద్రా తీరమునందున్న కంపిలానగరమని పిలువంబడెడు 'ఆనెగొంది సంస్థానమునం జేరి మహమ్మదీయులవలనఁ బరాజితులయిన హిందువులను జేరఁదీసికొనుచు నాసంస్థానమును బలపఱచుచుండిరి. అప్పుడు మహమ్మదు టోగ్లాకుచక్రవర్తి తనమేనల్లుఁడగు 'బహాఉద్దీన' నువాఁడు తనయధికారమునకులోఁబడక ధిక్కరింపఁగా వానినిశిక్షించుటకై దక్షిణదేశమునకుదండెత్తిరాగా వాడు పాఱివచ్చి 'ఆనెగొంది,సంస్థానాధీశ్వరుని మఱుఁగుఁజొచ్చెను. కంపిలానగరము నానెగొందియు సమీపముననుండుటచేత రెంటిని నేకపట్టణముగానే మహమ్మదీయచరిత్రకారులు భావించినట్టుదోఁచుచున్నది. ఈవార్తవిని క్రోధావేశపరవశుండయి సుల్తాను బహుసేనలంగూర్చుకొని యానెగొందిపురమునుముట్టడించెను. ఆనెగొందిపురవరాధ్యక్షుండు 'బహాఉద్దీనుని' మిత్రుఁడగు ద్వారసముద్రాధీశ్వరుండగు భళ్ళాణదేవునికడకుఁబంపి స్త్రీహత్యాపాపమని దలంపక యంతఃపురంబునకు నగ్నిహోత్రమును దాకొలిపి దయాపాత్రులనక శిశుసహితముగా నెల్లఱనాహుతిఁజేసి సహచరులతోఁ గూడుకొని శత్రువులపైఁబడి మదపుటేనుఁగులంబలెఁబోరాడి రణనిహతులైరని మహమ్మదు అబూఅబ్దుల్లాయనునతఁడు వ్రాయుచున్నాఁడు.

ఆచరిత్రకారుఁడే తత్సంస్థానాధిపతి పుత్త్రులు పదునొకండుగురు ఖైదీలఁగాఁ బట్టుకొనఁబడి మహమ్మదీయ మతావలంబకులుగాఁజేయఁబడిరనియు, చక్రవర్తి వారలనధికగౌరవముతో సమ్మానించెననియు, వారిలోనొకనితోఁదనకు నధికమైత్రి కలదనియుఁ గూ



డ వ్రాసియున్నాఁడు. ౧౩౩౮ వ సంవత్సరమున సుల్తాను ఆనెగొందిపట్టణమును ముట్టడించినతరువాత మాలికనాయబను వానినీదత్పురపరిపాలకునిగా నియమించి స్వదేశమునకు వెడలిపోయెను. సుల్తాను దేశమును విడిచిపోయిన వెంటనె తద్దేశప్రజలునూతన పరిపాలకుల నలక్ష్యముచేసి యెదుర్కొని విజృంభింపఁగా నదివఱకుఁబ్రధానిగానున్న హరిహరరాయలకు రాజ్యము నొప్పగించి మహమ్మదీయపరిపాలకుఁడు స్వరాజ్యముఁజేరుకొనెను. హరిహరరాయలొకనాఁడు సోదరుఁడగు వీరబుక్కభూపాలుతోఁగూడఁ దత్పురిసరారణ్యమునకు వేటాడఁబోయినపుడొక కుందేలు తన వేటకుక్కలను జూచి పఱుగిడుటకుమాఱుగాఁ దిరుగఁబడి యాకుక్కలను గఱచెనఁట! ఆవింతనుగన్నులారఁజూచి హరిహరరాయ లద్భుతప్రమోదంబులు మనంబునఁబెనంగొన నింతునకేమినిమిత్తంబని తదేకధ్యానముతో మరలియింటికిఁజనుచుండఁ దుంగభద్రా నదీతటంబున విద్యారణ్యులని ప్రసిద్ధిగన్న మాధవాచార్యులవారిని గలిసికొనివారికీసమస్తవృత్తాంతమును నివేదించెనఁట! ఆయాచార్యులవారాప్రదేశముననొక నగరమునిర్మించినయెడల జయప్రదముగానుండునని చెప్పిరఁట! హరిహరరాయలాదినముననే పట్టణమునుగట్టుటకు మొదలుపెట్టెనఁట! పట్టణమును గట్టినతరువాత నానెగొందిపురమునువిడిచి తత్పురవాసులతోఁ గూడవచ్చి నూతన పట్టణమునకు విద్యానగరమని నామకరణముఁజేసి యందుఁ బ్రవేశించెనఁట.

ఈవృత్తాంతము నంతయు 'న్యూనీజ' ను విదేశీయచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. ఏది యెట్లులున్నను విజయనగరము మాత్రము మాధవాచార్యులవారి యాజ్ఞచేతఁ గట్టఁబడెననుటసత్యమనినమ్ముటకు లేశమాత్రమునుసంశయములేదు. ఈమాధవాచార్యులవారి చరిత్రముకూడఁ జదువరులకు మనోవేదన గలుగునట్లుగానే చరిత్రములలో నెవరికిఁదోఁచినట్లు వారు వివిధవిధముల వ్రాసియున్నారు. మాధవాచార్యులవారు తుంగభద్రాతీరమునం

దున్న పంపానగరంబునందుఁ జన్మించిన యాంధ్రనియోగిబ్రాహ్మణులు; భారద్వాజగోత్రులు; ఈయనతండ్రిమాయణుఁడు; అన్నసాయణుఁడు; మాధవుఁడు వీరబుక్కభూపాలునకు కులగురువును మంత్రియునై యుండెనని పెక్కుశిలాతామ్రశాసనముల వలనను గ్రంథసవర్ణనములవలనను దెలియవచ్చుచున్నయది. ఈతఁడుగొప్పవిద్వాంసుఁడు. ఆదిశంకరునకుఁదరువాతశంకరాచార్యపీఠమధిరోహించినవారిలో మాధవాచార్యుల వారికిఁ బూర్వమునందుగాని పరమునందుగాని యింతటిపండితులు మఱియెవ్వరును లేరని చెప్పుదురు. ఈమాధవాచార్యులవారు పరాశరమాధవీయ మనుపేరఁ బరాశరస్మృతికొక గొప్పవ్యాఖ్యానమును, శంకరవిజయమనుగ్రంథమును, కాలమాధవీయమను నొకకాలనిర్ణయగ్రంథమును, విద్యారణ్యమని ప్రసిద్ధిగన్న వేదభాష్యమును, నూటయెనిమిదియుపనిషత్తులకొక వ్యాఖ్యానమును, సర్వదర్శనసంగ్రహమును, మాధవనిదానమనునుద్గ్రంథములఁ బెక్కింటినిరచించి వాసిగన్నవాఁడు. ఇతఁడువేదాంతదేశికాచార్యులవారితో సమకాలీనుఁడని దెలియుచున్నది. ఈవేదాంతదేశికాచార్యులవారుక్రీస్తుశకము ౧౨౬౮ వ సంవత్సరప్రాంతమున జన్మించి నూటరెండుసంవత్సరములు బ్రదికి ౧౩౬౯ వ సంవత్సరమున వైకుంఠపదవినొందిరి కాఁబట్టి వారి సహపాఠియగు మాధవాచార్యులువారుగూడ నాకాలమున నుండియున్నారని 'ఆచార్యసూక్తిముక్తావళి' యనుగ్రంథమునుండిమనము గ్రహింపవచ్చును. ఈమాధవామాత్యుఁడు శాలివాహనశకము ౧౨౫౩ అనఁగా క్రీస్తుశకము ౧౩౩౦ వ సంవత్సరమున సన్న్యాసాశ్రమమును స్వీకరించి ౧౩౮౫ వ సంవత్సరమున బ్రహ్మైక్యసంధానమునుబొందెను. మాధవమంత్రి యొక బీదబ్రాహ్మణునకుఁ బుత్త్రుఁడై పుట్టి మహాలక్ష్మినిగుఱించి పురశ్చర్య జరిపెననియు నామెప్రత్యక్షమై యీజన్మమున నాతఁడుతన ప్రసాదమును



బడయుఁజాలఁడనియుఁ జెప్పఁగానతఁడు నిరుత్సాహుఁడయిసన్న్యాసమును స్వీకరించెనని మణిమంజరిభేదినియను గ్రంథమునందు వ్రాయఁబడినది. విద్యారణ్యులు సన్న్యాసమును స్వీకరించుటనుగుఱించి గురుపరంపరయను గ్రంథమున మఱియొకరీతిని వ్రాయఁబడియున్నది. మాధవుని కనిష్ఠసోదరుఁడగు భారతికృష్ణుఁడను నతఁడు శృంగగిరికిఁబోయి యప్పటిపీఠాధిపతియగు వేద్యతీర్థుల వారివలన సన్న్యాసమును స్వీకరింపవలసినదిగాఁ బ్రబోధింపఁబడి యాశ్రమస్వీకారమునుగావించెను. మాధవాచార్యులవారు తమ్మునికిఁ దటస్థించిన దురవస్థనువిని యతనిని నతని గురువునుగూడ గృహస్థులనుగాఁజేసెదనని పంతముపలికి శృంగగిరికిఁబోయి యత్నించియుఁదుదకుఁ దనయభిప్రాయమునుగూడ మార్చుకొనితానుగూడ సన్న్యాసియై విద్యారణ్యస్వామియన్న బిరుదము వహించెను. మాధవాచార్యుఁడునతని సోదరుఁడును నోరుగంటిప్రతాపరుద్రునిపట్టణములో మహిమఁగాంచినయొక బ్రాహ్మణునకుఁ బుత్త్రులనియు, మొదటతమ్ముఁడు సన్న్యాసమునుగైకొనెననియుఁదరువాత మాధవాచార్యులు తనకు ధనమీజన్మమునలభింపదని లక్ష్మి చెప్పఁగా శృంగగిరికిఁబోయి సన్న్యాసమునుస్వీకరించెనని కన్నడాచార్యచరిత్రమునందుఁ దెలుపఁబడినది. కాని పరాశరమాధవీయమను గ్రంథముపై నుదహరించిన గ్రంథములలోని వృత్తాంతములను బూర్వపక్షముచేయుచు ఖండించుచున్నయది. పరాశరస్మృతికి వ్యాఖ్యానము వ్రాయునప్పు డాతఁడు వీరబుక్కభూపాలునకు మంత్రిగానుండెననియుఁ దెలుపుచు 'అమాత్య' యనుశబ్దమును దనపేరునకుఁ జేర్చి ప్రయోగించినాఁడు.

ఈ యమాత్యశబ్దము చిరకాలమునుండి నియోగిబ్రాహ్మణులకు బిరుదుగా వాడుకొనఁబడుచున్నయది. ఈ నియోగిబ్రాహ్మణులాకాలమునందు రాజులయొద్ద మంత్రులుగాను దండనాయకులుగాను, ఆస్థానకవులుగానునుండి యెన్నికఁగాంచినవారుగానుండిరి.

ఇంద్రునకు బృహస్పతివలెను, శ్రీరామునకు వశిష్ఠునివలెను, ధర్మజునకు ధౌమ్యునివలెను మాధవామాత్యుఁడు బుక్కభూపాలునకు మంత్రిగాను బురోహితుఁడుగానునుండుచువచ్చెను. కాఁబట్టి మాధవాచార్యుఁడు వీరబుక్కభూపాలునియొద్ద మంత్రిగానుండి సమస్తవైభవముల ననుభవించుచు సన్న్యసించినవాఁడేకాని కొందఱనుకొనునట్లు దరిద్రుఁడై సన్న్యాసమును స్వీకరించినవాఁడుకాఁడు. మాధవాచార్యుఁడు తానుసన్న్యాసియయ్యును తొంటివైభవములను విడువఁజాలక తనయెడఁబ్రజలకుంగల గౌరవాధిక్యమువలనను రాజానుగ్రహమువలనను గజాశ్వాందోళనాది సమస్తరాజచిహ్నములనుధరియించి పీఠాధిపతులకిట్టి భాగ్యసూచక చిహ్నములుండవచ్చునని శాసించి సమర్థించుకొన్న హేతువుచేతనే యిప్పటికాలపు పీఠాధిపతులుగూడ నేనుగులు, గుఱ్ఱములు, వాద్యములు, పల్లకులుగలిగి మహారాజవైభవముతో నూరేఁగుటసంభవించినది. మాధవాచార్యుఁడు సంగమరాజునకు (కంపభూపతికి) మంత్రిగానుండెనని టేలర్‌దొరగారు తమహిందూదేశచరిత్రమునందు వ్రాసియున్నారు. ఈసంగమరాజు సుప్రసిద్ధుఁడైన వీరబుక్కభూపాలుని తండ్రి. తండ్రికొడుకులయొద్ద మాధవాచార్యులు మంత్రిగానుండిన సంగతి సుప్రసిద్ధమైనచరిత్రాంశమనుటకు సందియములేదు. ఒకానొకస్వదేశీయ చరిత్రకారుఁడు విద్యారణ్యులనుగుఱించి యీక్రిందివిధమున నొకచోటవ్రాసియున్నాఁడు. ఆచరిత్రకారునియభిప్రాయమునుగూడ సంగ్రహముగానిట దెలిపి మాధవాచార్య చరిత్రమును విరమించుచున్నాఁడను హరిహర బుక్కరాయలిరువురును కురువంశమున జన్మించిరనియు, టోగ్లాకుచక్రవర్తిచే నోడింపఁబడిన వోరుగంటి ప్రతాపరుద్రుని ధనాగారమునకు రక్షకులుగానుండిరనియు, సుల్తానుప్రతాపరుద్ర నగరరక్షకుఁడయిన రామనాథునిజయించిన తరువాత పైనుదహరించిన యిరువురుకోశాధ్యక్షులను బట్టికొని ఖైదీలనుగాఁ దీసికొనిరండని తన దండనాయకుల



కుత్తరవు చేసెననియు, వారట్లు వారినిఁ బట్టుకొని బంధించి సుల్తాను సమీపంబునకుఁ గొనిపోఁగా నాతఁడు వారల సౌందర్య తేజోవిశేషంబులకు సంతసించుచు వారలను క్షమించి కర్ణాటక దేశమున భూములిచ్చి కొంత సైన్యముగూడ నొసంగి సాగనంపఁగా నాసోదరు లిరువురు కృష్ణవేణీ నదిని దాటి దక్షిణమునకు నడువఁగా భల్లాణరాజు వారల నెదుర్కొని రానీయక యుద్ధముచేసి యోడించెననియు, హరిహరబుక్కరాయలిరువురు స్వసైన్యమును విడనాడి యరణ్యమునకుఁ బాఱిపోఁగా నచట హరిహరరాయలు బడలికఁజెంది తమ్మునితొడపై శిరమునుంచి నిద్రించుచుండ నాతనికొక స్వప్నము కలిగెననియు, నాస్వప్నమున నొక యోగికనుపించి లింగమునొకదానినిచ్చి శీఘ్రకాలములోనే నీకు విద్యారణ్యస్వామి దర్శనము లభించుననియు, నాతని ప్రసాదమువలన మఱల నీకు రాజ్యవైభోగములు గలుగునని దీవించెననియు, హరిహరరాయలు నిద్ర మేల్కాంచి తమ్మునికి స్వప్నవృత్తాంతము నంతయు వినుపించి సంతోషముతోఁ జెదరిపోయిన సేనలను మఱలఁగూర్చుకొని యోగి చెప్పిన చందమున విద్యారణ్యస్వామి దర్శనము లభింపఁగా నాతని సుప్రసాదమును బడసి భళ్ళాణరాజుతో మఱల యుద్ధముచేసి యాతని నోడించి యారాజ్యముఁ గైకొనెననియు వారచట రాజ్యము చేయుచుండఁగా భూమిలో నొక సింహాసనము గానుపించెననియు, వారా సింహాసనమును వెంటఁ దీసికొని తుంగభద్రా తీరమునందున్న 'అనెగొంది' కిఁ దెచ్చి కొంతకాలమచట పరిపాలనము చేసిరనియు, వారలొక్కనాఁడు వేటకై తుంగభద్రానదికి దక్షిణపుటొడ్డుననున్న మహారణ్యమునకుఁ బోయినప్పుడు వేటకుక్కలు కుందేళ్ళకు జంకి పాఱిపోవుచుండుటను వీక్షించి యీవింతవృత్తాంతమును విద్యారణ్యస్వామికి నివేదింపఁగా నాతఁడాస్థలము జయప్రదమైనదనియు, నాస్థలమున నొక పట్టణమును మనుష్యాకారమును బోలునట్లుగా శుభముహూర్తమునఁ గట్టవలసిన

దని యాజ్ఞాపించెననియు, వారాప్రకారము నగరము గట్టి విద్యానగరమని పేరు పెట్టిరనియు మొదలుగాఁగల సంగతులను వ్రాసి యున్నాఁడు. ఈ విజయనగరము శాలివాహన శకము ౧౨౫౮ ధాత సంవత్సర వైశాఖ శుద్ధ పంచమినాఁడు విద్యారణ్యులను బిరుదము వహించిన మాధవాచార్యులవారి యాజ్ఞవలన సంగమరాజు పుత్త్రులగు హరిహర బుక్కరాయ లిరువురిచేతఁ గట్టఁబడి భూరి పరాక్రమమున నెందు నెదురులేక మహమ్మదీయ ప్రభువుల గుండియ లవియునట్లు పెంపొంది యైశ్వర్యవిద్యాప్రాభవంబులఁ బ్రపంచమున నీడులేక పశ్చిమఖండవాసులచేతను, పూర్వఖండవాసులచేతను వేనోళ్ళఁ బొగడ్తనొంది త్రిశతాబ్దములు వెలింగి చంద్రధ్వజులపాలంబడి యస్తమించినరీతి దేశాభిమాని యగువాని కెవ్వనికి దుఃఖకరముగా నుండదు?



## రెండవప్రకరణము.

విజయనగరము— హరిహరదేవరాయలు — గోవానగరమును జయించుట బుక్కరాయలు— సుల్తాన్ అల్లాఉద్దీన్‌హసన్ గంగోబహమనీ— కలుబర్గనగరము— మహమ్మదుషాహి— మహమ్మదుషాహి త్రిలింగదేశముపై దండెత్తి వచ్చుట— నాగయరుద్రుని మరణము— మహమ్మదుషాహి గోలకొండను జయించుట— మహమ్మదుషాహిదర్బారు— బుక్కరాయలదండయాత్ర— ముద్గల్లు ముట్టడి— మహమ్మదుషాహి విజయనగరముపైదండెత్తివచ్చుట—బుక్కరాయలు పాఱిపోవుట— విజయనగరము ముట్టడి వేయుట— మహమ్మదుషాహి పాఱిపోవుట— బుక్కరాయలు వెంబడించుట— మహమ్మదుషాహి యెదుర్కొని మఱల బుక్కరాయలను దఱుముట— విజయనగరమును ముట్టడించుట— బుక్కరాయలు సంధిచేసికొనుట— మహమ్మదుషాహిమరణము—

ఇట్లు ౧౩౩౬ వ సంవత్సరమునఁ దుంగభద్రా తీరమున విజయనగరము నిర్మింపఁబడినతరువాత మహమ్మదీయసుల్తానుల దౌర్జన్యములకుఁ దాళఁగలేక స్వదేశములనుండి వెడలి వచ్చిన హిందువు



లకెల్లఱకు రక్షకస్థానమై క్రమక్రమాభివృద్ధినొందుచు దక్షిణహిందూదేశమున విశేషప్రాముఖ్యతనుగాంచితురుష్కులకభేద్యమైయొప్పుచుండెను. ఆసంవత్సరముననే హరిహరదేవరాయలు విజయనగరసింహాసనమునకువచ్చి క్రమక్రమముగా మహిశూరము, కన్నడము, వనవాసి, (Banvasi) మొదలగు దేశములనుజయించి రాజ్యమును బెంపొందించుచుండెను. ఇతనికాలములోనే బాదమికోటబాగుచేయింపఁబడి బలపఱచఁబడినది. ఇతఁడు విజయనగరమున రాజ్యముచేయుచుండఁగా నితని రెండవతమ్ముఁడు వీరబుక్కభూపాలుఁడు హొయసలదేశమును బాలించుచుండెను. పెద్దతమ్ముఁడైన కంపభూపతితూర్పుదేశమునకధిపతిగానుండెను మూఁడవతమ్ముఁడైనమారభూపతి బన్వాసిదేశమునకుఁ బ్రభువుగా నుండెను హరిహరదేవరాయలు బహుభూములాక్రమించుకొని పాలకులనునియమించిపాలించుచు మహారాజ పదవియందున్నను మహామండలేశ్వరుండనని మాత్రమేచెప్పుకొనుచు దేశమునకు నెమ్మదికలిగించి మంచిస్థితికిఁదీసికొనివచ్చెను కన్నడదేశమునందలి ప్రాచీనజైనప్రభువులనులోఁబఱచుకొని యాదేశమునఁబన్నులు రాఁబట్టుకొనుటకొఱకుఁ జక్కనిపద్ధతులనేర్పఱచెను. కన్నడదేశమునందలిసముద్రప్రాంతభూములను గోవానగరమును నాక్రమించుకొన్నయరబ్బులనుజయించి వారివలనఁ గప్పములు గైకొనుచుండెను ౧౩౪౩ వ సంవత్సరమునఁ దురుష్కులతో యుద్ధముచేయుటకు నోరుగంటి ప్రతాపరుద్రునకుఁదోడ్పడెను. ఇతఁడు విజయనగరరాజ్యమును బాలించుచున్నకాలమున దేశముసుభిక్షముగానుండెను. మనుజుల మానప్రాణధనంబులకు రక్షణముగలిగియుండెను. వాణిజ్యముపెంపొందినది. భూములంతటను బచ్చనిపైరులతో నిండి యుండినవి దారిదోపిడులును దొంగతనములును లేకుండెను.

మాధవవిద్యారణ్యులు హరిహరదేవరాయనికిఁ బ్రధానమంత్రిగానుండియుండుటయేగాక యరబ్బులతోడఁ బోరాడి గోవా

నగరమును స్వాధీనముఁ జేసికొని ప్రఖ్యాతిఁగాంచెను. అచ్యుతదేవరాయని కాలమున విజయనగరమును జూడవచ్చిన 'న్యూనీజ' ను పోర్చుగల్ దేశపు చరిత్రకారుఁడొకఁడు మాధవవిద్యారణ్యుల జ్ఞాపకార్థము హరిహరదేవరాయలు 'హంపిదేవాలయ' మని యిప్పుడు ప్రసిద్ధిఁగాంచిన దేవాలయమును గట్టించెనని వ్రాసియున్నాఁడు. ఈదేవాలయ మిప్పటికిని హిందువులవలనఁ బూజింపఁబడుచున్నది. తక్కిన దేవాలయములు ౧౫౬౫వ సంవత్సరమునఁ దాళికోట యుద్ధానంతరము మహమ్మదీయులచేత నాశనము చేయఁబడినవి. ఈ హరిహరదేవరాయలు ఢిల్లీసుల్తానును జయించినట్టు రెండవసంగమరాజు దాన శాసనములలో నొకదానివలన గన్పించుచున్నది. హరిహరదేవరాయల మరణానంతరము ప్రభుత్వమువిషయమై యాతని సోదరులలో వివాదములు జరిగినట్టు చరిత్రమువలన గోచరమగుచున్నది. ఇతఁడు ౧౩౫౫వ సంవత్సరమువఱకును రాజ్యపాలనము చేసినట్టు చరిత్రమువలనను శాసనాదుల వలనను గనుపించుచున్నదికాని మఱికొన్ని హేతువులచేత నేడు సంవత్సరములు రాజ్యముచేసి ౧౩౪౪వ సంవత్సరమునకు లోపలనే మరణము నొందినట్టు స్యూయల్ దొరగారు తమగ్రంథమునఁ దెలిపియున్నారు. ఇదియే సత్యముకావచ్చును. నెల్లూరిమండలకలెక్టరుగారి కార్యస్థానమునన్న యొక తామ్రశాసనమునుబట్టి హరిహరరాయల రెండవ తమ్ముఁడగు బుక్కరాయలు విజయనగర సింహాసనమును బలవంతముగాఁ గైవసము చేసికొనినట్లు దెలియవచ్చినది. ఆదాన శాసనములో సంగమరాజునకు హరిహరరాయలు, కంపభూపతి, బుక్కరాయలు, మారిభూపతి, ముద్దప్పయను నైదుగురు పుత్రులుండిరనియు, వ్రాయఁబడియున్నది. హరిహరరాయలకుఁ దరువాత సింహాసనమునకు నెవరు వచ్చిరో, యాసంగతి మనకుఁ దెలియవలసి యున్నది. పై దానశాసనమువలన హరిహరరాయలమరణానంతరము కంపభూపతియు నతని తరువాత సంగమరాజును విజ



యనగరము పరిపాలించినట్లు తేటపడుచున్నది. ౧౩౫౬వ సంవత్సరము మే నెల 3వ తేదీని సంగమరాజు నెల్లూరిమండలములోని యొక గ్రామము నొక బ్రాహ్మణునకు దానముచేసినట్టింకొక శాసనమువలనఁ దెలియుచున్నయది. ఏదియెట్లున్నను విజయనగర సింహాసనాధిపత్యమునుగుఱించి కంపభూపతి పుత్రులకును, బుక్కరాయలకును పోరాటములు కలిగి బుక్కభూపతి ౧౩౫౪వ సంవత్సరమునుండి తానే రాజునని ప్రకటించి తుదకు రాజ్యమాక్రమించుకొనినది వాస్తవమనుటకు లేశమాత్రమును సందియములేదు. బుక్కరాయలు రాజ్యమునకు వచ్చిన కొలదికాలములోనే దేశమున మార్పులనేకములు జరిగినవి. మహమ్మదుటోగ్లాకు చక్రవర్తి త్రిలింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి ప్రతాపరుద్రుని కొడుకగు కృష్ణనాయకుని నాజిలో నోడించి యాతనిదేశమాక్రమించుకొని పాలింపుచుండెను.

కృష్ణనాయకుఁడు పాఱివచ్చి విజయనగరపురాజులను ద్వారసముద్రమును బాలించు భళ్ళాణరాజులనుగలుపుకొని త్రిలింగదేశముపైఁబడి ఢిల్లీచక్రవర్తిసైన్యములనుగెల్చి స్వరాజ్యమును మఱలఁగైకొని ఢిల్లీచక్రవర్తికి వింధ్యాచలమునకు దక్షిణభాగమున దేశము లేకుండునట్లు చేసెనుగాని మూఁడుసంవత్సరములకనంతరము చెదరిపోయిన సేనలంజేర్చుకొని ౧౩౪౭వ సంవత్సరమున "సుల్తాన్ అల్లా ఉద్దీన్ హసన్ గంగోబహమనీ" అనుపేరుతో ఘియాసుద్దీనునుబానిసవాఁడొకఁడు కలుబర్గపట్టణము రాజధానిగాఁజేసికొని భామినీరాజ్యసంస్థాపకుఁడనఁ బ్రఖ్యాతిఁగాంచి సర్వస్వతంత్రుఁడై విజయనగరరాజులకు గర్భశత్రువై ప్రబలుఁడగుచుండెను. నాటనుండిభామినీసుల్తానులకును విజయనగరరాజులకును దాదాపుగా మూఁడువందలయేండ్లెడతెగకుండ, ఘోరయుద్ధములనేకములు జరిగిజరిగి తుదకు విజయనగరరాజ్యమును నటుపిమ్మట భామినీసంస్థానమును గూడనంతరించినవి. రెంటికినిగలసంబంధమునుబట్టి కర్ణాటకరాజ్య

చరిత్రము మాత్రమేగాక భామినీరాజ్యచరిత్రముకూడ నిందుఁ జెప్పఁబడునుగావున మహాభారతములోని కథలకన్ననీచరిత్రమునందలికథలే జాలిగూర్చునవిగాను మనోహరములుగాను గూడ నుండి మనపూర్వులయొక్క పరాక్రమమునువేనోళ్ళఁ జాటుచుండినవిగానున్నవి. అల్లా ఉద్దీను సింహాసనమునకువచ్చి కర్ణాటకరాజ్యముపై దండెత్తిపట్టణములను పల్లెలనుగాల్చి ధనకనకవస్తువాహనాదులను దోచుకొనిపోవుటయే కలిగెనుగాని దేశమునుజయించినవాఁడు కాకపోయెను. ఆతనిరాజ్యముదక్షిణమునందు తుంగభద్రానది వఱకు వ్యాపించియుండెను. కర్ణాటకరాజ్యమునకును కలుబర్గసంస్థానమునకును సరిహద్దుకడహిందువులచే సురక్షితమై ఆదవాని దుర్గముండెను. ఈయల్లా ఉద్దీనను వాఁడుతనయిరువదియేడవయేటననగా ౧౩౫౮వ సంవత్సరము ఫిబ్రవరి రెండవతేదిని దేహవియోగమునుబొందఁగా నటుపిమ్మట మహమ్మదుషాహి సింహాసనమునకువచ్చెను. వీరబుక్కభూపాలుఁడమూల్యమగురత్నమునొకదాని అల్లా ఉద్దీనునకుబహుమానముచేయఁగా నాతఁడద్దానిని తనసింహాసనమునకుఁ బైనున్నపందిరి కలంకరించుకొనెనని చెప్పుదురు. మహమ్మదుషాహి సింహాసనమునకు వచ్చినతోడనే భామినీసుల్తానుల బంగారు వెండినాణెములనేకములు కర్ణాటత్రిలింగదేశములలోని హిందువులవలన గరిగింపఁబడుచున్నట్టును, వర్తకులుపెక్కండ్రు చంపఁబడినట్టును దెలిసికొనఁబడెనఁట! ఆసమయముననే వీరబుక్కభూపాలుఁడు త్రిలింగదేశపురాజును దోడుచేసికొని యదివఱకాక్రమించుకొన్న యేదోదేశమునిచ్చెదవాలేదాయని మహమ్మదుషాహి కడకు రాయబారులనుబంపెనుగాని పదునెనిమిది మాసములవఱకు రాయల రాయబారులను బంపకయే కాలయాపనమునకై తన రాయబారులనువిద్యానగరమునకును ఓరుగల్లునకును వినోదార్థము కాలముగడపుటకైఁ బంపి కడపటయుద్ధముచేసెదనని ప్రకటించి యోరుగల్లురాజ్యముపై దండెత్తివచ్చెను. బుక్కరాయలుప్రతాపరుద్రునకుఁదో



డ్పడెను. ఈయుద్ధమునందు బుక్కరాయలసేనలను నాడే గుంటముల్లినాథుఁడు సేనాధిపతిగానుండి నడిపించుచువచ్చెనని యొకానొకతామ్రశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది.

*హిందూరాజులవలన లంచముగొని మహమ్మదుషాహి తిరిగిపోయెనని ఫెరిష్టాయను మహమ్మదీయ చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడుగాని హిందువులను జయించుట కష్టసాధ్యమని తెలిసికొని నష్టమునకొప్పుకొనఁజాలక యుద్ధమును జాలించి వెనుకకు మఱలిపోవుటయే సత్యమని యూహింపవలసియున్నయది. లేనియెడల వెంటనే మహమ్మదుషాహి త్రిలింగదేశముపై దండెత్తి వచ్చుట సంభవింపదు. రెండవసారి యోరుగల్లు ముట్టడించి ప్రజలు నిరపరాధులని యెంచక దయాదాక్షిణ్యములను బాటింపక క్రూరసంహారమునకొడిగట్టి రాజగు నాగయరుద్రదేవునిఁ బట్టికొని పట్టణదుర్గమునకు ముందు నగ్నిహోత్రమును దాకొలిపి కోటగోడనుండి యతని నందుఁ బడఁద్రోయింపఁగా నతఁడు వీరస్వర్గమును గాంచెను కాని యీదారుణకృత్యమును భరియింపఁజాలక యసంఖ్యాకులులగు హిందూవీరాగ్రేసరులు మహమ్మదీయులను వెంబడించి కఠోరకుఠారంబులఁ జేతికందినవారినెల్ల నఱకుచు దఱుమఁగా మహమ్మదుషాహికూడ దెబ్బతినీ గాయమునొందినవాఁడై పరాజితుఁడై పదునేనువందల సైన్యముతోఁ బాఱిపోయి కలుబర్గఁ జేరి తిరిగిచూచెను. తదనంతరము బుక్కరాయలును ప్రతాపరుద్రుఁడును అప్పటిఢిల్లీచక్రవర్తియగు ఫిరోజిషాటోగ్లాకునకు "దక్షిణీ" రాజ్యమును భామినీసుల్తానునుండి స్వాధీనముఁ జేసికొనవలసినదనియు, తాము తోడ్పడెదమనియు రాయబారులను బంపఁగా ఫిరోజిషాటోగ్లాకు గృహకల్లోలములమూలమున వారిమనవుల నాదరింపక పెడచెవినిఁబెట్టి యుపేక్షించెను. ఈవర్తమానమును విని మహమ్మదుషాహి యిది కారణముగఁ జేసి యోరుగల్లు, గోలకొండలపై మఱల దండెత్తివచ్చి యుద్ధముచేసెను. ఆయుద్ధ

ములో ప్రతాపరుద్రుఁడు పరాజయమునొంది గోలకొండ దేశము నిచ్చుటకు నొప్పుకొని సమాధానపఱచుకొనెను. తరువాత మహమ్మదుషాహిదృష్టి విజయనగరలక్ష్మిపైకి వ్యాపింపఁజేసెను. విజయనగరమెప్పుడు నిర్మూలము గావింతునాయని సుల్తాను నిరంతరము నాలోచించుచుండెను. విజయనగరవైభవమును బల్వురు వేవిధములఁ గొనియాడుచుండ మహమ్మదుషాహి చెవులకు ములుకులై నాటుచుండెను. వేయేల? నిద్రాహారము లాతనికి దూరములయ్యెను. ఏరీతినైననేమి ౧౩౬౬వ సంవత్సరమునఁ దనమనోరథమీడేర్చుకొను సమయము తటస్థించినది. ఆసంవత్సరముననే తన సైన్యమునంతను జేర్చుకొని వీరబుక్కభూపాలునిపై దండెత్తి వచ్చెను. ఐదు లక్షల హిందువులను నఱికించి రక్తనదులను బాఱించెనని చెప్పినంగాని ఫెరిస్టాయను మహమ్మదీయచరిత్రకారునకుఁ దృప్తికలుగకపోయెను. ఈమహమ్మదీయచరిత్రకారుఁడే యుద్ధవృత్తాంతమును వినుపింపవలసివచ్చినను లక్షలకొలఁది హిందువులను మహమ్మదీయులచేఁ జంపింపక మానలేదు.

ఎవరేమివ్రాసినను బుక్కరాయలు మాత్రము సామాన్యపురాజులలోఁ జేర్చవలసినవాఁడుకాడు. అతఁడుసర్వస్వతంత్రుఁడు. బహుదేశములనుజయించి పాలింపుచున్నవాఁడు. భూరిపరాక్రమవంతుఁడు. ప్రతాపశాలియగు మహమ్మదుషాహికి నేవిషయమునను దీసిపోవువాఁడుకాడు. ఇట్లుండ నొకనాటిసాయంకాలమున మహమ్మదుషాహి ప్రమోదసాగరనిమగ్నుఁడై నిండుపేరోలగంబున్నవేళ కొందఱు పాటకులువచ్చి 'అమీరుఖుస్రూ' అనువానిచే రచియింపఁబడిన రెండు గీతములను శ్రవణానందకరంబుగా వినుపింపఁగాఁబరవశుఁడై మధుపానముచేసి యొడలెఱుంగని చిత్తముతో విజయనగర ధనాగారమునుండి ద్రవ్యమునుగొని వారలకు బహుమానము చేయవలసినదని ముఖ్యమంత్రికినాజ్ఞచేసెను. సారాయిమత్తువలనఁగలిగిన యుద్రేకముతోఁ జెప్పిన మాటగదాయని గ్ర



హించి యాజ్ఞాపత్రికనువ్రాసెనుగాని విజయనగర రాజునకుఁబంపలేదు. అయినను మహమ్మదుషాహి యారాత్రి నావిషయమును గుఱించి యాలోచించుచుండెను. మఱునాఁడు మంత్రినిఁ బిలిపించి యాజ్ఞాపత్రికను బంపితివాయని యడుగఁగానే యాతఁడు లేదని ప్రత్యుత్తరమిచ్చెను. అంతటసుల్తాను 'ఏమీనాపెదవులనుండియర్థములేని వ్యర్థపుమాటజాఱఁగలదా? సురాపానప్రమత్తుఁడనై నేనాజ్ఞయిచ్చియుండలేదు. నాకట్టిసంకల్పముగలదు.' అనిహెచ్చరించెను. అంతట 'మల్లెక్సయఫ్ ఉద్దీన్' అనునతనిమంత్రి యాయాజ్ఞాపత్రికపై రాజముద్రికనుముద్రించి శీఘ్రగామియగునొకదూతచేతికిచ్చి విజయనగరమునకుఁబంపెను. బుక్కరాయలాపత్రికను వీక్షించికోపోద్దీపితుండై యాపత్రికందెచ్చిన దూతనునొక గార్ధభముపై నెక్కించి విజయనగరవీథులందూరేగించి పేడనీళ్లుగొట్టించి యవమానపఱచి యాలెనింబంపించుటయెగాక భామినీరాజ్యముపై దండెత్తుటకై సంసిద్ధులరై యుండవలసినదని తన దండనాయకులకెల్లఱకు సమాచారములుపంపి యుద్ధమునకయి యెదురుచూచుచుండెను. తనదండనాయకులెల్లఱును స్వసైన్యములతో విజయనగరమునకు వచ్చినతరువాత బుక్కరాయలుముప్పదివేల గుఱ్ఱపుదళమును మూఁడువేలేనుంగులను లక్షకాల్బలమునుగలసైన్యముతోడ 'ఆదవాని' దుర్గముచెంతకుఁ బోయి యచటినుండి కొంతసైన్యమును సుల్తానుదేశమును బాధచేయుటకయి భామినీరాష్ట్రమునకుఁబంపెను. వర్షాకాలమాసన్నమగుటచేత బుక్కరాయలు కృష్ణవేణీ తుంగభద్రానదుల సంగమస్థానమునకుఁజేడమట త్రికోణాకారముగా నుండి హిందూమహమ్మదీయులకు వివాదభూమియైయుండి తరువాత రెండువందలసంవత్సరములవఱకు యుద్ధరంగముగానున్న రాయచూరుమండలములోని ముఖ్యనగరమగు ముద్దకల్లునకుఁ బోయియాపట్టణము పట్టుకొని స్త్రీపురుషులను భేదములేకుండ నెల్లఱను గ్రూరఖడ్గాహతిపాలుచేసి విజృంభింపఁగా నొక్క

డుమాత్రము ప్రాణమెట్లో దప్పించుకొనిపోయి కలుబర్గ కేగి సుల్తానునకీసమాచారమంతయుఁ దెలియఁజేసెను ఈవృత్తాంతమంతయు మహమ్మదీయచరిత్రకారుల వ్రాఁతలనుండి గ్రహించినదియగుటచేత బుక్కరాయలిట్టి దారుణకృత్యమునకుఁ గడంగునా యని సంశయముకలుగుచున్నది. అయిననునాకాలమునందు నెండొరులకుండు మతాంతరభేదంబులవలని వైషమ్యముల మూలమున మత్సరమే ప్రధానముగాఁ జేసికొని తురుష్కప్రభువులును హిందూ రాజులునుగూడనిట్టి క్రూరసంహారమునకుఁ గడంగు దురాచారము ప్రబలియున్నట్టు చరిత్రములవలన గోచరమగుచున్నది. కాని, యీబుక్కరాయల విషయమున నెంత సత్యమున్నదో మన మూహింపఁజాలము. ఈమారణకర్మవృత్తాంతమును మహమ్మదుషాహి విని దుఃఖాక్రాంతచిత్తుఁడయ్యును కోపోద్రేకమడంచుకొనలేక యీదుఃఖసమాచారమును దెచ్చిన నిరపరాధియగు నాదార్భాగ్యుని తత్క్షణమే చంపించెనఁట! మహమ్మదుషాహి దర్బారులో నిలువంబడ "మహమ్మదీయ మతావలంబకుల సంహరించినందునకు పరిహారముగా పాషండమతాభిమానులగు విగ్రహారాధనపరులను లక్ష హిందువుల్గను మట్టుపెట్టెసంగాని మతయుద్ధమును బ్రకటించు చంద్రాయుధమును మఱల వరలోనికిఁ జేర్పననియు హత్యనుండి వెనుదీయ" ననియుఁ బ్రతిజ్ఞపట్టి యాదినముననే రణభేరి మ్రోగించి దండయాత్రకు బయలువెడలెను.

మతయుద్ధమును బ్రకటించుచు మహమ్మదుషాహి కృష్ణానదీతటముఁ జేరి శత్రువులరక్తముతో ముద్దకల్లు పురమునందలి బుక్కరాయల ఖడ్గముపాలఁబడినవారి యాత్మలకుఁ దర్పణము విడిచి సంతోషపెట్టుటకై శత్రువుల కభిముఖముగా నా నదిని దాటినంగాని భుజించుటయు నిద్రించుటయునశాస్త్రీయమని నిశ్చయించి నిద్రాహారముల మానెదనని ప్రమాణముచేసెనఁట! పిమ్మట తన కొడుకగు ముజాహిదుషాకుఁ బట్టముగట్టి మంత్రియగు 'మల్లెక్స



యఫ్ ఉద్దీను' ని పాలకునిగానియమించి యిరువది యేనుఁగులను మాత్రముంచుకొని తక్కినయేనుఁగులనన్నింటిని నతనికిచ్చి బుద్ధులుచెప్పి కలుబర్గనగరమునకుఁ బంపివేసెనఁట! కాలవిలంబము చేయక తరువాతమహమ్మదుషాహి తొమ్మిదివేలగుఱ్ఱపుదళముతో నదినిదాటెనఁట! బుక్కరాయలీవార్తవిని దిగులుపడి ధనకనకవస్తువాహనాదులను విజయనగరమునకుఁ బంపివేసి మఱునాడు వీలుగానున్న యుద్ధముచేయుటయో లేనియెడల వెనుదీయుటయోజరిగింపవచ్చునని నిశ్చయించెనఁట!

మహమ్మదీయ చరిత్రకారులేమివ్రాసినను హిందువులకుఁ బ్రతికూలముగానే వ్రాయుచుందురు. అందుముఖ్యముగా ఫెరిష్టా యనునతఁడు వ్రాసినచరిత్రము చదివినయెడల నాతనిపక్షపాతబుద్ధి స్పష్టముగాఁ గనుపించుచుండును. మనకీతనివ్రాఁతకన్న నాధారము వేఱొండులేకుండుటచేత సత్యమెట్టిదైనను ఫెరిష్టా వ్రాసినయంశములనే గ్రహింపవలసివచ్చినది. బుక్కరాయలు మహమ్మదుషా యొక్క పరాక్రమమెఱుంగని వాఁడుకాడు. సమస్తమునుదెలిసికొనియే యుద్ధముచేయ వచ్చినవాఁడు. మహమ్మదుషాహి స్వల్పసైన్యముతోనదినిదాటిరాఁగానే సహజధైర్యమును విడనాడిదిగులువడి వెనుదీయఁ బ్రయత్నించెననుట హాస్యాస్పదముగానుండునని వేఱె చెప్పవలెనా? పదునాల్గవ శతాబ్దమధ్యమున జరిగిన యీ యుద్ధవృత్తాంతమును పదునేడవశతాబ్దారంభమునందు ఫెరిష్టాకన్నులతోఁ జూచినట్టు వ్రాయుటయే కేవలమాతని చరిత్రము సత్యదూరమగు ప్రమాణగ్రంథమనివిశ్వసించుటకునామనసొప్పకున్నయది. మహమ్మదీయసుల్తానుల యాస్థానమందుండి మతాభినివేశముగల యీ చరిత్రకారుఁడు సత్యమైనవృత్తాంతమెట్లువ్రాయఁగలఁడు? ఆరాత్రి భయంకరమగు గాలివీచుచుఁగుంభవృష్టిగా వర్షముకురియుచున్నందున నేనుఁగులు మొదలగు భారవాహకములగు జంతువులు బురదలోఁజిక్కుకొని శ్రమపడుచు సేనానివాసస్థానమును విడిచినాలుగు

మైళ్ళదూరమునకైన నడువశక్తికలవి కాక పోయినవి. మహమ్మదు షాహి యీవృత్తాంతమునువిని తనస్థానమునువిడిచితానే వారలకభిముఖుఁడయినడువనారంభించెను. మఱునాఁ డుదయమునకు రాయలసైన్యమునుసంధింపఁగానే వారలుసామాగ్రినంతయు వెనుక దిగవిడిచిభయంపడి యాదవానిదుర్గమునకుఁబాఱిపోయిరఁట! మహమ్మదుషాహి సామాగ్రినంతయుగొల్లవెట్టి శిశుసహితముగాస్త్రీపురుషులడెబ్బదివేలజనులను సంహరించెనఁట! సుల్తాను వేసవికాలము గడచుపర్యంతము ముద్దకల్లుపట్టణముననుండి తరువాతసేనలంగూర్చుకొని ఆదవానిదుర్గముముట్టడించెను. బుక్కరాయలుతన మేనల్లునిదుర్గసంరక్షణార్థముఁ గొంతసైన్యముతో నిలిపితానుతుంగభద్రానదికి దక్షిణభాగమునందునిలిచివిజయనగరమునుండియింకను సేనలనురప్పించుకొని యుద్ధసన్నద్ధుఁడై నిలిచియుండెను. మహమ్మదుషాహి శీఘ్రకాలములోనే తుంగభద్రానదినిదాటి విజయనగరరాజ్యభూములలోఁ బ్రవేశించెను. విజయనగరముపయి మహమ్మదీయులు దండెత్తివచ్చినవానిలోనిదియే ప్రథమదండయాత్రయని చెప్పవలసియున్నది. ఎందుకననిదివఱకు ఢిల్లీసుల్తాను తుంగభద్రానదికి నుత్తరమువనున్న యానెగొందిని ముట్టడించెనేకాని తుంగభద్రానదినిదాటి యీవలకువచ్చినవాఁడుకాఁడు. మహమ్మదుషాహి సిరుగప్పనుగ్రామసమీపమున నదినిదాటి కౌతాళమువద్దనున్న బయలులో రాయల సైన్యమునుదాకెను. మహమ్మదుషాహి నదినిదాటివచ్చుచున్నాఁడని చారులవలనవిని బుక్కరాయలు తన మంత్రులను సేనాధిపతులనురప్పించి సుల్తానునేప్రకారమెదుర్కొనవలసియుండునో యోజింపసాగెను.

అప్పుడందఱునుజేరి రాయల ముఖ్యసేనాధిపతియగు భోజమల్లునకాధిపత్యమునిచ్చిరి. ఆతఁడు సంతసించి తురుష్కరాజకుమారుని జీవముతో ఖైదిగాఁ బట్టికొని తీసికొని రావలసియుండునో ఆతని శిరస్సు బల్లెమునకు గ్రుచ్చి చూపింపవలసియుండునో రా



యల చిత్తమును వినఁగోరుచున్నానని మహాగర్వముతోఁ బలికెనఁట! బ్రదికియున్న శత్రువేయవస్థలోనున్నను నిష్టుఁడు కాఁడు గనుక జేతికందివచ్చినపుడు చక్కాఁడుటయె యుచితమార్గమని రాయలు ప్రత్యుత్తరమిచ్చెనఁట. రాయల యనుజ్ఞనుబొంది మల్లయ దండనాథుఁడు నలువదివేల గుఱ్ఱపుదళముతోడను, లక్ష కాల్బలముతోడను, మహమ్మదుషాహినెదుర్కొని హిందువులచేఁ బరమపవిత్రములుగాఁ జూడఁబడు గోవులను మహమ్మదీయులు చంపుటను గూర్చియు, వారి పరిశుద్ధములైన విగ్రహముల నపవిత్రపఱచుటనుగూర్చియు, వారి దేవాలయములను నిర్మూలముచేయుటను గూర్చియు, నేనుదినమును వర్ణించుచు సైనికుల కుపన్యాసములిచ్చి చంద్రధ్వజులఁ జంపుటయే పరమార్థమని దోఁచునట్లుగాఁ బౌరుషమెక్కింప వలసినదిగా బ్రాహ్మణోత్తముల కెల్లఱకు నానతి యిచ్చెను. మహమ్మదుషాహి భోజమల్లునిరాకవిని తనసైన్యమునకంతకు ఖానుమహమ్మదుని నధ్యక్షునిగానేర్పఱచి పదునైదువేలగుఱ్ఱపుదళమును, ఏఁబదివేలకాల్బలమునిచ్చి తానుపదివేల గుఱ్ఱపుదళముతోను ముప్పదివేలకాల్బలముతోను సమరసన్నద్ధుఁడయియుండెను. ౧౩౬౬వ సంవత్సరము జూలయి ౨౩ తేదీ గురువారమునాఁడు సూర్యోదయసమయమున నుభయసైన్యములును గలిసికొని సంకులసమరంబునకుఁగడంగెను. ఉభయసైన్యములును సముద్రతరంగములవలె నిటునటునూగులాడుచు నొండొరులతోడీకొని సాయంకాలము నాలుగుగంటలవఱకు ఘోరయుద్ధముచేయఁగా నిరుప్రక్కలను వేలకొలదిజనులు మృతినొందిరనిచెప్పుట యతిశయోక్తి గాదు. ఖానుమహమ్మదుసేనయొక్క కుడియెడమభాగములకు రక్షకులుగానున్న శూరాగ్రేసరులగు మూషీఖానుఁడును, ఏషీఖానుఁడును వీరమరణమునొందఁగా వారిసేనలు హిందువులప్రతాపమునకుఁ దాళఁజాలక పలాయనములయ్యెను. ఈ దురవస్థనంతనుజూచి తురుష్కసైన్యములు దిగులుపడిధైర్యమునువదలి చెల్లాచెదరగు

చుండ మహమ్మదుషాహి మూఁడువేల గుఱ్ఱపుదళముతో వచ్చి మల్లయదండనాథునిఁ దాఁకఁగానే పాఱిపోవుచున్న తురుష్కసైన్యములు వెనుకకుమరలివచ్చుచుండెను. మక్రీబుఖానుఁడు ఫిరంగులనుగాల్చుచు శత్రుసైన్యమును జీకాకునొందించుచు ముందుకుసాగివచ్చి శత్రువులను బాఱఁద్రోలుట కనుజ్ఞయిమ్మని ఖానుమహమ్మదునడిగెను. అతనికిమూలబలముకొంతయిచ్చి సాగుమనియుత్తరవుచేసెను. ఫిరంగులను గాల్చుటకు హిందువులకు కాలముచాలకపోయినందున వీరావేశముతోఁ గత్తులు గటారులు దూసి తురుష్కులకభిముఖులై పిఱికితనమావంతయులేక శత్రువులుసయితము మెచ్చునట్లుగాఁ బోరాడుచుండిరి. ఇట్లు ఖానుమహమ్మదునియొక్క 'పులివేటకాడ' ను పేరుగల యేనుఁగొకటి మావటీని యాజ్ఞకులోఁబడక శత్రుసేనామధ్యభాగమునఁ జొఱంబడఁగా మల్లయదండనాథుని యేనుఁగ లడ్డుపడి నిలుపఁగా నాసందడిసమయములో పులివేటకాని మావటీఁడు ప్రాణములను గోలుపోయెను. తదనంతరము ఖానుమహమ్మదయిదువందల గుఱ్ఱపుదళమును దీసికొని సమరగజమును వెంబడించి పురికొల్పుచుండెను. హిందూసేనలు క్రమము దప్పి చెల్లాచెదరగునట్లుగా నాయేనుఁగు ఘీంకృతులువెట్టుచు ధ్వంసము చేయుచుండఁగా భోజమల్లుగారు దెబ్బతిని గాయమును బొంది రణరంగమున నిలువలేక పరాఙ్ముఖుఁడయ్యెను తదనుచరులు సయితము నిలిచి యుద్ధుపడలేకపోయిరి హిందువులు తమ మధ్యభాగమిట్లల్లకల్లోలమగుటఁ జూచి యధైర్యపడి నలుదిక్కులకుఁబాఱిపోయిరి. ఇంకఁజెప్పవలసినదేమున్నది? తురుష్కులు చెలరేగి తారసించిన నెల్లఱను నఱికివైచుచుండిరి. గర్భిణీస్త్రీలను సయితము వదలిపెట్టక హతముచేయుచుండిరి. బిడ్డలఱొమ్ములమీఁదనుంచుకొని పెనఁగులాడుచున్న తల్లులనుండి బిడ్డలనులాగి బిడ్డలనుతల్లులనుగూడ నఱకుచుండిరి. మహమ్మదుషాహియిట్టివిజయవార్తలను తనరాజ్యమునకుఁ బంపియుఁదృప్తినొందనివాఁడయి తనప్రతి



జ్ఞఁ దీర్చుకొనుటకయి రాయలను వెంబడించి మహారణ్యములమధ్యఁ దఱుముచుండెను. బుక్కరాయలు వానికిఁజిక్కక హతశేషులనుగూర్చుకొని సురక్షితముగావచ్చివిజయనగరముఁ బ్రవేశించెను. మూఁడునెలలు మహమ్మదుషాహి రాయలనువెదకి నగరముఁజేరినాఁడన్నవార్తవినిపోయి విజయనగరమునుముట్టడించెను. కాని ముప్పదిదినము లెంతప్రయత్నముచేసినను రాయలులోఁబడలేదు. పట్టణమును స్వాధీనముకాలేదు. తనప్రయత్నమువ్యర్థముకాఁగా నతఁడుపట్టణమునువిడచి తుంగభద్రానదిమీఁదుగాఁబాఱిపోవుచు నడుగడుగునకు హిందువులచే నడ్డగింపఁబడుచుండియుఁ బోయిపోయి యొకమైదానమున దండువిడిసియుండెను. బుక్కరాయలును వారినివెంబడించివచ్చి సమీపముననేదండువిడసియుండెను. మహమ్మదుషాహి పాఱిపోయినవిధముఁజూడఁ దురుష్కులికఁ దమ్ముఁదలఁపడజాలరనియు, తేఱిపాఱఁజూడనైనఁజాలరనియు, హిందువులకు దృఢవిశ్వాసమునుగలిగించుచుండెను. ఆహేతువుచేత హిందువులు జాగ్రత్తలేనివారలయి పరాకుగలిగి యలక్ష్యస్వభావముతోనుండిరి. బుక్కరాయలొకనాఁడురాత్రి మధుపదార్థములనుసేవించి వారకాంతావినోదగోష్ఠిలోనుండి యానందాబ్ధినోలలాడుచుండఁగా నకస్మాత్తుగాఁ దురుష్కులుపైఁబడి తమకపటతంత్రమును బయల్పఱచఁగా బుక్కరాయలు పశ్చాత్తాపము నొందుచు విజయనగరమునకు మఱలఁబాఱిపోయెనట! పదివేలహిందువుల నఱుమాడిమహమ్మదుషాహి తిరిగి విజయనగరమును ముట్టడించెను. బుక్కరాయలు సమాధానపఱచుటకై రాయబారులను సుల్తానుకడకుఁ బంపెనుగాని యాతఁడంగీకరింపకుండెనఁట! అది చూచి వాని మిత్రుఁడొకఁడు 'మీరు లక్ష హిందువులనుమాత్రమే సంహారించెదమని ప్రతిజ్ఞపట్టినారు కాని హిందూజాతినంతను జంపెదమని ప్రతిజ్ఞపట్టలేదే' యని మందలించెనఁట! అందుకు సుల్తాను తాను ప్రతిజ్ఞపట్టిన మొత్తముకన్న నినుమడిగా హిందువులను జంపినను రాయలు లోఁబడ

తానాజ్ఞచేసిన ధనమొత్తమును బాటకులకు సమర్పించినఁగాని రాయలయెడలను నాతని ప్రజలయెడలను గరుణఁ జూపఁజాలనని బింకములు పలుకుచుండఁగా రాయల రాయబారులు సర్వస్వాతంత్ర్యమును బొందివచ్చినవారుగావున నాధనమొత్తమును నాతనికిఁ దత్క్షణమే చెల్లించిరి. రాయలయందుఁ దప్పితమున్న యెడల నిరాధారులును, నిరపరాధులునగు ప్రజలును, స్త్రీలును, బిడ్డలును గూడ దండార్హులగుదురా యని రాయబారులు మందలింపఁగా సుల్తాను భగవదాజ్ఞయట్లుండెననియు, నద్దానిని మార్పఁ దనకుశక్తిలేదనియు నుడివెనఁట! హిందూమహమ్మదీయు లిరుగుపొరుగువారగుటవలన ననవసరములగు క్రూరకృత్యములు మానుట యుచితమనియు, లేనియెడలఁ బరస్పరద్వేషములు ప్రబలములగుననియు రాయబారులు వాదింపఁగా మహమ్మదుషాహి వారివాదములు సహేతుకముగా నుండుటచేతఁ దానొడంబడితిననియు నికనెన్నఁడును దనకుజయము లభించిన తరువాత శత్రువునినొక్కనినైన నిష్కారణముగాఁ జంపించననియు, నెదుటివారుగూడ నట్లేచేయబద్ధులగనియుఁ బలికి ప్రమాణముచేసెనఁట. ఆపద్ధతి కొంతకాలమువఱకు నవలంబింపఁబడెనుగాని తరువాతి ప్రభువులామార్గమును విస్మరించి యథేచ్ఛగాఁ గ్రూరకృత్యములు చేయుచునేయుండిరి. ఈ మహాయుద్ధమునందు నయిదులక్షల హిందువులనుజంపి కర్ణాటకభూములు నిర్జనప్రదేశములుగాఁ జేసెనని మహమ్మదుషాహిని ఫెరిష్టాశ్లాఘించుచు నతిశయోక్తిగాఁ జెప్పుచున్నాఁడు. తరువాత కొన్నిసంవత్సరముల వఱకుఁ బోరులేకుండ రెండురాజ్యములవారికి సఖ్యతగలిగియుండెను. ౧౩౭౫వ సంవత్సరమున ఏప్రియలు ౨౧ వ తేదిని మహమ్మదుషాహి మరణమునొందెను.





## మూడవప్రకరణము.

---

మజాహీదుషాహి సింహాసనమెక్కుట— వెంగాపురము— సరిహద్దునుగుఱించినవివాదము— సుల్తానుయుద్ధమునుప్రకటించుట— బుక్కరాయలు సుల్తానునుఅరణ్యమధ్యమునఁద్రిప్పుట— సుల్తానువిజయనగరమును ముట్టడించుట— బుక్కరాయలు విజయనగరమునుగాపాడుట— హిందువులపరాజయము— మారభూపతి యుద్ధమునకువచ్చుట— దాదుఖానుఁడు ధర్మసముద్రమును విడిచిపెట్టుట— హిందువులు మహమ్మదీయుల నోడించుట— సుల్తానుఆదవానిదుర్గమును ముట్టడించుట— సుల్తానుయుద్ధము చాలించిపోవుట— సుల్తానుచంపఁబడుట— దాదుఖానుఁడుసింహాసనమెక్కుట—దాదుఖానుఁడుచంపఁబడుట— బుక్కరాయలు రాయచూరుకోట ముట్టడించుట—మామూదుసింహాసనమునకువచ్చుట— బుక్కరాయలమరణము—

మహమ్మదుషాహి మరణానంతరము నతని కుమారుఁడు మజాహీదుషాహి సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు సింహాసనమెక్కినతోడనే కృష్ణా తుంగభద్రానదులకు మధ్యనుండు దుర్గములును, మండలములునుఁ దమకుఁజెందియున్నవనియు, వానిని గుఱించి యప్పటప్పట తగవులాడుట కలుగుచున్నదనియు, నట్లుకలుగకుండఁ దుంగభద్రానది సరిహద్దుగాఁ జేసికొని దానికిఁ దూర్పుననుండు దేశమును వెంగాపుర (బంకాపురము) దుర్గమునుగూడ విడిచిపెట్టవలసినదనియు బుక్కరాయలకు వ్రాసెను. ఈవెంగాపురము ధార్వాడకు దక్షిణమున నున్నది. సముద్రతీరమునకును, విజయనగరమునకును మధ్యనుండుటచేతను, తురుష్కులు చిరకాలమునుండి యాకోటను స్వాధీనముఁజేసికోవలెనని తలంచి మోహాదృష్టితోఁ జూచుచుండిరి. అందుకు బుక్కరాయలు రాయచూరు ముద్గల్లుదుర్గము లానెగొంది సంస్థానమునకుఁ జెందినవగుటచేత రాయచూరుమండలమంతయు వదలిపెట్టవలసినదనియు, కృష్ణానదియే సరియైన సరిహద్దనియు, మహమ్మదుషాహి తననుండి గైకొన్న యేనుఁగులను మరలఁ దనకిచ్చివేయవలసినదనియుఁ, బ్రత్యుత్తరమంపెను. సుల్తాను యుద్ధమును బ్రకటించెను. సుల్తాను

రెండునదులను దాటి ఆదవాని దుర్గముకడకు వచ్చి చేరెను. బుక్కరాయలు తుంగభద్రానదీతటమున దండు దిగి యున్నాఁడని విని మజాహిదుషాహి తన సైన్యమును రెండుభాగములుగా భాగించి యొకబలము కోటముట్టడించుటకును, రెండవబలముతోఁ దాను బోయి విజయనగరమును బట్టుకొనుటకును నిశ్చయించి వాయవ్యమూలమార్గమున జాగరూకతగలిగి సేనలను నడిపించుకొనిపోవుచుండెను. బుక్కరాయలు మొట్టమొదట సుల్తానునిసంధించి సమరముచేయుటయేయుక్తమని యోజించెనుగాని తరువాత నదిమంచి పద్ధతికాదనితలంచి తనరాజధానికి దక్షిణముననున్న సందూరుకొండలలోని యడవులలోనికిఁబోయి యుండెను. మజాహిదుషాహి వానిని వెంబడింపక విజయనగరము సొగసయిననగరమని బహుజనులుశ్లాఘించుచుండుటచేత నచటికిఁబోవఁజూచెనుగాని యదిసుసాధ్యముకాని హేతువుచేత తిన్నఁగా బుక్కరాయలున్న యరణ్యమునకుదారితీసెను. సుల్తాను వచ్చుచున్నాఁడను సమాచారమును విని రాయలా యరణ్యమార్గములు తురుష్కులకుఁ గొత్తవియగుటఁ దలపోసి యాతనినాకాఅడవులలో నాయాస పెట్టదలంచియుండ సుల్తాను మహారణ్యమును భేదించుకొని దారులేర్పఱచుకొనుచు రాయలసైన్యమును వెంబడించుచుండ నారాయలాస్థానమునువిడచి మఱియొక స్థానమునకుఁబోవుచు నీరీతిగా నాఱుమాసములు సుల్తానునకందకయే చిక్కులు పెట్టుచుండెను. సుల్తానువజీరులిదిప్రయాససాధ్యమనియు లాభములేనిత్రిప్పటయనియు, సైన్యమునకు నధికనష్టము సంభవించుననియు బహువిధములబోధించి యతనిని మరలింపఁజూచుచుండిరి. కాని వారి యదృష్టవశమున రాయలకారోగ్య భంగముకలిగి యాయడవులలోని విషవాయువుల నాఘ్రాణించుటవలనఁ బ్రాణాపాయముకలుగవచ్చును గావున నాతనివైద్యులడపనివిడిచి స్వరాజధానికి విజయంచేయవలసినదని వేడుకొనుటతటస్థించెను. బుక్కరాయలు చేయునదిలేక వారియుపదే



శమును విశ్వసించి చాటుదారులను దప్పించుకొనిపోయి విజయనగరము ప్రవేశించెను. సుల్తానాతని వెనుకను గొంత సైన్యమును బంపి తాను ' అమీరాలమ్రా బహదూరుఖాను ' తో నయిదువేల సైనికులను దీసికొని సీతాబండ రామేశ్వరమను ప్రదేశము సందర్శించుటకై పోయెను. ఈతఁడాప్రదేశమునసుల్తాను ' అల్లా ఉద్దీనుకిల్జీ ' కట్టించిన మసీదును బాగుచేయించుటయేగాక హిందూదేవాలయములను బెక్కింటిని గూలఁద్రోయించి దేశమునంతపాడుచేసి విజయనగరమునకుఁ దిరిగివచ్చెను. ౧౩౧౦ వ సంవత్సరమున ఢిల్లీచక్రవర్తి సేనాధిపతియగు ' మలికాఫరు ' పశ్చిమతీరమున నొకమసీదు కట్టించెనను మాటసత్యమేకాని హిందూదేశమునకు దక్షిణముగా సింహళద్వీపమున కెదుటనున్న రామేశ్వర ద్వీపమున మలికాఫరు మసీదుకట్టించిన సంగతి వాస్తవమని నమ్ముటకాధారము గనుపించదు. మహమ్మదీయ సేనానియొకఁడు వేయిమైళ్ళ దూరము నిరంకుశాధికారము గల పల్వురు హిందూరాజ్యుల మధ్యనుండి దారిచేసికొని పోయి హిందువులచే మహాపవిత్రస్థలముగా నెంచఁబడు రామేశ్వరద్వీపమునఁ బదునాల్గవ శతాబ్దమునందు హిందూదేవాలయములను బడద్రోచిమసీదుకట్టించుటకు సాధ్యమెట్లయ్యెనో తెలియరాకున్నయది. కర్నల్ బ్రిగ్సుదొరగారు చెప్పినట్లు మలికాఫరు గోవానగరమునకు దక్షిణముగాఁ బశ్చిమతీరమున సదాశివఘట్టమను ప్రదేశమున మసీదుగట్టఁగా నయ్యదియే రామేశ్వరమునఁగట్టినదని చరిత్రకారులు భ్రమించియుండవచ్చును. అయినను రామేశ్వరమున బాడుపడిన మసీదుయొక్క చిహ్నములు గనుపించుచున్నవటగాని యదియిటీవల నెప్పుడో కట్టింపఁబడియుండును. ఇందునుగుఱించి యింకను విచారింపవలసియున్నది. మజాహిదుషా తరువాత నెట్లో బుక్కరాయలకు తెలియకుండఁ జాటుదారులగుండవచ్చి విజయనగరముపైఁ బడెనని ఫెరిష్టాయ సందర్భపువ్రాతలను వ్రాయుచున్నాఁడు.

తురుష్కులు విజయనగరమును బ్రవేశించుటకు సమ్మతపడి బుక్కరాయలు వీధులను గాపాడుటకు పెక్కండ్రు సైనికులను బంపెనటగాని తురకలు హిందువులను దఱిమి యెట్టకేలకుం గోటకును పట్టణమునకును నడుమనున్న చెఱువుకట్ట నాక్రమించుకొనిరంట! ఆ సమీపముననున్న కొండపై నెక్కి యచటి హిందూదేవాలయ మిడియంగొట్టి యమూల్యములగు రత్నాభరణములతోడ నలంకరింపంబడిన సువర్ణమయములగు విగ్రహములను జూఱంగొనెనంట! పరులకవిలంఘ్యములగునట్టి సప్తప్రాకారములు గలిగి విజయనగరము లక్షలకొలది శూరాగ్రేసరులచేఁ బరిరక్షితమైయున్న మహానగరమని కన్నులారఁ జూచిన విదేశీయచరిత్రకారులు పెక్కండ్రు వర్ణించియున్నారు. అట్టిసురక్షితస్థానములన్నిటిని దాటి యొడలు దుమ్ముగాకుండ ననాయాసముగా సుల్తానెట్లు రాఁగలిగెనో వింతగానున్నయది. ఈవృత్తాంతము జరిగిన రెండుశతాబ్దముల కావలనున్న యీచరిత్రకారుఁడగు ఫెరిష్టా స్వజాతి వారిలోఁ జెప్పుకొనెడు కల్పనాకథలనుబట్టి యీచరిత్రమల్లెనుఁగాబోలు! ఈచెఱువుకట్టకడ మజాహీదునకుఁ "జావుతప్పికన్నులొట్టపోయె" ననుసామ్యము ననుసరించి ప్రాణగండము గలిగియుఁ దప్పించుకొనిపోవుట తటస్థించెను అత్యంతచింతాస్పదంబగు తురుష్కుల దౌష్ట్యమునకు నోర్వంజాలక హిందువులెల్లఱులోని రోషానలంబు ప్రజ్వలింప శత్రువినాశనమునకై బుక్కరాయలను బ్రోత్సాహపఱచి లక్షలకొలది హిందూశూరాగ్రేసరులు ధ్వజమెత్తివచ్చుచుండుటను జూచి మజాహీదుషాహి తనఛత్రమును నావలఁ బాఱవైచి తనకై దండయొసఁగువాని గపిలదేశపుఁ దురుష్కుని మామూదనువానిని వెంటఁదీసికొని శత్రువుల సంఖ్యను గనుగొనుటకై చిన్నసెలయేటిని దాటి యావలి యొడ్డున నిలువంబడియుండెను.

అప్పుడు పరాక్రమవంతుఁడగు నొక్క హిందువు సుల్తాను స్వారివెడలు గుఱ్ఱమును గుర్తుపట్టి తన దేవతాస్థానముల నిర్మూలించి



న పగదీర్చుకొని ప్రఖ్యాతినొందుటకై సుల్తానువంకకు నశ్వారూఢుఁడై యతివేగమున వచ్చుచుండెను. అతఁడు పొదలచాటున నుండి యునొడ్డువిఱిగి పల్లముగానున్న సెలయేటియొడ్డు వెంబడి నెరికిగానరాకుండ వచ్చి బయలఁబడి తనవంక నతివేగమున వచ్చుచుండుట నదృష్టవశమున సుల్తాను వీక్షించి మామూదునకు సైగచేయఁగా నాతఁడు వెంటనే వాని గురిపెట్టి కాల్చెనుగాని తనగుఱ్ఱము బెదరినందున నతఁడు క్రిందఁబడెను. ఇంతలో శత్రువు మామూదును సంహరింప నుద్యుక్తుఁడు కాఁగా మజాహీదుషాహి భుజబలాఢ్యుఁడుగాన నతనిరక్షణకై తత్క్షణమె పోవ నాహిందువు మామూదును జంపుట మాని సత్తువతో సుల్తానునొక్క దెబ్బతీసెనుగాని యదృష్టవశమున సుల్తా నద్దుపెట్టిన యినుపసుత్తివలన నతఁడు జీవింపఁగలిగెనుగాని లేనియెడల నాదెబ్బతో మజాహీదు నామమాత్రావశిష్టుఁడగునను టకు సంశయములేదు. చూపఱులందఱు నాదెబ్బ సుల్తానుప్రాణముగొనెనని నిశ్చయించిరిగాని యట్లు జరగక సుల్తాను సుత్తిపెట్టుతో శత్రువు రెండుతుండములై క్రిందఁబడిపోయెను. తరువాత మామూదును గుఱ్ఱముపై నెక్కించి సుల్తాను స్వసైన్యమును జేరుకొనెను. తదనంతరము ఘోరయుద్ధము జరిగినదిగాని హిందువులు పరాజితులయిరి, తురుష్కులు బడలికదీర్చుకొనుచుండిరి. ఇంతలో బుక్కరాయల సోదరులలో నొకరు (మాంగభూపతియో లేక ముద్దప్పయో) అరువదివేల గుఱ్ఱపుదళముతోడను నధిక కాల్బలముతోడను రాజధానికివచ్చి రాయలను గలిసికొనఁగా భయంకరమగు యుద్ధము మఱలనారంభమయ్యెను. అప్పుడు సుల్తానునకు నాపదకలుగునేమో యనుభీతిచే నతనిబంధువు దాదుఖానుఁడను వాఁడు తనస్థానమగు ధర్మసముద్రమును విడిచి యుద్ధము జరుగు ప్రదేశమునకు వచ్చెను. తురుష్కులు మఱల జయమును బొందిరికాని శత్రువులు దాదుఖానుఁడు విడిచివచ్చిన ధర్మసముద్రమును ముట్టడించి పట్టుకొని సుల్తాను సైన్యమునకు వెనుకఁ జేరహానిఁ జేయుచు భీతికలిగించుచుండిరి.

మజాహీదుషా యుద్ధభూమిని విడిచిపెట్టి కొండలలోనుండి తనసైన్యమును సురక్షితముగా నావలకుఁదరలించుకొని యరువది వేల హిందువులను ముఖ్యముగా స్త్రీలను ఖైదీలనుగాఁదీసికొని పోయి యాదవానిదుర్గమును తొమ్మిదిమాసములు ముట్టడించియు నయ్యది స్వాధీనముఁగాక పోవుటవలన నాప్రయత్నమును మానుకొని స్వదేశమునకుఁబోయెను. అంతటితో యుద్ధము ముగిసినది. భామినీసుల్తానులు ఘనపరాక్రమ వంతులగుదురుకాని యధికారమునందును విభవమునందును రాష్ట్రవైశాల్యమునందును విజయనగ రాజులకు సమానులుకారని బుక్కరాయల కాలమునాటిస్థితి ఫెరిష్టావ్రాసియు న్నాఁడుగాని తరువాత క్రమక్రమముగా దక్షిణ హిందూదేశమంతియు విజయనగరరాజ్యములోఁ జేరిపోయినది. సముద్రతీరమున నున్నగోవానగరమును, బెలగాముకోటయు, తులువనాడును విజయనగరరాజుల స్వాధీనములో నుండెననియు, విజయనగరరాజ్యము జనపూరితమైనదనియు నాదేశప్రజలు విశేషరాజ భక్తికలవారనియు, మళయాళము సింహళము మొదలగు ద్వీపములను బాలించు ప్రభువులును విదేశరాజులును బుక్కరాయల యాస్థానమునందు రాయబారులను నిల్పిప్రతిసంవత్సరమును గానుకలుచెల్లించుచుందురనియుఁగూడ ఫెరిష్టా వ్రాయుచున్నాఁడు. మజాహీదుషాహి యుద్ధమును ముగించినతరువాత దాదుఖానునిఁ బిలిపించినాఁడు యుద్ధముచేయునపుడు ధర్మసముద్రము నేనిమిత్తమున విడనాడివచ్చితివనియు నట్లుచేయుటశత్రువులాస్థానమునుగైకొనిమనలఁదఱుముటకుఁ గారణమయ్యెగదా మనయదృష్టవశమున మనసైన్యముఁగాపాడుకొనఁగలిగితిమిగాని లేనియెడలనపాయముతటస్థించుననుటకు సంశయముగలదాయనిపలికి మనస్సునొచ్చునట్లుగా మందలించెను. అయ్యదిమనస్సునందుంచుకొని దాదుఖానుఁడు సుల్తానునకుఁ బ్రతికక్షిగాఁబనిచేయు నీర్ష్యాసూయా పరతంత్రులగు రాజకుటుంబములోని ప్రభువులతోఁగలిసి సుల్తాను



ను సంహరించుటకై కుట్రలుపన్నుచుండెను. సుల్తాను కలుబర్గచేరకపూర్వమే దారిలో దావుఖానుఁడు ౧౩౭౮ సంవత్సరము ఏప్రియలు ౧౯ వ తేదీ శుక్రవారమురాత్రి మతమూఫురు చెలికాండ్రతోడ మజాహీదుషాహి తనగుడారములో నిద్రించుచుండఁగాఁ బోయివానినినుగుమాడి సంహరించెను. మజాహీదుషాహి సంతానవిహీనుఁడగుటవలనను దావుఖానునకు సుల్తానుసోదర పుత్రుఁడగుటవలనను తానేసుల్తానని ప్రకటింపఁగానెల్లఱు నంగీకరించి కలుబరగిఁజేరి పట్టాభిషిక్తునిఁజేసిరికాని దేశీయులిరుతెగలైరొకతెగవారు దావుఖానుని సింహాసనమెక్కించుటకు సహింపకుండిరి.

ఆకారణమువలన దావుఖానుఁడు ముప్పది దినములకావలననగా మేనెల ౨౧ వతేదీనిరాజధానీనగరములోని పెద్దమసీదులో దైవమునుగూర్చి ప్రార్థించుచుండఁగా సంహరింపఁబడెను. ఇంతలో బుక్కరాయలు వివాదభూమి నాక్రమించుకొని కృష్ణానదివఱకువచ్చి రాయచూరుకోట ముట్టడించియుండెను. ఇఁకముందు నేవిధమైన వివాదములుపొసగకుండ నెనిమిదిసంవత్సరముల వయస్సుగల దావుఖానుని పుత్రునికన్నులు మజాహీదుషాహి సహోదరి “ఘూపర్వాక్ ఆగా” అనునామెతీయించఁగా నల్లాయుద్దీనుని కడగొట్టుకొడుకు మామూదను వాఁడు సింహాసనమునకువచ్చెను. ప్రజలందఱు నాతనియెడననురాగమును గలిగియుండిరి. బుక్కరాయలు సయితము రాయచూరు ముట్టడినివదలి మహమ్మదుషాహివలన నేర్పఱుపబడిన కప్పముమొత్తమును జెల్లించుటకు నొప్పుకొనెనని ఫెరిష్టాచెప్పుచున్నాఁడు. మామూదుదేశపరిపాలనము చేసినయిరువదిసంవత్సరముల కాలముదేశమందంతటను స్వరాజధానియందును నెమ్మదికలిగియుండెను. అంతట ౧౩౯౭ వ సంవత్సర మేప్రియలు ౨౦ దవతేదీని మామూదు కాలధర్మము నొందెను. బుక్కరాయలు ౧౩౭౯ వసంత్సరప్రాంతమున మృతినొందియుండవచ్చును.

బుక్కరాయలు శైవమతావలంబకుఁడయినను మతాంతరులగు హిందువులనుమాత్రమేగాక జైనమతావలంబకులనుగూడ సన్మానించు సహనబుద్ధికలవాఁడుగనుండెను. మైసూరుదేశములోని శ్రావణబెలగోలయను పట్టణమునందలి వీధులలోజరుగు దేవతామహోత్సవములయందుఁ దమకుఁగలహక్కులనుగుఱించి జైనులకును రామానుజీయులకును వివాదము పొసఁగినపుడు ప్రేమతో నిరువురినిసన్మానించి సమాధానపరచి చక్కనిదారికిఁ దీసికొనివచ్చినాఁడు. బుక్కరాయలు శూరుఁడుమాత్రమేగాక పండితుఁడుగాఁ గూడనుండెను. ఇతఁడు చెఱువులను, బావులను, కాలువలును త్రవ్వించివిశ్రాంతిగృహములను చక్కంటినిగట్టించెను. అనంతపురమండలములోని బుక్కసాగరమనియు బుక్కరాయసముద్రమనియు నామాంతరములుకలిగి ప్రసిద్ధికెక్కిన గొప్పచెఱువొకటి యిప్పటికిని గలదు.

---

## నాలుగవప్రకరణము.

---

రెండవ హరిహరరాయలు విద్యానగర సింహాసనమునకువచ్చుట— ఘియాసుద్దీను భామినీరాజ్యమును వహించుట—ఘియాసుద్దీను అంధుఁడుగాఁ జేయఁబడుట—షామ్సుద్దీను రాజ్యమునకు వచ్చుట—షామ్సుద్దీను రాజ్యపద భ్రష్టుఁడగుట—ఫిరోజిషా సింహాసనమెక్కుట—హరిహరరాయలు సుల్తానురాజ్యముపై దండెత్తుట—హరిహరరాయుల జ్యేష్ఠపుత్రుఁడగు బుక్కరాయలు ఫిరోజిషాతో యుద్ధముచేయుట—బుక్కరాయలు కొడుకు కాజీసీరాజీయను వానికుతంత్రమువలనఁ జంపఁబడుట—బుక్కరాయలు ఫిరోజిషాతో సంధిచేసికొనుట.—

బుక్కరాయలకు గౌరీదేవివలన జనించిన రెండవ హరిహరరాయలు తండ్రిమరణాంతరము రాజ్యభారమును వహించెను. తండ్రివలెనే యితఁడును ప్రసిద్ధపురుషుఁడుగానుండెను. ఇతఁడు 'మహారాజాధిరాజ' ను బిరుదమునువహించి యిరువది సంవత్సరములు నిరంకుశపరిపాలనముచేసి వాసిగన్నవాఁడు. ఇతఁడు దక్షిణహిందూ



దేశమునందంతటఁ దనయధికారమును జెల్లించుటయేగాక యనేకములయిన దేవాలయములకు బహుభూములను దానముచేసినట్లు పెక్కుశిలాతామ్రశాసనములవలన గోచరమగుచున్నది. ౧౩౯౩ వ సంవత్సరమున రెండవహరిహరరాయలు చోళరాజులను పాండ్యరాజులను జయించి వారివలన గప్పములుగైకొనుచుండెను. ఇతఁడు చోళులను జయించుటవలన శార్దూలమదభంజనుఁడను బిరుదము వహించినవాఁడు.

దేవాలయములకు మాత్రమేగాక బ్రాహ్మణులకును పాఠశాలలకును మాన్యములనుదానముచేసినవాఁడు. ఇతఁడు నిష్పక్షపాతబుద్ధియు, న్యాయైకదృష్టియుఁగలిగి మతాంతరులగు జైనులను సయితము రాజ్యపరిపాలనము నందున్నతపదవులనిచ్చి యాదరించినవాఁడు. ఇరుగదండాధిపుఁడను జైనపండితుఁడొకఁడు విజయనగరమున జైనాలయమునునిర్మించెను. అయ్యది యిప్పటికినిగనుపించుచున్నయది. ఈతనికాలమున విద్యారణ్యభాష్యము ముగింపఁబడినది. ఫిరోజిషాటోగ్లాకుచక్రవర్తి ఢిల్లీనగరమున బ్రాహ్మణులను వారిగ్రంథములతోఁ దగలబెట్టుచుండఁగా దక్షిణహిందూదేశమున రెండవ హరిహరరాయలు హిందూమతోద్ధారణముచేయ సర్వవిధములఁ బాటుపడుచుండెను. ఇతనిపరిపాలనమునఁ గర్ణాటకదేశమునందును దక్కనుదేశమునందును ద్వాదశవర్షక్షామము సంభవించెనని ఫిరిష్టావ్రాయుచున్నాఁడు. ఈతనికి సాయణాచార్యుఁడు మంత్రిగానున్నట్లు గనుపించుచున్నది. ఇతనికి ముద్దరాయకుఁడు ఇరుగపదండాధిపుడు, గుండరాజుసేనాధిపతులుగానుండి సర్వవిధములఁ దోడుచూపినట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నయది. ఇతఁడు రాజ్యమునకువచ్చినతోడనే గోవానగరముపై దండెత్తిపోయి యచటనుండి మహమ్మదీయులనుబాఱఁదోలి విజయముఁగాంచెను. ఇతనికి మల్లాంబికయను నామెపట్టపుదేవిగానుండెను. ఇతనిశాసనములు మైసూరు, ధార్వాడ, కాంచీపురము, చెం

గలపట్టు, తిరుచునాపల్లె మొదలగుప్రదేశములయందుఁ గానంబడుచున్నయవి తండ్రివలెనేయితఁడు శైవమతావలంబకుఁడయినను మతాంతరులను సమదృష్టితోఁ జూచుచుండెను. సుల్తానుమామూదుయొక్క పెద్దకొడుకు "ఘియాసుద్దీనను" పదునేడుసంవత్సరముల వయస్సుగలబాలుఁడు భామినీరాజ్యభారమును వహించెను ఇతఁడు రాజ్యమునకు వచ్చిననెలమీఁద నిరువదిదినములుగడచిన తరువాత ౧౩౯౭వ సంవత్సరము జూనునెల ౧౪వ తేదీని వింకుపేరుచెప్పిన యితనినిరప్పించి. బానిసవాఁడొకఁడు గ్రుడ్లుపెఱికించెను. పిమ్మట నీతనికనిష్ఠసోదరుఁడగు షామ్సుద్దీను పట్టాభిషిక్తుఁడుగాఁ జేయఁబడెను.

అయిదుసంవత్సరముల యనంతరము సుల్తానుదావుకొమారుఁడగు ఫిరోజిషాయను వాఁడు వానిని గ్రుడ్డివానినిజేసి రాజ్యపదభ్రష్టునిగాఁజేసి విడిచిపెట్టెను ఈఫిరోజిషాయను నాతఁడు౧౩౯౭ సంవత్సరము నవంబరునెల౧౫వతేదీని సింహాసనమునకువచ్చిమిగులఁబ్రసిద్ధికెక్కినవాఁడు రెండవహరిహరరాయలకడపటిశాసనము౧౩౯౯వసంవత్సరము అక్టోబరు౧౫ తేదీని పుట్టఁబడినది. రెండుశాసనములు రెండవబుక్కరాయలపేరిట ౧౪౦౬వసంవత్సరమునఁ బుట్టినవి తక్కిన వన్నియు ౧౪౧౨వసంవత్సరాంతమువఱకు రాజ్యపరిపాలనముచేసిన దేవరాయలకాలమునఁబుట్టినవి. విద్యానగరరాజ్యనిర్మాణదక్షుఁడగు మొదటిహరిహరరాయలు రాజ్యమునకువచ్చునప్పటికి మిక్కిలివృద్ధుఁడై యుండి యేడుసంవత్సరములు పరిపాలనము చేసియుండెనని న్యూనీజువ్రాసియున్నాడుకాని యాచరిత్రకారుఁడే హరిహరరాయలసోదరుఁడగు బుక్కరాయలుముప్పదియేడు సంవత్సరములు పరిపాలనముచేసెననికూడ జెప్పియుండుటచేత మొదటిహరిహరరాయలు మిక్కిలివృద్ధుఁడనియూహింపరాదు. ఇదెట్లున్నను బుక్కరాయలకొడుకగు రెండవహరిహరరాయలు సింహాసనమునకు వచ్చునప్పటికి బుక్కరాయలుమిక్కిలివృద్ధుఁడై యుండి మరణము



నొందియుండవలెను. ఇతఁడును వయస్సుముదిరియుండవలెను. ఇతఁ డిరువది సంవత్సరములు సత్పరిపాలనము చేసి యుండుటవలన ౧౩౯౯ వ సంవత్సరాంతమువఱకు మిక్కిలివృద్ధుఁడై యుండెనని చెప్పుటకు సందియములేదు. ఏమికారణముచేతనో హరిహరరాయలు క్రీస్తుశకము ౧౩౯౮వ సంవత్సరము సెప్టెంబరు ౧౩వతేదీని ముద్గల్లురాయచూరుకోటలను లోఁబఱచుకొనవలెనని ఫిరోజిషా దేశముమీఁదికి దండెత్తిపోయెనుగాని సంవత్సరము లోపలనే యుద్ధముముగిసినట్లు తెలియవచ్చినది. క్రీస్తుశకము ౧౩౯౯వ సంవత్సరమున హరిహరరాయలు మరణమునొందిన హేతువుచేత నీ యుద్ధము ముగింపఁబడినదేమో తెలియరాదు. రెండవ హరిహరరాయలయనంతరము మల్లాదేవివలన జనియించిన విజయ బుక్కరాయలు సింహాసనమెక్కెను. ఇతఁడు తండ్రిబ్రదికియున్నకాలమున గూడ రాజ్యపరిపాలనముచేయుచువచ్చెను. ఇతనికాలమున విజయనగరము సర్వవిధములఁ బొంపుచెందినది. విజయనగరముచుట్టును ప్రాకారములును, గోపురములును, రమ్యహర్మ్యములును మొదలగు పెక్కుకట్టడములు నిర్మింపఁబడినవి. ఇతనికాలముననే తుంగభద్రానదికి పెద్దదగు నానకట్టకట్టఁబడినది. ఇంతియగాక నదిలోనుండి నగరమునకు ౧౫ మైళ్ళపొడవుగల యొకమంచినీటికాలువ విశేషప్రయాసముతోఁ ద్రవ్వింపఁబడెను. ఈకాలువ కొండల యడుగుభాగముననుండు రాతిలోనుండి పెక్కుమైళ్ళవఱకు తొలువంబడి బహుభూములను సాగుబడిచేయుటకుఁ దగియుండి పనివానితనమును నాగరికతను కన్నులకు జాటుచున్నదో యననేటికిని శ్లాఘ్యతనుగాంచుచున్నయది. ఇతఁడు మూరులను మహమ్మదీయులను జయించుటయేగాక గోవానగరంబాదిగాగలుగు పట్టణాంబములఁ గైవసముచేసికొని తూర్పుదేశములనుజయించి తనయధికారము క్రిందికిఁదెచ్చెను. ఈవిజయబుక్కరాయలు తండ్రిబ్రదికియుండఁగానే ఫిరోజుతో యుద్ధము చేయనాదేశముమీఁదికి దండె

త్తిపోయెనని యిదివఱకె దెలిపియున్నాఁడను. భామనీసుల్తానుస్వాధీనములోనున్న ముద్గల్లు, రాయచూరు దుర్గములను బట్టుకొనవలెనని యీవిజయబుక్కరాయలు ప్రయత్నించెను. ఈదండయాత్రయందు విజయబుక్కరాయల కుమారుఁడు తండ్రితోఁగూడనుండెను. ఈసమాచారము దెలియరాఁగానే సుల్తానుసేనలంగూర్చుకొని బుక్కరాయల నెదుర్కొనుటకై బయలువెడలి మార్గమధ్యమందు నొక హిందూనాయకునిజయించి వానియనుచరులను తొమ్మిదివేలప్రజలను మట్టుపఱచి కృష్ణానదికి వామపార్శ్వమునందుఁ జేరినిలిచెను. దక్షిణపుటొడ్డున విజయబుక్కరాయలు తనసేనలనునిలిపి నదివెల్లువలతోఁ గూడియుండుటచేత దాటుటకు వీలులేక యెదురుచూచుచుండెను. ఫిరోజిషా తనమంత్రులతోసభగూడి తమకేరీతిగాఁ బ్రవర్తించిన జయముసులభసాధ్యమగునో వివరింపుఁడని యడిగిననెవ్వరును బదులుచెప్పకపోయిరి సుల్తానేరీతిఁ బనిచేయవలసియుండునో తనమనస్సులో విచారించుచుండఁగా "కాజీసీరాజీ" యనువాఁడులేచి తనమిత్రుల కొందఱిసహాయముచేతనదినిదాటిపోయి రాయలనుగాని వానికుమారునిఁగాని యేదోకుతంత్రమువలనఁ బరిమార్చివచ్చెదనని యనుజ్ఞనిమ్మని సుల్తానునివేడికొనెను. సుల్తానువాని యుపాయమునకు మెచ్చితనసేనలు నదినిదాటుటకు తోలుగప్పినతడకలను వందలకొలఁదిదెప్పించి నదినిదాటుటకు సిద్ధముగానుండెను.

ఆకాలమునందుఁ బ్రజలు తుంగభద్ర మొదలగు నదులను దాటవలసివచ్చినపుడు తోలుమూసిన తట్టలలోనుండి దాటుచువచ్చిరి. కాజీసీరాజీ తనమిత్రులతో బైరాగులవేషముఁబూని రాయల స్కంధావారమునకుఁబోయి యాటకత్తెలుండు తావున నివసించి యొకవేశ్యతో మైత్రిచేసి తనకామెయందెక్కువ మక్కువ పుట్టునట్లు వేయివిధముల నటించియుండెను. ఒకనాటి సాయంకాలమున నా వారకాంతామణి యమూల్యాభరణాలంకృతయై తన



గుడారమును విడిచిబయలువెడలుచుండఁగా నతఁడు దయఁగలుగునట్లుగా నామెకాళ్ళపైంబడి నీవులేనిదే నేనొక్క క్షణమైనఁ బ్రదుకజాలనుగాన నీవెచటకును బోవలదనియుఁ బోయినయెడల నన్నుఁగూడఁ గొనిపోవలసినదనియుఁ బ్రార్థించుచుండెను. రాయలకుమారునిచేత విందొకటిగావింపఁబడుచున్నదనియు నాయుత్సవమునకుఁదానుబోక తీఱదనియుఁ బాటకులును నాటకులును దక్క తదితరులురాఁగూడదనియు నాయాటకత్తెప్రత్యుత్తరమిచ్చెను. నృత్యమునందును గానమునందును దమకుఁ బ్రావీణ్యత కలదనియు వారలేయంత్రముమీఁదఁ బనిచేయుదురో యాయంత్రములోఁ దామునుజక్కఁగాఁ బనిచేయఁగలుగుదుమనియు నతఁడునమ్మకముపుట్టునట్లుగా నొక్కిచెప్పెను. ఆమె యామాటలు పరిహాసపాత్రములని భావించియెగతాళిచేయుచుఁ జేతనున్నవీణె సీరాజీచేతికిచ్చి నీప్రావీణ్యతఁ జూపుమనియడిగెను.

తనకంటెను తన యనుచరులకంటెను నెక్కువగా మనోహరంబగునటులఁ బాడుట కారంభింపఁగానే యామె పరమానందమునొంది నాకు రాయలకుమారునిచేత బహుమానము గలుగునటులఁ జేయుటకు సామర్థ్యము గలవారని నాకిపుడు దృఢమైన విశ్వాసము కలిగినదని వారకాంత పలికెను. అంతట వారలను వెంటనిడుకొని యావారాంగన రాయలకుమారుని మందిరమునకుఁ బోయెను. ఆదేశమునందలి యాచారముననుసరించి యాటకత్తెలు గుంపులుగఁగూడి నృత్యముచేసినతరువాత రాయల కుమారుఁడు హాస్యగాండ్రను, నాటకాండ్రను మొదలగువారిని వారివారి విద్యలఁ జూపుఁడని యాజ్ఞయిచ్చెను. కాజీసీరాజీ తన విద్యను జూపుటకై యావారాంగన పిన్నరాయల యనుజ్ఞఁబడసెను. స్త్రీవేషములను ధరించి కోరిగంటి చూపులు చూచుచుఁ జిఱునవ్వునవ్వుచు రంగస్థలమునకు వచ్చి హాస్యపాత్రములను బ్రదర్శింపుచు, తంబురలు మీటుచు, నృత్యములుసలుపుచు, సర్వజనాహ్లాదకరం

బుగా నైపుణీవిశేషంబులఁ జూపుచుండిరి. రాయలకుమారుఁడు పరిమితానందము నొందియుండెను. తుదకు దక్కనుదేశపునాటకాండ్రవలె నిరువురు గటారులుదూసి విచిత్రముగా ముందుకువచ్చుచు, వెనుకకుఁబోవుచు, చుట్టును దిరుగుచు, హాస్యకరంబులగు వేయి విధంబులయిన యంగవిన్యాసములనుజూపుచు నాడుచుండిరి.

కట్టకడపట నాకపటవేషధారులు రాయలపుత్త్రునిమీఁదికి దుమికి నిరువురునొక్కసారిగా నాతనివక్షస్థలమును గటారులతోఁ బొడిచి తరువాత నాతనిచుట్టునున్నవారినిఁ దాకిచంపిరి. రాయలపుత్త్రుని స్కంధావారమునఁ గొప్పసంక్షోభముపుట్టినది. పెక్కండ్రు మదిరపానప్రమత్తులై యుండుటచేతఁజంపఁబడిరి. కాజీసిరాజీ తనసహచరులతోఁగూడుకొని దీపములనార్పి త్రొక్కిసలాడుచున్న జనసంఘములోనుండి దప్పించుకొని పాఱిపోయెను. ఈమహాసంక్షోభము బుక్కరాయల సేనానివేశస్థానమున కంతకునుఁ దటస్థించెను. ఎచటఁజూచినను వింతసమాచారములే తెలుపంబడుచుండెను. ఇదేతురుష్కులువచ్చి పైఁబడిరని తమలోఁదాము కలయంద్రొక్కుకొనుచుఁ బెక్కండ్రు పఱువులిడుచుండిరి. తురుష్కసేనాధిపతియొకఁడు నదిని దాటి వచ్చి రాయలను నాతని పుత్త్రునిజంపెనని వదంతికలిగెను అంధకారబంధురముగానున్న యారాత్రి పదిమైళ్ళవఱకు వ్యాపించియున్న హిందూసేనానివేశస్థానముననున్న సేనాధిపతులందఱును నామహాసంక్షోభముపుట్టుటకు హేతువుగానరాని వారయి తమతమ డేరాలలోనే యాయుధపాణులయి వేచియుండిరి. ఈనడుమ సుల్తానునియొక్క నాలుగువేలసైనికులు పడవలనెక్కి నదినిదాటివచ్చుచుండిరి. శత్రుసైన్యములనునదినిదాటి రాకుండఁ జేయుటకై నియమింపఁబడిన రాయలసైనికులు బుక్కరాయలునాతని పుత్త్రుఁడును జంపఁబడినారను వార్తలనువినియుండి కలవలంబడుచున్న వారగుటం జేసి శత్రుసైన్యములను జూడఁగానే ధైర్యమునుగోలుపోయి శత్రువు



లనెదిరింపఁజాలక చెల్లాచెదరై ప్రాణములనుగాపాడుకొనఁబాఱిపోవుచుండిరి.

సూర్యోదయమునకుపూర్వమే ఫిరోజిషా తనసైన్యముతో నదినిదాటివచ్చి రాయలసైన్యమునుదాఁకొని ఘోరయుద్ధమునలుపుచుండెను. బుక్కరాయలుపుత్త్రుని మరణసమాచారము తన్నుదుఃఖసాగరమునముంచి వేయుటయు, శత్రువులాకస్మికముగ వచ్చి పయింబడుటయుఁ దలపోసి నిలువంబడి యుద్ధముచేయ ధైర్యముచాలక పుత్త్రశవమును గైకొని తనసైన్యముతో విజయనగరమునకుఁ బాఱిపోయెను. ఫిరోజిషా దారిపొడుగునను బుక్కరాయల సైన్యముతో యుద్ధముచేయుచు విజయనగరమువఱకుఁ దఱుముకొనివచ్చెను. బుక్కరాయలు కోటలోఁ బ్రవేశించి ఫిరోజిషాతో యుద్ధముచేయుచునేయుండెను. ఫిరోజిషా సోదరుఁడును 'ఖాన్ఖానన్' అను బిరుదముగలవాఁడునగు "అహమ్మ" దనువాఁడు విజయనగరమునకుఁ జుట్టునున్న దేశములోనున్న సొమ్మంతయు దోచుకొనుటయేగాక పెక్కండ్రు బ్రాహ్మణులను ఖైదీలనుగాఁ గొనివచ్చెను. అప్పటికి బుక్కరాయలతండ్రి మిక్కిలి వృద్ధుఁడై యుండుటచేత మంత్రులును, పురోహితులును సంధిచేసికొనవలసినదని యాతనిఁ బ్రార్థింపఁగా నాతఁడు పదిలక్షలహొన్నుల ఫిరోజిషాకునిచ్చి సంధిచేసికొనెను కాని దేశమునేమియు నీయలేదు.

ఏదేశమునుగుఱించి తాతలనాటినుండి వివాదముపడుచుండిరో యట్టి రాయచూరుమండలము తగవులోనేయుండెను. తండ్రియనంతరము విజయబుక్కరాయలు సింహాసనమెక్కినతరువాత ఘూర్జరమాళవ ఖాండవదేశపురాజుల ప్రోత్సాహమువలన ఫిరోజిషాకు గప్పముగట్టుటమానివేయఁగా సుల్తానుసమయముకొఱకు వేచియుండెనేగాని వెంటనేరాయలమీఁదికి దండెత్తిరాలేదు. బుక్కరాయలయనంతర మాతనిసోదరుఁడగు గౌడదేవరాయలు (రెండవ

సంవత్సరము నవంబరునెల ౫వ తేదీని సింహాసనమెక్కెనని మయిసూరు దేశములోని హాసానుగ్రామమునందలి యొకశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది.

---

## అయిదవప్రకరణము.

---

### గౌడదేవరాయలు (౧౪౦౬-౧౪౧౯)

గౌడదేవరాయలు సింహాసనమెక్కుట — స్వర్ణకార పుత్రికను మోహించుట — దేవరాయలు ముద్దకల్లుపయి దాడివెడలుట — స్వర్ణకార కులజుండు కూఁతునువెంటఁబెట్టుకొని పాఱిపోవుట — ఫిరోజిషా దేవరాయల పయి దండెత్తివచ్చుట — దేవరాయలపజయమునొందుట — దేవరాయలు తనపుత్రికను సుల్తానునకిచ్చి వివాహముచేసి సంధిచేసికొనుట — ఫిరోజిషా స్వర్ణకారుని పుత్రికనురప్పించి తనకొడుకగు హసాన్ ఖానునకుఁ బెండ్లిచేయుట — విజయభూపతి —

విజయబుక్కరాయల యనంతరము గౌడదేవరాయలుసింహాసనమునకువచ్చెను. ఈతనిరాజ్యపరిపాలనము ౧౪౦౬ వ సంవత్సరము నవంబరునెలలో నారంభమయినది. ఈతఁడు రాజ్యమునకు వచ్చునప్పటికి యౌవనమత్తుఁడై యుండెను. ఫిరోజిషాయధీనములోనున్న ముద్దకల్లునగరమున స్వర్ణకారుఁడొకఁడు వాసముచేయుచుండెను. ఆతనికొక పుత్రికగలదు విధాత లోకములోని సౌందర్యమునంతను ముద్దచేసియామెను సృజించెనోయన నొప్పుచుండెను. అట్టిసౌందర్యరాశికి విద్యాగురువై యొప్పుచున్న యొక్కవృద్ధబ్రాహ్మణుఁడు గౌడదేవరాయల యాస్థానమునకువచ్చియామెను వేవిధములవర్ణించుచు రాయలకు మోహముపుట్టించెను. అంతట దేవరాయలు బ్రాహ్మణునకు బహుమానమొసంగి యాభువనమోహినిని నాకు సమకూర్తువా యని యడిగిన నతఁడుసమ్మతించెను.



అమూల్యములగు రత్నాభరణములను, వస్త్రములను, సొమ్మునిచ్చి స్వర్ణకారునికడకు నాబ్రాహ్మణునిబంపి వాని కూతును రాయలకిచ్చి వివాహముచేయునట్లుగాఁ జేయుమనెను. ఆప్రకారమావృద్ధబ్రాహ్మణుఁడు దేవరాయలిచ్చిన కానుకలను బట్టించుకొని యాస్వర్ణకారుని గృహమునకుఁ బోయి యావద్వృత్తాంతమును వారలకు నివేదించి వారల పుత్రికను రాయలకిచ్చి వివాహము చేయవలసినదని ప్రోత్సాహపఱచెను. రాజాధిరాజగు గౌడదేవరాయలు తమకల్లుఁడు కాఁగలుగుట కాదంపతులు మేరమీఱిన యానందమునొంది సమ్మతించి కానుకలను గైకొనిరిగాని కొమార్తె తల్లిదండ్రులతో "రాయలకు నేను రాణినై వాని యంతఃపురమునకుఁబోయినయెడల మిమ్ము నాజీవితకాలములో మఱలఁ జూచుటకు నాకు సాధ్యముకాదు. రాయలకన్నను రాయల మందిరముకన్నను వాని రాజ్యభోగములకన్నను నాకు తల్లిదండ్రులే యధికులు; వారలను విడిచి నేనుండఁజాలను; రాజునెల్లను; వానిభాగ్యమెల్లను;" అని స్పష్టముగాఁ బలికెను. తల్లిదండ్రులు చేయునదిలేక తాము గైకొనిన కానుకలుమొదలగునవి తిరిగి బ్రాహ్మణునకిచ్చి యాతనిఁబంపివేసిరి.

దేవరాయలేతీరునైన నామెనుబట్టితెచ్చి పెండ్లి చేసికొనవలెననినిశ్చయించి యొకనాఁడు సేనలంగూర్చుకొని తనదేశమునంతను జూచివచ్చెదనుమిషనుబూని తుంగభద్రానది చెంత దండువిడిసి తనమిత్రులువలదన్నను వినకయైదువేల గుఱ్ఱపు దళముతో నదినిదాటి రాత్రింబగళ్ళు ప్రయాణముచేసి ముద్దకల్లుచేరునప్పటికి నంతకుమున్నె రాయలు వచ్చుచున్నాఁడనువార్తవిని యాపుర వాసులు పట్టణమునువిడిచి నానాముఖములఁ బాఱిపోయిరి. వారలతోఁగూడ స్వర్ణకారుఁడును వానిభార్యయుఁ బుత్రికయును బాఱిపోయిరి. రాయలసైనికులు పల్లెలు పట్టణములును దోచుకొనిరి. తమప్రయత్నమీవిధముగా విఫలముకాఁగా దేవరాయలుతన

రాజధానికిఁ దిరిగివచ్చెను. ఫిరోజిషా యీ సమాచారమును విని క్రోధావేశపరవశుఁడై విశేషసైన్యముం గూర్చుకొని విజయనగరముమీఁదికి దండెత్తివచ్చెను. దేవరాయలు కోటలోఁ దూఱి యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను. భయంకరమైన యుద్ధము జరిగి యా యుద్ధములోఁ దురుష్కులు పోటుబంటులయి నగరములోఁ బ్రవేశించి కొన్ని వీధుల నాక్రమించుకొనిరి గాని కర్ణాటకులు మహాశూరులయి వారలను బాఱఁద్రోలఁగా ఫిరోజిషా యాస్థానమును విడిచి వెనుకకు మరలివచ్చెను.

ఈజయమునకు సంతసించి గాడదేవరాయలు కోటగోడలదిగువను తనసైన్యమును జేర్చుకొని సుల్తానుసేనలను దాఁకి వెనుకకు మరలించుచుండెను. విజయనగరము చుట్టునుండు శిలామయమగు ప్రదేశమంతయుఁ దురుష్కుల గుఱ్ఱపుదళమునకు బాధకరముగానుండ వారలు నిరుత్సాహులయి మరలుచుండిరి. ఆసమయమున ఫిరోజిషా చేతిలో నంబొకటి గ్రుచ్చుకొని గాయముపడఁగా నాతఁడు చలింపక యాచనునూడఁబెఱికి గుడ్డతో గాయమును గప్పి గుఱ్ఱమునుండి దిగకయె సైనికులను బ్రోత్సాహపరచుచుండెను. తుదకు 'ఖాన్ఖానక్ అహమ్మదుఖానుల' పరాక్రమ మతిశయించినందువలనఁ దురుష్కులు హిందువులను బాఱఁద్రోలి సురక్షితమైన తావుఁ జేరి గాయముపొందిన భటుల విశ్రాంతికై కొంతకాలము వేచియుండెను. నాలుగుమాసములీరీతి దేవరాయలను కోటలోనుండి వెలుపలకురానీయక ఖైదిగాఁ జేసియుండఁ గొదువ సైన్యము రాయలదేశముమీఁదఁబడి ధ్వంసముచేయుచుండె. వెంగాపురమును (బంకాపురము) ముట్టడించి స్వాధీనముఁ జేసికొని యిరువదివేల హిందువులను ఖైదీలనుగాఁ బట్టుకొని ఫిరోజిషా ఖాంఖానుని విజయనగరమును విడువకుండ నియమించి తాను 'ఆదవాని' దుర్గమును బోయి ముట్టడించెను.



ఇట్లు గాడదేవరాయలు శత్రువులచేఁ జిక్కి చేయునది లేక తనపూర్వులెవ్వరు నొడంబడని పద్ధతులకుఁ దా నొడంబడవలసినవాఁడయ్యెను. దేవరాయలు తన పుత్త్రికను ఫిరోజిషాకునిచ్చి వివాహముచేయుటకును, యుద్ధమునకయిన సొమ్మునంతయు నిచ్చుటకును, వెంగాపురదుర్గమును తురుష్కుల యధీనముచేయుటకును నొడంబడవలసినవాఁడయ్యెను. దేవరాయలకుఁ బూర్వము కర్ణాటక రాజులెన్నఁడును దమకూఁతుండ్రను తమజాతివారికేగాని యన్యులకనఁగా మ్లేచ్ఛులకునిచ్చి వివాహముచేయుట మిక్కిలియవమానకరముగా నూహించి చేయకున్నను స్వయం కృతాపరాధమువలనఁ దటస్థించిన యీ చిక్కుచేత దేవరాయలు పుత్త్రికావివాహమహోత్సవమును బ్రకటించెను. నలువదిదినములవఱకు సుల్తానుశిబిరమునుండి రాయలయంతఃపురమునకు రాయబారము జరుగుచుండెను. బాటలకిరుప్రక్కల సంగడులేర్పడి యాయంగడులకెదుట గారడివాండ్రు, హాస్యకాండ్రు, నృత్యకాండ్రు మొదలగువారు పథికులకుఁ దమవిద్యలను జూపుచుండిరి. ఖాన్ఖానక్, మీర్ ఫజలుల్లా యనువారలు మతాచారము చొప్పున పెండ్లికొమరుఁడు తేఁదగిన కానుకలను దీసికొనివచ్చి రాయలయింట వారము దినములుండి రాయలు కానుకలతో నొసంగిన పెండ్లికొమర్తెను వెంటఁబెట్టుకొని ఫిరోజిషా శిబిరము ప్రవేశించిరి. ఫిరోజిషాను జూడవలెనని దేవరాయలు తనయభిలాషను నూతనజామాతకుఁ దెలుపఁగా నతఁడు నూత్నవధువుతో మామగారిని సందర్శించుటకు నొడంబడి నియమితదినమునకు ఖాన్ఖానుని శిబిరమునుండి తాను విజయనగరమునకు విజయంచేయఁగా దేవరాయలెదుర్కొని సన్మానించెను. నగరద్వారమునకును రాజభవనమునకును నాఱుమైళ్ళ దూరముగలదు. ఈబాటయంతయు ముకమలుగుడ్డలతోను అమూల్యములగు పట్టువస్త్రములతోను, బంగారపు గుడ్డలతోను గప్పఁబడియుండెనఁట! ఒకప్రక్క బాలురును నొకప్రక్క బాలికలును సు

న్నరజితఖచితములగు పుష్పములను తమశిరస్సులపైఁ జల్లుచుండఁగా నిరువురురాజకుమారు లశ్వారూఢులై వచ్చుచుండిరి. పురవాసులు వారివారి యౌన్నత్యములననుసరించి కట్నములు కానుకలు చెల్లించుచుండిరి. ఈప్రకారముపెండ్లివారు పురవీధులునాలుగును జుట్టిరాఁగానే దేవరాయల బంధువు లనేకులువచ్చి కానుకలు చెల్లించి తమ్ముఁగొలుచుచుండ వారలిరువురు గుఱ్ఱములను దిగి నవరత్నఖచితములగు పల్లకులనెక్కి పెండ్లివారికై యదివఱకు నేర్పరచిన భవనములకుఁ గొనిపోవ నచటదిగి దేవరాయలుసుల్తానునొద్ద సెలవుఁగైకొని తన యంతఃపుర మందిరమునకు వెడలిపోయెను. మూఁడురాత్రులచట సుల్తానువిందులారగించుచు నుండి నాలగవదినము రాయలయొద్దనుండి సెలవుఁ గైకొని నాలుగుమైళ్ళవఱకు వచ్చి దేవరాయలు సాగనంపఁగా ఫిరోజిషా సురక్షితముగాఁ దనసేనానివేశనస్థానమును జేరెను. దేవరాయలు తనశిబిరమువఱకు రాకమఱలిపోయిన ఫిరోజిషాకోపగించి దేవరాయలిట్టిపనిచేసినందుకు నెపుడయినఁ బగఁదీర్చుకొనక మానననిమీర్ఫజులుల్లాతోఁజెప్పి ప్రతిజ్ఞపట్టెను. ఈప్రతిజ్ఞను దేవరాయలకుఁ జెప్పివంపఁగా నాతఁడులక్ష్యపెట్టక యహంకారముతోఁగూడిన పలుకులుపల్కెనఁట! ఈయపూర్వవివాహమాహాత్మ్యపుసంగతులన్నియు ఫెరిష్టావ్రాసిన చరిత్రమువలనఁ దెలియుచున్నవిగాని వేఱొకయాధారము గనుపట్టదు. రాయలకుఁబట్టపుదేవులుగాక పెక్కండ్రు భోగస్త్రీలుందురు. ఏభోగస్త్రీకడుపున జనించినబిడ్డనిచ్చెనో? లేనియెడల దేవరాయలిట్టి సాహసకార్యమునకుఁజొచ్చునా? మంత్రులును బాంధవులునొడంబడుదురా? అట్టిదేసత్యమై అగ్నిసాక్షిగాఁ బెండ్లియాడిన పట్టపుదేవికడుపునఁబుట్టిన బిడ్డనేసుల్తానునకిచ్చి పెండ్లిచేసినవాఁడాయెనేని సుల్తానుతో వెంటనే విరోధమును గల్పించుకొనునా? ఈవిషయమునుగుఱించి సత్యమిట్టిదనియింకను సిద్ధాంతీకరింప వల్లనుగాదు. దేవరాయలకు జక్కయ



కవి విరచితమగు విక్రమార్కచరిత్రమును గృతినొందిన సిద్ధన్నమంత్రియు నాతనితండ్రి జన్నమంత్రియు మంత్రులుగా నుండినట్లుక్రింది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

“సీ. విమలవర్తనమున-వేదశాస్త్రపురాణ,
వాక్యార్థసరణికి-వన్నెపెట్టె।
పరమహృద్యశ్లాఘ్యైక-పద్యశతంబున,
దేవకీతనయుని-ధేయుఁజేసె।
రసికత్వమున దేవ-రాయమహారాజ,
కరుణాకటాక్షవీ-క్షణముఁగాంచె।
కర్ణాటకటకము-గలయంగ మెచ్చంగఁ,
గడఁకవిద్యాప్రౌఢి-ఘనతకెక్క॥
గీ. గురులఁబోషించె సత్కవీ-శ్వరులమంచెఁ।
ప్రజలఁబాలించె భాగ్యసం-పదవహించె।
హారితమునిముఖ్యవంశర-త్నాకరేంద్ర।
చంద్రుఁడై యొప్పసిద్ధయ-జన్నమంత్రి॥”

* * * * * * * * *

“గీ. దేవరాయమహారాయ-ధీవిధేయు।
మంత్రివల్లభ చామనా-మాత్యదత్త।
చామరచ్ఛత్రభూషాది-సకలభాగ్య।
చిహ్నములనొప్పిజన్నయ-సిద్ధమంత్రి॥”

ఫిరోజిషా కలుబర్గచేరినతరువాతస్వర్ణకారపుత్త్రికనురప్పించి యామెయందమునకు మెచ్చుకొనియామెను దనకొడుకగుహసాఁఖానునకుఁబెండ్లిచేసెనఁట! దేవరాయలు ౧౪౧౨-౧౩ సంవత్సరమువఱకుఁ బరిపాలించినట్లు శాసనముల వలనఁ దెలియుచున్నది. ఈదేవరాయలయనంతరము వీరవిజయరాయలు (విజయభూపతి) సింహాసనమునకువచ్చి యాఱుసంవత్సరములు పరిపాలనముచేసినట్లు శాసనములు గనుపించు చున్నవి. ఈవిజయనగరచరిత్రమునందుఁ గృష్ణదేవరాయల కాలము వఱకుఁ దత్పూర్వికులకాలమును స్థిరపరచుటకు సాధ్యముకాదు. ఈవిజయ రాయలు గొప్పవిద్వాంసుఁడనియు స్త్రీలోలుఁ డనియుఁ దెలియుటయేగాని యంతకన్న నితనిఁగుఱించి యేమియుఁ దెలియరాదు.

## ఆఱవప్రకరణము.

---

ప్రౌఢదేవరాయలు- [౧౪౧౯—౧౪౪౪-శక ౧౪౪౯]

ప్రౌఢదేవరాయలు సింహాసనమెక్కుట— ఫిరోజిషాతో యుద్ధము— ప్రౌఢదేవరాయలు విజయమునొందుట— ఫిరోజిషా వెంగ ఱెట్టుకొనివచ్చుట— అహమ్మదు దేవరాయలపై దండెత్తివచ్చుట— ప్రౌఢదేవరాయలు తప్పించుకొనివచ్చుట— అహమ్మదు విజయనగరముముట్టడించుట— అహమ్మదు చావుతప్పించుకొనుట— దేవరాయలులోఁబడుట— ఓరుగల్లుతురుష్కులపాలగుట— అల్లాయుద్దీను భామినీరాజ్యమువహించుట— ప్రౌఢదేవరాయలను తమ్ముఁడు చంపుటకుఁ బ్రయత్నించుట— ప్రౌఢదేవరాయలు భామినీరాజ్యముపై దండెత్తిపోవుట—

విజయభూపతి యనంతరము ప్రౌఢదేవరాయలు సింహాసనమెక్కినట్టు గన్పట్టుచున్నది. ఇతఁడు గౌడదేవరాయలకు మనుమఁడును విజయభూపతికిఁ బుత్త్రుఁడునై యున్నాఁడు. ఇతఁడు౧౪౧౯వ సంవత్సరమున సింహాసనమెక్కినట్టు గనుపించుచున్నది. ఇతఁడు వీరబుక్కభూపాలునకు తరువాతబుక్కరాయ వంశములోనితఁడే బహుసమర్థుఁడును పౌరుషశాలియనియుఁ జెప్పవచ్చును. ఇతఁడుసింహాసనమునకు వచ్చునప్పటికి చిన్నవాఁడై యున్నట్టూహింపఁబడుచున్నది. ప్రౌఢదేవరాయలు సింహాసనమెక్కినతోడనే ఫిరోజిషా త్రిలింగదేశముపై దండెత్తివచ్చి యోరుగల్లు, పాంగలకోటలను బట్టుకొనఁగాఁ బ్రతాపరుద్రుఁడు ప్రౌఢదేవరాయలను సాయము చేయుమని వేడుకొనఁగా ప్రౌఢదేవరాయలు బహుసేనలంగూర్చుకొనిపోయి తురుష్కులఁదాకెను. అప్పుడుహిందువులకును దురుష్కులకును ఘోరయుద్ధముజరిగెను. ఫిరోజిషా మిక్కిలి పరాక్రమవంతుఁడు. అట్టిశత్రువుతో బాలుఁడయ్యును ప్రౌఢదేవరాయలు లేశమాత్రమును సంశయింపక రణశూరుఁడై ప్రబలయుద్ధముచేసెను. తురుష్కుల సైన్యమునకంతకును సేనాధ్యక్షుఁడుగానున్న మీరుఫజులుల్లాయను మహమ్మదీయుఁడు హిందువులమధ్యభాగమునుదాకి వెనుకకుఁదఱిమి కుడిప్రక్కనుదాకెను. జయము



నుగాంచుటకు సందియములేనిస్థితిలోఁ దురుష్క సేనాధిపతి యుండఁగా నొకనివలనఁ దలపగులంగొట్టఁబడి వీరమరణము నొందెను. ప్రౌఢదేవరాయలవలన లంచముగొని యా తురుష్క సేనాధిపతి నొకశే యాఘోరకృత్యమును గావించెనని ఫెరిష్టా వ్రాయుచున్నాఁడుగాని యదిసత్యమని చెప్పుటకుఁ దగిన యాధారము గానుపించదు. అట్టిపరాక్రమవంతుఁడగు తురుష్క సేనాధిపతి హిందువులతో యుద్ధముచేసి మరణమునొందినాఁడని చెప్పుట యవమానకరమని భావించి యీయసత్యకల్పనమును గావించి ఫెరిష్టాతన యజమానుల దయనుసంపాదించియుండవచ్చును. ఏరీతినైన నేమి మీరుఫజులుల్లా యుద్ధములోఁ బ్రాణములుగోలుపోయెను. తమ సేనాధిపతి మరణమునొందఁగానే తురుష్కులు ధైర్యకంచుకమునువిడిచి తొలఁగుచుండ ఫిరోజిషాపౌరుషమునుజూపి యెంతపురికొల్పినను కార్యకారి కానందున ఫిరోజిషాసయితము హిందువులధాటికి నిలువంజాలక కదనరంగమునుండి తప్పించుకొని పాఱి పోయెను. వేలకొలఁదితురుష్కులు హిందువులచే నఱకివేయఁబడిరి. ఫిరోజిషా మున్నెన్నఁడిట్టి పరిభవమును బొందియుండలేదు. ప్రౌఢదేవరాయలంతటితో వదలిపెట్టలేదు. ఫిరోజిషాను వెంబడించి తఱుముకొనిపోయి యాతని రాజ్యములోఁ బ్రవేశించి తురుష్కులను మృగములను వేటాడుపగిది వేటాడి మసీదులనుగూల్చి పవిత్రస్థలములఁ జెఱచి వేయివిధముల దేశమును ధ్వంసముచేసి చిరకాలమునుండి తురుష్కులచేఁ దమపూర్వులు పొందుచున్న పరాభవమును వడ్డితోఁగూడఁ దీర్చుకొనెను. ఇట్టిదురవస్థలో నుండి ఫిరోజిషా ఘూర్జరదేశపు సుల్తానును దోడుచూపు మని ప్రార్థింపఁగా నాతఁడు తానపుడే నూతనముగా సింహాసన మెక్కిన వాఁడగుటచేతఁ దనవలనఁ గాదని ప్రత్యుత్తరమిచ్చెనేగాని యడ్డుపడఁజాలఁడయ్యెను. ఎట్టకేలకుఁ బోరాడఁగాఁ బోరాడఁగా సుల్తానునితోఁ బుట్టువగుఖాన్ఖానను వాఁడు హిందువులనొకరీతితనదేశమునుండియా

వలకుఁబంపి రాజ్యమును నిలుపఁగలిగెనుగాని ఫిరోజిషా బెంగఁబెట్టుకొని యీయపజయమును సహింపలేక కృశించుచుండెను. స్వర్ణకారపుత్త్రికను బెండ్లాడినతనకొడుకగు హసానునకు రాజ్యము నొప్పగింప ఫిరోజుదలంపు గలిగి యుండెనుగాని బలాఢ్యుఁడగు సోదరుఁడు ఖాన్ఖానన్నను వాఁడు ప్రభుజనప్రేరేపితుఁడై యుద్ధసన్నద్ధుఁడై రాజ్యమాక్రమింపఁ బూనఁగాఁ దన ప్రయత్నమును మానుకొని సోదరునితనతరువాత సుల్తానుఁగాఁ జేయవలసినదిగాఁ జెప్పి ౧౪౨౨ వ సంవత్సరము సెప్టెంబరు ౨౪ వ తేదిని దేహవియోగమునుబొందెను. అహమ్మదుషాహి యను పేరుతో సోదరుఁడు సింహాసనమెక్కెను. ఈతఁడు ఫిరోజిషాపుత్త్రుఁడు హసన్ఖానుని మిక్కిలిగౌరవముతోఁజూచుచు నాతనిఫిరోజాబాదు నగరమునిచ్చి యాతనిజీవనార్థము తగినంతజాగీరిచ్చి యాపట్టణము చుట్టు నెనిమిదిమైళ్ళలోపల స్వేచ్ఛానుసారముగా విహరించుటకును వేటాడుటకును నాజ్ఞ యిచ్చెను. అతఁడును దుర్భరమైన రాజ్యభారమును బూనుటకంటెఁ దనకులభించిన జీవనమే మేలయినదని భావించి తృప్తినొందినవాఁడై స్త్రీలోలుఁడై ఫిరోజాబాదునందు కాలము వెళ్ళఁబుచ్చుచుండెను. కొంతకాలమువఱకు నాయిరువురకు భేదమేమియునులేక యైకమత్యము కలిగియుండెనుగాని తరువాత నేమికారణముననో హసానుఖానుఁడు నేత్రములుతీయించి వేయఁబడిఫిరోజాబాదు మందిరమున ఖైదుచేయఁ బడెను. అహమ్మదుషాహిసింహాసనమునకు వచ్చినతరువాత విజయనగరపు రాజుతోఁ గలవైరమును దలపోసి యేరీతినైనఁ బగదీర్చుకొనవలెనని యాతఁడు రాజ్యమును సైన్యమును బలపఱచుటయెగాక వెంటనే ప్రౌఢదేవరాయలపై దండువెడలివచ్చెను. రాయల దండనాయకులెల్లఱును సైన్యములనుదీసికొని యోరుగల్లుసేనతోఁ గూడ రాయలకుఁ దోడ్పడి యెల్లఱును తుంగభద్రానదివద్ద దండు విడిసి యెదురుచూచుచుండిరి. వరదలేనికారణమునఁ దుంగభద్రానది సుల



భముగా దాటుటకనుకూలముగానుండెను. ఈరీతిగా నలువది దినములున్నతరువాత నొకనాఁడు సుల్తానుసైన్యములు నదిని దాటివచ్చి రాయలసైన్యముపైఁబడెను. ప్రతాపరుద్రుని సైన్యములు రాయలసైన్యమును దిగవిడిచివెనుకకు మఱలిపోయెను. అర్ధరాత్రమునందు శత్రుసైన్యములకుదూరముగానదినిదాటిన లోడీఖానుఁడును, ఆలమ్‌ఖానుఁడును, డిల్లావర్‌ఖానుఁడును ప్రాతఃకాలమునకు శత్రుసైన్యములనుగలిసికొనిరి. ఆసమయమున నాచెంతనున్న చెఱకుతోటకుఁ జేరియున్న యొకతోటలో రాయలు పరిమితపరివారముయొక్క రక్షణములోనుండి నిదురించుచుండుట తటస్థించెను. అకస్మికముగా మహమ్మదీయులగుంపు తోటలోఁ బ్రవేశింపఁగానే రాయలుతత్తఱపడి కట్టుబట్టతోఁ బాఱిపోయి చెఱకుతోటలోఁదూఱెను. మహమ్మదీయభటులు కొందఱాతోటలోనికిఁ బోయి యచటనాతనిఁగాంచి సాధారణమనుష్యునిఁగా భావించి చెఱకుగడలమోపుకట్టి వానితలమీఁదఁబెట్టి మోచుకొని తమతో రావలసినదని యాజ్ఞ చేసిరి. తన్నుగుర్తుపట్టలేదుగదాయని సంతసించి వారుచెప్పినప్రకారముచేసి తాను సులభముగాఁ దప్పించుకొనవచ్చునని తలంచెను. సుల్తానునదినిదాటి వచ్చుటయు రాయలుకనుపించకుండుటయుఁ దలపోసి హిందువులు రంగస్థలముననిలువంజాలక పలాయనులైరి. ఇంతలోసుల్తానురాయల స్కంధావారమునఁ బ్రవేశింపఁగా రాయలఁబట్టి తీసికొనిపోవుచున్న భటులింతకన్న యెక్కువసొమ్మును దోచుకొనవచ్చునుగదాయని రాయలను విడిచితమమిత్త్రులను గలిసికొనుటకు సుల్తానువద్దకుఁబోయిరి. బ్రతికితిగదాయని రాయలుసంతసించి తనసైన్యములతోఁబాఱివచ్చిన తరువాత తనదండనాయకులచేత గుర్తింపఁబడి యక్కడ నిలిచి చెదరిపోయిన సేనలను మఱలఁజేరఁదీసికొని క్రమస్థితిలోనుంచి సేనాధిపతులతో యుద్ధముఁజేయుటను గుఱించి యాలోచించి యాప్రయత్నమును మానుకొని విజయనగరమునకు మఱలి పో

యెను. అహమ్మదుషా విజయనగరమును ముట్టడించుటకు మాత్రమే యోచింపక త్రొక్కినప్రదేశమెల్ల నిర్ధూమధామము చేసి దయాదాక్షిణ్యములనువిడనాడి తనపూర్వికుఁడైన మహమ్మదుషాహి పెట్టిననియతినతిక్రమించి స్త్రీలనక పురుషులనక శిశువులనక చేతి కందిన వారినెల్ల ఖండతుండములుగ నఱకివైచుచు ఘోరకృత్యములు సలుపుచుండెను. మానుషత్వమును దిగవిడిచి యిరువది వేలహిందువులను జంపుటముగియునప్పుడెల్ల మూఁడేసి దినములు విందులు సలుపుచుండెను. దేవాలయములఁ గూల్చి విగ్రహముల నూడఁబెఱికి బ్రాహ్మణపాఠశాలలం దగలంబెట్టుచుండెను. ఈ రాక్షసకృత్యమును జూచిసహింపఁజాలక యైదువేలహిందువులుతమ ప్రాణములనుగోలుపోయినను గ్రూరకర్ముఁడగు సుల్తానునిఁ జంపి తాముజన్మించిన దేశమునకునుపకారము సలుపవలెననిదీక్షవహించి వేగులనునియమించి సమయముకొఱకుగాచియుండిరి. ఒకనాడు సుల్తానుతన సేనానివేశస్థానమునువిడిచి వేటకై పంద్రెండుమైళ్ళదూరముపోయి యుండుటతటస్థింపఁగా నావృత్తాంతమునుచారులవలనఁ దెలిసికొని వెంటనెపోయి యతని యనుచరులగు రెండువందల మొగలాయీలు సయితము కొంచెముదూరముననుండుసమయమునఁబోయి యాతనిఁ జుట్టుముట్టఁగా భయపడి తప్పించుకొని యాసమీపముననున్న పశువులదొడ్డిలోఁ బ్రవేశింపవలెననిబరువెత్తుచుండ శత్రువులు దఱుముకొనివచ్చుచుండిరి. భూమి బ్రద్దలయి లోతుగానున్న యొకకయ్యదాటి పోవలసివచ్చెను. అది దాటిపోవుటకు లోపలనేశత్రువులు సమీపించిరి. ఇంతలోనాతనియదృష్టవశమున విలుకాండ్రగుంపొకటి తోడు పడెను. అంబువలన శత్రువులు కొంచెమాలస్యముకాఁగా సుల్తానునకు దూరమునుండి పోవలసివచ్చెను. సుల్తానువిలుకాండ్రతోఁగూడ నాపశువులదొడ్డిలోఁ బ్రవేశించెను. శత్రువులునువచ్చి దానిఁజుట్టుముట్టిరి. ప్రబలయుద్ధముజరిగి శత్రువులుగోడలుపగులఁగొట్టి లోపలఁ బ్రవేశిం



పనున్న సమయమున సుల్తానుకొఱకు వెదకికొనుచువచ్చి అబ్దుల్ ఖాదరనువాఁడు శత్రువులనుదాకెను. అహమ్మదుషా అబ్దుల్ఖాదరుసైన్యముతోఁజేరుకొని శత్రువులతో ఘోరయుద్ధము సలిపి తుదకుఁదప్పించుకొనిపోయెను. వేయిమంది హిందువులును ఏనూఱుగురు తురుష్కులును బ్రాణములను గోలుపోయిరి. ఈ యాపత్తునుండి విడివడి సుల్తానువిజయనగరము ముట్టడించెను. దేవరాయలు ప్రజలకుఁగలుగు నష్టమునుయోజించి అహమ్మదుషాతోసంధిచేసికొనెను ముప్పదియేనుఁగులను ధనముతోనింపి పుత్త్రినిచ్చి సుల్తానువద్దకుఁబంపెను. సుల్తాను దేవరాయలపుత్త్రిని మిక్కిలి గౌరవించి తనప్రక్కను గూరుచుండఁబెట్టుకొని యరేబియా పారశీక ఖొరాసాను దేశములనుండి తెప్పించిన సుందరము లయినయశ్వముల నిరువదింటిని, నవరత్నఖచితమైన ఖడ్గమును, మగయేనుఁగును, శ్వానములను, కర్ణాటకులావఱకెఱుఁగని మూఁడు డేగలను బహుమానముచేసి యాతనిఁదిరిగి విజయనగరమునకుఁ బంపివేసి తాను కలుబరగి నగరమునకు వెడలిపోయెను. ఈయుద్ధము ముగిసినతరువాత ననావృష్టివలనదేశమునఁ గాటకము సంభవించి దక్కనునందు ప్రజానాశనము సంభవించెను. తరువాత ౧౪౨౪ వ సంవత్సరమున నహమ్మదుషా త్రిలింగదేశముపై దండెత్తిపోయి యోరుగల్లుముట్టడించెను. అదివఱకుఁబొందిన కష్టమువలనను నష్టమువలనను కాటకోపద్రవమువలనను ప్రౌఢదేవరాయలు కాకతీయులకు లేశమాత్రమును దోడుచూపలేకపోయెను. స్వల్పకాలము ఘోరయుద్ధముజరిగి త్రిలింగరాజ్యము తురుష్కుల యధీనమైపోయెను. అనేక శతాబ్దములనుండి తురుష్కుల కజేయమై వెలుంగుచున్న ప్రతాపరుద్రరాజ్యము విజయనగరపు రాజుల యుపేక్షవలన నాటితోనంతరించిపోయినది.

అహమ్మదుషా యనంతరమాతనిపుత్త్రుఁడు రెండవ అల్లా ఉద్దీన్ భామినీరాజ్యమును వహించెను. క్రీస్తుశకము ౧౪౩౫ వ

సంవత్సరము ఫిబ్రవరు ౨౦వ తేదీ భానువారమునాఁడు అహమ్మ
దుషామరణమునొందెను. అల్లాయుద్దీను సింహాసనమునకు వచ్చిన
తోడనే తనసోదరుఁడగు మహమ్మదుఖానుని దేవరాయలమీఁదికిఁ
బంపెను. దేవరాయలు సంధిచేసికొని మఱలఁకొంత ధనమునిచ్చి
మహమ్మదుఖానుని సాగనంపెను. ఈవిజయమునకు ప్పొంగి మహ
మ్మదుసోదరునిపైఁ దిరుగఁబడి దేవరాయల సహాయమునుబొందె
ను. మహమ్మదు ముద్గల్లు, షోలాపురము, రాయచూరు, బీజపుర
ము, మొదలగుపట్టణములను స్వాధీనముచేసికొనెనుగాని సుల్తాను
సైన్యముతో యుద్ధముజరిగినపు డపజయము నొంది పాఱిపోయెను
తరువాతసుల్తాను వానియపరాధమును మన్నించి రాయచూరుకో
టనాతనికిచ్చెను. ౧౪౪౨వ సంవత్సరమున దేవరాయలుతనకును
భామినీసుల్తానునకును గల విరోధమునుగుఱించి తలపోసి మంత్రి
లను, బంధువులను, హితులను, పురోహితులను వృద్ధులగుబ్రా
హ్మణులను నెల్లవారినిఁ బిలిపించి యొకపెద్దసభచేసి తనరాజ్యముభా
మినీరాజ్యముకంటె నధికవిస్తీర్ణతకలదనియు, నైశ్వర్యప్రదమైన
దనియు, జనసమృద్ధమైనదనియు, బహుసేనావృతమైనదనియు, అ
ట్లయ్యుఁదురుష్కులు విజయమునొందుచుండుటకుఁ గారణంబేమని
యడిగెను. కొందఱు మహమ్మదీయుల గుఱ్ఱములుమిగుల బలాఢ్య
ములయినవనియు, శ్రమకోర్చునవియనియు, కర్ణాటకదేశపు గుఱ్ఱ
ములు మిక్కిలిబలహీనములయినవనియు, నత్యధికశ్రమకోర్వజా
లనివనిచెప్పిరి. మఱికొందఱు సుల్తాను సైన్యమునందు కుశలులగు
విలుకాండ్రు పెక్కండ్రుకలరనియు రాయలసైన్యమునందంతగాఁ
గానరారనియుఁజెప్పిరి. అందుమీఁదట ప్రౌఢదేవరాయలు తనసై
న్యములోనున్న మహమ్మదీయులకు విందుచేసివారలకు జాగీరులిచ్చి
మసీదుగట్టించి వారిమతధర్మములకు నెవ్వరు భంగము కలుగఁజే
యకుండఁ గట్టుదిట్టములేర్పఱచి రెండువేలమహమ్మదీయ విలుకాం
డ్రను తనసైన్యములోఁ జేర్చుకొనుటయేగాక యిరువదివేల హిం



దూవిలుకాండ్రను గూడఁజేర్చుకొని పెక్కండ్రకు ధనుర్విద్యనే
ర్పించుచు సేనలనుజక్కపఱచుకొని పెంపునొందించుచుండెను.

ఇట్లుండ దేవరాయలనుజంపవలెనని యొకనాఁడు సోదరుఁ
డో సోదరపుత్త్రుఁడో ప్రయత్నించినను నాప్రయత్నమునకు వి
ఘ్నముసంప్రాప్తమై వారలే దమప్రాణములను గోలుపోవలసివచ్చె
ను. సోదరుఁడని అబ్దుల్ రజాకనునాతఁడును సోదరపుత్త్రుఁడని న్యూ
నీజును చెప్పుచున్నారుగాని అబ్దుల్ రజాకు ప్రౌఢదేవరాయనికాల
మున నాతనివద్దకు రాయబారిగావచ్చి సమస్తవృత్తాంతమును గ
న్నులారఁ జూచినవాఁడుగావున నతఁడు చెప్పినదే సత్యమని యొప్పు
కొనకతప్పదు. ప్రౌఢదేవరాయల సోదరుఁడు నూత్నభవనమునొక
దానిఁగట్టించి గృహప్రవేశమహోత్సవమునాఁడు రాజబంధువు
లకు విందొనరింతునని యాహ్వానపత్రికనుబంపించెను. ఆహ్వాన
ముచేయఁబడిన మంత్రులును రాజబంధువులును మొదలగువా
రందఱునువచ్చి యొకసభామంటపమునఁ గిక్కిరిసియుండిరి. ఆకా
లపువాడుకచొప్పున నెల్లఱునొక్కసారిగా నొకచోటభోజనమున
కుఁగూరుచుండరాదు. వారివారి తారతమ్యములననుసరించి యొ
క్కరొక్కరేపిలువంబడుచువచ్చిరి. మందిరమునందుదుంధుభులు, నగా
రాలు, తుత్తారాలు, పిల్లనగ్రోవులు చెవులుచిల్లులుపడునట్లుగా
మ్రోగుచుండెను. ఆసందడిసమయములో రాజకీయోద్యోగియుల
కు వేర్వేఱుగా విందులు పెట్టుమిషమీఁద వేర్వేఱుగృహములకుఁ
గొంపోయి యదివఱకేమున్నుచేసికొన్న యేర్పాటుననుసరించి భో
జనముపెట్టుటకుమాఱుగఁ బ్రాణములనేగొనుచుండిరి. ఈప్రకా
రము మంత్రులను రాజబంధువులను దండనాయకులను పెక్కం
డ్రను వధించియుండెను. వాద్యములమ్రోఁతవలన లోపలనేమిజ
రుగుచున్నదో యాకుట్రలోఁజేరినవారికేగాని తదితరులకేమియుఁ
దెలియకుండెను. దుర్మార్గుఁడగు నారాజకుమారుఁడీ కుతంత్రమువ
లన రాజునుగూడఁగడతేర్పవచ్చునని యూహించి రాజసమ్ముఖము

నకువచ్చి చేతులుజోడించుకొని దేవరవారు విజయంచేయువఱకు రాజబంధువులెల్లఱును వేచియుండురుగాన దయచేసి తనప్రార్థన నంగీకరించి భ్రాతృవాత్సల్యమునుజూపి తనయింట విందుగుడిచి తన్నుగౌరవింపవలసినదని వేయివిధముల వేడికొనెను. అంతట రాయలు తనకస్వస్థముగానున్నదని నేనీపూట భోజనమునకు రానని యు దైవముపలికించినట్లుపలికెను. తనప్రయత్నమంతయు భగ్నమయినదిగదాయనిచింతించి రోషావేశపరవశుఁడై తమలపాకులు పోకచెక్కల క్రిందదాఁచియుంచుకొనిన వాడిగలకత్తినిదీసి రాజు పైఁబడి పలుమాఱుఁగొట్టెను.

రాయలు తానుగూరుచున్న సింహాసనము వెనుకకువెలికిలఁబడిపోయెను. రాజుమరణమునొందెనుగాయని నిశ్చయించి సోదరుఁడు తనయెడ విశ్వాసముగల బంటునొకని రాజుశిరస్సు ఖండింపవలసినదిగా నియమించి తానంతఃపురసౌధాగ్రమునకెక్కి "ఓ మహాజనులార! నేనురాజును వానిసోదరులను మంత్రులను బ్రాహ్మణులనుజంపితిని. నేనేప్రభువుగానున్నాను. ఇంతలో రాజు శిరస్సుఖండింప నాజ్ఞాపింపఁబడిన బంటుతనపూన్కి నెఱవేర్ప సింహాసనము సమీపింపఁగా రాయలువెనుకనున్న గోడనానుకొనితన్ను జంపవచ్చిన బంటువెన్నువిఱిగి వెనుకఁ బడునట్లు తనశక్తికొలఁది నొక్కిపెట్టు ఱొమ్ముపయిఁబెట్టెను. అదివఱకు తనకు దేహరక్షకుఁడుగానుండి దాఁగొనియున్న తనభృత్యుని సహాయమువలన నాపాతకునిఁజంపి యంతఃపురము వెడలివచ్చి "నేనుసజీవినై యున్నాను; నేనుసురక్షితముగానున్నాను; ఆరాజద్రోహినిఁ బట్టుకొనుఁడు" అనిరాజుమొఱపెట్టెను. అంతటజనులీ దారుణకృత్యమంతయును వీక్షించి గుమిగూడి రాజద్రోహియగు రాయలసోదరునిఁజుట్టుముట్టి చక్కడంచిరి.

కుట్రలోఁ జేరినవారినందఱిని రాజుచంపించెను. రాజును చంపఁదలఁచినవారిలో ననేకులనేక చిత్రవధలకుఁ బాల్పడవలసిన



వారయిరి. కొందఱుఁ బ్రతికియుండఁగానేఁ దగులంబెట్టఁబడిరి. ఆహ్వానపత్రికను దెచ్చిన మనుష్యుఁడు క్రూరహింసలపాలయ్యెను. విజయనగరమిట్టి దురవస్థలోనుండఁగా భామినీసుల్తానగు నల్లాయుద్దీనను వాఁడీసమాచారమంతయునువిని యేడులక్షలవరహాలు కప్పముకట్టవలసినదని రాయలకు వర్తమానముచేసెను. రాయలా వర్తమానమునకు జంకక ధైర్యమువలంబించి ప్రౌఢదేవరాయలు సుల్తానుదేశముపై దండెత్తిపోయెను. రాయలు తుంగభద్రానదిని దాటి ముద్దకల్లుకోటలోఁ బఱచుకొని రాయచూరు వెంగాపురదుర్గములను బట్టనిశ్చయించి సాగరుబీజపురమువఱకుఁగల దేశమును గొల్లవెట్ట సేనలనుబంపి భామినీరాజ్యమల్లకల్లోలము చేయుచుండెను. సుల్తాను సేనాధిపతులగు మల్లిక్ ఆల్ టిజార్, అజీమ్ఖాన్, జమాన్ఖాన్ మొదలగువారు తురుష్కసైన్యములంగూర్చుకొని రాయలసైన్యముతో యుద్ధముచేసిరి. ఆయుద్ధములో మహమ్మదీయులకుఁ బ్రాణనష్టమువిశేషముగా సంభవించెను. తుదకు నొండొరులకు హానికలుగఁజేసికొనకుండ సంధిగావించికొనిరి. ఈప్రౌఢదేవరాయలకాలముననే పారశీకదేశమునుండి అబ్దుల్ రజాకను నాతఁడును, ఇటాలియాదేశస్థుఁడగు నికోలోకోంటియను నాతఁడును విజయనగరమును జూడవచ్చిరి. ఆవృత్తాంతమే నేడవప్రకరణమున వివరింపఁబడును. ప్రౌఢదేవరాయలు ౧౪౪౩ వ సంవత్సరాంతముననో ౧౪౪౪ వ సంవత్సరారంభముననో మరణము నొందియుండును.

## ఏడవప్రకరణము.

---

నికోలోచేసిన వర్ణనము — విజయనగరము — ఉత్సవములు — జనులు — అబ్దుల్ రజాకుచేసిన వర్ణనము — అతనిప్రయాణము — నగరప్రాకారములు — రాజమందిరములు — టంకశాల — బజారులు — మహానవమిపండుగ —

విజయనగరము స్థాపింపఁబడినతరువాత నానగర మెంతవైశాల్యముగలదియో, ఎంతజనభారమును వహించినదియో, ఎట్టి రక్షకస్థానములను గలదియో మనయాంధ్రులకంతగాఁ దెలియదు. విదేశీయులు వ్రాసియుంచిన వర్ణనలనుబట్టి మనమిప్పుడు నిజస్థితిఁ దెలిసికొనఁగలుగుచున్నాము. నికోలోకోంటి యను నిటాలియాదేశస్థుఁడొకఁడు ౧౪౨౦ వ సంవత్సరమున నీదేశమునకువచ్చి విజయనగరమునుజూచి ల్యాటిన్‌భాషలోనానగరవైభవములను వర్ణించియున్నాఁడు. తొలుదొల్తనికోలోకోంటి హిందూదేశమును జేరఁగానే ఘూర్జరదేశమునకు రాజధానియగుకాంచియానగరమును దర్శించి యిరువదిదినముల యనంతరము బర్కూరుమొదలగు పట్టణములనుజూచి మార్గమధ్యమున నుండు వింతలనువీక్షించుచు క్రమముగా రాయల రాజధానియగు విజయనగరమునకు వచ్చినవాఁడు. అతఁడీనగరమును నిట్లు వర్ణించుచున్నాఁడు.

"విజయనగరమను మహానగరము మిక్కిలినిట్రముగానున్నపర్వతములసమీపమునఁ గట్టఁబడినది. ఆనగరముయొక్క చుట్టుకొలత యఱువదిమైళ్ళుండెను. ఈనగరమున నాయుధములను ధరింపసమర్థులగువారు తొంబదివేలభటులున్నారు." ఇతఁడుపర్వతములని యుదహరించనేకాని ఱాళ్ళగుట్టలును కొండలునేగాని గొప్ప పర్వతములులేవు. రక్షక పంక్తులయొక్క వైశాల్యమసామాన్యమై యాశ్చర్యకరమైయున్నది. మిక్కిలి పొడవునుస్థూలమునుగల ఱాతిగోడలు కనమలకడ్డముగాఁ గొండలకొనలవఱకుఁ గట్టఁబడినవి. వెలుపలిపంక్తులు చెక్కుచెదరకుండునటులఁ బెక్కుమైళ్ళవఱకు సమభూమిలో నిర్మింపఁబడినవి. కొండలమధ్యనున్న పల్లపుప్రదేశములలో జనులునివసించుగృహములును మిద్దెలును మేడలును, నగరులును, ఉద్యానవనములు, ఫలవృక్షములు, పంటకాలువలు మొదలగునవి పెక్కులుకలవు. అచ్చటచ్చటప్రసిద్ధములగు దేవళములును గోపురంబులును గన్నులకుఁ బండువుసేయుచుండునట్లుగా నుండెను. అట్టినగరులయొక్కయు దేవాలయములయొక్కయు, ద్వారములయొక్కయు, శిథిలములయిన భాగములనేకములు నేటికిని గన్పించుచున్నయవి. ఇచ్చటమాత్రమేగాక విజయనగరమునకుత్తరముగా బ్రవహించుచున్న తుంగభద్రానది కావలనున్న ఆనెగొందిపురములోని కట్టడములయొక్క శిథిలములయిన భాగములుకూడ ననేకములునేటికిని గన్పించుచున్నవి. రెండుపెద్దభాగములుగా నేర్పడిన యీమహానగరముయొక్క వైశాల్యమును జనబాహుళ్యతయు నత్యధికమై యుండినవి. పురమునకుదక్షిణముననున్న రక్షకస్థానముమొదలుకొని యానెగొందిపట్టణముయొక్క యుత్తరపుకొనవఱకుఁగల దూరము పండ్రెండుమైళ్ళుండెను. అటులనేపడమరనుండి తూర్పునకుఁగలదూరము పదిమైళ్ళుండెను. ఆకాలమునందు త్రవ్వింపఁబడిన పంటకాలువలు నేటివఱకును శిథిలములుగాక బహుభూములను సారవంతములగు పంటలను బండించునవిగాఁ జేయుచున్నవి. ఆప్రదేశములిపుడు పచ్చనిపైరులతోను నానావిధములగు ఫలవృక్షములతోను నిండియున్నవి. కొండలపైభాగములందు శిథిలములైన దేవళములయొక్కయు, గృహములయొక్కయు, గోడలయొక్కయు, భాగములుగనుపించుచున్నయవి. ఒకకాలమునందు మిక్కిలిసొగసుందనమును ఔన్నత్యమును గనఁబఱచిన చిత్రంపుఁబనులయొక్క శిథిలములయినభాగములు నేటికిని మధ్యభాగమునందు గనుపించుచున్నయవి.

మఱియు నికోలోడెయికోంటి యనునాతఁడు "ఈప్రాంతములందు నివసించుజనులు తమయిష్టముననుసరించిబహుభార్యలను బరిగ్రహింపుచుందురు. వారిలు జీవయాత్ర ముగించిన భర్తలశవములతోఁ గూడదహింపఁ బడుచుందురు. వారి ప్రభువు హిందూదేశములోని ప్రభువులకన్న మిక్కిలి శక్తిగలవాఁడు. అతనికిఁబండ్రెండువేల భార్యలుగలరు. అందునాలుగువేలు రాజెచ

టికిఁబోవునో యచ్చటికిఁ గాలినడక నడిచివచ్చెదరు. మఱి నాలుగువేలస్త్రీలు సుందరాలంకారభూషితలై యశ్వారూఢలయి వెంటనంటివచ్చెదరు. రెండుమూఁడువేల భార్యలాతఁడు చనిపోయినపుడు శవముతోఁగూడ నగ్నిప్రవేశము చేయ నిశ్చయించుకొన్నవారయియుండిరి. సంవత్సరములో నొకానొకకాలమునందు తమయిలవేల్పుగాఁ బూజించెడు విగ్రహమును రెండురథములమధ్యనుంచి నగరవీధులయందూరేగింతురు. చిన్నపడుచులు సుందరవస్త్రాలంకారభూషితలై దేవునిగుఱించి పాటలుపాడుచు వెంబడించివచ్చెదరు. అనేకులుభక్త్యావేశపరవశులయి స్వామివారిరథచక్రములక్రిందఁబడి నజ్జునజ్జులయి మరణమునొందిన భగవంతుఁడుముక్తినిగరుణించుననునమ్మకముతో నాప్రకారముఁ జేసి ప్రాణములనుగోలుపోవుచుందురు. మఱికొందఱుప్రజ లురిపెట్టుకొని రథమునకుఁగట్టుకొని బాధనొందుచుఁ బ్రాణములను విడిచెదరు. సంవత్సరమునకు మూఁడుగొప్పపండువులను గావించెదరు. అందొకపండువుదినములలో స్త్రీపురుషాదు లాబాలవృద్ధులు నదులలోను సముద్రములోను స్నానములాచరించి నూతనవస్త్రముల ధరియించి శుచివ్రతులయి భజనలు, నృత్యములు, విందులుసలుపుచు త్రిరాత్రములు గడుపుదురు. మఱొకపండుగనాఁడు దేవాలయములలోపలను వెలుపలను దీపారాధనలను జేయుచుందురు. మూఁడవపండుగ నవరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వీధులయందు దూలములనుబాతించి వానికొనలకు వివిధములగు రంగుల గుడ్డలను, జీరగుడ్డలను గట్టుదురు. మఱియునొక్కొక్కదినమున సమస్తభూతములను సమదృష్టితోఁజూచు నొక్కొక్కభక్తిపరుని నాదూలములచివరనుంచి నానావిధములయిన పండ్లతోఁ గొట్టుచుందురు. వారలెంతయు నోపికతో నోర్చుకొనియుందురు. ఈమూఁడు పండుగలునుగాక మఱియొకపండుగ త్రిరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వసంతమను పేరుతోఁ బసపునీళ్ళను రాజమా



ర్గమున నడచువారలపైఁ జల్లుచుందురు. రాజులపైనను రాణులపైనను గూడఁ జల్లుచుందురు. ప్రజలియ్యదిచూచి కేరింతములు గొట్టుచుందురు." అని వ్రాసియున్నాఁడు. ఈనికోలోడెయికోంటి విదేశీయుఁడగుటవలన రాణులయొక్క పరిచారికలనుగూడ రాజుభార్యలని యూహించి పొరబడి పండ్రెండువేలభార్యలుండిరని వ్రాసియుండవచ్చును. అతఁడు దెలిపిన పండుగలు నాలుగును వరుసగా సంవత్సరాదిపండుగనియు, దీపావళిపండుగనియు, మూఁడవది మహానవమి పండుగనియు, నాలుగవది కాముని పండుగయనియు మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. విజయనగరము వజ్రములకు ప్రసిద్ధికెక్కియుండెనని యాతఁడు దెలిపియున్నాఁడు. తరువాత ౧౪౪౩వ సంవత్సరమున "అబ్దుల్ రజాక" నునతఁడు విజయనగరమును జూడవచ్చి యానగరమును వర్ణించియున్నాఁడు. ఇతఁడు పారశీకదేశపురాజునొద్దనుండి కళ్ళికోటరాజగు జామొరిన్ కడకు రాయబారిగావచ్చెను. అచటనుండి దేవరాయలచేఁ బిలిపింపఁబడినట్లుగాఁ దెలుపుచున్నాఁడు. ఇతఁడు మంగళూరు, బెద్నూరు మొదలగు పట్టణములగుండ ప్రయాణముచేసి విజయనగరమునకు వచ్చినవాఁడుగావున దారిపొడుగునను తాను జూచిన దేశములయొక్కయు, ప్రజలయొక్కయు వర్ణనలను జేసి విజయనగరమునుగుఱించి యిట్లువ్రాసియున్నాఁడు.

"౧౪౪౩ వసంవత్సరము, ఏప్రియలునెలాంతమునకు విజయనగరము ప్రవేశించితిమి. మమ్ముఁదోడ్కొని పోవుటకై మాకెదురుగాఁ బరివారజనమును బుత్తెంచి మేముబసచేయుటకై మాకొకసుందరమయిన గృహమురాయలిప్పించెను. అతనిరాష్ట్రము కృష్ణానది మొదలుకొని కన్యాకుమారివఱకు వ్యాపించియుండెను. ఆనగరమున వికృతాకారములు గలిగిపర్వతములను బోలినవేయి యేనుగులుగలవు. పదునొకొండు లక్షలసైన్యముగలదు. హిందూస్థానము నందాకాలమున నిరంకుశాధికారముగల మఱియొక

రాయలు గానరాఁడు. విజయనగరము వంటిమహానగరమును నేనెన్నఁడును గన్నులతోఁ జూచియుండలేదు. ఆనగరమును బోలిన మఱియొకనగరము ప్రపంచమున నెచ్చోటనైన నున్నట్టువినియుండలేదు. సప్తప్రాకారములచేతఁ జుట్టఁబడిన యేడుదుర్గములచేసు రక్షితమై ఆనగర మొప్పుచున్నయది. మొదటిదుర్గము చుట్టును నిలువెడెత్తుగలఱాళ్ళు గుఱ్ఱములుగాని భటులుగాని నడచుటకు వీలులేనియట్లు భూమిలో సగమువఱకు పాదుకొనియున్నవి. ఉత్తరముగానున్న యేడవదుర్గమే రాజునివసించు నంతఃపురమందిరముగానున్నయది. మొదటిదుర్గము యొక్క దక్షిణపుకొన మొదలుకొని యుత్తరముగా నదివఱకు దూరమెనిమిది మైళ్ళుగానుండెను. మొదటిదుర్గము మొదలుకొని మూఁడవదుర్గము వఱకుఁగల ప్రదేశమంతయు సాగుచేయఁబడిన పొలములతోను గృహములతోను ఉద్యానవనములతోను ఫలవృక్షములతోనునిండియుండెను. మూఁడవదుర్గము మొదలుకొని యేడవదుర్గమువఱకుఁ గలప్రదేశమంతయు నసంఖ్యాకములగు జనసంఘములచేతనిండి బజారులతో నొప్పుచుండెను. రాజమందిరమునకు సమీపముగా నాలుగుబజారులొక దానికొకటి యెదురుగా బారులుదీర్చియుండినవి. ఉత్తరమునరాయలమందిరము యొక్క ద్వారమంటపముగలదు.

ప్రతిబజారునకు పైన సొగసైన తాళ్వారముతోఁ గూడిన యున్నతములైన కమానులు నిర్మింపఁబడినవి. అన్నిఁటికంటె రాయలయాస్థానమంటపము మిక్కిలి యెత్తుగానున్నది. బజారులు విశాలములును పొడవులునుగలిగి రమణీయములై యుండినవి. గులాబీపూవు లంతట నమ్మఁబడుచున్నవి. ఆప్రజలు గులాబీపూలను నాహారముకంటె నావశ్యకములయినవిగా భావించుచుండిరి. ముత్యములు, కెంపులు, నీలములు, వజ్రములు మొదలగునవి బహిరంగముగా బజారులలో విక్రయింపఁబడుచున్నవి. ఈప్రదేశములందును రాజాంతఃపురప్రదేశములందును నున్నగా పాలగచ్చుచే



యఁబడిన ఱాతివారులగుండ కాలువలు పెక్కులుజలపూర్ణములై ప్రవహించుచున్నవి. రాయలసౌధద్వారమంటపమున కెడమభాగమున రాజనగరువలెనున్న దివానుఖానాయనుమందిరముకలదు. దానికెదురుగా నొక్క సభామంటపముగలదు. సభామంటపమున కుచివరచోపుదారులు నిలువంబడియుందురు. ఆసభామంటపము మధ్యదివానుగూరుచుండు పీఠముగలదు. అచటదివానులేక దండనాయకుఁడు ప్రజలవిజ్ఞాపనములను విమర్శించుచుండును. అతని తీర్పునకుపైతీర్పులేదు. పనిముగించినతరువాత దండనాయకుఁడు సప్తద్వారములనుదాటి యంతఃపురముసొచ్చి సమస్తమును రాజునకునివేదించును. రాజమందిరమునకు వెనుక దండనాయకునిగృహముకలదు. ఆమందిరమున కెడమపార్శ్వమున నాణెములముద్రించు టంకశాలగలదు. దివానుఖానాకు నెదురుగా నేనుఁగులుండుకట్టడముగలదు. ఏనుఁగున కొక్కొక్క గదిచొప్పున నేర్పాటుచేయఁబడెను. నాణెములముద్రించుటంకశాలకెదురుగా నగరపాలకుని గృహముకలదు. ఆతనిక్రిందఁబండ్రెండు వేల భటులుండిరి. టంకశాలకు వెనుకప్రక్క పదునైదుగజముల వెడల్పును రెండువందలగజముల పొడవునుగల యొకచిన్నబజారుకలదు. బజారునకిరుపార్శ్వములయందు నిండ్లును ముఖమంటపములును గట్టఁబడియున్నవి. వానికెదుటసొగసయిన ఱాళ్ళచేఁగట్టఁబడిన యున్నతాసనములుగలవు. ఆయాగదులయొక్క గోడలమీద సింహములు, పెద్దపులులు, చిఱుతపులులు మొదలగుక్రూరమృగములయొక్క యాకారములు చిత్రింపఁబడినవి. అక్కడియున్నతాసనములు రత్నాభరణాలంకృతలగు వేశ్యాంగనామణులచే నధిష్ఠింపఁబడియుండినవి. ఒకనాఁడు నన్నుఁజూచుటకై రాయలయంతఃపురమునుండి పంపఁబడినకొందఱు దూతలువచ్చి యాదినముననే నన్ను రాయలయాస్థానమునకుఁ గొనిపోయిరి. రాజకుమారుఁడు (ప్రౌఢదేవరాయలు) సభామంటపమున రాజకార్యధురంధరులగుమంత్రి

శిఖామణులు మొదలుగాఁగలవారు తన్ను బలిసికొలువ సింహాసనాధిష్ఠితుండై యుండెను. వానికిరుపార్శ్వముల జనసంఘము వృత్తాకారముగా నిలువంబడి యుండెను. రాయలు పట్టుపీతాంబరమును ధరించియుండెను. సొగసగు నీటిచేఁజేయఁబడిన ముత్యాల పతకమును నమూల్యములగు రత్నాభరణములను ధరించి యుండెను. పలచనైనట్టియు పొడవైనట్టియు దేహమునుగలిగి నలుపును దెలుపును గాక చామనచాయంబోలు రూపమునుగలిగి యుండెను. చెక్కులు మెత్తనివై పలచగనున్నవి. గడ్డమునవెంట్రుకలులేవు. చూపుమనోహరముగానుండెను. ఆతనికి నేడువందల భార్యలును ఉంపుడు కత్తెలునుగలరని తెలియవచ్చినది. మహానవమి పండుగనాడు రాయలు (ప్రౌఢదేవరాయలు) తనరాష్ట్రములోనుండి తనకుఁ గప్పముగట్టుచున్న సేనాధిపతులను ప్రభువులను దనయాస్థానమునకు రప్పించి దర్బారుతీర్చెను. వారలు మిగుల రమణీయములగు హారాదాలతో నలంకరింపఁబడిన యేనుఁగులను వేయింటినితమతోఁగూడఁ దెచ్చిరి.

ఆనాడు నగరమంతయు శృంగారముగా నలంకరింపఁబడెను. ఏనుఁగులొకచోటునకుఁజేరిసముద్రతరంగములం బోలిగను పట్టుచుండెను. అచటచట నాలుగయిదంతరువులుగల పందిరులు నిర్మింపఁబడినవి. ఈపందిరులు గిఱ్ఱమనిచుట్టుఁ దిరుగుటకను కూలములగునట్లుగా నిర్మింపఁబడినవి. ఈమైదానమునకెదుట తొమ్మిది పందిరుల్లతోఁగూడిన రాజభవనమొకటి నిర్మింపఁబడినది. తొమ్మిదవ యంతరువులో నిపందిరిలో రాయలకు సింహాసనమమర్పఁబడినది. అంతఃపురమునకును పందిళ్ళకును మధ్యనాటకులును పాటకులును కథకులునునుండిరి. ఈరాజునకెదుటనున్న తెఱకొవలఁబడుచులు సుందర వస్త్రాలంకార భూషితలై నృత్యములు సలుపుచుండిరి. గారడివాండ్రు మిక్కిలి యానందముప్పొంగునట్లుగా నేనుఁగులచే నాటలాడించుచుండిరి. మూడుదినము లీవిధముగా నాటలతోను పాటలతోను వినోదములతోను గడపఁబడినవి. మూడవనాఁడు నాకుమరల రాజదర్శనము లభించెను. మిక్కిలి వైశాల్యముగల సింహాసనము సువర్ణముతోఁజేయఁబడి యమూల్యములగు మణులచేఁ బొదగఁబడియున్నది. సింహాసనమునకెదుటఁ జదరముగానున్న మెత్తయొకటిగలదు. దానికొనలయందు మూఁడువరుసల ముత్యములతోఁ గుట్టఁబడియుండెను. రాజామూఁడుదినములామెత్తపైఁ గూరుచుండియుండెను. ఆమందిరముయొక్క గోడలునుపైకప్పును మణులచేఁ బొదుగఁబడిన బంగారుపలకలచేఁ గూర్పఁబడియున్నవి. అవియును బంగారపు మేకులతో బిగింపఁబడియున్నవి. ఈరీతిగా విదేశీయులచే వర్ణింపఁబడిన యీవిజయనగరము పదునేడవపదునాఱవ శతాబ్దములయందు మిక్కిలి యౌన్నత్యమును బొందియుండెనని చెప్పుటకు లేశమాత్రము సంశయింపవచ్చునా? అట్టిమహానగరమునేడు మనకన్నులకు గానరాకుండుటవలన మనకెంత విచారమును గలుగఁజేయుచున్నది! ఇఁకమన కథాంశమునకు వత్తము.



# ఎనిమిదవప్రకరణము.

---

## మల్లికార్జునరాయలు-విరూపాక్షరాయలు.

అల్లాఉద్దీన్ మరణము—హుమాయూను సింహాసనమెక్కుట— మహమ్మదుషా— ఖాజాఖాన్ గవాన్— తురుష్కులుగోవానగరమునుముట్టడించుట— మహమ్మదుదండయాత్రవెడలుట— మహమ్మదు రాజమహేంద్రపురము, కొండపల్లె, కొండవీడు, కంచిమొదలగుపట్టణములుజయించుట— పురుషోత్తమదేవుఁడను గజపతిరాజు విజయనగరముపైదండెత్తివచ్చి నరసింహరాయలచేనోడింపఁబడుట— మహమ్మదు క్రోధాంధుఁడై ఖాజాఖాన్ గవానుజంపుట— యూసఫ్ఏదులషాహి భామినీరాజ్యమాక్రమించుట— సాళువనరసింహరాజు విజయనగరరాజ్యమాక్రమించుట-

ప్రౌఢదేవరాయల యనంతరము విజయనగర రాజ్యము చిక్కులలోఁబడి తొల్లింటి యౌన్నత్యమును గోలుపోయి స్వప్రయోజనపరులగు నరపతులయధీనమై బలపరాక్రమములుడిగి బుక్కరాయవంశజులనుండి తొలఁగిపోయి పరాధీనమైనది. ప్రౌఢదేవరాయల యనంతరము సింహాసనమెక్కిన రాజులెల్లను కామాంధులును దుర్బలులును నై యుండుటవలన విజయనగర రాజ్యములోని పెక్కుభూములను తురుష్కులు జయించి స్వాధీనముఁజేసికొనిరి.

అతని యనంతరము రాజ్యమునకువచ్చిన రాజులేయేకాలమున సింహాసనమెక్కిరో యెంతెంతకాలము పరిపాలించి యెవనితరువాతనెవరు ప్రభుత్వసంపదను వహించిరో స్పష్టముగ వక్కాణించుట దురవగాహముగా నున్నయది. ప్రౌఢదేవరాయలకు మల్లికార్జునరాయలు, విరూపాక్షరాయలునని యిరువురు పుత్త్రులుండియున్నట్టు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నయది. మల్లికార్జునరాయల శాసనములు ౧౪౫౨-౫౩, ౧౪౬౪-౬౫ సంవత్సరములలోను విరూపాక్షరాయల శాసనములు ౧౪౭౦వ సంవత్సరములోను బుట్టినట్టు గన్పట్టుచున్నవి. మల్లికార్జునరాయలకు నిరువురు పుత్త్రులున్నట్టు దెలియుచున్నది. వారి శాసనములు ౧౪౭౯-౮౦, ౧౪౮౬-౮౭ సంవత్సరములలోఁ గనుపించుచున్నవి. ౧౪౮౩-౮౪వ సంవత్సరపు శాసనములో రెండవ విరూపాక్షరాయల పేరుదహరింపఁబడినది. చిత్తూరి మండలములోని అంబూరుగ్రామములో ౧౪౬౮-౬౯ సంవత్సరముగల రాజశేఖరరాయల శాసనమొకటి కలదు. మఱియొకటి కడపమండలములోని పారణపల్లెగ్రామమునందు ఱాతిమీఁదచెక్కఁబడియున్నది. దాని ప్రతియొకటి అనంతపురమండలములోని తాడిపత్రి తాలూకాలోని గొడ్డమఱ్ఱిగ్రామవాసియగు నారాయణరెడ్డి స్వాధీనములోనున్న రాగిపలకమీఁద వ్రాయఁబడియున్నది. కాని యిందు



ప్రౌఢదేవరాయలపేరుదాహరింపఁబడియున్నది. ప్రౌఢదేవరాయలను నామముకలవారు పెక్కండ్రు గలరుకాని పైనుదహరించిన యబ్దుల్‌రజాకు విజయనగరమును సందర్శించిన కాలముననే రాయలు రాజ్యపరిపాలనము చేయుచుండెనో యారాయలే ప్రౌఢదేవరాయలని సహేతుకముగాఁ దెలుపవచ్చునని దోఁచుచున్నది. శాసనములొకరీతిని విదేశీయులువ్రాసిన చరిత్రము లొకరీతిని మహమ్మదీయులువ్రాసినచరిత్రములొకరీతిని దెలుపుటయేగాక శాసనములలోనే యనేకభేదములు గన్పించుచుండఁగా సత్యమిట్టిదని చెప్పుటకు శక్యముగాకున్నయది. ప్రౌఢదేవరాయలకు సింహలదేవివలన జనించిన పెద్దకొడుకగు ఇమ్మడిదేవరాయలు మల్లికార్జునరాయలనుపేరుతో రాజ్యమునకువచ్చి యిరువది సంవత్సరములు రాజ్యపరిపాలనముచేసినట్టు గన్పట్టుచున్నయది. ఇతని కాలమున యుద్ధములుజరిగినట్టేమహమ్మదీయచరిత్రకారుఁడును దెలిపియుండలేదు. ఇతనికి తిమ్మనదండనాయకుఁడు ప్రధానమంత్రిగా నుండినట్టు దెలియుచున్నది. అతనిశాసనములు మైసూరు దేశమునందు గనుఁబడుచున్నవి.

ఇతనియనంతరము పుత్త్రులను సింహాసనమునకు రానీయక సోదరుఁడగు విరూపాక్షరాయలు సింహాసనమెక్కెను. ఇతఁడు మిక్కిలి దుర్బలుఁడగు రాజు ఈవిరూపాక్షరాయలు మధుపానప్రమత్తుఁడై స్త్రీలోలుఁడై యంతఃపురములోనేయుండి బయలకు రాక ప్రజలకుగాని దండనాయకులకుగాని దర్శనమీయక మదాంధుఁడై యుండుటవలన బహుభూములను గోలుపోయెను. తనపూర్వులార్జించియుంచిన బలాఢ్యములగు దుర్గములను పెక్కింటినితురుష్కులపాలుచేసెను. ఈతఁడుతన తెలివి తక్కువచేత దండనాయకులఁ బెక్కండ్రను జంపించెను. ఇతఁడొకనాఁడు రాత్రినిద్రఁబోవుచుండఁగా తనదండనాయకుఁడొకఁడు తనగదిలోఁ బ్రవేశించి తన్నుఁజంపవచ్చినట్టు కలఁగని యామఱునాఁడుదయమున వానిని

రప్పించితాను గన్న స్వప్నవృత్తాంతమును దెలిపి వానిని జంపించెను విజయనగర రాజ్యమిట్టి దుష్ప్రభువులనిరంకుశాధికారము నం జిక్కి యప్రతిష్ఠపాలగుచున్న కాలముననే భామినీరాజ్యమును గూడఁగలహములు ప్రబలి భామినీరాజ్యము చీలిపోయినది. అల్లాయుద్దీను ఇరువదిమూడు సంవత్సరములు రాజ్యముచేసి ౧౪౫౮ వసంవత్సరము ఫిబ్రెవరి ౧౩వ తేదీనిమరణమునొందెను. అతని యనంతరము క్రూరుఁడగున తనిపుత్త్రుఁడు హుమాయూనను వాఁడు సింహాసనమెక్కెను. హుమాయూను సింహాసనమెక్కినవెంటనె తెలుఁగుదేశములో దేవరకొండదుర్గముపై దండెత్తివచ్చి యాహింద్రభులతో యుద్ధముచేసి యోడిపోయి మరలి తనరాజధానికిఁబోయెను. అతఁడెల్లవారికి సంతోషమొదవునటుల ౧౪౬౧ వ సంవత్సరము సెప్టెంబరు ౪ వ తేదీని మరణమునొందెను. ఇతనికాలమున మల్లికార్జునరాయలు విజయనగరమును బాలించుచుండెను. తరువాత నైజాముషా సింహాసనమునకువచ్చి కొద్దికాలము రాజ్యముచేసిన యనంతరమాతని తమ్ముఁడగు మహమ్మదనువాఁడు ౧౪౬౩ వ సంవత్సరము జూలయి ౩౦ దవ తేదీని సింహాసనమెక్కెను. విరూపాక్షరాయలు విజయనగరరాజ్యభారమును వహించినకాలమున మహమ్మదుషామంత్రియగు మామూదు (ఖాజాఖాఁ) గవానను వాఁడు రాయల యధీనమందున్న గోవా నగరమును ముట్టడించి స్వాధీనముఁ జేసికొని విజయముఁ గాంచినవాఁడు.౧౪౬౯ సంవత్సరమునఁ బశ్చిమతీరమునందలి వర్తకమంతయుఁదురుష్కుల యధీనములోనుండెను. వారలు విజయనగర భామినీరాజ్యములరెంటికిని గుఱ్ఱములను విక్రయించుచుండిరి. విజయనగరపు రాజులకు నావర్తకులసహాయమువలననే గుఱ్ఱములనుబొందవలసియుండెను. ఆగోవానగరమున వసించు 'మూరులు' ను వర్తకులు తమ గుఱ్ఱముల నన్నింటిని దక్కనుదేశపు మూరులకు (తురుష్కులు) విక్రయించిరి. అందువలన విరూపాక్షరాయలు కోపించి



'ఒన్నూరు' లోనున్న తన దండనాయకునిచే గోవానగరమునందలి పదివేల మూరులను (తురుష్కులను) బట్టిచంపించెను. ఈఘోరకృత్యమును ఖాజాఖాఁగవాను విని దండెత్తివచ్చి హిందువుల నోడించి గోవానగరమును గైకొనుట సంభవించెను. పశ్చిమతీరమంతయుఁ దురుష్కులపాలయ్యెను. ఈ విరూపాక్షరాయలకాలముననే యుత్కలదేశపురాజగు పురుషోత్తమదేవుఁడను గజపతి విజయనగరముపయి దండెత్తివచ్చి విజయనగరసేనాధిపతులలోఁ బ్రముఖుఁడగు సాళువనరసింహరాజుచే నోడింపఁబడి పాఱిపోయెను. ౧౪౭౦వ సంవత్సరమున భామినీసుల్తానగు మహమ్మదుషా యుత్కలదేశముపయి దండెత్తిపోయి కొండపల్లి, కొండవీడు రాజమహేంద్రపురము మొదలగు పట్టణములను గైకొని 'నిజాముల్ముల్క' నువానిని పరిపాలకునిగా నియమించెను. విజయనగరపు రాజునాజ్ఞఁగైకొని బెల్గామునకధికారిగానున్న విక్రమనాయకుఁడు గోవానగరమును మఱలఁ గైకొనఁ బ్రయత్నించెనుగాని మహమ్మదుషా వెంటనె బెల్గాముపయి దండెత్తివచ్చి యాతనినిజయించి యాదుర్గమునుగూడఁ గైకొనెను. ఆకాలమున దక్కనుదేశమునందును, తెలుఁగుదేశమునందును భయంకరమైన కాటకము సంభవించెను. కొండపల్లిలోని హిందువులు తురుష్కులపయిఁ దిరుగఁబడి మహమ్మదీయపరిపాలకుని సంహరించి యుత్కలదేశపురాజును దోడుచూపుమని ప్రార్థించిరి. అందుమీఁదట నుత్కలదేశపురాజు నిజాముల్ముల్క స్వాధీనములోనున్న రాజమహేంద్రపురదుర్గమును ముట్టడించెను. మహమ్మదుషా యీవార్తవిని సక్రోధుఁడై సేనలంగూర్చుకొనివచ్చి కొండపల్లిదుర్గమునుబట్టుకొని యచటిదేవాలయము నొకదానిఁ బడగొట్టి బ్రాహ్మణులనుజంపి యాప్రదేశమున మసీదుగట్టించెను. అంతట రాజమహేంద్రపురమునకుఁబోయి కళింగరాజునుజయించి కటకమువఱకుఁబోయి శత్రురాజ్యమునందలి ప్రజల నుఱుమాడుచు దేశమునంత దగ్ధముచే

సెను. అతఁడు రాజమహేంద్రపురమున మూఁడుసంవత్సరములు నిలిచియుండి త్రిలింగదేశమును సురక్షితముగాఁజేసికొని తనకు ప్రబలశత్రువుగానున్న సాళువనరసింహరాజును జయింపఁ గంకణము కట్టుకొనెను. రాజమహేంద్రపురము, కొండపల్లి, వినుకొండ, మచిలీపట్టణము, కాంచీనగరము, మాలూరు, గంజికోటలగు పట్టణములనుజయించి పూర్వదిగ్విజయయాత్రను ముగించి సుల్తాను కలుబరగిఁజేరెను.

రాజకార్యధురంధరుఁడును ప్రభుభక్తిఁగలవాఁడునుబహుసమర్థుఁడును నగు ఖాజాఖాంగవానును మహమ్మదుషా క్రోధావేశపరవశుఁడై నిష్కారణముగఁజంపి జనద్వేషుఁడాయెను. శీఘ్రకాలములోనే తనక్రిందిదండనాయకులు చెలరేగి స్వతంత్రులయి తిరుగఁబడి భామినీరాజ్యమును భీభత్సముచేసిరి. ౧౪౮౧ వ సంవత్సరముమార్చి ౨౧ వ తేదీని మహమ్మదుషా మృతినొందెను. అతనియనంతరము రెండవమామూదుషాయను పండ్రెండేండ్లబాలుఁడు సింహాసనమునకువచ్చెనుగాని పేరునకుమాత్రమే ప్రభువుగానుండెనుగాని దేశమంతయు నరాజకమై యల్లరుల కాటపట్టయ్యెను. జాగీరుదారులెల్లఱును సుల్తానును దిరస్కరించుచుండిరి. దండనాయకులు స్వతంత్రరాష్ట్రములను స్థాపింపఁజూచుచుండిరి. ఎట్లయిననేమిరాజ్యము భిన్నములయ్యెను. భామినీరాజ్య మిట్లుండఁగా విజయనగరరాజ్యము బుక్కరాయలవంశజులనుండి బలపరాక్రమతేజోనిధియగు సాళువగుండ రాజపుత్త్రుఁడు నరసింహరాజు గైకొని రాజ్యభారమువహించెను. ఈవృత్తాంతము దీనితరువాతి యధ్యాయమునఁ దెలుపఁబడును. భామనీసుల్తాను సేనాధిపతులగు ఏదులషాహి బీజపురమును, బరీదుషాహి విదర్భపురమును (బీదరు) ఇమ్మదుషాహిబీరారును నిజాముషాహి అహమ్మదునగరమును, కుతుబుషాహి గోలకొండయునుగైకొని సర్వస్వతంత్రులయి స్వరాష్ట్రములనుస్థాపించి భామినీరాజ్యమును రూపుమాపిరి. రెండవ



మామూదుతరువాత నహమ్మదు నతనితరువాత నల్లాయుద్దీను సింహాసనమెక్కియు నందుండితొలగింపఁబడిన యనంతరము నతని తమ్ముఁడువాలీయనువాఁడు రాజ్యమాక్రమించుకొని చంపఁబడెను తరువాత రెండవఅహమ్మదుకొడుకు కలీముల్లాయనువాఁడు పేరునకుమాత్రము సింహాసనమెక్కెనుగాని మరణమునొందువఱకు ఖైదిగానేచేయబడియుండెను. అతనితో భామినీరాజ్య మంతరించినది.

---

## తొమ్మిదవప్రకరణము.

---

సాళువ నరసింహరాజు విద్యానగరరాజ్యమాక్రమించుట- సాళువ యీశ్వరరాజుపుత్త్రుఁడగు నరసరాయలు (నరసింహరాజు) సాళువగుండ రాజుపుత్త్రుఁడగు నరసింహరాజు మరణానంతరము విజయనగర రాజ్యమునుగైకొనుట- నరసరాయలదిగ్విజయము- వీరనరసింహరాయలు రాజ్యమునకువచ్చుట- బీజపురసుల్తాను విజయనగరముపైదండెత్తివచ్చుట- పోర్చుగీసులు (బుడుతకీచులు) హిందూదేశమునకువచ్చుట గోవానగరమునుముట్టడించుట వర్తమానయొక్కవృత్తాంతము—ఆల్బుకర్కు.—

రెండవహరిహరరాయల కడపటిదినములలో సాళువగుండరాజుమంత్రిగానుండెను. ఈగుండరాజువంశము వరాహపురాణమునందభివర్ణింపఁబడినది. చంద్రవంశపురాజయిన గుండరాజునకు మంగరాజుపుట్టెను ఈమంగరాజు సాళువబిరుదంబుపొందినసంగతి జైమినిభారతములో నీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది:—

సీ. దురములోదక్షిణ-సురతాను నెదిరించి, కొనివచ్చిసాంపరా-యనికినిచ్చి।
సామ్రాజ్యమునసిల్పి-సాంపరాయస్థాప, నాచార్యబిరుదవి-ఖ్యాతిఁగాంచె।
శ్రీరంగవిభుఁబ్రతి-ష్ఠించియాజివేల, మాదలద్దేవుమ-న్ముడికినొసఁగె।
మధురాసురత్రాణు-మడియించిపరపక్షి, సాళువబిరుదంబు-జగతినెరపె।
గీ. గబ్బితనమునఁదేజము-గంబుగట్టి।తతిమినగరంపుగవనులు-విఱుఁగఁద్రోలి।
తానువేసిసిఁగాచను-గ్గడిశఁదెచ్చె।సాహసంబుననుప్పాంగు-సాళ్వమంగు.

ఈసాళువమంగరాజునకు గౌతరాజును, గౌతరాజునకు గుండరాజును, గుండరాజునకు తిమ్మరాజును జైమినిభారతమును కృతి నొందిన నరసింహరాజును జన్మించిరి. ఈసాళువ నరసింహరాజే విజయనగరరాజ్య మాక్రమించినది ఈనరసింహరాజుతండ్రి గుండరాజు రెండవహరిహరరాయలకు మంత్రిగాను దండనాథుఁడుగాను నుండి కొంతరాజ్యమును సంపాదించెను. తరువాత నరసింహరాజు తానువిజయనగరరాజులకు లోఁబడియుండియుఁ దనరాజ్యమును బెంపుచేసికొనుచు విజయనగరపురాజుల పక్షముననుండి మహమ్మదీయులతోఁ జేసిన యుద్ధములలోనెల్ల విజయమునుగాంచుచు మిక్కిలిప్రఖ్యాతినిఁ బొందినవాఁడు. విజయనగరమునకుఁ దూర్పుననుండు దేశమునకంతకుఁ దానధికారిగానుండి సేనాధ్యక్షత్వమునువహించి బాహుబలదర్పయుతుఁడై ప్రముఖత్వమునువహించెను

ఇతఁడు ప్రబలుఁడైయున్నకాలమున విజయనగరము ప్రౌఢదేవరాయల యనంతరమున దుర్బలులగు రాజులచేఁ బరిపాలింపఁబడుచున్నకతమున విదేశీయులెల్లఱు నీతనినే రాజని నమ్మి విజయనగర రాజ్యమును నరసింహరాజ్యమని వ్యవహరించుచుండిరి. ఇట్లుండ విజయనగరరాజ్యమును బాలించుచున్న విరూపాక్షరాయలు దుష్టపరిపాలనమును జేయుచుండఁగా నతనిపెద్దకొడుకు రాజశేఖరరాయలు తండ్రినిఁజంపి తాను రాజ్యమును జేకొనవనియు, పితృహంతకుఁడనైన మహాపాపిననియుఁ జెప్పుచు తమ్ముఁడగు రెండవవిరూపాక్షరాయలకు రాజ్యమొప్పగించెను. ఇతఁడు సింహాసనమునకు వచ్చినతోడనే మంత్రులు రాజశేఖరరాయలను జంపవలసినదిగా బోధచేయనారంభించిరి. తండ్రినిఁ జంపినవాఁడు సోదరునిఁ జంపకమానఁడని తెలియఁజెప్పి వానిచే రాజశేఖరరాయలను జంపించెను.



ఈఘోరకృత్యమును ముగించినతరువాత తనతండ్రివలెనే తానును క్రూరకృత్యములనుజేయుచు దుష్పరిపాలనముచేయుచుండఁగా సర్వజనసమ్మతుఁడైన యతనిదండనాయకుఁడును మంత్రులలోముఖ్యుఁడునగు నీసాళువ నరసింహరాజు వానినిఁజంపి రాజ్యమాక్రమించుకొననూహించి ప్రజలకందఱకును రాజుచేయుదుండగములను దెలిపి దండనాయకుల కెల్లఱకులంచములిచ్చి రాజునెడ ద్వేషమునుబుట్టించి రాజునుబట్టుకొనబయలువెడలెను. సాళువనరసింహరాజు తనభూములాక్రమించుచున్నాఁడనియు, దుర్గములను బట్టుకొనుచున్నాఁడనియు రాజభవనమును ముట్టడింపనున్నాఁడనియు రాజునకువర్తమానమువచ్చినను లక్ష్యముచేయకపోవుటయేగాక యావార్తనుదెచ్చినచారునిఁ బరిభవించిపంపెను. సాళువనరసింహరాజు దండనాయకులలో నొకఁడు కోటగోడను సమీపించి ద్వారమువద్దకువచ్చెను. ఎవ్వరునెదుర్కొనరయిరి. ఎవ్వరుచెప్పినను రాజు నమ్మకపోయెను. సేనానినగరుసొచ్చెను. రాజు నమ్మలేదు అంతఃపురముప్రవేశించి కావలియున్నయాఁడువాండ్రను సంహరించి లోనికివచ్చుచుండెను. అంతఃపురములో నాక్రందనధ్వనులుపుట్టెను. రాజపుడుదెలిసికొని వేగిరపడి కోటవెనుకనున్న ద్వారములనుండి తప్పించుకొనిపాఱిపోయెను. తరువాత దండనాయకుఁడు రాజభవనమును ముట్టడించి సర్వస్వమును స్వాధీనమును జేసుకొని సాళువనరసింహరాజునకు సింహాసనమొప్పగించెను. ఇతఁడు రాజ్యమునకువచ్చి రాజులదివఱకుఁ గోలుపోయినదేశములను మఱలనాక్రమించుకొనెను. ప్రజలను ప్రభువులనుసన్మానించుచు న్యాయపరిపాలనముచేసి వాసికెక్కెను. ఇతనినిసత్ప్రభువని యెల్లఱునుగొనియాడుచుండిరి. ఇతఁడుపండితుండయి కవులసన్మానించుచువచ్చెను. ఈతనికాలమునఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడాస్థానకవిగానుండి జైమినిభారతమును గృతియిచ్చెను. ఈసాళువనరసింహరాజున కన్నయగు తిమ్మరాజునకు ఈశ్వరరాజుకొడుకు ఈ యీశ్వరరాజు సాళు

వనరసింహరాజుకు సేనానాయకుఁడుగానుండెను. నాదెళ్ళ యప్పామాత్యుని ముత్తాతతమ్ముఁడయిన చిట్టిగంగన్నయను నాతఁడుమంత్రిగానుండినట్లు మాదయగారిమల్లనకవి విరచితమగు రాజశేఖరచరిత్రమునందలి యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

ఉ. సాళువనారసింహమను-జప్రభుకార్యకళాదురంధరుం।
డైలవణాబ్ధివేష్టితధ-రాధిపదుర్గతమంత్రమంత్రిశుం।
డాలవితానకేసరియ-నంగనవంగసమానరూపరే।
ఖాలలితాంగుఁడట్టిచిటి-గంగనయొప్పుగుణానుషంగుఁడై॥

ఈశ్వరరాజుమాత్రమేగాక యతనితండ్రి తిమ్మరాజుకూడ సాళువనరసింహరాజునొద్ద కొంతకాలము సేనాధిపతిగానున్నట్లు దెలియుచున్నది. ఈతిమ్మరాజుకన్న యితనిపుత్త్రుఁడీశ్వరరాజును, అతని యనంతరము నరసరాయలును సాళువనరసింహరాజునొద్ద సేనాధిపతులుగానుండుటమాత్రము స్పష్టమని చెప్పఁదగును. ఈ యీశ్వరరాజు వరాహపురాణమునందిట్లువర్ణింపఁబడియున్నాఁడు.

సీ. ఉదయాద్రిభేదించె-హుత్తరినిర్జించె, గండికోటపురంబుఁ-గదలఁద్రవ్వె।
పెనుగొండసాధించె-బెగ్గలూరుహరించెఁ, గోవెలనెల్లూరు-గుంటుపఱిచె।
కుందాణివిదళించె-గొడుగుచింతజయించెఁ, బాగూరుపంచము-పాడుచేసె।
నరుగొండవెకలించె-నామూరుమర్దించె, శ్రీరంగపురమును-జారిసమరె।
గీ. రాయచౌహత్తమల్లధ-రావరాహ । మోహనమురారిబర్బర-బాహుసాళ్వ।
నారసింహప్రతాపస-న్నహనుఁడగుచు।విశ్వహితకారితిమ్మయ-యీశ్వరుండు॥

ఇతఁడు పారశీక యవనదేశములనుండి వర్తకులు దెచ్చెడు గుఱ్ఱములనెల్లఁ గొని సేనలను వృద్ధిపఱచుచుండెను. మూఁడుగుఱ్ఱములకు (బ్రతికినవయినను చచ్చినవయినను) వేయివరహాలచొప్పున నిచ్చుచుండెను. అందువలన వర్తకులు విశేషద్రవ్యము నార్జించుచుండిరి. అతనికి మరణకాలమాసన్నమగునప్పటికి నతనికి స్వాధీనములుకాని మూఁడు దుర్గములుండెనఁట. అయ్యవి రాయచూరు, ఉదయగిరి, కొండవీడనని చెప్పుదురు. సాళువనరసింహరాజొకనాఁడు తనకవసానదశసంభవించినదని తెలిసికొని తనకన్న మనుమఁడును, ఈశ్వరరాజు పుత్త్రుఁడును, సేనాధిపతియును,



పురపాలకుఁడునగు నరసరాయలను రప్పించి బాలురగు తనకొడుకుల నతని కప్పగించి తాను బహుకష్టపడి విజయనగరరాజ్యము తురుష్కుల యధీనముగాకుండ నిలిపితిననియు, బాలురకు యుక్తవయస్సువచ్చువఱకు ఱెప్పవలెఁగాచుచు సమస్తమును నీయధీనములోనుంచుకొని పరిపాలనము చేయవలసినదనియుఁ, గొడుకులకు యుక్తవయస్సువచ్చినతరువాత నెవఁడు రాజ్యపదవివహించుటకు సమర్థుఁడగునో వానిని సింహాసనమెక్కించి మెలఁకువతోఁ గాపాడుచుండవలెననియు బహువిధములఁ జెప్పి యొప్పగించి దేహవియోగమును బొందెను. ఈసాళువనరసింహరాజు మృతినొందినయనంతరము సాళువయీశ్వరరాజు పుత్త్రుఁడు నరసరాయలను నరసింహరాజుపయి నరసింహరాజుయొక్క జ్యేష్ఠపుత్త్రుని సింహాసనమెక్కించి పరిపాలనాభారమునంతను దానే వహించి ధనాగారమును దన యధీనములోనే యుంచుకొనెను. రాయలదండనాయకుఁడొకఁడు నరసరాయలయెడ ద్వేషమునుబూని తాను రాయలను జంపి నరసరాయలాపనిచేసెనని వదంతి పుట్టించి యానేరమునకై నరసరాయలను జంపింపవచ్చునుగదాయని యూహించి కుతంత్రమునుబన్ని రాయలబంటునకొకనికి లంచమిచ్చి యొకనాటి రాత్రి రాయలను జంపించెను. నరసరాయలే యీఘోరకృత్యమును జరిగించెనని వదంతి కలిగెను. అయ్యది భరింపఁజాలక నరసరాయలు (నరసింహరాయలు) రాయలసోదరునిఁ బట్టాభిషిక్తునిగాఁజేసి రాజద్రోహమును గావించిన దండనాయకుని శిక్షించుటకు సమయము గానరాక వేచియుండెను.

ఒకనాఁడు నరసరాయలు వేటాడుటకై పోవుచున్నానని రాయలతోఁజెప్పి తనకుటుంబమును నగరములోనేయుంచి నీగుండమనుపట్టణమునకుఁ బోయెను. అటనుండి పెనుగొండకుఁబోయి సైన్యములనుగూర్చుకొని రాజద్రోహమునుబూని మాయన్నను జంపినద్రోహియగు దండనాయకుని శిక్షింపవలెననియు లేనిచో

డల నాతనివలెనేనిన్నును గుదముట్టించువనియు మీతండ్రిచనిపోవునపుడు సమస్తమును నాకు నొప్పగించి బిడ్డలను గాపాడవలసిన భారము నాయందుంచినవాఁడుగావున నవశ్యముగా వానినిఁ జంపుటకుత్తరమీయవలెననియు రాజునకువర్తమానముచేసెను. రాయలకాదండనాయకునియెడఁ బ్రేమానురాగములుగలవాఁడు గావున వానిరక్షింపబుద్ధిపుట్టి నరసరాయలప్రయత్నమునకు విఘ్నముచేయఁబ్రయత్నించెను. అంతటనరసరాయలు ససైన్యముతోనేతెంచిరాయలనగరముముట్టడించి యాతనింబట్టుకొనినాలుగయిదుదినములలో నాద్రోహినిద్రుంచెదనని భయపెట్టఁగా నారాయలు భయంపడి యాదండనాయకునిఁజంపించి యాతనితలదెచ్చి నరసరాయలకుఁజూపించెనఁట! అందునకు నరసరాయలుసంతసించి రాజునువదలిపెట్టి సైన్యములనుబంపివేసి విజయనగరముఁ బ్రవేశింపఁగాఁ బౌరులెల్లరును నరసరాయలనుగీర్తించుచుండిరి. అతని న్యాయపరిపాలనమును జూచి ప్రజలుతమకితఁడే రాజగానుండిన నెంతో క్షేమముకలుగునని నమ్మి భక్తివిశ్వాసములు కలవారలై నిరంతరము గొనియాడుచుండిరి. రాయలను దూరముగానుంచిన యెడల తనయధికారము మఱింతచెల్లుబడియగునని యూహించి నరసరాయలు పిన్నరాయలను పెనుగొండకుఁబాపి యతనికి సంవత్సరమునకు నిరువదివేల వరహాలనిచ్చుచు నిరువదివేల సైన్యము నిచ్చితిమ్మప్పనాయకుఁడను దండనాయకుని నతనిసంరక్షణకర్తగా నియమించి తాను విజయనగరమునుండి రాజ్యపరిపాలనము చేయుచుండెను. తనయధికారమునకు లోఁబడని ప్రభువులనెల్ల నొక్కొక్కరిని వరుసగా జయించి లోఁబఱచుకొని వారివలనఁ గప్పములను గైకొనుచు నిర్వక్రపరాక్రముఁడగుచు నెందు నెదురులేక యుండెను. ఇట్లుండఁగా దండనాయకులెల్లరును రాయలు రాజ్యపరిపాలనముచేయ సమర్థుఁడుకాఁడనియు నాతినింజంపి రాజ్యమును గైకొని పరిపాలింపవలసినదని నరసరాయలకు బోధింపసాగిరి.



అప్రయత్నముగాఁ దనక్రిందివారికిట్టి తలంపుగలుగుట యీశ్వరాదేశమని నరసరాయలూహించి యీపనిజరిగినయెడల నిప్పటికన్న నధికఘనత్వము తనకు రాఁగలదని నమ్మి యీదుష్కార్యములోఁ దనకు సంబంధమున్నట్టు బయల్పడకుండ నెట్లుజరుపవచ్చునో దెలుపుఁడని తనకీబోధచేసిన యాదండనాయకులనే యడిగెను. అంతట కొండమరెడ్డి (కొండారెడ్డి) యను దండనాయకుఁడు నరసరాయలకిట్లు బోధించిచెప్పెను. "మీరు నాతోఁగూడ తలంటుకొనవలసినదని యాజ్ఞచేయుఁడు; మీయుత్తరవును దిరస్కరించెదను; మీరు నాకు శిక్షవిధింపుఁడు; నేను పెనుగొండకు పాఱిపోయి రాజునకు మీయెడ ద్వేషము ప్రబలమగునట్లు పురికొల్పెదను; రాజుయొక్క దయనుసంపాదించుకొన్నతరువాత నాతనింగడతేర్చనుపాయమును జింతించెదను. రాజునకు నామాటలయందు మంచి నమ్మకము పుట్టునట్లుగా నితరదండనాయకులు వ్రాసినట్లుగా నుత్తరములను సృజించి వెంటనే పట్టణము విడిచిపోవలసినదనియు, నరసరాయలు తన్ను పెనుగొండలో ఖైదుచేసి పరిపాలించుచున్నాఁడనియు నాతనిశిక్షించుటకయి యెచటికయినఁబోయి సేనల గూర్చుకొన్నయెడల నప్పుడుతాముతోడుపడెదమనియు వ్రాసిపంపినయెడలఁ దప్పకనామాటనమ్మును; ఒక్కఁడును పట్టణమువిడిచిపోవును; ఆసమయమునుగనిపెట్టి వానినిఁజంపింతును. అంతటితో నీవునిశ్శంకముగా రాజ్యపరిపాలనముచేయవచ్చును." అని యతఁడుసదుపాయమునుజెప్పెను. ఈయుపాయమునకు నరసరాయలు సంతసించి యాతఁడుచెప్పినప్రకారము జరిగించెను. కొండమరెడ్డియుఁ బెనుగొండకుఁబోయి తనతంత్రమునుబన్ని రాజునకునమ్మకముగలిగించి ప్రతిదినము నొక్కొక్కదండనాయకుని యుత్తరమును సృజియించుచువచ్చెను. ఆయుత్తరములలోని కపటతంత్రములను విశ్వసించి బలవంతుఁడగు నరసరాయలను ధిక్కరించి జయించుటయెట్లు సాధ్యమగునని కొండమరెడ్డినడిగెను. ఓమహారాజా!

నీవుచంద్రగిరికిఁబోతి వేని దండనాయకులెల్లను నరసరాయలయెడ ద్వేషముఁ గలిగియున్నారు గావున వెంటనేవచ్చి మిమ్ముఁగలిసికొందురు ; అప్పుడుమీరు సులభముగా నరసరాయలను జయింపవచ్చునని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అంతటరాయలు " అయ్యో ! ఇరువదివేలమంది నన్నుఁజుట్టుకొనియున్నారు ; వీరినిఁదప్పించుకొని యీపురమును విడిచియెట్లుపోఁగలను ? అనిపలికెను. అందుపైనతఁడు నీవెంటెరిగా నీతోఁటగుండపోయి నగరద్వారముద్వారా నీవుపోయినయెడల నిన్నెవ్వరును గుర్తుపట్టలేరు ; ఆవలనేను గుఱ్ఱములను సిద్ధముగానుంచెదను. నీవుహయముపై నెక్కి వాయువేగమునఁ జంద్రగిరికిఁబోవచ్చునని నమ్మకము పుట్టునట్లుగాఁజెప్పెను. రాయలందునకు సమ్మతించెను. ఒకనాఁడీతఁడు రాయలసన్నిధానమునకువచ్చి " ఓమహాప్రభూ! నేడుచేయవలసిన దానిని రేపటివఱకు నిలిపియుంచరాదు ; హయములు సిద్ధముగానున్నవి ; ఈరాత్రినాతోడరమ్ము ;, అనియాతనినొడంబఱచి యారాత్రి నాతనినెంటరిగ దీసికొనిపోయెను. వీరలుతోఁటగుండ వెళ్ళుచుండఁగా నిరువురుభటులువచ్చి యదివఱకె కొండారెడ్డివలన నాజ్ఞాపింపబడియున్నారు గావునరాయలపైఁబడి తామెవ్వరినిఁ జంపుచున్నారో యెఱుంగకయె చంపివేసిరి. కొండారెడ్డి యాశవమునొకచోటఁ బాతిపెట్టించి నరసరాయలకు రహస్యముగా వర్తమానముచేసెను. మరునాడు రాయలు గనుపింపకుండుటచేత నందందు వెదకివెదకి నెచ్చోటను గానరాక యెల్లవారు నూరకుండిరి.

నరసరాయలీవార్తవిని మిగులఁబశ్చాత్తప్తుఁడై విచారించెనుగాని రాజులేకుండుటవలన రాజ్యమరాజకమై ప్రజలుదిరుగుబాటుచేయుదురేమోయని సేనలనుసిద్ధముగానుంచుకొని మిక్కిలిజాగరూకతగలవాఁడయి యుండెను. ఇంతలో నాహత్యగావించిన రెడ్డివచ్చి యావద్వృత్తాంతమును బూసలు గ్రుచ్చినయట్లుగా నరసరాయలకుఁ దెలియఁజేసెను. అతఁడు మిక్కిలి సంతసించి యా



తనికి గొప్ప బహుమానమును జేసెను. సమస్త రాజ్యమును దన స్వాధీనములోనే యుండెనుగనుక నేయాటంకమునులేక తానే రాజునని ప్రకటించి పట్టాభిషిక్తుఁడయ్యెను. ఇతఁడు బహుపరాక్రమవంతుఁడు. ఇతఁడు తనపైఁ దిరుగఁబడిన రాజులనెల్లను జయించినట్లీక్రింది పారిజాతాపహరణములోని పద్యమువలనఁ దేటపడుచున్నయది.

సీ. కుంతలేశ్వరుఁడు బి-ట్టుపడంగ విద్యాపు, రంబుఁగ్రక్కొనినిజ-ప్రౌఢినెఱపె।
వారసీమసమర్ధరమానవత్వంబుఁ, దొలఁగించెమ్మానవ-దుర్గసీమ।
జోళవల్లభునకు-సురవధూమధురాధ, రములిచ్చెనుగ్రరా-వుఁదంబుఁగొనియె।
శ్రీరంగపట్టణసీమాభ్ధసటీవి, నోటంబువోవనేంద్రు-నదుఁజూచె।
గీ. నతఁడునుతికెక్కె-రామనే-త్వంతరాశి। కలితనాశ్వదానవి-ఖ్యాతియశుఁడు।
మంజలీకరమేఘమా-ర్గాంబరియుఁడు। ఈశ్వరాధిపునరసప్ప-ధీశ్వరుఁడు॥

ఇతఁడు ౧౪౭౭ వ సంవత్సరము మొదలుకొని రాజ్యపరిపాలనముచేసినట్లు లాతని దానశాసనములవలనఁ దెలియనచ్చుచున్నయది. ఆతని శాసనములు శ్రీ॥ శ॥ ౧౪౦౯ వ సంవత్సరము వఱకు గనుపించుచున్నవిగాని యితఁడు ౧౪౦౪ వ సంవత్సరము వఱకు రాజ్యముచేసిన యనంతరము వీరనరసింహరాయలు రాజ్యమునకువచ్చినట్లుదెల్లముగుచున్నయది.

ఈనరసరాయలకుతిప్పాంబయనియు నాగమాంబయనియు ఓబాంబికయనియు ముగ్గురుభార్యలుకలరు. అందుతిప్పాంబకు వీరనరసింహరాయలును, నాగమాంబకు కృష్ణదేవరాయలును, ఓబాంబికకు అచ్యుతదేవరాయలును శ్రీరంగరాయలును జనియించిరి. నరసరాయలయనంతరము వీరనరసింహరాయలు రాజ్యముచేసినట్లు మనుచరిత్ర పారిజాతాపహరణములలోని యీక్రింది పద్యములవలనఁ దేటపడుచున్నది:-

క. వీరన్నృసింహరాయఁడు నిజభుజ। దారుణకరవాలపటిమ-ధారాళకీర్తి।
రాజిమాయుచునేకాతప। వారణముగనేలెధరణిమఘవాపముగా॥
(మనుచరిత్ర.)

క. వారలలోఁ దిప్పాంబకు। మారుఁడు పరిపంథికంధి-మంథాచలమై।
వీరనరసింహరాయఁడు। వారాశిపరీతభూమి-వలయం బేలెన్॥

(పారిజాతాపహరణము)

ఈ వీరనరసింహరాయల తండ్రి నరసరాయలుఁగూడఁ దానుపండితుఁడయి పండితులను కవులను సన్మానించుచువచ్చెను. నందిమల్లయఘంట సింగయలచే వరాహపురాణకృతి నొందెను. ఈ వీరనరసింహరాయలు రాజ్యమునకువచ్చినతోడనే మయిసూరురాజులు తిరుగఁబడినందున వారలనుజయించుటకై తనతమ్ములగు కృష్ణదేవరాయలను అచ్యుతదేవరాయలనుబంపి వారలను జయించి లోఁబఱచుకొనెను. ఇతనితండ్రి నరసరాయలకాలముననో లేక యీవీరనరసింహరాయల కాలముననో పోర్చుగీసువారి యోడలుపశ్చిమతీరమునకు వచ్చిచేరెను. ఆయోడలకధికారివాస్కోడిగామా యనునాతఁడు. ఇతఁడు ౧౪౯౮ వ సంవత్సరమున హిందూదేశమునకువచ్చెను. విజయనగరమునకులోఁబడి భట్టుకల్లు, ఒన్నూరు నగరములకధికారులుగానున్న ప్రభువుల సహాయమువలనఁ బోర్చుగీసువారు గొన్నిస్వాతంత్ర్యములనుబొందిరి. ౧౫౦౩ వ సంవత్సరమునఁ బోర్చుగీసువారు 'ఒన్నూరు' ను ముట్టడించి తగులంబెట్టిరి. తరువాతగొప్ప వర్తకస్థానముగానున్న భట్టుకల్లు (Bhatkal) ముట్టడించిరికాని యానగరపాలకుఁడు వారికి ౫౦౦ ల బరువులబియ్యము కప్పముగా నిచ్చెనేగాని గిద్దెడుభూమినైన ధారవోయలేదు. ౧౫౦౫ వ సంవత్సరమున బోర్చుగీసువారు "అంజదీవి" యందొకకోటనుగట్టిరి. ఆల్మెయిడా (Almeida) అనునాతఁడు రాజప్రతినిధిగావచ్చి ఒన్నూరు (Honaver) బట్టుకొని తత్పురపాలకుఁడగు తిమ్మయతో ఘోరయుద్ధముచేయఁగా నాతఁడు పోర్చుగీసువారితో సంధిచేసికొనెను. వీరనరసింహరాయలు భట్టుకల్లునందుదక్క మఱియెచ్చటనైనను పోర్చుగీసువారుకోటకట్టుకొనుటకుత్తరువుచేసెను. ఈకాలముననేవర్తేమా (Varthema)



యను నిటాలియాదేశపు బాటసారి విజయనగరమును జూడవచ్చి నరసింహరాజ్యమని పిలువంబడు విజయనగరరాజ్యమును గుఱించి చక్కనిసంగతులను వ్రాసెను. అతఁడు కన్నడదేశమందలి రాజులెల్లఱు నరసింహరాయలకు లోఁబడియుండిరనియు సముద్రతీరముననున్న పట్టణములన్నియుజనసమ్మర్దము కలవనియు విశేషవర్తకస్థానములనియుఁ జెప్పుచున్నాఁడు.

ఆహారపదార్థములెచ్చోటను సమృద్ధిగానున్నవఁట! అతనికి కన్ననూరినుండి విజయనగరముకువచ్చుటకు ౧౫ దినములు పట్టెనఁట! అబ్దుల్‌రజాకువలెనే యితఁడును విజయనగరమును వర్ణించుచున్నాఁడు. తానువినిన రాజులలోనెల్ల నీనరసింహరాయలే యైశ్వర్యవంతుఁడని దెలుపుచున్నాఁడు. అతఁడు పోర్చుగీసువారికి పరమమిత్రుఁడుగా నుండెనఁట! అతండెక్కు గుఱ్ఱమునకునలంకరించు నాభరణములయొక్క విలువ యొక్కయిటాలియాదేశపు నగరముయొక్క భాగ్యమునుమించియుండునఁట! ఎచటకు ప్రయాణముచేసినను సురక్షితముగాఁ బోవచ్చునఁట! ఈవీరనరసింహరాయలు బుక్కరాయాదులవలె శైవమతావలంబకుఁడుగాక వైష్ణవమతావలంబకుఁడుగానుండెను. ఇతనికి సాళువతిమ్మరాజను నియోగిబ్రాహ్మణుఁడు మంత్రిగానుండెను. ఇతనిచరిత్రము రాఁబోవుప్రకరణములలోఁ దెలుపఁబడును. వీరనరసింహరాయలు జాడ్యపీడితుఁడై యుండి మరణకాలమాసన్నమగుటఁ దెలిసికొని మంత్రియగు సాళువతిమ్మరాజును, ఎనిమిదేండ్లవయస్సుగల తిమ్మరాజను తనకొడుకునురప్పించి కొడుకునుమంత్రికిఁజూపించి తనయనంతరమునాతనికిఁ బట్టముగట్టవలసినదనియు, తనతమ్ముఁడగు కృష్ణదేవరాయల నేత్రములనుదీయించివేసి తనకుచూపించవలసినదనియు, అటులగావించినచో తనమరణానంతరము రాజ్యమునుగుఱించి తగవులుండవుగాన నాప్రకారమవశ్యముగా జరుపవలసినదనియుఁ జెప్పెను.

ఆప్రకారము జరిగింతునని చెప్పి సాళువతిమ్మరాజు కృష్ణదేవరాయలను రప్పించి నరసింహరాయలచే దానాజ్ఞాపింపఁబడినవిధంబునంతయుఁ దెలియంజెప్పెను. ఈవృత్తాంతమును విని కృష్ణదేవరాయలు తానుప్రభుత్వము చేయఁదలఁచుకోలేదనియు రాష్ట్రములోఁ దనకేయుద్యోగమును గూడనక్కఱలేదనియు, తాను సన్న్యసించి యీప్రపంచములోఁ దిరుగుచు జీవయాత్రముగింపవలెనని సంకల్పముగలదనియు, నందువలనఁ దనకన్నులను దీయింపక వదలిపెట్టవలసినదనియుఁ బ్రార్థించెను. కృష్ణరాయలు చెప్పినదంతయు గ్రహించి సాళువతిమ్మరాజు కృష్ణరాయలు వయస్సువచ్చినవాఁడగుటవలనను వీరనరసింహరాయలపుత్త్రుఁడు బాలుఁడగుటవలనను, కృష్ణరాయలు మిక్కిలి సమర్థుఁడగుటవలనను, కృష్ణరాయలనే రాజునుగాఁ జేయవలెనని నిశ్చయించి యొకమేఁకను జంపి దానికన్నులను దీసికొనిపోయి ప్రాణముపోనున్న నరసింహరాయలకుఁ జూపఁగా నాతఁడు సంతసించి ప్రాణములను విడిచెను. తరువాత కృష్ణదేవరాయలే సింహాసనమెక్కెను.

---

# శ్రీకృష్ణదేవరాయచరిత్రము

## పదవప్రకరణము.

---

శ్రీకృష్ణదేవరాయలుపట్టాభిషిక్తుఁడగుట — రాయలజననము — తిమ్మరుసు నం శ్రీరాయలనుగాపాడుట — తిమ్మరుసునియోగి బ్రాహ్మణుఁడనినిరూపించుట — తిమ్మరుసు రాయలను పెంచి కాయఁగొట్టుట — తిమ్మరుసుకొట్టుటకుం గలకారణమును జెప్పుట — రాయలుసోదరులను సోదరపుత్త్రులఁ జంద్రగిరి దుర్గములోఁ బెట్టుట...



శ్రీవీరనరసింహరాయలు దేహవియోగమును బొందఁగానే శ్రీవీరప్రతాపకృష్ణదేవమహారాయలు శాలివాహనశకము ౧౪౩౦ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౫౦౯ వ సంవత్సరమున బట్టాభిషిక్తుఁడాయెను. కృష్ణదేవరాయలు తాను సింహాసనమెక్కినందులకు జ్ఞాపకార్థముగ హంపిలోనుండు పంపాపతిదేవాలయమునకు గొప్పగోపురమునొకదానినిగట్టించెను. ఈకృష్ణరాయలను కుమారధూర్జటియను నాంధ్రకవియొకఁడు తనకృష్ణరాయవిజయమునం దీవిధముగా వర్ణించియున్నాఁడు.

సీ. చక్కెరవిలుకాని-చక్కఁదనముగల్గి, చొక్కమానార్వటి-బుక్కరాజు,
సాకల్యముగఁగీర్తి-సర్వదిక్తటులందుఁ, బ్రకటస్థితిమించు-నాకువారు,
కంటకరాజన్య-గర్వంబులడగించి, లీలచేవిఱ్ఱచునం-ద్యాలవారు,
దాటీనిరాఘాట-ఘాటీహతవిరోధి, కోటులైవెలయువె-ల్గోటివారు।
చండతరశౌర్యులగు పెమ్మ-సానివారు। బూదహాళివారు మొదలైన-భూమిపతులు।
గొలువఁబట్టాభిషిక్తుఁడై-చెలువుమీఱె। రమ్యగుణశాలి శ్రీకృష్ణ-రాయమౌళి

శ్రీకృష్ణదేవరాయలకు పూర్వము నరసింహరాయలను పేరుగలవారు ముగ్వురు విజయనగరరాజ్యమును బరిపాలించియుండుటచేత శాసనములను బరీక్షించినవారేమి విదేశీయులగుచరిత్రకారులేమి స్వదేశీయులగు చరిత్రకారులేమి, సరియగుకాలనిర్ణయమును జేయలేక క్రొత్తచిక్కులను గల్పించుకొని యితరులకుఁగూడ మార్గము సుగమముఁగాకుండఁజేసిరి, ఆహేతువుచేతఁ గృష్ణరాయలు సింహాసనమెక్కినదినమునుగుఱించిన చర్చలను విడనాడి కథాప్రారంభమునకుఁ గడంగుచున్నాఁడను. ఈరాయలవారి జననాదికమునుగూర్చియు మనకంతగాఁ దెలియకుండునటులఁ బరస్పరవిరుద్ధములగు వ్రాఁతలే గ్రంథములయందుఁజొప్పింపఁబడినవి కృష్ణరాయల జననమొకరు క్రీస్తుశకము ౧౪౬౫ వ సంవత్సరమునందనియు మఱియొకరు ౧౪౮౭ వ సంవత్సరమునందనియు వ్రాసియున్నారుగాని యిదిసత్యమనిగాని యిదియసత్యమనిగాని సిద్ధాంతీకరించుటకు నాధారములుగానుపింపవు. ఈరాయలవారు శాలి

వాహనశకము ౧౩౯౨వ సంవత్సరమునందనఁగాఁ గ్రీస్తుశకము ౧౪౭౧ వికృతిసంవత్సరపుష్య బహుళద్వాదశీ శుక్రవారము నాఁడు జనించినట్టు దెలిపెడు నీక్రిందిపద్యమొకటి జనులచే వాడు కొనఁబడుచున్నది.

ఉ. అందలిశాలివాహనశ-కాబ్దములద్రివసుత్రిసోములన్।
వందితమైనయవ్వికృతి-వత్సరమందలిపుష్యమాసమం।
దుందగుకృష్ణపక్షమున-నుండెడిద్వాదశిశుక్రవాసరం।
బందుదయించెఁగృష్ణుఁడుశు-భాన్వితుఁడానరసింహమూర్తికిన్।

ఇదియేసత్యమయిన యెడలఁగృష్ణరాయల రువదిసంవత్సరములకుఁ బయిగాఁ బ్రదికియుండవలెను. కాని కృష్ణదేవరాయలు తననలువదవయేటనో నలువదియైదవయేటనో స్వర్గస్థుఁడై యుండవచ్చునని పెక్కండ్రువ్రాసియున్నదానికి విరుద్ధముగానుండుట చేతనింతకన్నఁ బ్రబలమైనయాధారము తెలియునంతవఱకునియ్యది ప్రమాణముగాఁ దీసికొనరాదని నాయభిప్రాయము. కృష్ణరాయలతల్లియగు నాగమాంబ సాళువనరసింహరాయలకు (ఈశ్వరరాజపుత్త్రుఁడగు నరసింహరాయలకు) నుంపుడుకత్తెయని చెప్పుదురు కాని యదియెంతవఱకుసత్యమో యిప్పుడునిశ్చయించుటకును కటిరెండుశాసనములలోని వ్రాఁతలుగాని పుక్కిటిపురాణగాథలుగాని మనకాధారములు కాఁజాలవు.

కృష్ణదేవరాయలు రాజ్యమునువహించుటనుగూర్చి చిత్రమైనకథను జెప్పుచున్నారు. ఈశ్వరరాజపుత్త్రుఁడగు సాళువనరసింహరాయలు తన పెద్దకుమారుఁడగు వీరనరసింహరాయనిపైనిఁ జూపుప్రేమముకంటెఁ గృష్ణదేవరాయనియెడ నధికప్రేమమును జూపుచువచ్చెననియు, అదిచూచిసహింపఁజాలక వీరనృసింహరాయని తల్లితిప్పాంబ తినసవతిపుత్త్రునిఁ జంపింపఁ బ్రయత్నింపఁగా మంత్రియైన సాళువతిమ్మరాజుగారాజాజ్ఞను గనిపెట్టి యాతనినిదాఁచి ప్రాణమునురక్షించి కాపాడెననియు, తరువాతఁ గొంత



కాలమునకు నృసింహదేవరాయ లుబ్బుజబ్బుచేత బాధపడుచుఁ బ్రాణావసానకాలమునందుఁ గొడుకులనుబిలిచి తనవ్రేలి యుంగరమును దీసికొన్నవాఁడు రాజ్యార్హుఁడని చెప్పినప్పుడు తక్కినవారు తీయుట కుపాయముతోఁచక యూరకుండఁగాఁ గృష్ణదేవరాయలుతనచేతిఖడ్గముతో జనకునివ్రేలునఱికి యుంగరమునుదీసికొనననియు నతనిసాహసమునకుమెచ్చి నరసింహరాయలాతనినే పట్టాభిషిక్తునిఁ జేయనియమించి దేహవియోగమును బొందెననియుఁ జెప్పుచున్నారు కాని యిదిసత్యముగాదు. నరసింహరాయల తరువాతఁ గృష్ణరాయల యన్నయగు వీరనరసింహరాయలు రాజ్యభారమునువహించినట్లు కృష్ణరాయల కంకితమీయఁబడినమనుచరిత్రపారిజాతాపహరణగ్రంథములలో నుదహరింపఁబడియుండఁగాఁ బయికథసత్యమయినదని యెట్లుచెప్పవచ్చును? పారిజాతాపహరణములో నంది తిమ్మకవి వీరనరసింహరాయల యనంతరముకృష్ణరాయలు రాజ్యాభిషిక్తుఁడైనటుల నీక్రిందిపద్యమున నుదహరించి యున్నాఁడు.

శా. వీరశ్రీనరసింహశౌరిపిదపన్-విశ్వక్షమామండలీ।
ధౌరంధర్యమువజ్రసంహననదృప్త-దన్నాగమాంశాసుతుం।
డారూఢోన్నతిఁగృష్ణరాయఁడువిభుం-డైరాజ్యసింహాసనం।
బారోహించెవిరోధులున్గహనశై-లారోహముం జేయఁగన్॥

సత్యమిట్టిదయినను బయికథపుట్టుటకుఁ గారణములేకపోలేదు. నరసరాయలయనంతరము వీరనరసింహరాయలురాజ్యపరిపాలనముచేసి రోగపీడితుండయియుండి యొకనాఁడు తానుబ్రదుకనని నిశ్చయించి మంత్రియగు తిమ్మరుసునురప్పించి తనతరువాత రాజ్యమునుబొందవలసినవాఁడు తనకుమారుఁడగు తిమ్మరాజుగాన నాతఁడెనిమిదేండ్లు వయస్సుగలిగి యున్నబాలుఁడగుటను దలంచి ప్రసిద్ధుఁడగు తనతమ్ముఁడు కృష్ణరాయలకే ప్రజలుపట్టముఁగట్టనూహింతురుగాన నట్లుజరుగకుండఁ గృష్ణరాయలనేత్రములు తీ

యించివేసి నాకుఁగనుపఱచి నాపుత్త్రుని సింహాసనమెక్కించవలసినదని యాజ్ఞచేసెనని న్యూనీజు (*Nuniz*) వ్రాసియుండెననుట వెనుకటి ప్రకరణమునందుఁ దెలిపియుంటిమిగదా! ఇందువలన మనమూహింపవలసినదేమనగాఁ న్యూనీజు [*Nuniz*] అచ్యుతదేవరాయల కాలములోనివాఁడేగావున నితరులు వ్రాసినదానికంటె నతఁడువ్రాసిన దానిలోనే సత్యమెక్కుడుగా నుండునని కృష్ణరాయలు సింహాసనమెక్కునప్పటికి వీరనరసింహరాయలకుతిమ్మరాజను నెనిమిదిసంవత్సరముల వయస్సుగల పుత్త్రుఁడుండెననుట వాస్తవము. తిమ్మరుసు మంత్రివలనఁ గృష్ణరాయలు రాజ్యపదవినొందుటయు సత్యము. ఈ తిమ్మరుసెవరో మనమిప్పుడు దెలిసికొనవలసియున్నది. ఇతనియింటిపేరు సాళువవారు ఇతనిపేరు తిమ్మరాజు. అందువలనఁ బెక్కండ్రు సాళువతిమ్మరాజు క్షత్త్రియుఁడనియు, విజయనగరరాజులబంధువనియు, నభిప్రాయము గలవారలయి సత్యమునుగనిపెట్టలేకపోయిరి. విజయనగరరాజ్యచరిత్రముఁ బ్రకటించి యమితవ్యయ ప్రయాసములనుబొంది ఖ్యాతిఁగాంచిన స్యూయల్ దొరగారుసయితము తిమ్మరుసు మంత్రినిగుఱించి పొరఁబడి యాతనిని క్షత్త్రియుఁడనియే భావించియుండిరి. కృష్ణదేవరాయలకు సాళువతిమ్మరాజను పేరుగల పినతండ్రియొకఁడుగలఁడు. అతఁడేయితఁడని బహుజనులయభిప్రాయముకాని సత్యమదికాదు. ఇతఁడు నియోగిశాఖా బ్రాహ్మణుఁడనుటకు లేశమాత్రమును సందియములేదు. ఈ మంత్రిశిఖామణికిని పెనుగుదురుపాడు గ్రామమిరాసీదారులును హరితసగోత్రీకులునునగు నాదెళ్ళవారికిని బంధుత్వముగలిగియున్నట్టు మాదయ్యగారి మల్లనకవి విరచితమగు రాజశేఖరచరిత్రముయొక్క పీఠికలో నుదహరింపఁబడిన నీక్రిందిపద్యములవలన స్పష్టమగుచున్నయది. రాజశేఖరచరిత్రము కృతినొందిన నాదిండ్ల అప్పామాత్యుఁడు కృష్ణరాయల మంత్రియగు తిమ్మరుసునకల్లుఁడైనట్టు తద్గ్రంథమునందే దెలుపఁబడినది.



అప్పామాత్యుఁ డాఱువేల నియోగిబ్రాహ్మణుఁడనియు మంత్రియు దండనాథుఁడనియుఁ దెలియవచ్చుచున్నది.

శా. వైరించప్రతిభావదావదవచో-వైయాత్యసాతత్యస
త్యారూఢస్థితిపాండవాగ్రజమహీ-యస్వచ్ఛకీర్తిచ్ఛటా।
పారావారనిమగ్నశత్రుగణకుం-భత్పూర్వభూభృద్దిశా।
నారీమన్మథబంధురక్షణచణా-నాదిండ్లవంశాగ్రణీ।

సుగంధి. పారదప్రభావిభాసి-భద్రకీర్తివాహినీ।
పూరదానధూతదివ్య-భూజకామధేనుదు।
ర్వారయాఱువేలవంశ-వారిపూర్ణచంద్రమా।
సారబుద్ధిజాలనీత-శత్రుభూమిభృద్రమా॥

క. శ్రీచక్రచారుకుచయుగ।
సూచకగాఢోపగూహ-సూచితపులక।
ప్రాచుర్యతత్త్వతత్పర।
యాచకసంస్తుత్యమంత్రి-యప్పామాత్యా॥

అని మల్లనకవిచేఁ బయిపద్యములలో వర్ణింపఁబడిన యప్పామాత్యుఁడను నతఁడు తిమ్మరుసు మంత్రికూతును బెండ్లియాడినట్లుగా నీక్రిందిపద్యములలో స్పష్టమగునట్లుగా వర్ణించియున్నాఁడు.

సీ. ఏమంత్రిమణినిజ-స్వామికార్యక్రియా, తత్పరమానసో-త్సాహశాలి।
యేమంత్రిమణిమిత్ర-హితబాంధవాశ్రిత, ప్రకరరక్షణకళా-ప్రౌఢబుద్ధి।
యేమంత్రిమణివచో-హేలాతినైర్మల్య, శీతలతాధూత-శీతరోచి
యేమంత్రిమణిసుధా-ధామశాంభవదామ, ధాళధళ్యసుతుల్య-ధవళకీర్తి॥
గీ. యట్టిమంత్రికులోత్తంసవహితనృపతి। పటలమకుటాగ్రఘటితపత్పద్మయుగళి
సకలకర్ణాటరత్నావి-చక్షణుండు। దీనసురశాఖి సాళువ-తిమ్మమంత్రి॥
గీ. అమ్మహామంత్రికతనయ-రంగలక్ష్మి। సకలపుణ్యాంగనాజన-శ్లాఘనీయ।
లక్ష్మమాంబకునుదయించి-లలినిమెఱయ। తిరుమలాంబికఁ బెండ్లియై-తేజరిల్లె॥

ఈ యప్పామాత్యుని ముత్తాత తమ్ముఁడైన చిట్టిగంగన్న కృష్ణదేవరాయని తాతయగు నీశ్వరరాజునకు ప్రభువుగానుండినట్టియు జైమినిభారత కృతిపతియైనట్టియు విజయనగర రాజ్యమాక్రమించినట్టియు (గుండరాజపుత్త్రుఁడగు) సాళువనరసింహరాజునొద్ద మంత్రిగానుండెనని వెనుకటిప్రకరణమునందుఁ దెలిపియుంటిమిగదా! ఇందువలన సాళువతిమ్మరాజుగారు (తిమ్మరుసు) నియోగిబ్రా

హ్మణుఁడని స్పష్టపడుచున్నదిగదా! ఇంతియగాక సాళువతిమ్మరాజు బ్రాహ్మణుఁడై నట్లనేకశాసనములయందును దెలుపఁబడినది. శ్రీసింహాచలస్వామివారి యాలయములోని శాసనములో నాతఁడు ద్విజన్మాగ్రణియనియున్నది. ఆశాసనమిట్లున్నయది.

“శ్లో॥ శాకాబ్దేబహుధాన్యనామనినభో వేదాబ్ధిచంద్రాన్వితే।
కార్తిక్యాం శశివాసరే శుభతిథౌ సింహాచలస్వామినే।
హారం కర్ణవిభూషణే చకటకే శ్రీకృష్ణరాయాధిపా।
మాత్యారాచయసాల్వతిమ్మనృపతి ప్రాదాద్ద్విజన్మాగ్రణీ॥”

ఇందువలన నీతిమ్మరాజు బ్రాహ్మణుఁడనియును, రాచయ్యయనునాతని కొడుకనియు స్పష్టమగుచున్నయది. కాఁబట్టి కృష్ణరాయల పినతండ్రియగు సాళువతిమ్మరాజు కృష్ణరాయలమంత్రియగు సాళువతిమ్మరాజు [త్రిమ్మరుసు] కాడనుటస్పష్టము అతనితండ్రి పేరీశ్వరరాజయిన ట్లీక్రింది పద్యములవలనఁ దేటతెల్లమగుచున్నయది.

క. ఆయీశ్వరనృపతికిబుణ్యాయతమతియైన-బుక్కమాంబకు దేజ।
స్తోయజహితులుదయించిరిధీయుతులగునారసింహ-తిమ్మనరేంద్రుల్॥

ఈసాళువ తిమ్మరాజు బ్రాహ్మణుఁడును రాచయ్యగారి పుత్త్రుఁడును నని చెప్పఁబడుటచేతనే సంశయములెల్లను దీరిపోయినవి. ప్రభువులయింటిపేరును మంత్రివరునియింటిపేరును నొక్కటియగుటయేగాక తిమ్మరాజను నామసామ్యమును బట్టి కూడ బెక్కండ్రు చరిత్రకారులాతఁడు క్షత్రియుఁడేమోయని భ్రమపడియుండిరిగాని వేఱొకటిగాదు. ఈమంత్రిశిఖామణి బహుసమర్థుఁడని చెప్పుటకు లేశమాత్రమును సంశయములేదు. ఇతఁడుచేసినదానశాసనము లనేకములుగలవు. ఇతఁడునరసింహరాయల కడనువీరనరసింహరాయలకడను గూడమంత్రిగానుండెను కానికృష్ణరాయలకడ మంత్రిగానున్నప్పటికంటె నెక్కుడుప్రఖ్యాతిరాలేదు. కృష్ణదేవభూవరుని దిగ్విజయములోఁగూడ నీమంత్రిశేఖరునికీర్తిలత యెల్లదిక్కులకు వ్యాపించినది.



యుగంధర మంత్రివలెనే తిమ్మరుసు మంత్రినిఁగూర్చియుఁ బెక్కుకథలాంధ్రదేశమునఁ జెప్పుకొనఁబడుచుండఁగా నాతనికీర్తిఁ బోలె నీతనికీర్తియు వ్యాపించియున్నది ఇతని బుద్ధిచాతుర్యము వలనఁగూడఁ గృష్ణరాయలు ప్రఖ్యాతిఁగాంచినది వాస్తవమనినమ్ముటకు సంశయింపనక్కరలేదు. కృష్ణరాయలు పట్టాభిషిక్తుఁడగునాఁడు తిమ్మరుసుమంత్రి రాయలనొకగదిలోనికి రహస్యముగరప్పించెను. తనచిన్ననాటనుండి యీమంత్రి శిఖామణిప్రేమాతిశయంబులు ముప్పిరిఁగొనఁగంటికి ఱెప్పయుంబోలెఁ దన్నుఁగాపాడుచున్నవాఁడగుటంజేసి కృష్ణరాయలును మంత్రికివిధేయుఁడయి మంత్రికడకువచ్చెను. అంతటతిమ్మమంత్రి రహస్యముంజెప్పెదనని తలుపుచాటునకుం దీసుకొనిపోయి యిదిగోరహస్యమని యొకచెంకాయఁ దనసత్తువతోఁగొట్టెనఁట! పిడుగుపాటువలెఁ దనపైఁబడిన యాదెబ్బకుఁ దలగిరగిరందిఱుగ రాయలుక్రిందఁబడెనట! తిమ్మరుసు కన్నీరుఁగ్రించుచు నాతనియెదుటఁ గూరుచుండెనఁట! కృష్ణరాయలు కొంతవడికిఁదెప్పరిలి దీనాననముతోఁ దిమ్మరుసుమోమువీక్షింపఁగా నాతండురాయలంజూచి కౌగిలించుకొని ముద్దాడి “అన్నా నీయొడలు నొచ్చెనని నన్నుదూషింపకుము. ఇట్టిపని చేయుటకు నాకుఁజేతులాడక యిన్నిదినంబులూరకుంటిని; ఇఁకనూరకున్నచో స్వామిద్రోహముఁ జేసినవాఁడనగుదునను భయముచే సాహసించి యిపుడీపనిచేసితిని; నాతప్పుసైచి నన్నుమన్నింపుము.” అనివేడుకొనెనట!

తనకు బాల్యప్రభృతి కంటికి ఱెప్పవలెఁ గాచుచున్న తిమ్మరుసు కారణములేనిది యేపనియుంజేయఁడని కృష్ణరాయ లెఱుంగునుగావునఁ బ్రసన్నుఁడై “అప్పా! జనకుఁడు తనయునినేల దండించును? ప్రేమాలోపముచే దండించునని తలంతురా! కొడుకును బాగుచేయు నుపాయములు దండ్రికిం దెలియునుగాని కుమారుని కెట్లు దెలియంగలవు; దీనినే మహాప్రసాదముగా స్వీ

కరించితి:" అని పలికెనఁట! అందుకు మంత్రి మిక్కిలి సంతసించి కృష్ణదేవరాయనిఁ బలుమాఱుఁ గౌఁగలించుకొనుచు "నాయనా! నీవిట్టివాఁడవని యెఱింగియుండుటచేతనే నేనిట్టిపని చేయఁగలిగితినిగాని యొరులపట్ల నిట్లు చేయఁగలుగుదునా? ఇట్లు చేసితినని మనస్సులో నుంచుకొనకుము; నీవింతవఱకుఁ బువ్వులలోఁ బుట్టి పువ్వులలోఁ బెఱిగినవాఁడవు; ఆగర్భశ్రీమంతుఁడవగుటచేత సుఖములనేగాని కష్టములనెఱుంగవు; నీవిపుడు బహుజన పరిపాలకుఁడవు కాఁబోవుచున్నాఁడవు గాన నంతటినుండి మేమెల్లఱము భవదాజ్ఞానువర్తులము కావలసినవారముగాని నీకు బుద్ధులు చెప్పవలసినవారముగాము. దండనాపారుష్యమువలనఁ బ్రజలకుఁ గల్గు బాధ ప్రభువరులకు స్వయముగ ననుభవమువలనఁ దెలియదేని యట్టిప్రభువు ప్రజలకు క్రూరదండనముల విధించి హింసించి లోకకంటకుఁడనిపించుకొనునుగావున నట్టి దండనాపారుష్యమువలనఁ గలుగు నొప్పి ప్రభువుల కనుభవములో నుండుట ప్రజల భాగ్యమని చెప్పఁదగుఁగదా! అట్టిభాగ్యము నీప్రజలకును, తన్మూలమున నీకీర్తి విస్తరించుభాగ్యము నీకును గల్గించుట కిపుడీకార్యముం జేసినాఁడను." అని తెలియఁజెప్పెనఁట!

ఈకథయెట్టిదైనను సాళువ తిమ్మమంత్రి కృష్ణరాయలు రాజ్యభారమును వహించినది మొదలుకొని బహువిధముల బుద్ధులుచెప్పి రాయలకధిక ప్రఖ్యాతిఁగలిగించెననుట వాస్తవమని నేను దృఢముగా నమ్ముచున్నాఁడను. ఈమంత్రినిగుఱించిన కథాచమత్కృతులను దెలిపి గ్రంథవిస్తరముచేయుట నాతలంపుకాదు గనుక నాకథలనువిడిచి చరిత్రాంశమునకువచ్చి సందర్భానుసారముగానీ మంత్రినిగుఱించి యందందు ప్రశంసగలిగినప్పుడు దెలుపనూహించి ప్రస్తుతము విరమించుచున్నాఁడను. కృష్ణదేవరాయలు తానుపట్టాభిషిక్తుఁడుకాఁగానే తనసోదరులను సోదరపుత్త్రుని విజయనగరమునకు ౨౫౦ మైళ్ళదూరములోనున్న చిత్తూరుమండలము



లోని చంద్రగిరిదుర్గముననుంచి వారలకు కాపుగారక్షకభటులను నియమించి తానునురక్షితుఁడయి ప్రజలుమెచ్చునట్లుగా రాజ్యపాలనము సేయుచు భువనవిఖ్యాతినొందుచుండెను.

## పదునొకొండవప్రకరణము.

---

పోర్చుగీసువారు—ఆల్మెయిడాకుబదులుగా ఆల్బుకర్కు రాజప్రతినిధిగావచ్చుట—ఆల్బుకర్కు జామొరిన్ రాజుతో యుద్ధముచేసి యోడిపోవుట—ఆల్బుకర్కు కృష్ణరాయలకడకు రాయబారముపంపుట—ఆల్బుకర్కు గోవానగరమునుజయించుట—కృష్ణరాయలు ఆల్బుకర్కునుగొనియాడి ప్రోత్సాహపఱచుట—ఫ్రాన్సిస్కులూయీగారి రాయబారము—పోర్చుగీసువారును కృష్ణరాయలును ఒడంబడికచేసికొనుట—డార్టీబార్బోసాగారి దేశయాత్ర.

శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సింహాసనాధిరోహణము చేసినకాలమునందు హిందూదేశములోని పశ్చిమతీరమునందలి వారిస్థానములకన్నిఁటికిఁ బ్రభువుగా నుండుటకు రాజప్రతినిధిగా నాల్మెయిడా (*Almeida*) యను నాతఁడు నియమింపఁ బడియుండెను. కానిశీఘ్రకాలములోనే ఆల్బుకర్కు (*Albuquerque*) ఆల్మెయిడాకుబదులు పరిపాలకుఁడుగావచ్చెను. ఇతఁడు కళ్ళికోటరాజగు జామొరిన్ రాజుతో (*Sawuri of Calicut*) యుద్ధముచేసి యోడిపోయి యధికనష్టమును బొందెను. ఈకళ్ళికోట పశ్చిమతీరమునందలి యిప్పటి మలబారుమండలములోనిది. అయ్యది మూరులను (*Moors*) మహమ్మదీయుల పరిపాలనముక్రింద నుండెను. ఆల్బుకర్కు తాను పోర్చుగల్ (*Portugal*) దేశపురాజుచేత మూరులతో యుద్ధముచేయుటకు మాత్రమే పంపఁబడితినిగాని హిందువులతో యుద్ధముచేయఁ బంపఁబడలేదనియు, కళ్ళికోట ధ్వంసము చేయఁబడినందున రాజాపట్టణమును విడిచి దేశములోనికిఁ బాఱిపోయినవాఁడుగావున నారాజ్యమును జయించుటకుఁ దమకుఁ దోడుచూపినయెడల మూరుల నచటినుండి తఱిమివేసి తానాదేశ

ము నాక్రమించుకొన్న తరువాత దక్కను దేశమునందున్న మూరులను దఱుముటకు దాను దోడుచూపుదుననియుఁ దనప్రార్థనము నంగీకరింపవలసినదనియు శ్రీకృష్ణదేవరాయలకడకు రాయబారిని బంపించెను. ఇంతియగాక యవనపారశీక దేశములనుండి దెప్పించెడు గుఱ్ఱములను బీజపురసుల్తానునకుఁ బంపుటకుమాఱుగాఁ గృష్ణరాయలకే పంపించెదమనికూడ నాతఁడు వాగ్దత్తము చేసెను. తరువాత నాతఁడు బీజపురసుల్తానగు నేదులశాహి (Adil Shah) స్వాధీనములోనున్న గోవా నగరమును ముట్టడించి క్రీస్తుశకము ౧౫౧౦ వ సంవత్సరము మార్చి ౧ వ తేదీని పట్టణమును గైకొనెను. తరువాత వెంటనె గాస్పారుచానోకా (Gaspar Chanoka) యను వానిని పోర్చుగీసు వారి వర్తక సంరక్షణార్థమై భటకల్లు (Bhatkal) కడ నొకకోటను గట్టుకొనుటకనుజ్ఞ నీయవలసినదిగాఁ గోరుటకై రాయలకడకుం బంపెను. చానోకా విజయనగరమున సన్మర్యాదలతో గౌరవింపఁబడెనఁటగాని యాకాలమున కృష్ణదేవరాయలు బీజపురసుల్తానగు నేదులశాహితో సఖ్యతఁ గలిగియుండుటచేతనో మఱియేకారణముచేతనో తృప్తికరమైన ప్రత్యుత్తరమీయకపోయెనని బార్రోసు (Barros) వ్రాయుచున్నాఁడు. తరువాత కృష్ణదేవరాయలు గోవానగరమును జయించినందులకు ఆల్బుకర్కును గొనియాడుచు నేదిల్‌ఖానుతోఁ జేయుయుద్ధములోఁ దోడ్పడెదననియు వాగ్దత్తముచేసి రాయబారినిఁ బంపెనఁటగాని యట్టిపని జరిగియుండలేదని స్యూయల్ గారు వ్రాయుచున్నారు. అటుపిమ్మట మహమ్మదీయసేనలు మఱలగోవానగరమును ముట్టడించి ఘోరయుద్ధముచేసి జయమునొందఁగా నాల్బుకర్కు ప్రదేశమును వదలిపెట్టి నూటయేబది మహమ్మదీయులను వారిభార్యలను బిడ్డలనుజంపి ఖైదీలనుగాఁ బట్టుకొనిపోయెనని ఫెరిష్టా వ్రాయుచున్నాఁడు.



ఆ సంవత్సరము నవంబరు నెలలో బీజపురమున సంభవించిన గృహకలహములలోఁ దగులుకొని ఏదిల్‌షా చిక్కుపడియుండుటను దెలిసికొని యాల్బుకర్కు గోవానగరపరిపాలకుఁడుగానున్న రసూల్‌ఖానునిఁ దాకి వానివిజయించి స్త్రీపురుషాదుల నాఱువేల తురుష్కులను హతముచేసి డిసెంబరునెలలో మఱలగోవానగరమును గైకొనెను. ఏదిల్‌షా మంత్రియగు కమ్మలఖానుఁడు పోర్చుగీసువారితో నొడంబడిక చేసికొని గోవానగరమును వారలకువిడిచిపెట్టెనని ఫెరిష్టా వ్రాయుచున్నాఁడుగాని యదిసత్యమనితోఁచదు. రసూలుఖానుఁడు ఘోరయుద్ధముచేసి యోడిపోయినట్టు చారిత్రమువలనఁ గోచరమగుచున్నయది. ఈ సమాచారమంతయు విజయనగరమునకుఁ దెలియవచ్చినతోడనే కృష్ణదేవరాయలు క్రీస్తుశకము ౧౫౧౦ వ సంవత్సరము డిసెంబరునెలలో నాల్బుకర్కు కడకు రాయబారులనుబంపఁగా ఫ్రాంసిస్సులూయీగారు తమ రాయబారమును గుఱించిన యుత్తరములను వారలచేతికిచ్చి పంపించెనఁట. ఆయుత్తరములలో నెక్కరాయలవలన దక్కతదితరులచేత సమ్మానింపఁబడితిననియు, అయినప్పటికి రాయలుభటకల్లు కడ గోటకట్టుకొనుటకనుజ్ఞయిచ్చెననియు వ్రాసియుండెనఁట. అందెందుచేతనోగాని ఫ్రాంసిస్సులూయీ తనరాయబారము ముగిసినతరువాత విజయనగరమునుండి తిరిగిరానేలేదఁట! అతఁడేమైనదియుఁ జరిత్రమేమియుఁ జెప్పదుగాని యొకానొకదినమున విజయనగరములో నాతఁడుచంపఁబడెనని యాల్బుకర్కూహించుచున్నాఁడు. ఈరాయబారి యాకాలములోని విజయనగర బీజపుర వృత్తాంతములను సవిస్తరముగాఁ దెలుపుటయేగాక కృష్ణదేవరాయని పరిపాలనావిశేషములనుగూడఁ దెలిపియున్నాఁడు, ఏదిల్‌షా బీజపురమునుముట్టడించి భామినీసుల్తానుని ఖైదీగాఁబట్టుకొనెననియు, ఇతనితోఁబాటు మఱినలుగురు మహమ్మదీయప్రభువులు భామినీసుల్తానధికారమును దిరస్కరించి స్వతంత్రులుకాఁ బ్రయ

త్నించుచుండిరనియు, బెల్గాముదేశపుప్రజ లేడిల్‌షాయధికారము ను దిరస్కరించి విజయనగరపురాజు నధికారమునకు లోఁబడిరనియు, విజయనగరపురాజు పెనుగొండప్రభువు స్వాధీనుఁడుగాక యుండెనని మేడువేలసైన్యముతో నాతనినోడించి స్వాధీనముఁ జేసికొని సముద్రతీరమునకుఁ బోవుచున్నాఁడనియు, ఏకారణమున నీదండయాత్రకభిముఖుండయి పోవుచున్నాఁడో తెలియరాదు గనుక మిక్కిలి జాకరూకుఁడవై యుండవలసినదని వ్రాసియుండెను. ఇంతియగాక కృష్ణదేవరాయలు మిక్కిలిబలవంతుఁడుగావున నాతనితోస్నేహముగానుండుటయే పోర్చుగీసువారికి క్షేమకరమనియు కృష్ణరాయలమంత్రియగు తిమ్మరాజును (తిమ్మరుస్సు) విదేశీయులను దరికిఁజేరకుండ రాయలకు దుర్బోధ చేయుచుండునుగావున నాతనినమ్మియుండరాదనియు గర్నవ్వార్ రాజుతో గోవానగరము నిప్పించుటకుఁగుతంత్రములు చేయుచున్నాఁడనియు వ్రాసియుండెను. రెండవసారి యాల్బుకర్కు గోవానగరమునుబట్టుకున్న తరువాత వెంగాపుర (*Bankapur*) ప్రభువు శ్లాఘించుచు నుత్తరము వ్రాసి ప్రతిసంవత్సరము తనకుమూఁడువందలగుఱ్ఱములను వెలకుఁ బంపించుచుండవలెననికోరెను: ఈవెంగాపురము గోవానగరమునకును విజయనగరమునకుమధ్యనున్న బలవత్తరమైన ప్రదేశమగుటచేతను అరిగితేఱిన గుఱ్ఱపుసవారులకుఁ బ్రసిద్ధికెక్కియుండుటచేతను వెంగాపురప్రభువు తమకుమిత్రుఁడుగానుండుటలాభకరమని తలపోసియాతనికోరిక నంగీకరించిరి. విదేశీయులువచ్చితనసరిహద్దులో విభాములనాక్రమించుచున్నారనుచింత లేశమాత్రమునులేనివాఁడై శ్రీకృష్ణదేవరాయలు తానుముందు నేడిల్‌షాతోఁజేయు యుద్ధములకు గుఱ్ఱములుకావలసియుండెనే యయ్యవి నాకుఁబంపించువారే మిత్రులని భావించి యీపోర్చుగీసువారికి మిక్కిలియనుకూలుఁడై యుండెను. వారలును రాయలచిత్తవృత్తినిగనిపెట్టి యవనపారశీకములనుండిగొని తెచ్చిన గుఱ్ఱములనన్నిటిని బీజపురమునకుఁ



బంపక విజయనగరమునకుఁబంపి కృష్ణదేవరాయలకే విక్రయించుచుండిరి. గుఱ్ఱములవ్యాపారమునునిరాటంకముగా జరిపినయెడల నాల్బుకర్కుకు కృష్ణదేవరాయలిరువదివేల పౌనులనిచ్చెదనని వాగ్దత్తము చేసెనఁటగాని యాల్బుకర్కుసమ్మతింపలేదఁట. మఱికొంతకాలమునకు రాయలు తానుబీజపురసుల్తానగు ఏడిల్‌షాతో యుద్ధముచేయవలసియున్నదిగాన గుఱ్ఱములనుగుఱించి వెనుకచెప్పిన యొడంబడికను నంగీకరింపవలసినదని మఱల నాల్బుకర్కునకురాయబారముఁబంపెను. ఈసమాచారమును సుల్తాను దెలిసికొని రాయలతో మాని తనతో వ్యాపారము చేయవలసినదని తానొకరాయబారమునుబంపెను.

తనయుద్దేశమును నెఱవేర్చుకొనుటకు మంచిసమయముదటస్థించెను గదాయని యతఁడుసంతోషించి ముందుగాఁదాను రాయలుతనకు సంవత్సరమునకు ముప్పదివేలవరహాలను నిచ్చినయెడల గుఱ్ఱములనన్నిఁటిని నాతనికేపంపెదననియు, వానిని గోవానగరమునుండి గొనిపోవలసిన బాధ్యతమీఁదేయనియు, తనసైన్యములకగు వ్యయమంతను భరించినయెడల యుద్ధములోఁ దోడ్పడెదమనియు రాయలకుఁ దెలియఁజేసెను. తరువాత బీజపురసుల్తానునకు గోవానగర ద్వీపమునకెదురుగానున్న పీఠభూమిని దమకిచ్చినయెడల సుల్తానుకోరిక నంగీకరింపఁబడునని తెలియఁజేసెను. ఈవ్యవహారము ఫలిష్కారమగులోపలనే ఆల్బుకర్కుమృతినొందెను.

క్రీస్తుశకము ౧౫౧౬వ సంవత్సరము డార్టిబార్బొసాయను (*Duarte Barbosa*) నాతఁడీదేశమును జూడవచ్చి యప్పటిస్థితిగతులను వర్ణించియున్నాఁడు. నరసింహరాజ్యము మిగులభాగ్యవంతమైనదనియు, సమస్తపదార్థములతో నిండియున్నదనియు, నగరములతోను పట్టణములతోను నలంకరింపఁబడి జనభరితమై యొప్పుచుండెనని వ్రాయుచున్నాఁడు.

విజయనగరరాజ్యమును పోర్చుగీసువారు నరసింహరాజ్యమని పిలుచుచుండుటయేగాక చరిత్రములలోఁగూడ నట్లే వ్యవహరించుచుండిరి. ఆకాలమునఁ బశ్చిమతీరమున భటకల్లు గొప్ప రేవుపట్టణముగాను, వర్తకస్థానముగాను నుండెననియు, అచటి నుండి యినుము, మూలికలు, కరకకాయలు మొదలగునవి విదేశములకుఁ బంపఁబడుచుండినవనియు, విదేశములనుండి ముత్యములును, గుఱ్ఱములును వచ్చుచుండినవనియు, నవి యిప్పుడు ముఖ్యముగా గోవానగరమునకుఁ బోర్చుగీసువారివలనఁ దెప్పింపఁబడుచున్నవనియు వ్రాయుచున్నాఁడు. కృష్ణదేవరాయల సోదరపుత్త్రుఁడో మేనల్లుఁడో భటకల్లు (*Bhatkal*) నకుఁ బరిపాలకుఁడుగానుండి తానొక రాజుగానుండి విజయనగరరాజునకు లోఁబడి కప్పముగట్టుచుండెనని తెలియఁజేయుచున్నాఁడు. బార్బొసాతీరమును వదలి పడమటికనమలను దాటివచ్చి విజయనగరము నీరీతిగా వర్ణించుచున్నాఁడు. " పర్వతములకు ౧౩౫ మైళ్ళదూరమున నొకప్రక్క బలాఢ్యమగు కుడ్యముచేతను, నొకప్రక్క నదిచేతను మఱియొకప్రక్క నొక పర్వతముచేతను జుట్టఁబడి జనసమ్మర్దముఁ గలిగిన విజయనగరమను మహానగరమొక్కటిగలదు. అయ్యది సమభూమిమీఁదఁ గట్టఁబడినది. నరసింహరాజందు (కృష్ణదేవరాయలు) వాసముచేయుచుండును. అతఁడుదయార్ద్రబుద్ధికలవాఁడు. అతఁడు రాయలని పిలువంబడుచుండెను. అతఁడు విశాలములయినట్టియుసొగసయినట్టియుసభామంటపములతోఁగూడిన సుందరమందిరములను బెక్కింటినిఁ గలిగియున్నాఁడు. అక్కడ నివసించెడు సామంతులగు ప్రభువుల మందిరములనేకములుగూడ నానగరమునఁ గలవు. తక్కిన యిండ్లన్నియుఁ బైకప్పుకలిగియున్నవి. వీధులు విశాలములయియున్నవి. అయ్యవి వివిధదేశములయొక్కయు నానాజాతులవారియొక్కయు జనసంఘములతో నిండి నిబిడీకృతములై యున్నవి. సింహళము, పైగోదేశములనుండి



దెప్పింపఁబడెడునాభరణములయొక్క వ్యాపారము విరివిగా జరుగుచుండెను. దేశములో నెచ్చటఁజూచినను వజ్రములు గానఁబడుచుండెను. నరసింహరాజ్యమునం దొకటియు, దక్కనురాజ్యమునం దొకటియు, వజ్రపుగనులుగలవు; ఆర్మజుకేయల్ ద్వీపములనుండి తేఁబడిన యమూల్యములగు ముత్యములతో నిండియుండెను; పట్టుపీతాంబరములును పగడములునుగూడఁ గలవు; రాజు పైనుదహరించిన మందిరములలోఁ దఱచుగానివసించుచుఁ గొన్నివేళలందుమాత్రమే బయలకుఁబోవుచుండును. రాజునొద్ద పరిచర్యసేయువారలు స్త్రీలుగానుండిరి. రాజులోపలనున్నప్పుడు వీరలు రాజును గనిపెట్టుకొనియుందురు; వారలలో దాదాపుగానందఱును రాజగృహమునకు సంబంధించినపరిచారికలుగానుండిరి. ఈపనికత్తెలకందఱకు నామందిరములలో నివసించుటకుఁ బ్రత్యేకముగాగదులుగలవు; ఇతనికి మంత్రులతోను రాజకీయోద్యోగియులతోనుగలిసి రాజకీయవ్యవహారములను బరిష్కరించుటకనువగు నాస్థానమంటపముగలదు; వారెల్లఱు మనుష్యులుభుజములమీఁద మోచుకొనివచ్చెడు మేనాలమీఁద నెక్కివచ్చెదరు. ఈ మంటపముఖద్వారమునందు మేనాలవారును గుఱ్ఱపురౌతులును పెక్కండ్రెల్లప్పుడునిలిచియుందురు. ఎల్లసమయములందునురాజుతనయొద్ద తొమ్మిదివందల యేనుగులను ఇరువదివేల యశ్వములను తనసొమ్ముతోఁగొన్నవానిని నుంచుకొనియుండును; ఇంతియగాక తాను స్వయముగా జీతములిచ్చియుంచుకొన్న నూఱువేలసైనికులుగలరు; రాజుచనిపోయినయెడల నాతనితోఁబాటు నాలుగయిదువందల స్త్రీలు దహనముచేయఁబడుదురు. నరసింహరాజెప్పుడును (కృష్ణదేవరాయలు) తనభూమిఁగై కొన్న దక్కిణీరాజుతోను ఉత్కలదేశపురాజుతోను యుద్ధములుచేయుచుండును.

---

## పంద్రెండవప్రకరణము.

---

శ్రీకృష్ణదేవరాయలు గంగవంశరాజులను జయించుట—పాండ్యచోళచేరదేశములను జయించి తెలుఁగు నాయకులను బరిపాలకులనుగా నియమించుట—రాయలుదయగిరి దుర్గముపైదండెత్తిపోయి తిరుమలకోపరాయ మహాపాత్రుని బట్టుకొనుట—పూర్వదిగ్విజయయాత్ర—కనిగిరిపైదండెత్తివచ్చుట—వీరరుద్రగజపతికూఁతుం బరిణయంబై యాతనివింధ్యపర్వతములకుఁ బాఱఁదోలుట—కొండవీడుపై దండెత్తుట—వీరభద్రగజపతిని నోడించుట—కొండపల్లిగైకొనుట—వేఁగిదేశములనుజయించుట—సింహాద్రిచేరుట—సింహాచలస్వామికి భూదానములను జేయుట—పొట్నూరికడ జయస్తంబమును నాటుట—ఉత్కలదేశపురాజధానియగుకటకపురిని గాల్చుట—ప్రతాపరుద్రగజపతి పాఱిపోవుట—గజపతిరాయలతోసంధిచేసికొనుట—గజపతితనకూఁతునిచ్చివివాహముచేయుట—కుతుబ్షాత్రిలింగదేశముపైదండెత్తివచ్చి రాజుకొండ, దేవరకొండ, కోవిలకొండ బెల్లముకొండ కొండవీడు కంబముమెట్టు కొండపల్లి జయించుట— రాయలు గోలకొండదేశముపైదండెత్తుట—కంబముమెట్టుపురము పాలించు సీతాపతిరాజు యోడిపోయి రామచంద్రదేవుని మఱుఁగుఁజొచ్చుట—హిందువులోడిపోవుట—కుతుబ్షా బీజపురసుల్తానుతో యుద్ధముచేయుట— కృష్ణరాయలు కటకము వఱకు దేశమును జయించుట—

శ్రీకృష్ణదేవరాయలు సింహాసనమునకు వచ్చిన శీఘ్రకాలములోనే తన రాజ్యమును నానాముఖముల వ్యాపింపఁజేసి మిగులఁ బ్రసిద్ధుఁడాయెను. కృష్ణదేవరాయలు సింహాసనమెక్కునప్పటికి వివాహము కాలేదు. రాయలు క్రీస్తుశకము ౧౫౧౩వ సంవత్సరమున దక్షిణదిగ్విజయయాత్రకుబయలువెడలి మయిసూరు మండలములోని యుమ్మటూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము మొదలగు దుర్గములను బట్టుకొని గంగవంశరాజులనోడింపఁగాఁ దరువాత నాదేశమంతయు స్వాధీనమయినది. శివసముద్రముకోటలోనుండి రాజ్యముచేయుచున్న త్యావరాజు మృతినొందఁగా నతని కుమారుఁడగు గంగరాజు కోటను సురక్షితముగాఁజేసి మఱికొందఱుపాలెగాండ్రను జేర్చుకొని కృష్ణరాయలకుఁ



గప్పముకట్టి లోఁబడక తిరస్కరింపఁగా వారలను శిక్షింపవలెనను నుద్దేశముతోఁ గృష్ణరాయలు చతురంగబలసమేతుఁడై ఫిరంగులు మొదలగు నాయుధములతో నధికసైన్యములంగూర్చుకొనిపోయి కర్ణాటకదేశములోఁ గావేరీతీరమునఁ బశ్చిమరంగమునకుఁ దూర్పుగానున్న బలాఢ్యమగు శివసముద్రము కోటను ముట్టడించి గంగరాజునకు శత్రువగు చిక్కరాయనిం జేర్చుకొని ప్రేతపర్వతము, గారికొండలలో దండుదిగి కొంతకాలమునకుఁ గనమ కావేరి మార్గముగుండఁపోయి కోటను బట్టుకొని స్వాధీనముఁజేసికొని లోనఁబ్రవేశించెను. గంగరాజు కావేరిమడుగులోఁబడి ప్రాణత్యాగముచేసెను. ఈవృత్తాంతము "కొంగదేశరాజకాల్" అను చరిత్రములో వ్రాయఁబడియుండెను. ఇంతియగాక కృష్ణరాయాస్థానకవులలోఁ బ్రసిద్ధుఁడగు తిమ్మకవి విరచితమగు పారిజాతాపహరణగ్రంధములోని ద్వితీయాశ్వాసమునందిక్రిందిపద్యమున నిట్లు వర్ణింపఁబడియుండెను.

"శా. సమ్మర్దక్షమఝ్ఝనిబంధనవిధాసంక్రందనాచార్యకా।
రమ్యాన్యాచలవజ్రపాతజగతీరక్షాంబుజాక్షేశ్వర।
ధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యప్రోద్భవాతీరభా।
గుమ్మత్తూరిశివంసముద్రపురవప్రోన్మూలనాడంబరా॥"

ఉమ్మటూరు. శివసముద్రము దుర్గములను జయించినతరువాత శ్రీరంగపట్టణమునకుఁబోయి చిక్కరాయలను లోఁబఱుచుకొని యాతనికిఁగొంతదేశమునిచ్చి "కాంబగౌడడు, వీరప్పగౌడడు" అనుపాలెగాండ్రవశమునఁ గొంతిదేశమునుంచి సమీపమున్నండలి పాళెయపట్టులజయించి యాకర్ణాటకదేశమునకంతకు శ్రీరంగపట్టణము రాజధానిగఁజేసి కృష్ణరాయధ్వజమనుపేరుతో నొకధ్వజమునెత్తించి ప్రఖ్యాతిఁగాంచెను. అటుపిమ్మటకొడగు మళయాళము మొదలగుప్రదేశములను జయించి యాదేశపురాజులచేఁగప్పములంబరిగ్రహించుకొని పాండ్యచోళచేరదేశములను జయించుటకై లక్షసైన్యమును బంపించెను. ఈసేనకంతకును ప్రసిద్ధు

లగు "విజయప్పనాయకుఁడు, వేంకటప్పనాయకుఁడు" అనుసేనాధిపతులను నలుగురేర్పఱుపఁబడిరి. విజయప్పనాయకుఁడు వేలూరుముఖ్యస్థానముగాఁ జేసికొని పన్నులు స్థిరపఱచి రాఁబట్టుచుండెను. చిత్తూరిపాలెగాఁడును తొండమండలములోనిపాలెగాండ్రును విజయప్పనాయకునితో సంధిచేసికొని తామిచ్చుకొనవలసిన కప్పములనుగుఱించి పరిష్కారముఁ జేసికొనిరి. కాళహస్తిప్రభువగు బొమ్మిరెడ్డికూడఁ బన్నుచెల్లించుటకు నొప్పుకొనెను. తరువాత జింజీపట్టణమునకుఁబోయి చోళమండలములోని పాలెగాండ్రను రప్పించి పన్నులునిర్ధారణజేసి తానచటనేకాపురముండి పాండ్య, చోళ, చేరరాజులదేశములనుజయించి కప్పములనునిర్ణయించిరాయలకొఱకు రాఁబట్టుచుండెను. తంజాపురి, తిరుచనాపల్లి, మధుర, తిరునగరురాజులు విజయప్పనాయకుని యిష్టానుసారముగ వ్యవహార పరిష్కారములనంగీకరించిరి. ఈరీతిగాఁ బూర్వకర్ణాటకదేశమంతయుఁ గృష్ణరాయలయధీనమాయెను. ఈదేశమువలనరాయలకు మూడుకోట్లరూకలాదాయము వచ్చుచుండెను. ఈదేశమునంతను మూడుఖండములుగ భాగించి వానిఁబరిపాలించుటకుమువ్వురు పాలకులను నియమించెను. జింజీలోనుండుకృష్ణప్పనాయకుఁడు సింహపురము [నెల్లూరు] మొదలుకొని కొల్లడము నదివఱకును (Calaroon) పరిపాలించుచుండెను.

విజయరాఘవనాయకుఁడనునాతఁడు తంజాపురిలోనుండి కావేరీనదిప్రవహించు ఫలవంతమైన దేశమునకంతకుఁ బ్రభువై (Governor) పరిపాలించుచుండెను. దానికి దక్షిణముననుండు తిన్నెవల్లిమండలమంతయు వేంకప్పనాయకునివలనఁ బాలింపఁబడుచుండెను. ఇట్లు కృష్ణరాయలప్రభుత్వకాలమునఁ దెలుఁగు నాయకులు ద్రావిడ కర్ణాటక మళయాళదేశములకుఁ బరిపాలకులుగా (Governors) నుండిపరిపాలనముచేసియుండిరి ఇట్టి ప్రభుత్వ సంపదలు కృష్ణరాయలకు గలుగుటకుసహింపలేక తురుష్కులు



రాయలకును నాతనికిలోఁబడియుండిననాయకులకును విరోధమునుగలిగింపఁ జూచుచుండిరి. ఈరీతిగా దక్షిణదిగ్విజయ యాత్ర ముగించి యాసంవత్సరములోనే కృష్ణదేవరాయలు బలవత్తరమగు నుదయగిరి దుర్గమునుసాధించుటకై దండెత్తిపోయెను. ఆకాలమున నుత్కలదేశపురాజధానియగు కటకపురిమొదలుకొని యుదయగిరిపర్యంతముగల దేశమంతయు గజపతులనెడి యుత్కలదేశపురాజులయధీనమైయుండెను. ఈదేశములోని యుత్తరభాగమునకనఁగా రాజమహేంద్రపురముమొదలుకొని కటకపురివఱకుగల దేశమునకుఁ గళింగదేశమనియు గోదావరీకృష్ణానదులకు మధ్యనుండుదేశమునకు వేఁగిదేశమనియు దానికిదిగువనున్న దేశమునకు విదర్భదేశమనియుఁ బేరులుగలవు.

అట్టివిదర్భదేశమునకు దిగువనున్నసింహపుర మండలములోని యుదయగిరిమీఁదికి దండెత్తివచ్చినప్పుడు దానికధికారిగానున్న వీరభద్రపాత్రుని పినతండ్రియైన ప్రహారేశ్వరపాత్రునిజయించి కృష్ణరాయలాదుర్గమునుసాధించెను. కృష్ణరాయలీదుర్గమునుముట్టడించినపుడు ముప్పదివేలసైనికులను ఎనిమిదివందల యేనుగులనుగలిగియుండెను. ఆకాలమున నుదయగిరిదుర్గము మిగులబలాఢ్యమై శత్రువులకభేద్యమై పదివేలకాల్బలముతోను నాలుగువందల గుఱ్ఱములతోను సురక్షితమైచెన్నుమీఱియుండెను. రాయలు దుర్గములోనివారికి భోజనపదార్థములందకుండఁ బదునెనిమిదిమాసములుముట్టడించి కోటబురుజులను సమీపించుటకై తనసైనికులకు మంచిబాటలనేర్పఱచుటకు గండశైలములఁ బెక్కింటినిఁబగులఁగొట్టి జాతిగుట్టల సందులఁగూడ పెక్కుబాటలనేర్పఱచెనుగాని కోటసమీపించుటకు నొక్కొక్కఁడుగాఁ బోవలసినట్టి యిరుకైన మార్గమొకటిగలదు దానినిపెద్దదిగఁజేసి యామార్గములగుండ యాయుధపాణులై పోయిపోరాడి దుర్గమునుబట్టుకొని లోపలఁ బ్రవేశించిరి. ప్రవేశించి ప్రహారేశ్వరపాత్రునిబట్టుకొని విజయనగర

మునకుఁగొంపోయెనఁట! ఆదుర్గముమీఁదనున్న యొకదేవాలయములోని కృష్ణవిగ్రహమునుగొనిపోయి విజయనగరములో స్థాపనముచేసి కృష్ణస్వామిపేరనొక గొప్పయాలయమునుగట్టించెను. ఆయాలయమిప్పుడు శిథిలమైనను నగరములోఁజూడఁదగిన ప్రదేశముగానున్నయది. ఈదేవాలయమునకు బహుభూములను దానముచేసి శాసనములనువ్రాయించెను. ఆసమీపముననే కృష్ణరాయలుహజారరామస్వామియాలయమునొకదానిఁగూడఁగట్టించెను. కృష్ణరాయలచేత నుదయగిరిదుర్గములోఁ బట్టుపడినవాఁడు తిరుమలప్రేతరాయ మహాపాత్రుఁడని ధరణికోటశాసనములోఁ జెప్పఁబడినది. అటుతరువాత రాయలామండలములోని కనకగిరి (కనిగిరి)కిరాజయినట్టియు, ఓరుగంటిప్రతాపరుద్రునిసంతతి వారిలోఁగడపటివాఁడయినట్టి వీరరుద్రగజపతిమీఁదికి దండెత్తిపోయినటుల నాంధ్రకవులచరిత్రములో నీక్రిందివిధమున వ్రాయఁబడినది. "కృష్ణరాయల మంత్రియైన యప్పాజీయను నామాంతరముగల తిమ్మరుసు (సాళువతిమ్మరాజు) నెల్లూరిమండలములోని కనిగిరికి (కనకగిరికి) రాజయినట్టియు, ఓరుగంటిప్రతాపరుద్రునిసంతతి వారిలోఁగడపటివాఁడయినట్టియు, వీరరుద్రగజపతి కాతనికొమార్తెను కృష్ణరాయలకిచ్చి వివాహముచేయుమని సందేశముపంపెను. అతఁడు హీనకులుఁడైన కృష్ణరాయనికిఁ దనపుత్త్రిక నియ్యననిస్పష్టముగాఁ జెప్పి యటువంటిబలవంతునితో విరోధముపెట్టుకొనుటకు సాహసింపఁజాలక, కొమార్తెనిచ్చెదనని చెప్పి రాయలను మంత్రిసహితముగారప్పించి, అంతఃపురముజొచ్చినప్పుడు రాజుప్రాణములు గొనఁబ్రయత్నించెను. కోటలోఁబ్రవేశించినతరువాత మంత్రియైన తిమ్మరుసీమోసమునుగనిపెట్టి రాజుప్రాణములుకాపాడుటకై రాజువేషమునువేసికొని కృష్ణరాయనికి సేవకవేషమువేసి తనవెంటఁగొనిపోయెను. కాని కృష్ణరాయనిచేతివ్రేలినున్న ముద్రయుంగరమునుబట్టి యతఁడేరాజని యంతఃపురములోనివా రానవాలుపట్టిరి.



ప్రాణోపద్రవము సంభవింపనున్న యాసమయమునందు ధీమంతుఁడైనమంత్రి యుపాయమువలన రాజు తానునుమంత్రియు నెట్లో ప్రాణములు దక్కించుకొని పారిపోయి స్వదేశమునుజేరినతోడనే సేనలనుగూర్చి కనిగిరిమీఁదదండెత్తివచ్చి వీరరుద్రునిరాజ్యమును అతనిపుత్త్రికయైన చిన్నాదేవినిగైకొని ద్రోహియైన యాతనిఁ జంపక కుటుంబసహితముగా వింధ్యపర్వతప్రాంతములకుఁ బాఱఁదోలెను. వీరరుద్రుని శుద్ధాంతస్త్రీలు వింధ్యపర్వతము పాలయినసంగతిని మనుచరిత్రమునం దల్లసానిపెద్దన యీరీతిగావర్ణించియున్నాఁడు.

మ. ధరకెంధూళులుకృష్ణరాయలచమూ-ధాటీగతిన్వింధ్యగ।
హ్వరముల్దూఱఁగఁజూచి శౌరచటఁగా-పైయుండుటంజాలన।
చ్చెరువైయొత్తనివింత-చీఁకటులువచ్చెం-జూడరేయంచు వే।
సారిదింజూతురువీరరుద్రగజరాట్శు-ద్ధాంతముగ్ధాంగనల్॥

ఆంధ్రకవిచరిత్రకారులగు రాయబహద్దరుకందుకూరివీరేశలింగముపంతులవారీపై యంశముల నేగ్రంథమునుండి స్వీకరించిరో పెద్దనకవికృతమగు పై నుదహరింపఁబడినపద్యముపై కథకు ముడిపెట్టుటకుంగల ప్రబల హేతువులేవియుగానరాకున్నయవి. పై వృత్తాంతమునుపూర్వపక్షసిద్ధాంతమునుజేయుటకుఁ బ్రత్యేకముగా నొకప్రకరణమువినియోగింపఁబడియుండుటంజేసి యావిషయములనిటఁజర్చింపక కృష్ణరాయలపూర్వదిగ్విజయయాత్రను గుఱించిమాత్రమే యీప్రకరణమునందు వ్రాయుచున్నాఁడను. కృష్ణరాయలు ౧౫౧౫ వ సంవత్సరమునందు పూర్వదిగ్విజయయాత్ర వెడలి యున్నవాఁడు. కృష్ణరాయలవిజయములనుగూర్చి పారిజాతాపహరణ మనుచరిత్రగ్రంథములలో నుదహరింపఁబడిన పద్యములను ముందుగాఁదెల్పితరువాతఁబ్రత్యేకముగా వ్యాఖ్యానమును వివరించెదను.

చ. మునుకొనికొండవీటికడ మూఢతరుద్రుఁడుకృష్ణనందను।
స్మనసిజునిన్ జయించెనది-మానవకేసరసేంద్రుకృష్ణరా।

యశ్చ ప్రతికొండవీటికడ-నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁడగువీరభద్రుఁ గరు-ణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్॥

సీ. ఉదయాద్రి వేగన-త్యుద్ధతి సాధించె, వినుకొండ మాటమా-త్రన హరించె
గూటముల్ పదరంగఁ-గొండవీడ గలించె, బెల్లముకొండయ-చ్చెల్లఁ జెఱిచె
వేలుపుకొండ నుద్వృత్తి-భంగము సేసె, జల్లిపల్లె సమగ్ర-శక్తిఁ గూల్చె
గినుక మీఱి ననంత-గిరి క్రిందుపడఁ జేసె, గంబంబుమెట్టు-గ్రక్కన గదల్చె॥

క. బలనికాయముకాలుమ-ట్టులవడంబు
గటకమును నింకనను మను-త్కలమహీశు
డనుదినమ్మును వెఱచునె-వ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణ-రాయవిభుఁడు॥

చ. నెలకొని కృష్ణరాయధర-ణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికర-కాండశతుల్ ప్రసకంపుఁ బాములై
మలసినచోటఁ గూడినస-మగ్రయశోవసనంబు గప్పి తా
వలపఁగఁ జేసె భూసతిని-వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పరన్॥

పారిజాతాపహరణము.

సీ. తొలుదొల్త నుదయాద్రి-శిలదాఁకి తీండ్రించు, నసిలోహమున వెచ్చ-నయి జనించె
మఱికొండవీ డెక్కి-మార్కొనినలియ్యెఁ, యులకసవాపాతు-నంటి రాజె
నటసాగి జమ్మిలో-యఁబడి వేగ దహించెఁ, గోనబిట్టేర్చి గొ-ట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ-గరఁచె గౌతమి గ్రాఁచె, నవుల నాపొట్నూరు-రవులుకొనియెఁ

గీ. మాడెముల్ ప్రేల్చె నొడ్డాదిమసియొనర్చెఁ గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగిపరవ
దోఃకచిచ్చన నౌరయుద్ధురతఁ గృష్ణ। రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని॥

* * * * *

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జ-యాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్నూరికడ-నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరుణాళ్ళకుం దిగుసు-రప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము-వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్॥

మనుచరిత్రము.

ఉదయగిరిదుర్గము స్వాధీనమైన తరువాత కృష్ణరాయలు కొండవీటిపై దండెత్తివచ్చెను. అయ్యది యుత్కలదేశపురాజగు ప్రతాపరుద్రగజపతి నందనుండగు వీరభద్రగజపతి పాలనములో నుండి దక్షిణహిందూదేశమునందలి దుర్గములలో నెల్ల బలాఢ్యమైనదై సురక్షితమైన దుర్గముగానుండెను.



వీరభద్రగజపతిమాత్రమే గాక కుమారహంవీరపాత్రుని కుమారుఁడు నరహరిదేవుఁడు, శ్రీనాథరాజు రామరాజు కుమారుఁడు లక్ష్మీపతిరాజు జన్యామలకసవాపాత్రుఁడు, సుప్రపాలచంద్రమహాపాత్రుఁడు, పూసపాటిరాచిరాజు రాచూరియల్లయఖానుఁడు, ఉద్దండఖానుఁడు మొదలగువారు సేనాసమేతులై కొండవీటిసీమకు రక్షకులై యుండిరి. వీరలనెల్ల నను కృష్ణరాయలు జయించి వారలనెల్ల నుబట్టుకొని యభయహస్తమిచ్చి కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు, తంగేడు, కేతవరము మొదలగు దుర్గములను సాధించి కైవసముఁ జేసికొనెను. ఈవృత్తాంతము పైగ్రంథములలోని పద్యములవలనమాత్రమే గాక ధరణికోట శాశనమువలనను సింహాచలదేవాలయములోని శాసనమువలనను తెలియవచ్చుచున్నయది. శాలివాహనశకము ౧౪౩౭ సరియైన క్రీస్తుశకము ౧౫౧౫ వ సంవత్సరము జూను నెల ౨౩ వ తేదీని కృష్ణరాయల మంత్రియగు సాళువతిమ్మరాజుగారు (తిమ్మరుసు) కొండవీడుకోటను స్వాధీనముఁ జేసికొనెను. ఈవిజయమును గుఱించి తిమ్మరుసును శ్లాఘించు శాసనమొకటి యాకొండవీటిలోనే గానంబడుచున్నయది. తిమ్మరుసు తనసహోదరుఁడగు గోవిందరాజును దుర్గాధ్యక్షునిగా నియమించెనని న్యూనీజు (*Nuniz*) వ్రాయుచున్నాఁడుగాని నాదిండ్లగోపమంత్రిని దుర్గాధ్యక్షునిగా నియమించినట్లు మఱొకశాసనమునఁ జెప్పఁబడినది.

ఈగోపమంత్రి సాళువతిమ్మరాజుకాలమున గుత్తిదుర్గమును పాలించుచున్నట్లు మాదయగారి మల్లనకవి విరచితమగు రాజశేఖరచరిత్రమునందుఁ దెల్పఁబడినది. తత్ప్రబంధమును గృతినొందిన నాదిండ్లయప్పామాత్యున కీగోపమంత్రి తమ్ముఁడుగాఁ గనుపట్టుచున్నాఁడు. ఈయప్పామాత్యుఁడు తిమ్మరుసునకు [సాళువతిమ్మరాజు] నల్లుఁడని యిదివఱకె తెలిపియుంటినిగదా! ఈయప్పామాత్యుఁడును గోపమంత్రియు సాళువతిమ్మరాజు మేనయల్లుండ్రయినట్లు గను

పట్టుచున్నారు. అందువలననే కాఁబోలు తిమ్మరుసు తనకూతు మేనల్లుఁడగు నాదిండ్లయప్పామాత్యునకిచ్చి వివాహము చేసినాఁడు. గోపమంత్రి గుత్తిదుర్గమునకు దండనాథుఁడుగానుండినట్లే క్రిందిరాజశేఖర చరిత్రమునందలి పద్యమువలన స్పష్టమగుచున్నయది.

ఉ. ప్రాపితరాజ్యవైభవని-రాకృతపాకవిరోధియైన యా।
గోపనమంత్రి ధర్మధన-గోపనసమ్మతిగుత్తిదుర్గ।
శ్రీపరిపాలనక్రమస-మిద్ధభుజాబలశాలిరూపరే।
ఖాపరమత్స్యలాంఛనుఁడ-యాహవకార్యధురంధరుండిలన్॥

కాఁబట్టి తిమ్మరుసు తనసోదరుఁడగు గోవిందరాజునే దుర్గాధ్యక్షునిగా నియమించినట్లు నిశ్చయింపవలసియుండునో లేక గోపనమంత్రిని గుత్తిదుర్గమునుండి రప్పించి కొండవీడునకు దండనాథునిగాఁ జేసెనని నిశ్చయింపవలసియుండునో యింకను విచారింపవలసియున్నయది. ఈకాలమునఁ బురుషోత్తమగజపతికుమారుఁడగు ప్రతాపరుద్రగజపతి కటకపురిరాజధానిగా నుత్కలకళింగాంధ్రదేశములు పాలించుచుండెను. అతనికుమారుఁడు వీరభద్రగజపతి కృష్ణరాయలతో యుద్ధముచేసి యోడిపోయెనని చెప్పియుంటిమి గదా. ప్రతాపరుద్రగజపతియల్లుఁడగు పూసపాటి రాచిరాజు కేతవరదుర్గాధ్యక్షుఁడుగానున్నట్టులు కృష్ణవిజయమను గ్రంథమున నీవిధముగాఁ దెలుపఁబడినది.

సీ. నవభారతాఖ్యాన-నవ్యకావ్యమునకు, నాయకుండయ్యె నే-నరవరుండు।
కటకేశ్వరుని చేతఁ-గనికేతవరమాత్మ, పురముగా నేలె నే-భూవిభుండు।
నిలిపె భారుహమున్నె-న్నృపగండపెండేరఁ, మెపుడు డాకాల నే-నృపతిమౌళి।
యఖిలసద్గుణవతి-యక్కమాంబాదేవి, ప్రాణేశుఁడయ్యె నే-పార్థివుండు॥

క. ప్రథితగజపతిరాజవీ-రప్రతాప।రుద్రతనయాధినాయకా-రూఢతమ్మి।
రాజజనకతఁగాంచె నే-రాజతిలక।మతఁడలరుతమ్మిభూ రాచ-యప్రభుండు॥

ఈపూసపాటి రాచిరాజు కృష్ణరాయలతో యుద్ధముచేసి యోడిపోయి స్వాధీనుఁడుకాక కొంతసైన్యమునుదీసికొని కృష్ణరాయలకు దూరముగాఁ బారిపోయి వేగిదేశములోనుండు సంస్థానములనుదోచుకొనుచు రాయలకందకతిరుగుచున్నట్లుగాఁ గొన్ని గ్రంథ



ములవలనఁ దెలియుచున్నయది. అటుపిమ్మట రాయలు కొండపల్లి దుర్గమును మూఁడుమాసములు ముట్టడించి యోఢ్రదేశపు రాజుయొక్క భార్యను ఆతనినందనునిఁ బట్టుకొని ఖైదుచేసి విజయనగరమునకుఁ బంపెనని న్యూనీజు వ్రాయుచున్నాఁడు.

తదనంతరము కృష్ణరాయలు వేగిదేశముపై దండెత్తిపోయి జమ్మిలోయకోనసీమకొండాము మొదలగు ప్రదేశములను జయించి రాజమహేంద్రపురమునకుత్తరముననుండు రహితాపురము మొదలగు మన్యసంస్థానములను స్వాధీనముఁ జేసికొని విశాఖపట్టణమండలములోని బాహుబలేంద్రవంశస్థులకు రాజధానియగు పొట్నూరికడ జయస్తంభమును నాటి మాడెములు (మన్యసంస్థానములు, మాడుగలు మొదలగునవి) రూపుమాపి మత్స్యవంశస్థులదగు నుడ్డాది నాశనముఁ జేసి సింహాద్రిఁ జేరి యచటిస్వామికిఁ గొన్ని యాభరణములను భూములను దానముచేసి యటనుండి యుత్కలదేశపు రాజధానియగు కటకపురినిఁ గాల్పఁగాఁ గళింగదేశపురాజగు ప్రతాపరుద్రగజపతి తాను నగరమును విడచి పాఱిపోయి తరువాతఁ గృష్ణరాయలకుఁ దనకూతు నిచ్చి వివాహముచేసి సంధిచేసికొనెను. కృష్ణరాయలు తాను జయించిన కళింగదేశమును, వేగిదేశమును. అనఁగా కొండపల్లి మొదలుకొని కటకపురమువఱకుఁగల దేశమును తిరిగి ప్రతాపరుద్రగజపతికిచ్చివేసి విజయనగరమునకుఁ దిరిగివచ్చెను. కృష్ణరాయలు గజపతితో యుద్ధముచేసినపుడు రాయలకు సహాయులుగానున్న వారిని నాతనికి లోఁబడిన సామంతరాజులను కృష్ణరాయవిజయములోఁ గవి యీరీతిగా వర్ణించియున్నాఁడు.

సీ. కోటలుదుర్గముల్-గొనుచుదోఃపటుబల, ధాటిచేమించునా-శ్రీవటివారు।
కంటకాహితకంఠ-లుంటనోదతులీల, దంటలైతగుతోర-గంటివారు।
నిర్భరంబుగశత్రు-నికరంబులుపడగించి, ధీరులైమించుగొ-బ్బూరివారు।
చాఁదోర్బలలీల సరదారిసంఘంబుఁ, దూలించివెలయునం-ద్యాలవారు॥

గీ. వాదిగాఁగల్గురాజులు-వేదురగతి। తుళువదొరలును బోయలు-దురుసుగాఁగ
ప్రతిదినంబును ఘోరమహా-రణమొనర్పి। నిలిచిపోరాడె గజపతి-బలములప్డు॥

అనగా నీదండయాత్రలోఁ గృష్ణరాయలకుఁ దోడ్పడినవారలా ర్వీటువారు, నంద్యాలవారు, గొబ్బూరివారు, తొరగంటివారు, వెల్గోటివారు, (వెలమలు) పెమ్మసానివారు, నాయనివారు, బూదహాళివారు, రావెలవారు, తుళువదొరలు మొదలగువారునై యున్నారు. ప్రతాపరుద్రగజపతితోఁ గృష్ణరాయలకైయిన యుద్ధమును జిత్రముగాఁదన కృష్ణరాయవిజయమునఁ గుమారధూర్జటి వర్ణించియున్నాఁడుగాని యాగ్రంథమునఁ జరిత్రాంశములకన్న వర్ణనాంశములే విశేషముగాఁగానంబడుచున్నవి. కృష్ణరాయలు తమరాజ్యముమీఁద దండెత్తివచ్చుచున్నాఁడనివిని '౧ బలభద్రపాత్రుఁడు ౨ దుర్గాపాత్రుఁడు ౩ భీమాపాత్రుఁడు ౪ ముకుందపాత్రుఁడు ౫ భీకరపాత్రుఁడు ౬ బేరుపాత్రుఁడు ౭ రణరంగపాత్రుఁడు ౮ ఖడ్గపాత్రుఁడు ౯ ఆఖండలపాత్రుఁడు ౧౦ మురారిపాత్రుఁడు ౧౧ వజ్రముష్టిపాత్రుఁడు ౧౨ తురగరేవంతపాత్రుఁడు ౧౩ గజాంకుశపాత్రుఁడు ౧౪ అసహాయపాత్రుఁడు ౧౫ మృగేంద్రపాత్రుఁడు (౧౬ పేరుతెలియదు]' అనుపదియాఱుగురు పాత్రసామంతులుగూడికొని ప్రతాపరుద్రగజపతికడకుంబోయి రాయలరాకనువిన్నవించి యుద్ధమునకనుజ్ఞయిమ్మని ప్రార్థింపగా గజపతిసమ్మతించి యనుజ్ఞనిచ్చెను.

" అప్పుడు రాయలసేనలును గజపతిసేనలును దలపడి ఘోరయుద్ధముచేయుచుండెను. రాయలీసమరవిధమునుజూచి తిమ్మరుసుగఱపిన హితోపదేశమును బెడచెవినిబెట్టి యిట్టివిపత్తుతెచ్చికొంటినిగదాయని పశ్చాత్తప్తుఁడగుచు మంత్రినిఁబిలువనంపించి తానడచిన మార్గము తప్పనియొప్పుకొని కార్యసాధనమగు కర్తవ్యమాలోచింపుమని వేడికొనెనఁట! వీరలనీరీతిగాజయించుట కష్టసాధ్యముగాన గజపతికిని పాత్రసామంతులకువైరమునుగల్పించి



కాని లేక మఱియేతంత్రముచేతనేని వారలనుఁ దొరలకుదూరముగానుండునట్లుచేసిజయమును బడయవలయును గాన నట్టిపనితాఁ జేసెదననిచెప్పి రాయలనడిగి విశేషద్రవ్యమునుదీసికొని పదియాఱుగురు సామంతులపేరను దురాశనుగల్పించు జాబులను వ్రాసి యాజాబులను ధనమునుపెట్టెలలోనుంచి పరిచారకులచేతికిచ్చి యొంటరిగాఁబోయివారలకిచ్చి ప్రత్యుత్తరములు తెండని చెప్పిపంపెను. వారలుగజపతి సేనలమధ్యనుండి యీపెట్టెలను దీసికొనిపోవుచుండ గజపతివారలనుబట్టితెప్పించి యాపెట్టెలనుగైకొని యందుండునుత్తరములదీసికొని చదువుకొనఁగాఁ దనపాత్రసామంతులు తనపట్లచేయుద్రోహము వెల్లడియగుచున్నట్లుండెను. ఆయుత్తరములలో నిట్లువ్రాయఁబడియుండెను. "శ్రీకృష్ణదేవరాయలు మీరునియమించినపద్ధతుల కంగీకరించె; ఆపద్ధతులప్రకారము గజపతిరాజును నాకునొప్పగించెదరేని మీరునిర్ణయించిన ప్రకారము గ్రామములును రత్నాభరణములను ధనమునుమీయధీనముచేసెదము.' ఇట్లుండుటను గజపతిచదువుకొని తానుతప్పించుకొనుమార్గము నాలోచించుకొని యితరులకు గోచరముగాకుండునట్లుఁ గొంత దూరముననున్న మఱియొక స్థలమునకుఁబోయి యచ్చట రహస్యముగా నుండెను. తమప్రభువు యుద్ధభూమియందు గానరాకుండుటం జేసియు, నతని క్షేమముఁ దెలియకుండుటం జేసియు, వారలు యుద్ధమును ముగించి నిలచియుండిరి. ఇంతలో రాయలు వారలకు నెత్తుడు కలుగనీయక తిమ్మరుసును గజపతియొద్దకుఁ బంపెను. అతఁడు రాయల యనుమతిప్రకారము గజపతి చెంతకుఁబోయి యితని వలన బహుమానములను బడసి రాయల యోగక్షేమమును దెలిపి తనకూతు రాయలకిచ్చి వివాహము చేయవలసినదని విన్నవించెనఁట. అందులకు గజపతి సమ్మతించి రాయలతో సంధిచేసికొని కూతునిచ్చి వివాహము చేసి రాయలను బంపించివేసెను. ఈవివాహమును గుఱించి చర్చించవ

లసిన విషయములు పెక్కులున్నవి గాన నయ్యవి కృష్ణరాయల వివాహమును జెప్పు ప్రకరణమునందు వివరింపఁబడును.

ఈపై వివరించిన విధమంతయు హిందూగ్రంథములనుండియుఁ బోర్చుగీసువారలనుండియు గ్రహించినది. ఇఁక మహమ్మదీయగ్రంథములయందు వ్రాయఁబడిన విధము దెలుపవలసియున్నయది. హిందూమహమ్మదీయచరిత్రములు బహుస్థలములయందు భిన్నములయి యుండుటయేగాక కాలనిర్ణయములోఁగూడ నేకీభవింపకయున్నవి. సుల్తాను కూలీకుతుబ్షాయనువాఁడు భామినీరాజ్యావసానకాలమునందు గోలకొండరాజ్యమును స్థాపించి క్రీస్తుశకము ౧౫౧౨ వ సంవత్సరమునుండి స్వతంత్రుఁడై ప్రజాపాలనముచేయనారంభించెను. ఇతఁడు రాజ్యమునకు వచ్చినతోడనే త్రిలింగదేశములోని రాజకొండ, దేవరకొండ దుర్గములనుబట్టుకొనెను. ఆదుర్గములను బరిపాలించు వేంకటనాయకుండనువాఁడు రాజకొండకడ సుల్తానుతో ఘోరయుద్ధముచేసి యోడిపోయెను. రాజుకొండయుఁ దరువాత దేవరకొండయు సుల్తానువశమయ్యెను. సుల్తాన్ ఖూలీ కుతుబ్షా త్రిలింగదేశముపై దండెత్తి దేవరకొండ స్వాధీనము చేసికొన్నతోడనే విజయనగరాధిపతి యగు శ్రీకృష్ణదేవరాయలు బహుసేనలం గూర్చుకొని సుల్తాను దేశముపై దండెత్తి వచ్చెను. ఇయ్యది ౧౫౧౩వ సంవత్సరమున జరిగియుండనోపు. రాచూరునకుఁ దూర్పుగా నుండు పాంగలకోటకడ నుభయసైన్యములకును యుద్ధము జరిగెను. తురుష్కసైన్యములే విజయముఁ గాంచెను. తరువాత సుల్తాను ఘనపురమునుముట్టడించెను. దానింజేకొనినపిమ్మట బీదరు సుల్తాను అల్లాయుద్దీన్ ఇమ్మనుశాహి దేశపుసరిహద్దులోనున్న కోవిలకొండను ముట్టడించెను. ఈదుర్గముకూడ సుల్తానువశమయ్యెను. సుల్తాను కుతుబ్షాకును సుల్తాను ఇమ్మనుషాకునుయుద్ధముజరిగెను. కుతుబ్షా జయముగాంచెను. తరువాత గోలకొండరాజ్యమునకుఁ దూర్పు



ననుండు కంబముమెట్టను బరిపాలించు సీతాపతియనునాతఁడు బెల్లముకొండదుర్గమును ఓరుగల్లుదుర్గమునుగూడఁ బాలించుచుఁ దురుష్కులపైఁ దిరుగఁబడి యుద్ధములుచేయుచుండఁగా సుల్తాను బెల్లపుకొండను ముట్టడించెను. సీతాపతిరాజు రణరంగమునువిడచి పాఱిపోయెను. సుల్తాను గోలకొండఁబ్రవేశించెను. తదనంతరము సీతాపతి సమీపదేశములనుబాలించు ప్రభువులనుబురికొల్పి గొప్పసేననుగూర్చుకొని కంబముమెట్టపురమున విజృంభించియుండెను. ఈ సమాచారమును సుల్తానువిని కంబముమెట్టపై దాడివెడలి హిందూసేనలతోఁబోరాడఁగా సీతాపతినిలువలేక యోడిబాఱిపోయి గజపతిరాజుపుత్రుఁడై కొండపల్లిదుర్గమునుబాలించు రామచంద్రదేవుని శరణువేడెను. సుల్తానుదయాదాక్షిణ్యములను విడనాడి కంబముమెట్టపురములోని పురుషులను, స్త్రీలను, బిడ్డలనుజంపి సీతాపతిమందిరమునన్నున్న స్త్రీలనపహరించి తనయంతఃపురమునకుఁ బంపివేసెను.

ఇంతలో గజపతిరాజు సేనలు పాలించి నూరకడనున్న నది చెంతఁ దురుష్కసైన్యములను దాకి యుద్ధముచేసి యోడిపోయెను. కుతుబ్షా కొండపల్లిని గైకొని వేగిదేశముపై దండెత్తి వచ్చి హేలాపురమును (ఏలూరు) బట్టుకొని యటుపిమ్మట రాజమహేంద్రపురమును ముట్టడింపఁగా నుత్కలదేశపురాజగు గజపతి సంధిచేసికొని హేలాపురవిజయవాటికామండలములను (Ellore and Bezwada Districts) సుల్తానునకు వదలిపెట్టఁగా నాతఁడు తనరాజ్యములోఁగలుపుకొనెను. కృష్ణదేవరాయలీసమాచారమునంతయువిని గజపతిరాజు సంరక్షణార్థమై బహుసేనలం గూర్చుకొనివచ్చుచుండెను. సుల్తాను దిరిగివచ్చి కొండవీడు ముట్టడించెను గాని బెల్లముకొండ వినుకొండలలోనుండు హిందూ సైన్యములు మూలమున సుల్తాను కొండవీడు ముట్టడిని వదలి బెల్లముకొండపై వెడలి యధికనష్టమునుబొంది యెట్టకేలకు నాదుర్గమును బట్టు

కొనెను. అదిస్వాధీనమైనపిమ్మట కొండపల్లికివచ్చెను. ఇంతలోఁగృష్ణరాయల సైన్యమువచ్చి బెల్లముకొండలోని తురుష్క సైన్యములనుదాకెను, ఈవర్తమానమును సుల్తానువిని కొండపల్లి వదలి బెల్లముకొండకువచ్చెను. హిందువులసైన్యము ముట్టడిమానివేసెను. సుల్తానుకొండవీడునకుఁబోయి యచటిసైన్యముల నోడించి యాదుర్గమునుగైకొనెను. కొండవీడు తురుష్కుల యధీనమయిన వార్త రాయలువిని లక్షసైన్యమునిచ్చి తనయల్లుఁడగు రామరాయలను బంపెను. అప్పుడు సుల్తాన్ ఖాన్ కూలీకుతుబ్షా రామరాజుతో యుద్ధముచేసిఓడిపోయి కొండవీడునుహిందువులకు వదలివేసి కృష్ణానదియొడ్డున సేనలనునిలిపియుంచెను, ఈయుద్ధము క్రీస్తుశకము ౧౫౧౫ వ సంవత్సరమున జరిగినయుద్ధమైయైన యెడల గృష్ణరాయలిచట యుద్ధముచేసినది వీరభద్రగజపతి మొదలగు వారితోఁగాని సుల్తాను సైన్యములతోఁగాదనునట్లుగా న్యూనీజు (*Nuniz*) మొదలగువారువ్రాసిన వృత్తాంతములనుబట్టి తెలియుచున్నయది. విజయనగర రాజసైన్యములు కొండవీడునుబలపఱచుకొని సుల్తానుని వెంబడించిపోయితాకఁగా సుల్తానుయుద్ధముచేసి హిందూసైన్యములను వెనుకకుమరలునట్లులు చేసెను. అంతటితోఁదృప్తినొందక కుతుబ్షా మఱలఁగొండవీడునుముట్టడించెను. హిందువులు లోఁబడిరనివ్రాయఁబడెను. కుతుబ్షా తనరాజధానికి మరలివచ్చుచుండఁగాఁ గృష్ణరాయల ప్రోత్సాహముచేత బీజపుర సుల్తానగు ఇస్మాయిల్ ఏదులశాహి కోవిలకొండను ముట్టడించినట్లు గావినెను. కుతుబ్షా తనసైన్యములను నడిపించుకొనిపోయి బీజపురసుల్తానుతోననేకయుద్ధములుచేసెను.

ఇస్మాయిల్ ఏదులశాహి జ్వరబాధాపీడితుఁడయి మృతినొందగా మాలూయనువాడు రాజ్యభారమునువహించెను. బీజపురసైన్యములతోనయిన యుద్ధములలోనొకదానిలోఁ గుతుబ్షా మొగమున గాయమునుబొంది బ్రదికియున్నంతవఱకు వికృతాకా



రమునుగలిగియుండెను. ఇట్లుగా మహమ్మదీయుల గ్రంథమున వ్రాయఁబడినది. దీనినిగుఱించి యాలోచింపఁగా నీయుద్ధములొకటి రెండుసంవత్సరములలో జరిగినవిగాక కుతుబ్షా సింహాసనమెక్కినది మొదలుకొని యిస్మాయిలు మృతినొందిన క్రీస్తుశకము ౧౫౩౪వ సంవత్సరమువఱకు నడిచినవిగానున్నవి. ఈమహమ్మదీయచరిత్రాంశములు కృష్ణరాయలు కటకమువఱకుఁ గలదేశమునుజయించెననిచెప్పెడు ప్రక్రమమున కెంతమాత్రమును భంగముకలిగింపఁజాలవు. కృష్ణరాయలీభాగమునందు హిందువులతోమాత్రమేగాక తురుష్కులతోఁగూడ యుద్ధములుచేసినట్లుగాఁన్యూనీజు (*Nuniz*) వ్రాసియున్నాఁడుగాన మనముసంశయింపవలసినపనిలేదు. ఇట్లు శ్రీకృష్ణదేవరాయలు పలుదేశములనుజయించి చిరకాలమునుండి తురుష్కులకును దమకును వివాదభూమిగానుండి తురుష్కుల స్వాధీనములోనున్న రాచూరు ముదిగల్లుదుర్గములను బడయవలెనని నిశ్చయించుకొని పూర్వదిగ్విజయయాత్ర ముగించి తనసేనలనుమరలించుకొని స్వదేశమునకుఁబోయి సురక్షితముగా విజయనగరముఁ బ్రవేశించెను.

---

## పదమూడవప్రకరణము.

---

కృష్ణరాయలు దాసీపుత్త్రుఁడగుటా కాదాయని చర్చించుట— రాయలధర్మపత్నులెవరని— చిన్నాదేవివృత్తాంతము— తిరుమలదేవిచరిత్రము – వారలు గజపతిపుత్త్రికలని చెప్పెడువానిని విమర్శించి కారణనిరూపించుట— అన్నపూర్ణాదేవి చిన్నాదేవి కాదనిచెప్పుట—

అల్లసానిపెద్దనకవి విరచితమగు మనుచరిత్రమునుబట్టియు నంది తిమ్మకవిప్రణీతమగు పారిజాతాపహరణమును బట్టియు శ్రీ

కృష్ణదేవరాయల కిరువురుపట్టపుదేవులు గలరని దెలిసికొనుచున్నారము. మనుచరిత్రములో మొదటియాశ్వాసమున నీక్రిందికందపద్యములోఁ జిన్నాదేవియుఁ దిరుమలదేవియునను నిరువురుభార్యలు గలరనిచెప్పఁబడినది,

క. ఆవిభునవంతరంబధ। రావలయముఁదాల్చెఁగృష్ణ-రాయఁడుచిన్నా।
దేవియుశుభమతితిరుమల। దేవియునుందనకుఁగూర్చు-దేవేరులుగాన్॥

పారిజాతాపహరణములో నయితము గృతిముఖంబున వివరింపఁబడకపోయినను ద్వితీయాశ్వాసములో తిరుమలదేవీవల్లభ అనియును మూడవయాశ్వాసములో.

క. శ్రీవేంకటగిరివల్లభ। సేవాపరతంత్రహృదయ-చిన్నమదేవీ।
జీవితనాయకకవితా। పావీణ్యఫణీశకృష్ణ-రాయమహేశా॥

అనిపై నుదహరించిన చిన్నాదేవికూడ భార్యయైనట్లు చెప్పఁబడియె. కృష్ణరాయవిరచితమగు నాముక్తమాల్యదలో మాత్రము తిరుమలదేవియు, అన్నపూర్ణాదేవియు దేవేరులనిచెప్పంబడియెను. ఎట్లన్న:-

"క. ఆవిభునవంతరంబధ। రావలయముఁబూనితీవు-రహిమైఁదిరుమ।
ల్దేవియునున్నపూర్ణా। దేవియుఁగమలాబ్జముఖులు-దేవేరులుగాన్॥

అనిచెప్పఁబడినది. అన్నపూర్ణనామము చిన్నాదేవియొక్క నామాంతరమనుట నిర్వివాదాంశమని యాంధ్రకవిచరిత్రములను బ్రకటించినవారును కవిజీతములను బ్రకటించినవారును వ్రాసియున్నారుగాని మనముముఖ్యముగా సంశయింపవలసినయంశమేయన్ని నాయభిప్రాయమయినను పైనుదహరించిన కృష్ణరాయధర్మపత్నులని పేర్కొనఁబడిన తిరుమలదేవియొక్కయు, చిన్నాదేవియొక్కయు వృత్తాంతములను మనముదెలిసికొనవలసియున్నది. వీరలనుగుఱించి యాంధ్రకవుల చరిత్రమునందును కవిజీతములయందును,కృష్ణరాయవిజయమునందును వ్రాయఁబడినయంశములు తృప్తికరములయినవియు, విశ్వాసపాత్రములయినవియుఁ గావని యీక్రిందఁజర్చించెడు విషయములనుబట్టి వెల్లడియగుచున్నవి. శ్రీకృష్ణదేవరాయ లుత్తమక్షత్రియుఁడుగాక దాసీపుత్త్రుఁడనును ద్దేశ్యముతోఁ దదనుగుణ్యములగుకథలు కల్పింపఁబడి సత్యమునుదెలిసికొనెడు సందర్భమునఁ జరిత్రకారులకు వేసటంబుట్టించుచున్నయవి. మనదేశములో సత్యవంతములగు చరిత్రములను వ్రాయునభ్యాసములేనికారణమునఁ బుక్కిటపురాణగాథలను బురస్కరించుకొని మనముచరిత్రములను వ్రాయఁబూనినఁ బెక్కుదోషములుండకమానవు. విదేశీయుల సహవాసమువలననిపుడు మనము చరిత్రములను వ్రాయవలెనని పెద్దకోరికతోనుంటిమి. అటులయినచో దోషయుతములగుగ్రంథములను వ్రాయఁబూనుటకన్న మిన్నకుండుటయుత్తమంబని యూరకుండవచ్చునా? ఊరకుండరాదని నేనుదృఢముగాఁజెప్పెదను. మనగ్రంథములలోని దోషములను మనతరువాతివారు సంస్కరింపవచ్చును. అట్టియుద్దేశముతోనే బ్రహ్మశ్రీ గురుజాడశ్రీరామమూర్తి పంతులుగారుకవిజీవితములను రాయబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమును బ్రకటించినారు. కృష్ణరాయలు దాసీపుత్రుఁడని నిరూపించుటకై యీక్రిందివింతకథ కవిజీవితములయందీవిధముగాఁబేర్కొనఁబడియున్నది; "ఈతనితండ్రియైన తెలుఁగుదేశపు నరసింహరాయఁడు త్రిలింగదేశంబున రాజ్యంబుసేయుచుండె, ఈతండొకనాటిరాత్రిఁగాలోచిత కృత్యంబులు నివర్తింపబహిర్దేశంబునకుంజనియుండ నంతరిక్షంబునుండి యొక్కరిక్క మిక్కిలితేజంబుతో నాతనియుదకస్థాళింబడియె. దానిఁజూచి యారాజుతనచేతనాపాత్రంబుమూసి యనతిదూరంబుననున్న నిజభటుంబిలిచి యోరీ అప్పనికి (తమ్మరుసునకు) యీవార్తదెల్పుము. అనుడు నాభృత్యుండు వేగిరించిచని దానినెఱింగించిన నాతండానీరు ద్రావుమనిరాజుతోఁజెప్పనుత్తరంబిచ్చెవాఁడావార్తను రాజునకుఁదెల్పినతోడనే యాతెండుతిమ్మరుసునాజ్ఞానుసారంబుగ గార్యంబుఁడపె.అనంతరము తిమ్మరుసు రాజుకడకేతెంచి యతనినారాత్రి

స్త్రీయతో సుఖంబుగనుండుమని తెల్పె. రాజును తిమ్మరుసుమాటల యెడం గౌరవముంచి యంతిపురికిం జని పట్టపుదేవిం బిలువం బంచిన నామె కారణాంతరముచే రాలేదయ్యె. దానికెంతయు వగచుచు నామె చెలికత్తెలలో నొక్క జవరాలిం గూడి యాదినంబు సుఖంబుగనుండె. తోడనే యాయింతి గర్భంబుం దాల్చె. నవమాసంబులు నిండిన యనంతరమాయింతి యొక శుభముహూర్తంబున దేవకి కృష్ణునింగన్నట్లు తాం గృష్ణరాయనిం గనియె." అపజయమనుమాట స్వప్నములోనయిన నెఱుంగని కృష్ణరాయలపరాక్రమమున కద్భుతపడి యాతని మాతృగర్భమునందలి పిండము గట్టిదని నిరూపించుటకై యీకథ కల్పింపంబడియుండవచ్చునుగాని యిది సత్యమని యెట్లు నమ్మవచ్చును? శాలివాహనశకము ౧౪౫౯ హేవళంబి సంవత్సరమున నచ్యుతదేవరాయ లొక బ్రాహ్మణునికి నారాయణపురము నగ్రహారముగానిచ్చిన దానశాసనములో:-

శ్లో. తిప్పాజీనాగలాదేవ్యోః కౌసల్యాశ్రీసుమిత్రయోః।
జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయమహీపతీ।
అస్మాదోబాంబికాదేవ్యా మచ్యుతేంద్రోఽపి భూపతిః॥

అను శ్లోకము వ్రాయంబడియున్నది. ఇందులో నరసరాయల భార్యలును వారలకుం గల్గిన యాత్మజులును దెలుపంబడిరి. కౌసల్యవంటి తిప్పాంబయందు వీరనరసింహరాయలును, సుమిత్రవంటి నాగమాంబయందు కృష్ణదేవరాయలును, ఓబాంబికయందు అచ్యుతదేవరాయలును బుట్టిరని చెప్పంబడినది.

కవిజీవితగ్రంథకారులగు శ్రీరామమూర్తిపంతులవారచ్యుతదేవరాయలు వీరనరసింహరాయల కుమారుఁడనియును కవిచరిత్రకారులగు వీరేశలింగముపంతులవారచ్యుతదేవరాయలు కృష్ణరాయలపుత్త్రుఁడుగానుండవచ్చునని చెప్పుచు "ఈబంధుత్వమింకను విచారణీయము"నియు వ్రాసియున్నారు. అచ్యుతదేవరాయలనుగుఱించినవిషయము బాతనిచరిత్రమునందే చర్చించెదను. దశరథమహా



రాజునకు కౌసల్యాసుమిత్రలంబలె నరసరాయలకు తిప్పాంబనాగమాంబలను వారు భార్యలుగానుండిరని పైశ్లోకాభిప్రాయము. నిజముగా నాగమాంబ భోగకాంతయే యైనయెడల నట్టిపోలికనుబోల్చుట కెట్లుసమ్మతించును? ఇంతియగాక కృష్ణరాయాస్థానకవులలో నొక్కఁడగు నందితిమ్మన తనపారిజాతాపహరణగ్రంథము ప్రథమాశ్వాసమున,

"క. ఆనరసమహీమహిళా।
జానికి గులసతులు పుణ్య-చరితలు తిప్పాం।
బానాగాంబిక లిరువురు।
దానవదమనునకు రమయు-ధరణియుం బోలెన్॥

విష్ణుమూర్తికి లక్ష్మీభూదేవులంబలె నరసరాజునకు తిప్పాంబానాగాంబికలు భార్యలుగానుండిరని వ్రాసియున్నాడు. నాగాంబిక కులసతియనియుం బుణ్యచరితయనియుం జెప్పియున్నాఁడుగదా! నాగాంబిక శూద్రస్త్రీయై దీపాలు బాగుచేసెడు నాగియను దాసీయువతియే యైనయెడలం గులాంగనయనియుం బవిత్రచరిత్రముగలదనియుం దిమ్మనార్యుఁడేల యసత్యోక్తులు పలుకును? ఇంకను పెక్కు కారణములవలన గృష్ణరాయలతల్లి నాగాంబిక కులాంగనయే కాని దాసీయువతి కాదని సిద్ధాంతీకరింపవచ్చును. గ్రంథస్థములగు నిదర్శనములుండఁగా నయ్యవి విశ్వసింపక పుక్కిటిపురాణగాథలతోం బెనగులాడుటయెల్ల నరచేతిలోని వెన్నముద్దను విడిచి మోచేయి నాకుటవంటిదిగాదే! కృష్ణరాయలు దాసీపుత్త్రుఁడను చెడువాడుక వ్యాపించియుండి తలమజట్టుకొనియుండుటచేత నాతనికెవ్వరును గన్యలనీయకపోఁగా నాయారాజులను జయించి బలవంతముగా వారల కూతులను బెండ్లియాడినట్లుగాం గూడ కథలు గల్పింపంబడినవి. అట్టికథలలో నొకదాని నాంధ్రకవులచరిత్రమునుండి యెత్తివ్రాసి వెనుకటిప్రకరణమునం దుదహరించియుంటినిగదా! కళింగరాజైన వీరరుద్రగజపతికూఁతును గృష్ణరాయలకిచ్చి పెండ్లిచేయువల

సినదనితిమ్మరుసుగజపతికి వర్తమానముపంపఁగా బలవంతునితో
విరోధముపెట్టుకొనలేక గజపతితనకూతునిచ్చుటకు సమ్మతించి కప
టోపాయముచేత రాయనిఁజంపఁబూనుటయు రాయలుతప్పించు
కొనిపోయి సేనలనుగూర్చుకొనివచ్చి యాతనినిజయించి యాతని
కూతును చిన్నాదేవియనునామెను పెండ్లిచేసికొనెనని చెప్పఁబడి
యున్నదిగదా! ఇదియటుండనిండు. ఇఁకఁగవిజీవితములలో నే
దైననాధారము దొరకునాయని విచారింపఁగా నచ్చటగూడ నీవి
షయమంధకారబంధురముగానున్నయది. కవిచరిత్రకారుని య
భిప్రాయమునుబట్టి కనిగిరిరాజయిన వీరరుద్రగజపతి కూతును
చిన్నాదేవిని, ఉత్కలదేశపురాజగు ప్రతాపరుద్రగజపతి తనూ
భవ తిరుమలదేవినిఁ గృష్ణరాయలు పెండ్లియాడెనని. ఇఁకఁగవి
జీవితకారుని యభిప్రాయమన్ననో వినుకొండనుబాలించు గజప
తిపుత్త్రిక వరదరాజమ్మను బెండ్లియాడుటయు నామె రాయలను
దాసీపుత్రుఁడని తిరస్కరించిరాకుండుటయు, చెఱువులు బావులు
త్రవ్వించుచు దానధర్మములనుజేయుచుఁ గొంతకాలముండి తరు
వాత రాయలయనుగ్రహమును బొందెననియు నామెయేచిన్నా
దేవియనియు, ప్రతాపరుద్ర గజపతివిజయించి తుక్కాజీఅంబ
(తుక్కారామ్) నుబెండ్లిచేసికొనెననియు నామెయే తిరుమలదేవి
యనియు నై యున్నది. చిన్నాదేవియు, తిరుమలదేవియు రాయల
ధర్మపత్నులని నేనునునొప్పుకొందునుగాని వారలుపయి చరిత్ర
కారులిరువురువ్రాసిన గజపతులపుత్త్రికలనిమాత్రము నమ్ముటకు
నామనసొప్పకున్నయది. ఇందుకు గ్రంథనిదర్శనములు పెక్కులు
గలవు. వారిగ్రంథములనుబట్టియే వారుచెప్పెడుసంగతులు పూ
ర్వపక్షములగుచున్నవి.

ఇయ్యవి పూర్వపక్షముచేయుటకు ముందుకవిజీవితముల
లోనేమివ్రాయఁబడినదో మాచదువరులకుఁ దెలుపవలసియున్న
ది. గ్రంథవిస్తరభీతిచే నాగ్రంథములోనుదహరించినదానిని సం



గ్రహపరచి యిటవ్రాయుచున్నాఁడను "కృష్ణరాయనికి దాసీ
పుత్త్రుఁడని యపనిందవచ్చియుండుటంజేసి సత్కులీనులగు రాజు
లేకును గన్నియనిచ్చుటకు సంశయించిరఁట! తిమ్మరుసు కృష్ణరా
యలచేఁ బ్రేరేపింపఁబడి తమకుఁ గప్పముఁ గట్టుచు వినుకొండను
బాలించుగజపతికడకుఁబోయి యతనిచేసన్మానింపఁబడి యాతనిపు
త్త్రికను రాయలకిచ్చి పెండ్లిచేయవలసినదని చెప్పెనఁట! అందు
లకు గజపతి తెల్లఁబోయి తెలివితెచ్చుకొని మీయిష్టానుసారము
గాఁగార్యమునడిపెదమని తాంబూలమునిచ్చి సాగనంపెనఁట! తి
మ్మరుసుమిక్కిలియానందముతో రాయలకడకువచ్చి రాయనికాశు
భవార్తఁ దెలిపెను రాయలాచిన్నది సత్కులసంజాతయని యెఱి
గినవాఁడై నను రూపలావణ్యాదులెట్టివో చూడవలెననియు నదె
ట్లుసంభవించుననియు నడుగఁగాఁ దిమ్మరుసుమంచిదనిచెప్పి తనప
ల్లకీలోరాజుంగూడఁగూర్చుండఁబెట్టికొని రాణువతోడబయలువెడ
లి పెనుగొండఁజేరి లగ్ననిశ్చయంబునకు వచ్చుచున్నామని గజ
పతికి సమాచారముపంపెను. ఇఁట వినుకొండలో గజపతిచేసిన
పనికి బంధువులందఱుఁ గృష్ణరాయని కులహీనుఁడని నిందించు
చుండఁగా గజపతిమాత్రము కృష్ణరాయలను దిరస్కరించుటకు
శక్తిలేమియెఱిఁగినవాఁడై కానున్నదికాకమానదని వివాహప్ర
యత్నమునుజేయుచుండెను. బంధువులు రాయనినెట్టులయినఁజం
పవలెనని నిశ్చయించుకొనియుండిరి. తిమ్మరుసు తనపరివారజనంబు
లతో వినుకొండకువచ్చి కృష్ణరాయనికి తాంబూలమందిచ్చువాని
వేషంబుమార్చి తనకంచుకంబుసంచిలో నాకులుచెక్కలునునిచికొని
రాజుచుట్టినయాకులన్నియుఁ బదిమందియుఁజూచునట్లుగసందికొని
మొదటిసంచిలోని మడుపులునములుచు గజపతికోటలోనికిం జను
దెంచె. గజపతియెదురుగావచ్చి యాతనిలోనికిం దోడ్కొనిపోయి
నప్పుడు తాంబూలంబుఁదెచ్చువానికూడరమ్మనిచెప్పె. తిమ్మరుసు
సముచితసంభాషణము జరిపినతరువాత గజపతి జూచి మాతల్లియ

గు భవిష్యత్పట్టమహిషిని దర్శించు వేడుకగలదు. సాధ్యపడునా యనియడుగఁగానాతఁడు వల్లెయని యావార్త నంతఃపురమునకుఁ బంపెను. తరువాతతిమ్మరుసును నాతనిసేవకునివెంటఁబెట్టుకొని గజపతి యంతఃపురమునకుఁగొనిపోఁగాగజపతిపుత్త్రిక సర్వాభరణభూషితయై మేఘంబుచాటుననుండి తళుక్కుతళుక్కున మెఱయు మెఱుముచందంబునఁ దెరతీసుకొనివచ్చి యెదుటనిలువంబడి వీరలనిరువురను నెగదిగంజూచుచోఁ బరిచారకునిపాదంబుననున్న పచ్చలమట్టియగాన్పించె. అందువలననామె యాపరిచారకుఁడే రాయలనియూహించి గిరుక్కునవెనుకకుందిరిగి లోనికిఁజని యాపరిచారకుఁడే కృష్ణరాయలని తమవారికిందెలిపె.

అపుడాయాడువారలందఱు రాయనికోటలోనే చంపనూహించి యేమియుపాయంబని కలవలంబడుచుండగాఁ దిమ్మరుసు గ్రహించి పరిచారకునికి కనుసైగఁజేసి "ఏమిరా తమలంబున సున్నంబింతగ వేసితివేలరా" యని యుగ్రుండై వానిం దఱుముకొనుచు గృహాంగణంబులన్నియుందాటి సింహద్వారంబునుండి కోటవెలుపలకుంబఱువెత్తిరి. రాజుభార్యలుం దేవిడిబంధింపుమని యుత్తరవుచేసిరి. ఆయాజ్ఞప్రకారము రాజభటులుతలుపులుబిగియించి మార్గావరోధముంగావించిరికాని వారలిరువురింతకుమున్న కోటవెలుపలకు వచ్చియుండుటచేతఁ బ్రమాదములేకపోయెను. తిమ్మరుసు పఱుఁగిడినవార్తస్త్రీలువిని పట్టికొనిరండని ద్వారపాలకులను బఱువెత్తింపఁగా వారికినిద్వారావరోధంబే కలుగుటంజేసి యేమియుఁ జేయఁజాలకపోయిరి. గజపతి సమస్తవృత్తాంతమును గ్రహించి తనవారికి గొప్పవానితో విరోధముఁబెట్టుకొనరాదని బుద్ధిచెప్పి లగ్ననిశ్చయముసేయుఁడని తిమ్మరుసునకుఁ దెలియఁజేసెను. తిమ్మరసు తమప్రభువులయింట ముందుగాఁబెండ్లికుమారుని బాకునకుబాషికంబుఁగట్టి దానినే వివాహమునకుఁబంపెడునాచారముగలదు గావున సుముహూర్తమునాటికి బాకునుదీసికొని



మేమందఱమువచ్చెదమని తిరిగిప్రత్యుత్తరమంపెను. తిమ్మరుసు చేసిన యోచనమంచిదని గజపతియుసమ్మతించెను. కృష్ణరాయులను విజయనగరమునకుఁబంపివేసి సుముహూర్తమునాటికి బాకును దెప్పించి మహోత్సవముతో వివాహమునుజరిగించి శుభముహూర్తమాలోచించి వధువును మారాజుకడకుఁ బంపివేయుఁడని గజపతితోఁజెప్పి సపరివారంబుగఁ దాను విజయనగరమునకుఁబోయెను. గజపతియునొక శుభదినంబుసర్వసన్నాహంబులుగావించి దాసదాసీజనంబులను కనకాంబరాభరణంబులనిచ్చి ప్రయాణముచేయించెను. పెండ్లికూతునకు రాయలనుజంపి కులముద్ధరింపవలసినదని దుర్బోధనలుగావింపఁబడెను. అందునకు గజపతితనయ యొడంబడనందున దాసీజనంబులలోఁ గొందఱుదుర్బోధనలుచేసి రాయలనుజంపిరండని రాణులు మొదలగు నాడువారాజ్ఞచేసిరి. తరువాత కతిపయదినంబులకు వారలెల్లఱు సురక్షితముగా విజయనగరముఁబ్రవేశించిరి. తనపట్టపురాణివచ్చినదని యామెకుందగు భవనమునుజూపించి నగరమలంకరింపఁజేసి రాయలత్యుత్సాహముతోనుండెను. నూతనరాజదంపతులకు పునస్సంధానముహూర్తంబు దైవజ్ఞులచేనుంపించి యొకనాఁడు శుభముహూర్తమున నొకభవనంబు విచిత్రంబుగనలంకరింపఁబంచి యందావధూవరులను బ్రవేశముసేయించెను. అంతకుమున్నా పట్టమహిషి చెలికత్తెలందఱు లతాంగికికంటకంబులనంటించుతెఱంగున నావధువునకు మొలచుట్టును గత్తులనుగట్టి పైని మృదుదుకూలంబులుగప్పి పయోముఖవిషకుంభముంబోలె నలంకరించి యాయింటనొంటిగ నిల్పి తారందఱును మెల్లమెల్లగనావలకుజాఱి తలుపులుబిగియించిరి. అంతట రాయలాలలనామణికిఁగట్టియున్నగాగర దనకాలనొడిసిపట్టి సామీప్యంబునకుఁ జేరఁదీయఁగాఁ గత్తుల మొలనూలుల్కాపాతంబునుబోలె నేలపైనాయుమయరిష్టంబును దెలుపుచుంబడియె. రాయలు "అప్పా! ఈచిత్రముంజూచితివా?" యనితిమ్మ

రుసుంబలిచెనఁట! ఆతఁడచ్చట నేమూలనోదాగొనియున్న వాఁడగుటంజేసి "జాగ్రతో భయంనాస్తి" యనిప్రత్యుత్తరమిచ్చి సేనలసన్నాహంబుననుండ నియమించి కొందర దాసీజనంబులఁ బిలువనంపించి దాసీజనంబిదె వచ్చియున్నారనిరాయలకుఁ దెల్పెను. రాయలాచిన్నదానినిఁ దోడ్కొనిపోయి యామెజనకునియింటవిడిచి రమ్మనియాజ్ఞచేసెను. ఆచిన్నది తనద్రోహబుద్ధికిని రాజుదాక్షిణ్యాచిత్తంబునకును నద్భుతమందుచు అయ్యో! పుట్టినింటికిని మెట్టినింటికిని నప్రఖ్యాతిఁ దెచ్చి పతికిదూరంబనైతి! పుట్టినింటి కెవ్విధమునజనుదునని కొంతదూరమరిగియిఁక దానుపుట్టినింటికిఁ బోననియు నచట నేభగవంతుని స్మరించుచు తపస్సుచేసికొనెదనని తిరస్కరింపఁగాఁ గూడనున్న వారావర్తమానమునురాజునకుఁ దెలియఁబంపఁగా రాయలుమంత్రితో నాలోచించి యామెకచట నొకభవనమునునిర్మించి దాసీజనంబులఁగొందఱినిచ్చి యామెకుఁ గావలసినపుడెల్ల ధనముపంపుచుండవలసినదనియుత్తరవుచేసెను. ఈమె యచటవసించి యనేకధర్మకార్యములంజేయుచు కాలముగడపుచుండెను. ఈమెపేరువరదరాజమ్మ.

అచట దూరంబుననుండు నాలుగు పర్వతములలోనికిఁ గట్టలు కట్టించి దానినొక పెద్దచెఱువుగ నేర్పరించె. ఈతటాకము మిగుల విశాలముగలదియు, రమణీయమైనదియునై యెటుఁజూచిన నాలుక్రోశంబులు (౧౨ మైళ్ళు) కట్టలుగలది. ఈచెరువు సిద్ధమగుతఱి కట్టలలో రెండు కనములేర్పడెనఁట. అయ్యవి యెంత ధనము వ్రయపఱచినను కార్యకారి కాకపోయెనఁట? అందులకామెచింతించుచుండ నొక గొల్లదివచ్చి జలదేవతకు నరబలి యిచ్చినఁగాని యాకనములు పూడవనియు, నాపనిచేయుటకు నాయిరువురు పుత్త్రులు చాలియుందురనియు, నీవు సంశయింపవలసిన పనిలేదనియుఁ దనకొడుకుల నొప్పించి యామెవద్దకుఁ దీసికొని రాఁగా వరదరాజమ్మ తనకష్టము లేకపోయినను వారల ప్రోద్బలము



వలననే సమ్మతించి వారలకు విశేషధనమునీయఁబోఁగా ధనముమాకక్కఱలేదనియు, మాపేరట శాశ్వతముగా నుండునటుల రెండు గ్రామములను గట్టింపవలసినదని వేడుకొనఁగా నామె సమ్మతించి వారల నాకనములలోఁ బెట్టించి పైన మన్నువేయించి కప్పించెను. అన్నపేరు పెదకంబడు, తమ్మునిపేరు చినకంబడునగుటవలనఁ బెదకంబమనియు, చినకంబమనియు రెండు పల్లెలను గట్టించెనఁట! ఇప్పుడా రెండునుగలిపి కంబమని వాడెదరఁట! వరదరాజమ్మకు తుక్కాజీయను నామాంతరము గలదఁట? ఆమె కొన్నిశ్లోకములను రాయలకు దయగలుగునట్లు రచియించెనని ప్రతీతిగలదు.

తుక్కాపంచకము.

'తుక్కానామ గజపతిపుత్రీ కృష్ణదేవరాయపత్నీ' యనియున్నది.

శ్లోకములు.

చరస్వనాం తేనవమంజరీషునషట్పదోగంధఫలీమజిఘ్రత్।
సాకిన్నరమ్యానచకిన్నరంతాబలీయసీకేవలమీశ్వరాజ్ఞా॥ ౧॥
మాకింశుకప్రకటయాత్మనిమేషమాత్రం।
మన్మస్తకేవిహరతీతిమధువ్రతోయం।
కింమాలతీవిరహవేదనయాత్వదీయం।
దృష్ట్వా।పసూనమచిరాదవలభ్రమేణ॥ ౨॥
భ్రమరభ్రమతాదిగంతరాళే।
క్వచిదాస్వాదితమీక్షితంశ్రుతంవా।
వదసత్యమపాస్యపక్షపాతం।
యదిజాతీకుసుమానుకారిపుష్పం॥ ౩॥
కుసుమానిలిఖంతునామచిత్రే।
కతిచిత్కారువిశేషరూఢశిక్షాః।
సురభిత్వమమూనికింలభంతే।
కిముచైతేషురసంపిబంతిభృంగాః॥ ౪॥
కింమాలతీమ్లాయసిమాంవిహాయ।
చుచుంబతుంబీకుసుమంషడంఘ్రిః॥
లోకేచతుర్భిశ్చరణైఃపశుస్స్యా।
త్షడ్భిరత్యద్భుతపశుర్నకింస్యాత్॥ ౫॥

ఈపైగాథయంతయు నేనుకవిజీవితములలోనుండి దీసికొని సంగ్రహపఱచి వ్రాసినదిగావునఁ గొన్నివాక్యములు సయితము గ్రహింపఁబడినవని దెలుపుచున్నాఁడను. ఇందు కుపబలముగా కేలరుదొరగారు తాము వ్రాసిన యానాలిసెస్సను (Analyses) గ్రంథములో నీక్రిందియర్థమిచ్చువాక్యములను వ్రాసియున్నాఁడు.

"గజపతిరాజుపుత్త్రిక రుచిదేవియనునామె కృష్ణదేవరాయలు దాసీపుత్త్రుఁడుగాన సత్కులీనయగుదాను విజయనగరము రాననియు, కంబమువద్ద కాలముగడుపుదునని చెప్పఁగా రాయలందున కంగీకరింపఁగా నామెతండ్రి పంపినధనముతో కంబముకడనొక పెద్దచెఱువు నేర్పరించి విశేష దానధర్మములను జేసెను. ఇప్పుడీ కథలను బూర్వపక్షము చేయుటకుముందు కవిజీవితములయందుదహరింపఁబడిన కృష్ణరాయల ద్వితీయవివాహవృత్తాంతమును దెలుపు వాక్యములనుగూడ నుదహరింపవలసియుండును.

"ఉత్కలదేశమునకు రాయలు దండయాత్రార్థియైపోయి ప్రతాపరుద్రగజపతితో యుద్ధముచేసి యాతనినోడించి తఱుమఁగా నాతఁడు కృష్ణరాయల కోరికప్రకారము తనకూఁతునిచ్చి పెండ్లి చేసి సంధిచేసికొనెనఁట! ఆభూపతిపుత్త్రిక కులహీనునికిఁ బెండ్లి చేసెనుగదాయని చింతించుచు రాయలను జంపి తాను జావనిశ్చయించుకొనెను. "ఆడుదానినోట నూగింజ దాఁగద" ను నట్లుగా నయ్యది యానోటనుండి యానోటఁబడి తిమ్మరుసునకుఁ దెలియవచ్చెను. తరువాత శుభముహూర్తంబున శ్రీపుష్పయోగంబునకుఁ బంపనపుడు కృష్ణరాయనికి మాఱుగనొకవిగ్రహంబును సిద్ధము చేయించి దానిలోఁ దేనెపోయించి హంసతూలికాతల్పంబునఁ దాసినుంచి పైనుత్తరీయంబుగప్పి రాయలుబడలియున్నాఁడుగావునఁ గొంత వఱకులేపవలదని యచటిస్త్రీజనంబులకుఁ జెప్పి, రాయల నెవ్వరికిఁ గానరాకుండ నొకచోటనుండనియమించి తానువేఱొకచోటనక్కియుండెను. తరువాతస్త్రీజనంబులు జరుగవలసినతంతెఱుంగుమరుగానఁ బెండ్లికూఁతునచటనిలిపి తలుపుమూసి యావలకుఁ బోయిరి. తిమ్మరుసు సంకుచేసికొని యెవరికిఁగానరాకుండ రాయలమంచము క్రిందనొదిగియుండెనఁట! చెలికత్తెలందరు నావలకుఁ బోయినతోడనే తానుదెచ్చినబాకును దీసియాబాకుతో రాయల నొకపోటు పొడిచెనఁట! ఆపోటుతో నందున్నమధుద్రవంబు పైకిఁజిమ్మియా యింతిముఖంబుపైని నోటనుబడియెను. దానిరుచివెంటనేచూచి "ఆహా! ఈరాజురక్తం బింతరుచియైయున్నయది! రాజెట్టివాఁడో గదా" యని చింతించుచుండఁ దిమ్మరుసుమెల్లన వెలికివచ్చి "తల్లీ! ఆరాజునలయునేని నీకాతనిం దెచ్చి యొప్పింతు. నీవుర్వృత్తిమానుదువని నాకువరమిమ్ము" అనిప్రార్థింప నామెతన ద్రోహమును క్షమింపవేఁడితినని రాయలతోఁ జెప్పి తెప్పింపుమని బాసలనేకంబులుచేయఁగా నతఁడురాయలకావార్తఁ దెలిపి యాతనిరప్పించి యావధూవరులఁగలిపి యొకరియెడనొకరికిఁ గల్మషంబుండకుండఁ బ్రమాణంబులుచేయించి వారలదీవించి యింటికిఁజనియెనఁట! ఆచిన్నదానిపేరేతిరుమలదేవియఁట! మొదటిభార్యకుఁ జిన్నాదేవియను నామాంతరముగలదఁట!"

పై నుదహరించిన గాథలవలనఁ గృష్ణరాయఁడు దాసీపుత్త్రుఁడని చిన్నాదేవియు, తిరుమలదేవియుఁగూడ రాయని నిరసించి యాతనిఁ గడతేర్చవలెనని ప్రయత్నించియు సాగక యెట్టకేలకు నాతని భర్తనుగా నంగీకరించిరనియు, వారలిరువురును గజపతుల పుత్త్రికలనియు స్పష్టమగుచున్నది. కృష్ణరాయలు దాసీపుత్త్రుఁడయినను గాకపోయినను నాతఁడు పెండ్లియాడిన చిన్నాదేవియుఁ దిరుమలదేవియు గజపతిరాజుల పుత్త్రికలు కారని నావాదమయియున్నది. మఱియుఁ జిన్నాదేవియు, నన్నపూర్ణాదేవియు వేరనియు సంశయము కలుగుచున్నది. ఈవిషయములను గుఱించి విదేశీయులేమయిన వ్రాసియున్నారాయని పరికించి శోధింపఁగా నచ్యుతదేవరాయల కాలమున నాతని యాస్థానమునకు

వచ్చిన న్యూనీజు (*Nuniz*) అను పోర్చుగల్ దేశీయుఁడు తనభాష
లో వ్రాసినదానిని స్యూయల్ దొరగారు భాషాంతరీకరించి తమ
గ్రంథమున వ్రాసియున్న విషయములు గనుపించినవి. అయ్యవి
సంగ్రహముగా నీక్రింద వివరింపఁబడుచున్నవి కాన వానిని సమన్వ
యింపవలసిన భారము మనయందున్నయది. పతివ్రతాశిరోమణు
లగు తిరుమలదేవియు, చిన్నాదేవియు పతిని జంపుటకుఁ బ్రయ
త్నించిన ధూర్తురాండ్రని యింతవఱకు నిష్కారణముగ నప్రతిష్ఠ
పాలయిరిగదా? నేటికిని వారిని నంటుకొనియున్న యపనిందా
పిశాచము తొలఁగునుగాక! కృష్ణదేవరాయలు బాల్యావస్థలో
నుండి విజయనగరమున వర్ధిల్లుచుండఁగా నొక వేశ్యకాంతాపుత్త్రి
కతో మైత్రిగలుగుట సంభవించినది. వారిస్నేహ మతిశయించి
యుండెనఁట! రాయలును నావారకాంతాతనూభవయు నన్యో
న్యానురాగములుగలిగి వర్ధిల్లుచుండఁగా రాయలొకనాఁ డామెను
జూచి చిఱునగవు నగుచు నిచ్చకమునకై "చెలియా! నేను రా
జ్యాధిపత్యము వహించినపుడు నిన్ను తప్పక పెండ్లిచేసికొనెద"
నని పలికెనఁట! తరువాత రాయలు పట్టాభిషిక్తుఁడయిన తరు
వాత వారలకుండు స్నేహమున్ను మఱువక రాత్రులయందు రహ
స్యముగా నెరికిఁ దెలియకుండ నొంటరిగా నావారాంగన గృహ
మునకుఁ బోవుచుండెనఁట! ఇదెట్లో మంత్రియగు తిమ్మరుసునకుఁ
దెలియవచ్చినది. ఒకనాఁడు తిమ్మరుసు రాయలనుబట్టుకొని మంద
లించవలెనని కాచియుండి రాయలు వేశ్యాగృహము లోపలికిఁ
బోవు సమయమునవచ్చి రాయలచేయిఁబట్టుకొని రాజాధిరాజవగు
నీవిట్టిపనిచేయుట తగవుకాదని మందలించి మందిరమునకుఁగొనివ
చ్చెనఁట! రాయలుతనకును నామెకునుగలిగిన మైత్రినిగుఱించిన వి
శేషములనుజెప్పి తనకేరీతినైన నామెనుబెండ్లిచేసినఁగాని మనస్సు
కుదురుపడదని నొక్కిచెప్పఁగాఁ దిమ్మరుసు చక్కగాయోచించియి
తఁడెటులయినను దనకోర్కెనెఱవేర్చుకొనక మానఁడనియూహిం



చి "ఓరాజకంఠీరవా? మనలను లోకము నిందింపకుండు మార్గ
మునువెదకి మనయభిలాషమును దీర్చుకొనవలెనేగాని తొందర
పడి కానిపనులుచేయరాదు. లోకనిందరాకుండునటుల నీకామె
ను వివాహముచేయించెద" నని చెప్పి నరపతివంశమున జనించిన
సౌందర్యవంతురాలగు నొకచిన్నదానిని ముందుగాఁ బెండ్లిచేయ
నూహించెను. కొన్నిదినములు జరిగినతరువాత నాప్రకారము రా
జవంశములో జనించినయొక్క చిన్నదానిని గృష్ణరాయలకు వి
వాహముచేయించెను. వివాహమహోత్సవానంతరము గాంధ
ర్వవిధిని బెండ్లియాడిన వేశ్యాపుత్త్రికను రప్పించి యాయినుపుర
కునొక భవనముగట్టించి యిప్పించెను. వేశ్యకాంతాపుత్త్రిక పే
రుచిన్నాదేవి. రాయలభార్యలలో నీమెయెడనే యత్యంతాను రా
గముగలిగియుండెనఁట! ఆమెయెడంగల గౌరవమును సూచించు
టకును నాగలాపురమను పేరిట నొక సొగసయిన పేటనుగట్టించెన
ని యీపైవృత్తాంతమును న్యూనీజు వ్రాసియున్నాఁడు. ఇతఁడు
కృష్ణదేవరాయల కాలములోను నతనితరువాత రాజ్యభార
మును వహించిన యచ్యుతదేవరాయల కాలములోను నున్నవా
డగుటచేత నిదియసత్యమని నుడువరాదు. ఇతఁడాకాలమునఁ బో
ర్చుగీసుభాషలో వ్రాసియున్నాఁడు. ఇయ్యది కొద్దికాలముక్రింద
టనే స్యూయల్ దొరగారిచే భాషాంతరీకరింపఁబడినది. ఉచ్చార
ణ తెలియని విదేశీయుఁడగుటవలనఁ జిన్నాదేవియనుటకు మాఱు
గాఁ జిన్నాదేవిడియనికూడ వ్రాసినాఁడు. ఇదిసత్యముకాని యె
డల సమకాలమునందున్న విదేశీయుఁడొకఁడు చిన్నాదేవియని పే
రెత్తుటకుఁ గారణమగుపించదు. నరపతివంశములోఁబుట్టి కృష్ణరా
యలకుఁ బెండ్లిచేయఁబడిన యామెతిరుమలదేవియని నేనిప్పుడు చె
ప్పగలను. ఎందువల్లననఁగాఁ గృష్ణరాయలు పూర్వదిగ్విజయయా
త్రకు బయలువెడలినప్పుడు రాయలధర్మపత్నులు చిన్నాదేవియు
ను తిరుమలదేవియును గూడనున్నట్టు పెక్కుశాసనములవలన గ

నుపించుచున్నది. ఉదయగిరికొండవీడు బెల్లముకొండ మొదలగు దుర్గములనుజయించిన తరువాతఁ గృష్ణవేణీనదీతీరమున నున్న ధరణికోటకు విజయంచేసి యమరేశ్వరదేవునికి దానము చేసి వ్రాయిించిన శాసనమీ క్రింద నుదహరించుచున్నాను.

,, స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరు రాయరగండ, అరిరాయవిభాడ, బాషిగెతప్పువరాయరగండ' అష్ట దిక్కురాయ మనోభయంకర, పూర్వదక్షిణపశ్చిమ సముద్రాధీశ్వర, యవనరాజ్యస్థాపనాచార్య, గజపతివిభాడ, శ్రీవీరప్రతాప, శ్రీకృష్ణదేవమహారాయని, విజయనగరాననుండి పూర్వదిగ్విజయ యాత్రకు వేంచేసి, ఉదయగిరిదుర్గముసాధించి తిరుమల ప్రేయతరాయ మహాపాత్రునిపట్టుకొని, అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము, మొదలైనగిరిదుర్గస్థలదుర్గాలుఅన్నిన్ని ఏకధాటింగైకొని కొండవీటిదుర్గము లగ్గలుపుచ్చుకొని, ప్రతాపరుద్రగజపతికొమారుఁడు వీరభద్రరాయనిన్ని, కుమారహం వీరమహాపాత్రునికొడుకు వీరమహాపాత్రుఁడు, రాచూరి మల్లఖానుఁడు, పుంసపాటిరాచిరాజు, శ్రీనాధరాజు లక్ష్మీపతిరాజు, జన్యాలకస్వాపాత్రుఁడు, పశ్చిమబాలచంద్ర మహాపాత్రుడు మొదలగాను పాత్రసామంతులను' మన్నెవారిని జీవగ్రాహంగాను పట్టుకొనేవారికి అభయదానమిచ్చి, ధరణికోటకు అమరేశ్వరులకై వేంచేసి, స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౩౭ అగునేటి యువసంవత్సర, ఆషాఢ, బ ౧౨ భానువారమునకు కృష్ణవేణీనదీతీరమందు అమరేశ్వర దేవులసన్నిధిని తులాపురుషమహాదానము సేయనవధరించి తమదేవులు, చిన్నాదేవమ్మచేతను రత్నధేనుమహాదానమున్ను, తిరుమలదేవమ్మగారిచేతను సప్తసాగరమహాదానమున్ను, చేయించనవధరించి తమతండ్రి నరసారాయనింగారికిని తమతల్లి నాగాదేవమ్మకును పుణ్యముగాను అమరేశ్వరదేవుని నైవేద్యమహాపూజలకు ధారాపూర్వకముగా



ను సమర్పించిన పెద్దమద్దూరి గ్రామమొకటి చతుర్వేద విద్యాపారగులైన బ్రాహ్మణోత్తములకు, నూట యెనమండ్రకు గ్రామములు ౪. * * * * * * * * * * *

ఈ శాసనమునుబట్టి కృష్ణదేవరాయలతోఁగూడ చిన్నాదేవియుఁ దిరుమలదేవియు వెంబడించి వచ్చినట్లు స్పష్టమగుచున్నయది. ఇంతియగాక "శుభమస్తు శ్రీమన్ మహారాజాధిరాజ పరమేశ్వర మూరురాయరగండ, ఆదిరాయవిజయభాషాగీత ప్రవరాయరగండ యవనరాజ్యసంస్థాపనాచార్య శ్రీవీరప్రతాప కృష్ణదేమహారాజులు విజయనగరాన సింహాసనస్థులై పూర్వదిగ్విజయ యాత్రకువిచ్చేసి, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలైనదుర్గాలుసాధించి సింహాద్రికివిచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౮ అగునేటి ధాతసంవత్సర చైత్ర బ ౧౨ స్థిరవారాన సింహాద్రినాధుదర్శించి తమతల్లి నాగాదేవమ్మగారికిన్ని తమతండ్రి నరసరాయునిగారికిన్ని పుణ్యముగాను దేవునికిసమర్పించిన కంఠమాల ౧కి ముత్యాలు ౯౯ ౧ వజ్రమాణిక్యాలకడియాలజోడు ౧ టి శంఖచక్రాలపతకం ౧న్ని పయిడిపల్లెం ౧న్ని తూకాలు గ ౪౪౨౯౨ కాని మాడలు గ ౨౦౦౦ తమదేవిచిన్నాదేవమ్మగారిచేతను సమర్పించిన పతకం ౧కి గ ౫౦౦ తిరుమలదేవమ్మగారిచేతను సమర్పించినపతకం ౧కి గ ౫౦౦ యింతమట్టుకు సమర్పించిన ధర్మశాసనము." అను సింహాచలశాసనమునుబట్టియుఁ బూర్వదిగ్విజయ యాత్రకుఁబూర్వమే కృష్ణరాయలకుఁబెండ్లిచేయఁబడిన చిన్నాదేవియు, తిరుమలదేవియునను నిరువురుభార్యలున్నట్టును వారాతఁడుదిగ్విజయ యాత్రకు బయలుదేరివచ్చినప్పుడు కూడనున్నారనియు స్పష్టమగుచుండఁగా వీరలుగజపతిరాజులపుత్త్రికలనియెట్లుచెప్పుదురో తెలియకున్నయది. ఈశాసనములువ్రాయునప్పటికిరాయలుకటకపురాధీశ్వరునిజయించి యాతనికూతుంబరిణయంబుకాలేదనుట నిర్వివా

దాంశమయియుండఁగా దిరుమలదేవి గజపతికొమార్తెయని వీరేశలింగము పంతులుగారును శ్రీరామమూర్తి పంతులుగారును నెట్లుసిద్ధాంతీకరింపఁ గలిగిరో నే నూహింపఁజాలకున్నాను. గజపతి తనకూతుం గృష్ణరాయలకిచ్చి వివాహమేచేయలేదాయని యడుగుదురేమో? గజపతి తనకూతునిచ్చి వివాహము చేయుట సత్యమేకాని యామెపేరు తిరుమలదేవి కాదు. మఱియొకతెయైయుండవలెను. కృష్ణరాయలు నలుగురిని బెండ్లిచేసికొనెననియు నందఱికన్నఁ జిన్నాదేవియెడ నత్యంతప్రేమగలిగి యుండుననియు న్యూనీజు వ్రాయుచున్నాఁడు. అటులయినచో నిదివఱకుఁ బైచరిత్రకారులవలన నుదహరింపఁబడిన గాథలన్నియు నసత్యములయినవా కొంచెమయిన సత్యములేకుండునాయని యోజింపవలసియున్నది. పూర్వదిగ్విజయ యాత్రకుబయలు వెడలిదేశములను జయించుచుఁ గృష్ణరాయలు సింహాచలమునకు వచ్చినతోడనే ప్రతాపరుద్ర గజపతి పాఱిపోయెననియు రాయలుకటకమునకీవలనుండు దేశమునుజయించి సింహాచలమునొద్ద నొక శాసనము వ్రాయించెననియు నందు "ఈయక్షరములు నశించువఱకును నుత్కలదేశపురాజు విజయనగరరాజుతో యుద్ధముచేయుటకు నొడంబడఁడుగాఁబోలు; ఈయక్షరములను నోఢ్రదేశపురాజు చెఱిపినయెడల నాతనిభార్య విజయనగర రాజుగుఱ్ఱములకు నాడములనుగొట్టు కమ్మరులవశముఁ జేయఁబడు" నని వ్రాయఁబడియుండెననియు నటుతరువాతఁ గృష్ణరాయలుతిరిగి విజయనగరమువచ్చెననియు, కొంతకాలమునకు రాయలు గజపతిపుత్త్రునిఁ బిలువనంపించి సాముగరిడీలయందు గడితేఱినవాఁడవని వింటిఁగాన నీవొకసారి కత్తియుఁగటారియుఁ దీసికొని విద్యాప్రావీణ్యమునుజూపించి కుస్తీపట్టవలసినదని కోరఁగా నాతఁడు మఱుదినముచేయుదునని చెప్పఁగా రాయలుసమ్మతించి మఱునాఁడు మల్లురఁబిలువనంపించి యొకప్రసిద్ధుఁడైనజట్టీతో గుస్తీపట్టుమనెననియు, అందులకు గజపతిపుత్త్రుఁడు కోపించి "ఉత్తమ



రాజపుత్త్రుఁడుగాక సామాన్యుఁడగు మనుష్యునితోఁ గుస్తీపట్టకనిషేధింపవలసినదిగా దేవుఁడుత్తరవుచేసినాఁడు" అని చెప్పి పొడుచుకొని మృతినొందెననియు, ఈవర్తమానము గజపతివిని తనకొమారుఁడు మృతినొందినతరువాతఁ దనభార్యను బందీలోనుంచుటకేమి ప్రమేయముగలదని రాయలనడిగెననియు, అందుపై తిమ్మరుసు మీకూఁతురాయలకిచ్చి పెండ్లిచేసినయెడల మీభార్యను మీవద్దకుఁ బంపించుటయేగాక మీవద్దనైకొన్న దేశమునుతిరిగి మీకిచ్చెదమని వర్తమానము పంపెననియు, అతఁడందులకు సమ్మతించి కూఁతునిచ్చి పంపెననియు, న్యూనీజు వ్రాసియున్నాఁడు. ఏది యెట్లున్నను గృష్ణరాయలకు గజపతి తనకూఁతునిచ్చి వివాహము చేసెననుటసత్యము. ఈపైవృత్తాంతముల నన్నిఁటిని సావకాశముగ విమర్శించిచూడఁగా నాకీవిధమున దోఁచుచున్నయది. తిరుమలదేవియును చిన్నాదేవియు రాయలు దండయాత్రవెడలునపుడు కూడనుండియున్నారనియు రాయలుపూర్వదిగ్విజయయాత్రముగించినతరువాత గజపతిరాజుకూఁతురు దుక్కారామను చిన్నది రాయలకుఁబెండ్లిచేయఁబడెననియు నామెయేమికారణముననో కొంతకాలము రాయలయాగ్రహమునకుఁ బాత్రురాలై విజయనగరమునకురాక దానధర్మాదికృత్యములుచేయుచు నెట్టకేలకు దనస్థితియుత్తమమయినదిగాఁ దలంపక రాయలయనుగ్రహమును సంపాదించుకొని యాతనిచేఁ బాణిగ్రహణమును జేయించుకొనెననియు నామెచేసిన దానధర్మములనుబట్టియు బ్రాహ్మణసమారాధనలనుబట్టియు నామెకు "అన్నపూర్ణదేవి" యనిరాయలు నామకరణముచేసెననియు నూహించుచున్నాను.

ఈదండయాత్రలో పెద్దనాదికవులు రాయలనువెంబడించియుందురు, మనుచరిత్రపారిజాతాపహరణగ్రంథములు రచించునప్పటికి గజపతికొమార్తె రాయలయింటికిరాలేదనియు నాకారణముననే వారిగ్రంథములయందు నామెపేరుదహరింపక తిరుమలదే

వియొక్కయు, చిన్నాదేవియొక్కయు, పేరులనుమాత్రమే యుదహరించియున్నారు. ఈగ్రంథములు రెండును క్రీస్తుశకము ౧౫౧౯ మొదలుకొని ౧౫౩౦ దవసంవత్సరము లోపలరచియింపఁబడినవై యున్నవి. ౧౫౩౦ దవసంవత్సరమునకుఁ దరువాత గృష్ణరాయలచే రచింపఁబడిన యాముక్తమాల్యదలోఁ దిరుమలదేవియు నన్నపూర్ణాదేవియు నుదహరింపఁబడియున్నారు. మనుచరిత్రములో నుదహరించినపద్యమునే కొంచెముమార్పుచేసి యాముక్తమాల్యదలో నుదహరించియున్నాఁడు. ఆమార్పయినను చిన్నాదేవి యను పేరుతీసివేసి అన్నపూర్ణాదేవి పేరుపెట్టుటకొఱకుమాత్రమే చేయఁబడినది. ఆపద్యములు రెండును ఈప్రకరణము మొదటను దహరింపఁబడియున్నవి. చర్వితచర్వణమని యయ్యవియిట మఱలనుదహరింపలేదుగానఁ జదువరులు వానిని మఱొకసారి గమనింపవలెను. రాయలిట్టిమార్పుచేయుటకు కారణమేమియుండునో దెలిసికొనవలసియున్నది. మనుచరిత్రములోని పద్యమని తెలియకుండుటకై రాయలీపనిచేసెనాయని యోజింపఁగా నదియెంతమాత్రముసరిపడదు. ఆముక్తమాల్యద గృష్ణరాయలు రచించునప్పటికిఁ జిన్నాదేవిమరణమునొందియైన నుండవలెను. లేదా చిన్నాదేవినిఁ గృత్రిమముగా వివాహమయితినిగాన నామె పట్టపుదేవియనివ్రాసిన లోకులుపరిహసించి నిందింతురేమోయను భయముచేతనైనను నామెపేరుదాహరించుట మానియుత్తమకులీనయగు నన్నపూర్ణాదేవి పేరుదహరించియుండవలెను ఈరెండుకారణములకన్న చిన్నాదేవిపేరుతీసివేసియన్నపూర్ణా దేవిపేరుదహరించుటకు గారణమగుపించదు. చిన్నాదేవికి నన్నపూర్ణాదేవి యనునది నామాంతరమేయైనయెడలఁ జెఱుపద్యములోఁ జిరకాలమునుండి లోకులచేవాడుకొనఁబడుచు వాడిగానున్న చిన్నాదేవియనుపేరుమార్చి తనగ్రంథములో రాయలుచేర్చుకొనుటకుఁ గారణమంతకుముందేగానుపింపదు. మయిసూరుమండలమునకు ప్రభువుగానుండి రా



చూరు యుద్ధములోఁ కృష్ణరాయలకు సేనానిగానున్న కుమారవీరయ్య యనునాతఁడు రాయలకు మామగారని న్యూనీజువ్రాసియుండుటచే నన్నపూర్ణాదేవి యాతనిపుత్త్రికయేమోయని సంశయము కలుగుచున్నయది. న్యూనీజుమాత్రమేగాక కృష్ణరాయలకాలముననుండి యాతనిదర్బారునకువచ్చిన పేయస్స (*Paes*) నునాతఁడుగూడ నీయంశములనే ధృవపఱచుచున్నాఁడు. కృష్ణరాయలకు పండ్రెండుగురు భార్యలుగలరనియు, వారిలో మూవురుమాత్రమే పట్టపుదేవులనియు, నీమూవురలకు జనియించినసుతులే రాజ్యభారమునువహింపనర్హులనియు, వ్రాయుచున్నాఁడు. ఈమూవురుభార్యలలో నొకతె యుత్కలదేశపురాజగు గజపతికొమార్తెయనియు, మఱొకతె శ్రీరంగపట్టణమునుబాలించు రాజుకొమార్తెయనియు, వేఱొకతె వేశ్యాంగనాపుత్త్రికయనియు, న్యూనీజుచెప్పినట్లుగానె వ్రాసియున్నాఁడు. కావున నాయంశములలో నసత్యములేదు. చిన్నాదేవి గజపతిపుత్త్రికకాదనియు వేశ్యాంగనాపుత్త్రికయనియు, ఆమెయెడనాతనికత్యంతానురాగముగలదనియు తిరుమలదేవి నరపతివంశములో జనించినదైనను శ్రీరంగపట్టణమునుబాలించు కుమారవీరశ్యామరాజుల పుత్త్రికయైనయుండవలెననియు, అన్నపూర్ణాదేవి యుత్కలదేశపురాజగు ప్రతాపరుద్రగజపతి కొమార్తెగావలెననియు, మనమునిశ్చయింపవచ్చును. గజపతిపుత్త్రిని రాయలుపట్టుకొని విజయనగరమునకుఁ దీసికొనిపోవుటయు, నాతఁడచట మరణమునొందుటయు సత్యమని పేయసు వ్రాసినదానినిబట్టికూడ స్థిరపడుచున్నది

## పదునాలుగవ ప్రకరణము.

కృష్ణరాయలు పూర్వదిగ్విజయయాత్ర ముగించుట — రాచూరుదుర్గమును ముట్టడింపవలెనని యోజించుట — సైద్ మెరాకారు రాయలవద్ద ధనమును

గైకొని బీజపురసుల్తానుకడకుఁ బాఱిపోవుట— ఆతని విడిచి పుచ్చుమని రాయలు వర్తమానము పంపుట— సుల్తాను తిరస్కరించుట— రాయలు యుద్ధోన్ముఖుఁడగుట— తమతమ సేనలతో సేనాధిపతులు వచ్చి రాయలను సందర్శించుట— రాయలు దండయాత్ర వెడలుట— రాచూరుకోట ముట్టడించుట— ఏడిల్‌షా యీసమాచారమునువిని యుద్ధముచేయవచ్చుట— సుల్తాను మంత్రులతో నాలోచించుట— రాయలతో యుద్ధము చేయుటయే ముఖ్యమని మంత్రులు బోధించుట— సుల్తాను కృష్ణదాటివచ్చుట— రాయలు ముట్టడివదలి సైన్యము మరలించుకొని సుల్తానునెదుర్కొనుట— తురుష్కులకును హిందువులకును యుద్ధముజరుగుట— తురుష్కులు పాఱిపోవుట— ఏడిల్‌ఖానుఁడు పాఱిపోవుట— సలాబత్ఖానుఁడు పట్టువడుట— రాయలు శత్రువుల స్కంధావారమునఁ బ్రవేశించి సుల్తాను సర్వస్వమును స్వాధీనముఁజేసికొనుట— రాయలు స్త్రీలను విడిచిపుచ్చుట—

కృష్ణరాయలు క్రీస్తుశకము ౧౫౧౬ వ సంవత్సరముతోఁ బూర్వదిగ్విజయయాత్ర ముగించి క్రీస్తుశకము ౧౫౨౦ దవ సంవత్సరమువఱకు విద్యావ్యాసంగమున నుండి యున్నట్లుగాఁ గనుపించుచున్నయది ఇతఁడు నరపతులగు త్రిలింగరాజులను, అశ్వపతులగు తురుష్కరాజులను, గజపతులగు నొడ్డిరాజులను జయించుట వలననీతనికి మూరురాయర గండఁడని బిరుదుపేరువచ్చినది. ఇటువంటిబిరుదులీతని కనేకములుగలవు. దక్షిణహిందూదేశమును పాలించినరాజులలో నింతదేశమునుజయించి పాలించినవాఁడుగాని యితనితో సమానుఁడగు వాఁడుగాని యధికుఁడగు వాఁడుగాని లేఁడు. ఆకాలమున హిందూదేశములో ముఖ్యముగా దక్షిణహిందూదేశములో రాచూరు (Raichur) దుర్గమువంటి బలాఢ్యమగు దుర్గము మఱియొకటిలేదు. అయ్యది ఘనపరాక్రమవంతుఁడగు బీజపురసుల్తానగు 'ఏడిల్‌షా' వశమునను న్నయది. ఈరాచూరు దుర్గమునుగుఱించి తురుష్కులకును హిందువులకును వందలకొలఁదిసంవత్సరములనుండి ఘోరయుద్ధము లనేకములు జరుగుచుండెనుగాని రాచూరుదుర్గముమాత్రము విజయనగరపురాజుల యధీనముకాలేదు. సాళువనరసింహరాజు తనమరణశాసనములోఁగూడ రాచూరుదుర్గ



మును స్వాధీనము జేసికొనలేకపోతిననియు, తనతరువాత రాజ్యమునకు వచ్చువారలా దుర్గమునుబట్టుకొని విజయనగర రాజ్యమును యశోవంతముగాఁ జేయుదురని నమ్ముచున్నాననియు వ్రాయించెను.

కృష్ణరాయల తండ్రియు సాళువ నరసింహరాజునకు పిమ్మట సింహాసనమెక్కిన నరసరాయలును ఆతని జ్యేష్ఠపుత్త్రుఁడును కృష్ణరాయల సోదరుఁడునునగు వీరనరసింహరాయలునుగూడ రాచూరు దుర్గముకొఱకు ప్రయత్నింపనేలేదు. కృష్ణరాయలు పూర్వదిగ్విజయయాత్రముగించినతోడనే రాచూరు దుర్గముమీదికి దండెత్తిపోవలెనని చూచెనుగాని బీజపురసుల్తానగు ఏడిల్‌షా పెక్కేండ్లనుండి మిత్రుఁడుగానున్నందున విరోధకారణమునకై వేచియుండెను ఇట్లుండఁగా 'సైడ్‌మెర్కార్' (Cide Mercar) అనువానికిగోవానగరమునకుఁబోయి గుఱ్ఱములను కొనుటకై రాయలు నలువదివేల పర్దావులనిచ్చి పంపించుటతటస్థమయ్యెను ఈ మెర్కారనువాఁడు రాయల భృత్యుఁడుగా నుండి యున్న తురుష్కుఁడు. ఇతఁడాధనమును గైకొని గోవానగరమున కీవలనున్న పోండా యనుపట్టణమువఱకుఁబోయి యటనుండి యాద్రవ్యముతో నేడిల్‌ఖాను కడకు బీజపురమునకుఁ బాఱిపోయెను. ఏడిల్‌ఖానుఁడు మెర్కారు పోండాలోనుండఁగా నాద్రవ్యముతో రమ్మని యీతనికి నుత్తరము వ్రాసెనని కొందఱుచెప్పుదురు. ఎట్లులైననేమి? మెర్కారు బీజపురముఁ బ్రవేశించెను. రాయల కీవర్తమానము తెలియవచ్చినది. రాయలుతిమ్మనుచేత నేడిల్‌ఖానున కీరీతిగా నొక జాబు వ్రాయించెను.

"అనేక సంవత్సరములనుండి మన రెండు రాజ్యములకును సఖ్యత కలిగియున్నది. ఇప్పుడొక రాజద్రోహి మూలమున మన స్నేహమునకు భంగము కలుగరాదు; కాఁబట్టి వెంటనె సైద్దును పంపుఁడని వేఁడుకొనుచున్నాఁడను" అను వాక్యములుగల యుత్తరము సుల్తానునకుఁ జేరఁగానే ఖాజీలకును మంత్రులకును దెలి

యఁబంపి వారలను రప్పించి యాయుత్తరమును జదివి వినిపించెను. ఎవరికి తోఁచినది వారు చెప్పిరిగాని కడాపట మెర్కారును రాజునకు నొప్పగింపరాదను విషయములో నందఱేకీభవించిరి. తాను చేసినపని తెలియకుండుటకై సైద్దునకు (Cide) డాబుల్ (Dabull) అను పట్టణమునిచ్చి యతని నచ్చటికిఁ బంపివేసి యటనుండి యాతఁడెచ్చటికోఁ బాఱిపోయెనని సుల్తాను పన్నుగడచేసి రాయలకు సమాచారము దెలిపెను. కృష్ణదేవరాయలాయుత్తరమును జూచుకొని యాగ్రహాయత్తచిత్తుఁడై మంత్రులను సేనానులను రప్పించి దర్బారులోనుండు నెల్లవారికి వినుపించునంత బిగ్గరగాఁ జదివి వినిపించెను. పగదీర్చుకొనవలసిన సమయము దాపునకువచ్చినదిగాన నించుకయు నాలస్యముచేయక దండయాత్రకున్ముఖులై యుండవలసినదనియుఁ జెప్పఁగాఁ గొందఱు స్వల్పమగు నిట్టి ధనము విషయమై చిరకాలమునుండియున్న స్నేహమును బరిత్యజించి యుద్ధముచేయుటవలన నంతగాఁ బ్రయోజనముండదని చెప్పిరిగాని రాయలు తాను పగదీర్చుకొనుటకు దృఢనిశ్చయుఁడనై యున్నాఁడనని ప్రత్యుత్తరము చెప్పెను.

అటులయినచో డాబుల్ (Dabull) పట్టణముమీఁదుగాఁ బోయి పోరాడుటకంటె సుల్తానువశముననున్న రాచూరు (Raichore) ముట్టడించి వశపఱచుకొనుట సర్వవిధముల శ్రేయోదాయకమని మంత్రులు మొదలగువారు రాయలకు హితముఁజెప్పిరి. అంతటఁ గృష్ణరాయలుబీరారు సుల్తానగు ఇమ్మదుశాహికిని, బీదరు సుల్తానగు బరీదుశాహికిని, అమ్మదునగరు సుల్తానగు నైజామ్‌శాహికిని, గోలకొండసుల్తానగు కుతుబుశాహికిని, తనకును ఏడిల్‌ఖానునకును జరిగినవృత్తాంతము నంతయుఁ దెలుపుచు సమరసన్నద్ధుఁడనై యున్నాఁడనని తెలియఁజేసెను. దేవతాభిషేకోత్సవములును, దేవతా రాధనములును, ముగించినతరువాత శ్రీకృష్ణదేవరాయలు రాచూరు కోటపై దండెత్తిపోయెను. తనరాజ్య



ములోనుండు సేనలనన్నిఁటినిగొనిపోయెను. విలుకాండ్రును, కత్తులుదూసికొని యున్నవారును, తుపాకులుచేతఁబట్టిన సిపాయీలును, ఈటెలఁగైకొన్నవారునుగలిసిన ముప్పదివేలకాల్బలమును, వేయితురంగములును పదునాఱేనుంగులునుగల సేనతో సేనారక్షకులలో ముఖ్యుఁడగు కామానాయకుఁడు ముందునడచుచుండెను. అతనివెనుక త్ర్యంబక రావనునతఁ డేబదివేలకాల్బలమును రెండువేలతేజులను, ఇరువదేనుంగులునుగల సేనతోఁబోవుచుండెను.

తిమ్మప్పనాయకుఁడను వాఁడఱువదివేల కాల్బలమును మూఁడువేలయినువందల గుఱ్ఱములునుముప్పదేనుంగులును గల సైన్యముతో నాతని (త్ర్యంబకరావును) వెంబడించిపోవుచుండెను. అతనితరువాత నాదెప్పనాయకుఁడనువాఁడు లక్ష కాల్బలమును, అయిదువేల గుఱ్ఱములును ఏబదేనుంగులును గల సైన్యముతోఁబోవుచుండెను. అతనివెనుకలక్షయు నిరువదివేలకాల్బలమును, ఆఱువేలతురంగములును, అరువదేనుంగులునుగల సైన్యముతోఁగొండమరెడ్డి (కొండారెడ్డి) పోవుచుండెను. ఎనుబదివేల కాల్బలమును రెండువేలయేబది గుఱ్ఱములును, నలువదేనుంగులును గల, సైన్యముతో నతనికుమారుఁడాతనివెంబడించి పోవుచుండెను. విజయనగరపురపాలకుఁడుగా నియమింపఁబడిన సాళువగోవిందరాజు (తిమ్మరుసు తమ్ముఁడు) ముప్పదివేల కాల్బలమును, వేయితేజులను, పదియేనుంగులనుగల సైన్యమును గలిగి వారల వెనుకను బోవుచుండెను. అతనివెనుక రాయలకుఁ దమలంబందిచ్చు మధురనాయకుఁడొకఁడు పదునైదువేల కాల్బలమును, రెండువందల గుఱ్ఱములునుగల సైన్యముతోఁ బోవుచుండెను. కృష్ణరాయలకుఁ గూఁతునిచ్చినవాఁడును, మయిసూరుమండలాధిపతియునగు కుమార వీరయ్య (కుమార వీరశ్యామరాయలు) ఎనిమిదివేల కాల్బలమును నాలుగువందల గుఱ్ఱములను, ఇరువదేనుంగులును గల సైన్యముతో నాతని వెనుకఁ బోవుచుండెను.

తరువాత బెంగాపుర దుర్గాధ్యక్షుఁడును, నరపతి వంశములోని యుత్తమక్షత్రియులును మొదలగువారు బహు సేనలతోఁ బోవుచుండిరి. రాయలు ప్రేమించు మూవురుఖోజ్జాలు నలువది వేలకాల్బలమును, వేయితురంగములును, పదునై దేనుంగులును గల సైన్యమును దీసికొని సాళ్వగోవిందరాజు సైన్యమును వెన్నంటి పోవుచుండిరి. నలువదివేల కాల్బలమును, ఆఱువేల తురంగములును మూడువందల యేనుంగులును తనకుఁ దక్షకసైన్యముగా నుంచుకొని శ్రీకృష్ణదేవరాయలు పైనుదహరించిన సేనలకన్నిఁటికిని నాయకుఁడయి నడిపించుకొని రాచూరుదుర్గము వైపునకుఁబోవుచుండెను. యుద్ధభటులసంఖ్యయె యేడులక్షలపైననుండఁగా నిఁకనితరపరివారమునుగూర్చి చెప్పనేల? శ్రీకృష్ణదేవరాయలు పది లక్షలజనులతో రాచూరుదుర్గమును ముట్టడించుటకుఁ బోయె నని చెప్పినప్పుడు హిందూదేశచరిత్రమున మహాభారత యుద్ధానంతరమున నొక్క తాళికోట యుద్ధమునందక్క ఏమహారాజును, ఏచక్రవర్తియునింత సైన్యమునుగూర్చుకొనిపోయి యుద్ధముజేసినట్టుగాను పించకుండుటంజేసి రాయల సమర్థతకు నేరయినను నద్భుతమందక పోరు. ఈయుద్ధమును న్యూనీజు చక్కఁగాఁ గన్నులారఁజూచినట్లుగా నేవిషయమునను సంశయమునకవకాశము లేకుండునటుల వర్ణించియున్నాఁడు.

అతఁడు చేసినవర్ణనమునే నేనిచటసంగ్రహముగాఁ దేటతెనుఁగుమాటలతోఁజేసెదను. ఒక్కొక్కభటుఁడు తనకింపగునటుల నలంకరించుకొన నెల్లవారుసమానముగా నాయుధపాణులై యుండిరి. విలుకాండ్రును తుపాకులను బేల్చువారలును లోపలదూదిపెట్టికుట్టఁబడిన యొకవిధమైనయుడుపులనుదొడిగికొనియుండిరి. డాలులఁబూనినవారు కత్తులను గటారులను నడికట్టులలో బిగియించికొనియుండిరి. వారలుపూనిన డాలులు పెద్దవియై శరీరమునంతను గ్రమ్ముకొనియుండునుగాన దేహరక్షకై వేఱుగాఁగవచములను ధరింపనగత్యము లేకయుండెను. హయములుసుందరవస్త్రాలంకార భూషితములై యొప్పుచుండెను. సమరముచేయు వారువములపైన హౌదాలమర్పఁబడియుండెను. అయ్యవి సుందరవస్త్రములచేఁగప్పఁబడి యొక్కొక్కదానిలో నలుగురేసియుద్ధభటులు గూరుచుండి యుండిరి. ఏనుఁగుదంతములకు గసిగలిగినట్టియును బదునుపెట్టఁబడినట్టియుఁగత్తులుగట్టఁబడియుండెను. ఆకత్తులతో నెక్కువచెఱుపునుగలుగఁజేయును. పెక్కుఫిరంగులుగూడఁ గొనిపోఁబడినవి. ఈ సేనతోఁ గూడవచ్చినచాకలుల లెక్కించుటకష్టసాధ్యముగానుండెను. ఇరువదివేల వెలయాండ్రుకూడనుండిరి. పిపాసాతురులై భటులుప్రాణములఁగోలుపోకుండునటుల మార్గమధ్యమునందు నీళ్ళతోనింపినతోళ్ళ సంచులనుంచి దాహమునుదీర్చుటకై పదిపండ్రెండు వేల జనులు నియమింపఁబడిరి. ఈసేనకు ముందుసమాచారములారసి దెచ్చుటకై యేఁబదివేల వేగులవాండ్రు (Scouts) నియమింపఁబడి పదిపండ్రెండుమైళ్ళదూరమున నడచుచుండిరి.



ఈచారులకిరుపార్శ్వములయందు విలువిద్యయందు నిపుణులయిన రెండువేల గుఱ్ఱపురౌతులను రక్షకులనుగా నియమించిరి. కావలసిన వస్తువుల నెల్లను లేదనక సమకూర్చుటకై వణిక్కులుగూడ నుండిరి. ఒక్కొక్కదళవాయికి నొక్కొక్క వర్తకుఁడు పూచీపడియుండెను. ఆదళవాయికిఁ గావలసిన వస్తువాతఁడు సమకూర్పక తప్పదు. ఇట్టి మహాసైన్యముతో శ్రీకృష్ణమహాదేవరాయలు విజయనగరమును వదలి రణభేరి మ్రోగించుచు నదులను, బయళ్ళను, పర్వతములను దాటివచ్చి రాచూరునకుఁ గొద్దిదూరముననున్న మల్లియాబాదు లేక మల్లయాబాదని తురుష్కులచేఁ బిలువఁబడునట్టి మల్లయ్యబండ యను ప్రదేశమునఁ దన సేనలతో విశ్రమించి దేవతాపూజలు మున్నగునవి గావించి రాచూరుదుర్గమును ముట్టడించుటకు వలయు సాధనముల సమకూర్చుచుండ బ్రాహ్మణపురోహితులు కొందఱేగుదెంచి శుభముహూ

త్రము దాపునకు వచ్చిన దని రాయలకు నివేదింపఁగా నాతఁడు తనకూడి గముసేయుచున్న మూరులను సేనాముఖమును (ముందటిభాగమును) నడపించుటకు నియమించెను. కామానాయకుఁడు రాచూరుదుర్గముయొక్క కందకము దరిని తనదండు విడిసియుండెను. తక్కిన సేనానులు వారలకీయఁబడిన యాజ్ఞలప్రకారము తమ తమ నియమితస్థానములయందు నిలిచిరి.

రాచూరుపురవాసులు పిరంగులను, జానకిత్రాడు తుపాకులను, తుపాకులను బేల్చుటయేగాక శరములను బ్రయోగించి శత్రుసైన్యమును జీకాకునొందించుచుండిరి. కందకములను సమీపించిన శత్రువులు పిరంగిగుండ్లకుఁ దాళఁగలేక హతశేషులగు వారలు పలాయనమగుటకుఁ బ్రయత్నించుచుండిరి. రాయలయ్యది గాంచి తాను వారలను కోటగోడలను బగులఁగొట్టి శీఘ్రముగా లోనఁ బ్రవేశింపగలుగుదురను నుద్దేశముతోఁ బంపితినేగాని పాఱిపోవుటకుఁ గాదనియు, ప్రాణములు గోలుపోయినను పిఱికితనమును జూపక శత్రువులకు వెన్నీయక నిలువం బడవలసినదేయనిగట్టియుత్తరవు చేసెను. అందువలన రాయలసైనికులు దోర్దర్పముం జూపుచు ఘోరతర యుద్ధములంజేయుచు విజృంభించుచుండిరి. దుర్గములోనున్న వారు బలాఢ్యులై యున్నతప్రదేశమున సురక్షిత స్థానములయందునిలిచి యద్భుతపరాక్రమమును జూపుచుండుట వలనను శత్రుసైన్యము విరామములేక పోరాడుచుండుటవలనను రాయలసైనికులలోఁ బెక్కండ్రుహతమగుచుండిరి. తమసైనికులదురవస్థనంతయుఁగాంచి రాయల సేనానులు తమ భటులయొద్ద నుండి కోటగోడలను బగులఁగొట్టితెచ్చిన ఱాళ్ళను ధనమిచ్చి కొనుచుండిరి. ఒక్కొక్కఱాయి యున్నతమునుబట్టి పదిమొదలుకొని ఏఁబది ఫణముల విలువగలిగి యుండెను.

ఈపద్ధతి నవలంబించుటవలన గోడలు పెక్కుతావులఁబగులంగొట్టఁబడి దారులేర్పఱుపఁబడెనుగాని పట్టణము సురక్షితమైన



దగుటచేతను దుర్గమునుసంరక్షించుచున్న వారలాఱితేఱినపోటుబంటులగుటచేతను రాయలసైనికులలోఁ బెక్కండ్రు ప్రాణములనుగోలుపోయిరి. అయినను ద్రవ్యాశప్రాణములకాశపడకుండఁజేసిభటులనుబురికొలుపుచుండుటవలన వీరావేశముగలిగివారలు పోరాడుచుండిరికాని లవలేశమును వెనుదీయుచుండలేదు. మృతకళేబరములను భటులకుఁ బిఱికితనము దోపకుండునటుల నెప్పటికప్పుడు రణరంగమునుండి తొలగించుచుండిరి. ఏడిల్‌ఖానుఁడు బహుసేనలంగూర్చుకొని వచ్చుపర్యంతముఁ గృష్ణరాయలు రాచూరుకోట ముట్టడించి పోరాడినకాలము మూడు మాసములుపట్టెను. ఈమహాసంక్షోభకాలమున నారాచూరుపురములోని ప్రజ లెట్లుండిరో యించుక దెలుపవలసియుండెను. రాచూరునగరము కృష్ణకును తుంగభద్రకును మధ్యను గండశైలములతో నిండియుండి వృక్షములులేని పెద్దబయలులోఁ గట్టబడియున్నది. ఈరెండునదులకు నుగలదూరము పదునెనిమిదిమైళ్ళుండెను. కృష్ణ కుత్తరముననుండు దేశము బీజనగరసుల్తానగు నిస్మాయిల్ ఏడిల్‌షాకుఁ జెందినదై యుండెను. తుంగభద్రకు దక్షిణముననుండు దేశము విజయనగరరాజులకుఁ జెందినదై యుండెను.

ఈరెండునదులమధ్యనుండు బయలులో సరోవరంబులును సెలయేళ్ళను బావులునుగలవు. కాంతావక్షస్థలమునుబోలెఁ గానుపించుకొండొకటిగలదు. నగరముచుట్టును సున్నములేకయే రాతిపనిచేయఁబడినబలమైనప్రాకారములుమూడుగలవు. గోడల కుపరిభాగములయందు మట్టితోఁ బూతవేయఁబడి యుండెను. కొండకొనయందునెత్తగునట్టియు బలమగునట్టియు గోపురమును బోలినయొకకోటగలదు. కోటయున్నప్రదేశమున సంవత్సరముపొడుగునను బ్రవహించునీటిబుగ్గయొకటిగలదు. అటువంటి యున్నతప్రదేశమున నిట్టియపురూపమగుబుగ్గసదాజలపూర్ణమయియుండి ప్రవహించుచుండుటవలన నయ్యదిపవిత్రమయినట్టిదిగా భావింపఁ

బడుచుండెను. ఈబుగ్గమాత్రమేగాక చెఱువులును బావులును బెక్కులుండుటవలన నానగరమునందలిప్రజలకు నీరములకై శ్రమపడనక్కఱలేకయుండెను. అయిదుసంవత్సరములవఱకుఁజాలునట్టితినుబండారవస్తువులు గలిగియుండిరి. ఈరాచూరుదుర్గమును నాలుగువందల గుఱ్ఱములును ఇరువదేనుంగులునుగలిగియున్న నేర్పరులగు నెనిమిదివేలసైనికులచేసంరక్షింపఁబడుచుండెను. ఒండొరులుమాట్లాడుకొనుటకనుకూలముగునట్లుగా బురుజులమర్పఁబడియుండెను. ఈబురుజులలోనువానిచుట్టును రెండువందలఫిరంగులుపెద్దవియమర్పఁబడియున్నవి. రాయలసైన్యము వచ్చి దుర్గము ముట్టడించుటకు ముందే ఏడిల్‌ఖానుని సేనానినొక్కనిఁ జేర్చుకొనిద్వారములెల్ల బంధించి ఱాళ్ళతోమూసివేసిపాలగచ్చుచేసి విడిచిపెట్టిరి. దుర్గమునలుప్రక్కలను రాయలసైన్యముముట్టడించియుండెను. తూర్పుప్రక్కను రాయలుండెను గాననాభాగమునఁ బోరాట మారంభమయ్యెను. రాజునివసించెడు గుడారముచుట్టునుముండ్లకంచె యెత్తుగావేయఁబడి యొకప్రక్కమాత్రము ద్వారమేర్పఱుపఁబడియుండెను. ఆద్వారమునకిరుప్రక్కల రక్షకభటులు కావలియుందురు. ఈకంచెకులోపల రాయల బ్రాహ్మణపురోహితుఁడు దేవతార్చనమును జేయుచురాయలతోఁగూడ నుండెను. రాయలున్నగదిలో నాతనిసంరక్షించెడునుద్యోగియులు ఖోజ్జాలునునుండిరి. ఈకంచెకుచుట్టును రక్షకభటులు కావలిగాచుచుండిరి. సేనానాయకులు వారలకేర్పఱుపఁబడిన ప్రకార మాయాస్థానములయందు డేరాలు నేయించుకొనియుండిరి. ఈసేనలకు వెలుపలిభాగమునందు వేగులవాండ్ర నివాసస్థానములుగలవు. ఈవేగులవాండ్రు రాత్రులయందు సేనానివేశస్థానము నందిరుగుచు గాచుచుండుటకును శత్రువులచేఁ బంపఁబడిన చారులున్నయెడల బట్టుకొనుటకునై నియమింపఁబడిరి. బట్టలుదికిపరిశుభ్రముచేయుటకనువ



గుతావున రజకులు నివసించియుండిరి. సేనానివేశస్థాన మంతయు సరిగా వీధులుతీర్చి యున్నట్లుండెను.

ఒక్కొక్కసేనాధిపతికొక్కొకబాజారేర్పఱుపఁబడియుండెను. అచట గొఱ్ఱెలయొక్కయు, మేకలయొక్కయు, పందిపిల్లలయొక్కయు, కోళ్ళయొక్కయు, కుందేళ్ళయొక్కయు, పావురములయొక్కయు, నింక నితరములగు పక్షులయొక్కయు మాంసములు సమృద్ధిగా విక్రయింపఁబడుచుండెను. అదంతయును జూడ విజయనగరములో నున్నట్లేయుండెను. నానావిధములయిన ధాన్యములు వారు భుజించెడు నితరవస్తువులును బాజారులలో దొరకుచుండెను. ఈవస్తువులుమాత్రమేగాక కావలసిన ప్రతివస్తువును విక్రయించెడు దుకాణాదారులచే నలంకరింపఁబడిన బాజారులు కూడఁ గలవు. ఇంతియగాక వజ్ర వైఢూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యాది రత్నములును, అమూల్యములయి పలువిధములగు మౌక్తికములును, సువర్ణమయములగు నాభరణములును, నిర్భయముగా విక్రయింపఁబడుచుండెను. స్వర్ణకారులు బంగారునగలను జేయుచుండిరి. బట్టలవర్తకులు నూలుతో నేయఁబడిన వస్త్రములసంఖ్యములుగా విక్రయించుచుండిరి. ఎక్కడఁజూచినను బశువులకు మేతకై పచ్చికసవును, నెండుకసవును మేట్లకుమేట్లుదెచ్చి యుంచఁబడెను. ఆయెడారిభూమిలో లక్షలకొలఁది ప్రజలకు సమృద్ధముగా సమస్తవస్తువులు సమకూర్చుట మిక్కిలి యద్భుతజనకముగా నుండెను. ముప్పదిరెండువేల నాల్గువందల గుఱ్ఱములకును, అయిదువందలయేఁబది దంతావళములకుఁ జాలిన కసవు సంపాదించుట యెంత కష్టసాధ్యమైనపనియో యోజింపుఁడు. ఇఁక నితరములగు జంతువులకుఁ గావలసినదానిని లెక్కింపనేల ? ఇన్నిజంతువులకాయెడారిభూములయందు సమృద్ధముగా మేతనుసంపాదించిన కృష్ణరాయలయొక్క సామర్థ్యమింతని యెట్లు చెప్పవచ్చును ? విదేశీయుఁ డెవఁడైన నచటికిఁబోయినయె

డలఁ దానొక మహానగరములో నివసించుచున్నానని భావించునే కాని నిజముగా నొక ఘోరయుద్ధము జరుగుచున్న ప్రదేశమున నున్నట్లుగా భావింపఁడని యాయుద్ధమును స్వయముగాఁ జూచిన విదేశీయచరిత్రకారులు వ్రాసియున్నారు. పలువిధములగు సమరవాద్యములు మ్రోగునపుడు గుండెలవియుచుండుటయేగాక యాకాశము చిల్లులుపడునట్లుగానుండి విచారమనుదానిలవలేశమును లేకుండఁజేసి పిఱికిపందలకుగూడ పోటుబంటులనుగాఁ జేయుచుండినవి. ఈభయంకరనినాదములకదరిబెదరి పక్షులనేకములు గిరగిరందిరుగుచు భూమిపైఁ బడినవని న్యూనీజు వ్రాసియున్నాఁడు. ఈవిధముగాఁ గృష్ణదేవరాయలు రాచూరుదుర్గమును ముట్టడించి యుండఁగా నేదులశాహి (Adil Shaw) వచ్చి కృష్ణా నదికి నుత్తరపుటొడ్డున దండు విడిసియున్నాఁడన్న నిజవర్తమానము దెలియవచ్చెను. శత్రువుని రాక నిరీక్షించుచు నాతఁడేవిధమునఁ బ్రవర్తించునో యారసి తనకుఁ దెలియఁబఱచుచుండవలసినదని రాయలు వేగులను బంచెను.

ఏడిల్‌షావచ్చుచున్నాఁడను వర్తమానము రాయల స్కంధావారమున వినరాగానే సామాన్యసైనికులెల్లరును కలవలంబడుచుండిరి. అచ్చట సుల్తానురాయలేమిచేయునో చూడవలెనని కొన్నిదినములు వేచియుండెను కానికృష్ణరాయలు సుల్తానుతోఁబోరాడుటకు రాకనలక్ష్యముచేసియుండెను. అందుపైననేడిల్‌ఖాను నివజీరులు కృష్ణరాయని యభిప్రాయమును గనుగొనలేక తమతమయభిప్రాయములను సుల్తానునకుఁదెలియఁజేసిరి. సుల్తానువారలతోనాలోచింపఁగాఁ గొందఱురాయలు తనయౌన్నత్యమునుబ్రకటింప మనలను సరకుగొనకయే మిన్నకుండెననియు, తామునదిని దాటునపుడు వచ్చి పైఁబడనున్నాఁడనియుఁజెప్పిరి. ఇట్టియాలోచనచెప్పినది గోవానగరమునకు డీమూఁరాయి (De Monroy) కెప్టెనుగానున్నపుడు పోండాను పాలించుచున్న అంకూసుఖానుఁడ



నువాఁడు (Ankus Khan). తక్కినవారలు వెనుకటియుద్ధములయందుఁదమపూర్వులుమూరులవలనఁబొందినపరిభవములనుదలంచుకొనిరాయలుభయంపడియున్నాఁడనియు మనముపేక్షచేసినమనయసమర్థత బయలఁబడుననియు, మనము త్వరితముగఁబోయి రాయలసైన్యమును మార్కొనుటకును నదిని దాటవలసియుండెననియు, నటులవెంటనేచేయకున్న శత్రువునకు హానికలుగకుండుటయుఁ దమకులాభములేకుండుటయుఁ దటస్థమగుననియుంజెప్పిరి.

హిందువులకన్న తాముతక్కువసంఖ్యకలవారలయినను వెనుకటియుద్ధములయందుఁ దఱచుగాఁ దమకే జయము లభించుటను బురస్కరించుకొని యిప్పుడుగూడఁ దమకేవిజయము లభించునని తురుష్కులకు దృఢమగునమ్మిక గలదు. ఏడిల్‌షా తనసైన్యమునంతయు నొక్కచోటికిరప్పించి యెన్నిక చేయించఁగా లక్షయునిరువదివేల కాల్బలమును, పదునెనిమిదివేల గుఱ్ఱపుదళమును నూటయేఁబదేనుంగులునునుండెను. పెక్కులుఫిరంగులుగూడఁ గలవు. ఇట్టిఫిరంగులుండుటవలనఁ దానవలీలఁగా రాయలనుజయింపఁగలుగుదునని సుల్తానునమ్మి యుద్ధముచేయుటకు సంసిద్ధుఁడై తనసేనాధిపతులకు నదినిదాటుటకుత్తరవుచేసెను. ఈప్రకారము నదినిదాటి రాయలకు తొమ్మిదిమయిళ్ళదూరమున దండువిడిసి యుండెను. నీటికిఁగఱవులేకుండునటులఁ దనసైన్యమునంతను నదియొడ్డుపొడుగునను నిలిపియుంచెను. సైనికులకనువగునటులఁ బెద్దకందకములు త్రవ్వించి వానిముందు ఫిరంగులను బెట్టించెను. ఈసమాచారమంతయుఁ గృష్ణరాయలు దెలిసికొన్నవాఁడయి తన సేనలను మరలించుకొని తురుష్కసైన్యముల కభిముఖుండయివచ్చుచుండెను. రాయలీవిధమున సేననునడిపించుకొనివచ్చి తురుష్కసైన్యములకు మూఁడుమైళ్ళదూరమునదండువిడిసియుండి మఱునాఁడు శుక్రవారమగుటచేతను ఆదినము శుభదినముకాదనియు శనివారమువఱకు వేచియుండవలసినదనియు మంత్రులు మొదలగువారు

చెప్పియుండుటచేత నాదినమువఱకురాయలు యుద్ధమును ప్రారంభింపకయే యుండెను.

రాయలు రాచూరువిడిచి వెనుకకు మరలినతోడనే యేమి కారణముననో కోటలోనున్న యొకసేనాధిపతి ద్వారమును దెఱచికొనివచ్చి రాయలసైన్యమును వెంబడించివచ్చి రాయలసైన్యమునకు కొద్దిదూరములోనే తానుగూడ దండువిడిసి చారులనుంచి రాయల స్కంధావారమునందలి సమాచారము లారయుచుండెను. ఇట నుభయసైనికులును సమీపించి యుండుటచేత నారాత్రియంతయు నాయుధపాణులై యుండిరి. శనివారమునాఁడుసూర్యోదయమునకు ముందే రాయలస్కంధావారమున రణభేరి మ్రోగుచుండుటయేగాక వివిధములగు వాద్యములు శ్రవణవిదారణదారుణరవంబుల నెల్లదిశలకుఁ బఱపుచుండెను. వీనితోఁ బాటు సమర సన్నద్ధములయిన గుఱ్ఱములయొక్కయు నేనుగులయొక్కయు సకిలింపులు ఘీంకృతులును హెచ్చెను. అతిశయోక్తిగానుండు నేమోగాని యాదారుణరవంబు విన్నవారినిమాత్రమేగాక చేయువారినిగూడ భయకంపితగాత్రులనుజేసి, మిన్నువిఱిగిమీఁదఁబడినట్లుగాఁ దోఁపింపఁజేసెనని కండ్లారఁజూచిన చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. సూర్యోదయమైన రెండుగంటలకు యుద్ధము ప్రారంభమాయెను. ఆయుద్ధమును జూచితీరవలయునేకాని యిట్టిదని వర్ణించినందువలన సామాన్యయుద్ధమువంటి యుద్ధమేయని తలంపు గలుగుననుసంశయముచే విడిచిపెట్టఁబడినది.

కొంచెముకాలములోనే తురుష్కులుత్రవ్వుకొనిన కందకములపైన హిందువులువచ్చినిలువంబడిరి. సుల్తానుఫిరంగులను బాఱుపెట్టుఁడని సైనికులకుత్తరవుచేసెను. ఫిరంగిగుండ్లకు రాయలసైనికులు వేనవేలుమడిసిరి. రాయలసైనికులు గుండ్లప్రేటులకుఁజీకాకునొందుచు నలుదిక్కులకుఁ ఋఱుగులిడుచుండ గుండ్లబాఱింబడినసైనికులును గుఱ్ఱములును ఏనుఁగులును గూడఁ బ్రాణములను



గోలుపోయి భూమిమీఁదఁగూలుచుండఁగా రాయలసైన్యము తురుష్కులధాటికిఁ దాళంజాలక వెనుకకుమరలిపారిపోవుచుండిరి. ఈవిధముగఁ బలాయమగుచున్న సేనను దఱుముకొనివచ్చి తురుష్కులురూపుమాపుచుండఁగాఁ గృష్ణదేవరాయలు నిలువంబడి "ఓ పిరికిపందలారా! ఓ రాజద్రోహులారా! సిగ్గువిడిచిపాఱినమిమ్మేమన వచ్చును! నాపక్షమున నిలువంబడిపోరాడఁ గలశూరాగ్రేసరులెవ్వరో వారలుమిత్రులును బాంధవులునగుదురు. రాజునువిడిచిపాఱెడువారు రాజద్రోహులనంబడుదురు. రాజాధిరాజును జంపఁగలిగితినని ఏడిల్‌షా యుప్పొంగుదినము తటస్థమయ్యెంగాఁబోలు! రాజునురూపుమాపితినని యాతఁడు గర్వము పొందకుండును గాక!" అని పలుకుచు దనవ్రేలియుంగరమునూడఁబెఱికి తనచెంతనున్న ఔతునకొకనికిచ్చి తనమరణమునకుగుర్తుగా నీయుంగరమును జూపించి యాచారముప్రకారము సహగమనము చేయవచ్చునని తనరాణులకుఁజెప్పవలసినదిగాఁజెప్పి కృష్ణరాయలశ్వారూఢుఁడై తనచుట్టునుండు సైనికులకుఁ బాఱిపోవువారిని దయాదాక్షిణ్యములను విడిచి తెగవ్రేయుఁడని యుత్తరవుచేసిముందుకుఁ దానడువనారంభించెను.

ఆతని యుత్తరవుప్రకారము పాఱిపోవుచున్న స్వజనమును నఱకుచుండఁగా వారెల్లఱు సిగ్గుపడి యిట్టిచావుచచ్చుటకంటె శత్రువుల నెదిరించిచచ్చుటయే వీరపురుషధర్మమని నిశ్చయించి పాఱిపోవుటమాని రాయల సైనికులెల్లరు శత్రువులకభిముఖులై చావుబ్రతుకులారయక వీరావేశముతోఁ దురుష్కుల నుఱుమాడుచుండిరి. తురుష్కులిట్లు ధైర్యకంచుకమును విడనాడి రణరంగమున నిలువలేక చెల్లాచెదరయి ప్రాణభీతినొందినవారలయి నలుగడలకుఁ బఱుగిడుచుండఁగా హిందువుల క్రూరఖడ్గములపాలయి వేలకొలఁది ప్రాణములను గోలుపోయిరి. సేనానివేశస్థానమును సయితము గాపాడుకొనలేక నదిలోనికి దుముకుచుండిరి. ఇంతలో రాయల గుఱ్ఱపుదళమును, ఏనుఁగులును వచ్చి పైఁబడి శత్రువు

లనుబట్టి చంపుచుండెను. ఏనుఁగులు విజృంభించి శత్రుసైన్యము పయింబడి తొండములతోఁ బట్టుకొని చీల్చివేయుచుండఁగా హౌదాలపైఁ గూరుచున్న సైనికులు శత్రువులనసేకులను వేటాడుచుండిరి. ఈరీతిగా నేదిల్‌ఖానుని సైన్యమంతయు రూపుమాసిపోవుచుండఁగా నాతఁడు దప్పించుకొని పాఱిపోవలెనని ప్రయత్నించుచుండెను. పాపము! సుల్తానుసైనికులకెక్కడలేని దురవస్థయు సంప్రాప్తమయ్యెను. తురుష్కసైనికులు పాఱిపోవలెనని యొక్కసారిగాఁ గృష్ణానదిలోనికిఁ దుముకుచుండిరి కాని నదిలోన నీరెక్కువయుండుటచేతఁ బోవుటకు వీలులేక యందుఁ గొందఱు మునిఁగిపోవుటయెగాక కొందఱు ప్రాణభీతిచే మఱలనొడ్డునకు రాఁగా రాయలసైనికులు వారిని నఱికివైచుచుండిరి.

ఏనుఁగులు ప్రవాహములోనికిఁబోయి తొండములతో సైనికులంబట్టుకొని వీచివైచుచు నొండొరులను గొట్టుచుఁ బ్రాణనష్టమును గలిగించుచు నొక్కనినైనఁ దప్పిపోనీయక చక్కాడుచుండెను. ఈరీతిగాఁ దురుష్కసైన్యము హతమగుచుండఁగాఁ గృష్ణరాయలు వీక్షించి జాలిగుండెకలవాఁడై నిరపరాధులను జంపినందువలన నేమిలాభముండునో చెప్పుఁడని తన సేనానాయకులను మందలింపఁగా వారలెల్లను నాతని యుత్తరవుప్రకారము యుద్ధమును జాలించి సేనలను మరలించుకొని వినయవిధేయతలు చూపుచుండిరి. రాయలు సుల్తాను శిబిరమునకుఁ బోయి కొంతసేపాతని డేరాలో విశ్రమించి శత్రుసంహారమును బూర్తిచేయక తానిట్లుపేక్షాపరుఁడై యూరకుండుటయెంతయు ననర్థదాయకమని తన సేనాధిపతులు మొఱలిడుచుండఁగా దనకు సైనికులపకారము చేయలేదనియు సుల్తాను చేసిన యపకృతికిఁ బ్రతీకారము పొందెననియు నింక రాయచూరుదుర్గమును ముట్టడించి వశపఱచుకొనవలసియున్నదనియుఁ జెప్పి వారలను క్రూరవ్యాపారమునుండి మరలించెను. ఏదిల్‌ఖానుఁడసాదఖానునితో నేనుఁగుమీఁద నెక్కి పాఱిపోయెను, రాయచూరు దుర్గములో



నుండివచ్చిన సేనాధిపతి ఏదిల్‌ఖానుఁడు పరాజయము నొందగానే తానుమరలిపోయి రాచూరుదుర్గములోఁ బ్రవేశింపఁ బోవుచుండగా లోపలనున్నవారు రానీయక పోయినందున నుభయులకును గొంతసేపు పోరాటముకలిగి యెట్టకేలకు లోపలఁ బ్రవేశించెను. రాయలు సుల్తాను సేనానివేశనస్థానమునుండి తురుష్కులు వదలిపెట్టిపోయినవస్తువులను నొక్కచోటికిఁ జేర్పించుచుండెను. తురుష్కసేనానులయిదుగురు ఖైదీలుగాఁ బట్టుకొనఁబడిరి. ఏదిల్‌ఖానుని సేనానాయకులలో ముఖ్యుఁడగు సలాబత్‌ఖానుఁడుగూడ నుండియుండెను. ఏదిల్‌షా సైన్యము పలాయనమగుచుండుటఁ జూచి సలాబత్‌ఖానుఁడు పోర్చుగల్ దేశీయులు స్వపక్షద్వేషులై ఏదిల్‌షా సైన్యములోఁ జేరఁగా వారలలో నయిదువందల పోర్చుగీసువారినిఁ దీసికొని రాయలసైన్యములోఁ జొచ్చి శత్రువులు నయితము మెచ్చుకొనునట్లుగా గొఱ్ఱెలమందలోనితోడేలువలెనే విజృంభించి నిజపరాక్రమమును జూపఁగా రాయల సైనికులు వేలకొలదివచ్చి యూపిరాడకుండఁ జుట్టుముట్టుకొని యెట్టకేలకు నాతని గుఱ్ఱమును సంహరించి యందొక్కనినైనఁ బోనీయక యందఱినిఁ గడపి గాయములతో నలసి సొలసియున్న ఖానునిఁ బట్టుకొనిరి. నాలుగువేల గుఱ్ఱములు నూరేనుఁగులు నాలుగువందల పిరంగులు తొమ్మివందలు పిరంగులభారమును వహించు బండ్లు పెక్కులు గుడారములు రాయలకైవసమయ్యెను. ఇతరజంతువులను గుఱించి చెప్పనేల? పురుషులు స్త్రీలు బిడ్డలు పెక్కండ్రు పట్టుకొనఁబడిరి గాని రాయలు స్త్రీలను బిడ్డలను దాక్షిణ్యభావముతో వదలిపెట్టించెను. ఈయుద్ధము క్రీస్తుశకము ౧౫౨౦ వ సంవత్సరము మేయినెల ౧౯ దవ తేదిశనివారమునాఁడు ప్రారంభమాయెనని రాబర్టు స్యూయల్ దొరగారు వ్రాసియున్నారు. ఈయుద్ధములో నేదిల్‌ఖానునిఁ గృష్ణరాయలు జయించినట్లాముక్తమాల్యదలోని యీక్రిందిపద్యము వలనఁ గన్పట్టుచున్నది.

మ. “ అటుకన్నోటకఘట్టికాఖురపుటీ-హల్యంగు రాసానిపు
చ్చలువోదున్నిగలచ్చమాగజమదా-సారప్లుతింగీర్తిపు
ష్కలసస్యంబిడియేకధాటిభళిరా-కట్టించితౌదృష్టికే
దులఖానోగ్రకపాలమర్దపహరి-దుర్భాజాంగలశ్రేణికన్. ”

ఇంతటితోనీయుద్ధసమాచారము ముగియలేదు. రాచూరు దుర్గమును స్వాధీనముఁ జేసికొన్న విధమును బదునయిదవప్రకరణమునను దహరింపబడును.

## పదునయిదవ ప్రకరణము.

రాయలు తిరిగి రాచూరుముట్టడించుట-- పోర్చుగీసు “ రాయబారియగు ఫిగరీడో తోడ్పడుట— ఫిగరీడో మూరులంజంపుట— మూరులు భయపడి పాఱిపోవుట—కోటగోడలలోఁ గంతలుపడుట-- తురుష్క సేనాధిపతిచచ్చుట— మూరులు మొదటి పంక్తివిడనాడుట— పౌరులు రాయలను శరణువేడుట— రాయ లభయహస్తమిచ్చుట— రాయలు దుర్గమాక్రమించుట— రాయలు పురజనుల ప్రార్థనలనాలించి వారియాస్తులఁగాపాడుట— దక్కనుసుల్తానులు రాయలకు యుద్ధము వలదని రాయబారములు పంపుట— రాయలు వారలఁదిరస్కరించుట— రాయలు విజయనగరముఁ బ్రవేశించుట— ఏడిల్‌షా రాయబారమును బంపుట— రాయలు సుల్తానును దనకాళ్ళుపట్టుకొమ్మనుట— సుల్తాను సమ్మతించిరాకపోవుట— రాయలు సుల్తానుదేశమునకుఁబోవుట —బీజపురము రాయలయధీనమగుట— సుల్తానుపాఱిపోవుట —రాయలసైనికులు బీజపురమును ధ్వంసము చేయుట— సుల్తాను విచారించుట— అసాదుఖాను రాయబారము —అసాదు రాయలకు సలాబత్ఖానునియెడ ద్వేషమును బుట్టించుట— రాయలు సలాబత్ఖానునిఁ జంపించుట— అసాదు పాఱిపోవుట— రాయలు కలుబరిగిముట్టడించి సుల్తాను దేశమును ధ్వంసము చేయుట— రాయలు దండయాత్ర ముగించుట—

కృష్ణదేవరాయలు తురుష్కులను జయించినతరువాతఁ దన ప్రక్కను వీరమరణము నొందిన పదునాఱువేలసైనికులకు నగ్నిసంస్కారము మొదలగునవి గావించి దానధర్మములొనరించి సేనలను మరలించుకొనివచ్చి పూర్వస్థానముననే దండువిడిసి తిరిగి రాచూరుదుర్గమును ముట్టడించెను. యుద్ధానంతరమితఁడు తిరిగి రాచూ



రు వచ్చినపుడు “ క్రిస్టోవాడె ఫిగరీడో ” (*Christovao de Figueiredo*) అనునాతఁడు గుఱ్ఱములతో విజయనగరములో నుండి తుపాకులను బేల్చు సిపాయీల నిరువదిమందిని వెంటనిడికొని రాయలఁగలసికొనెను. రాయలా పోర్చుగీసు రాయబారి సహవాసము గలుగుటకును, ఆతఁడీఘోరయుద్ధమును దనయాన్నత్యమునధికారముఁ జూడఁ గలుగుటకును సంతోషించి ఏడిల్‌ఖాను నుండి గైకొన్న కొన్ని డేరాలను నాతనికిప్పించి వారలను తనడేరాలకు సమీపముననే డేరాలనుగట్టుకొనవలసినదిగా నాజ్ఞాపించెను. ఒకనాఁడు “ క్రిస్టోవాడెఫిగరీడో ” (*Christovao de Figueiredo*) రాయలవద్దకువచ్చి తనకుఁ బట్టణముచూడవలెనని యభిలాష కలదనియు నట్లు పోవుటకుఁ దనకాజ్ఞ నిప్పించవలెననియుఁ బ్రార్థింపఁగా రాయలట్లుపోయినఁ బ్రమాదముఁ దటస్థించినఁజూచి రాయలు సహింపఁగలఁడాయని వారించిననాతఁడు తమదేశీయులపని యుద్ధముచేయుటయేగావున నట్టిఘనత తనకుఁ గలుగజేయవలెనని మఱిమఱి ప్రార్థింపఁగా రాయలు కొంత పరివారమునిచ్చి పంపించెను.

“క్రిస్టోవాడెఫిగరీడో” *Christovao de Figueiredo* సాధ్యమగునంతవఱకుఁ దాను గనుపింపకుండఁ బ్రాకారములకుఁ జుట్టియున్న కందకము సమీపించి తురుష్కులగు మూరులు నిర్లక్ష్యముతో దేహములనావంతయుఁ గాచుకొనక కోట బురుజులపైనను గోడలపైనను విహరించుచుండఁగాఁ జూచి తానును తనసిపాయీలును గుఱిపెట్టి పెక్కండ్రను గాల్చి చంపుచుండిరి. అదివరకెన్నఁడెన్నఁడీ తుపాకులచే నిట్లుచచ్చుట తురుష్కులు చూచినవారలుకారు గాన జడిసి తమతమతావులను విడనాడుచుండఁగా రాయలసైనికులు గోడలపయిం బడి పగులఁగొట్టుటకు నారంభించిరి. అందువలన రాయల స్కంధావారమున “క్రిస్టోవాడెఫిగరీడో” పట్టణములోఁ బ్రవేశించినాఁడను వదంతికలిగి పెద్దకలకలము పుట్టెను

పట్టణములోనున్న వారద్భుతమందుచు వీరెట్లు రాయల సైన్యములోఁ జేర్చుకొనఁబడిరో తెలియక వీరల సహాయముచేతనే గదా హిందువులు కోటగోడలు సమీపింపఁ గలిగిరని యూహించిరి. కోటగోడ పెక్కుస్థలములయందు బీటలుతీసి యధికనష్టమును బొందెను. దుర్గముపైనుండు పిరంగులు కోటయడుగుభాగముననుండు గోడలఁ బగులగొట్టు ప్రజలకు నష్టము గలుగఁజేయఁజాలవు. గోడలకు లోపల మట్టిపూతపూయఁబడెను. కంతలుపడినచోట నెదురుగా ఫిరంగులు లేవు. అదివరకు లోపలనుండువారు రాయలసైనికుల ననేకవిధములఁ దుపాకులతోను, శస్త్రాస్త్రములతోను ఱాళ్ళతోను సమీపింపకుండునటులఁ జేయుచుండఁగా వీరలు వచ్చి గుఱిపెట్టి కాల్చి గోడలపైనున్న వారినిఁ జంపుటచేత రాయలసైనికులకు సులభముగా గోడలను దాఁకుటకు వీలు గలిగెను.

తనతోఁగూడ నొకరోజున మూరులనెదుర్కొనుటకుఁ దమ కనుజ్ఞ నీయవలసినదని రాయలసైనికులు క్రిస్టోవాడెఫిగరీడోను వేడికొనిరి. ఆతఁడందులో మర్యాదకలవారినిఁ గొందఱిని నెన్నికొని తనసైనికులను మూడుభాగములుగా విభజించి మూరులపైఁబడి సావకాశము చిక్కకుండఁ జంపుచుండెను. రాయలసైనికులు గడ్డపాఱలు మొదలగు నాయుధములతోఁ గోడను బగులఁగొట్టుచుండిరి. రాయల తదితర సైనికులెవరికిఁ దోఁచినరీతి వారలు పని చేయుచుండిరి. అందువలన మూరులకు నిలువ సాధ్యముగాక తాము సంరక్షించుచున్న మొదటిపంక్తిని విడిచిపెట్టిపోయిరి. స్త్రీలును బిడ్డలును పట్టణము విడిచి దుర్గములోనికిఁ బాఱిపోయిరి. నగరపాలకుఁడుగా నున్న సేనాధిపతి భీతినొంది పఱుగులిడుచున్న సైనికులఁ బురికొల్పుచు మరలింపవలెనని యెంత ప్రయత్నించినను వారలు నిలువక యుద్ధము చేయుచున్నది హిందువులు మాత్రమే గాదు పరంగులు గూడ నున్నారుగాన నచటికిఁ బోయినవాఁడెల్లఁ జచ్చినవాఁడే యని చెప్పఁగా నాతఁడు వారలను జూడఁబోయి తానుగూడ గుండుదెబ్బ తగిలి



నేలఁగూలెను. నగరరక్షకుఁడిట్లు నేలం గూలినతోడనే పురములోని వారలు హాహారవంబులు మిన్నుముట్ట శోకించుచుఁ దాముదివఱకు సంరక్షించెడు ప్రాకారములను విడనాడి కలవలంబడుచుండిరి. రాయలసైనికులు గోడలు పగులఁగొట్టియా నాటికూరకుండిరి.

ఏడిల్‌ఖానుఁడు యుద్ధము ప్రారంభించి మోడిపోయినది మొదలుకొని యప్పటికి నిరువదిదినములు కావచ్చెను. ఆమఱునాఁడు పురములోని ప్రజలొక ద్వారమును దెఱచిరి. తెల్లజెండా నెత్తికొని చేతులు జోడించుకొని వారెల్లఱు రాయల సమ్ముఖమ్మునకు వచ్చుచుండిరి. ఆవర్తమానము రాయలకుఁ దెలియరాఁగాఁ దనమంత్రియగు సాళ్వతిమ్మరాజును (తిమ్మరుసును) వారల నాదరించుటకై యెదురుగాఁ బంపెను. వారలకు రాయలు తమయెడఁ గరుణచూపునని నమ్మకము చిక్కెను. వారలు రాయలసన్నిధానమునకుఁ గొనిరాఁబడి యాతనికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి దుఃఖాకులితమానసులై కన్నుల బాష్పధారలోడుచుండఁగాఁ గరుణచూపవలసినదని బహువిధముల వేడుకొనుచుండిరి. రాయలు వారలకు దుఃఖోపశమనముఁ గావించి యభయహస్తమిచ్చి రేపు వచ్చెదముగాన నిర్భయముగానుండుఁడని పౌరులనెల్లఱను బంపివేసెను. కృష్ణరాయలు పట్టణమును వశపఱచుకొనవలసినదని యొక సేనానాయకున కాజ్ఞ యొసంగెను. తనకిట్టి జయమును కలిగించుటకుఁ బ్రేరేపకులలో ముఖ్యుఁడగు "క్రిస్టోవాడెఫిగరీడో" ను నుచితవిధమున శ్లాఘించి రాయలు సన్మానించెను. రాయలస్కంధావారమున సైనికులెల్లఱు నాటిదినము మిక్కిలి యానందాబ్ధి నోలలాడుచు వినోదములలో మునింగి ప్రొద్దుగడపుచుండిరి.

మఱునాఁడు సూర్యోదయానంతరము కృష్ణదేవరాయలు కాల్యకరణీయంబులు నిర్వర్తించుకొని సంధ్యావందనాదినిత్యకర్మలు నెఱవేర్చుకొని సేనానాయకులు పెక్కండ్రు వెంటఁ గొలిచిరా బయలుదేఱివచ్చి పురములోఁ బ్రవేశించెను. పౌరజనులందఱు నా

తని సందర్శించుటకై నగరద్వారమునవేచి యుండిన వారలగుటం జేసి రాయలువచ్చినతోడనే కైవారములుసేయుచు నాశీర్వదించుచు నాతనింగొనిపోయి మహోత్సవముతో నూరేగించి దుర్గముసమీపమునకుఁ గొనిరాఁగా రాయలుపురములోని గౌరవాధికులనురప్పించి యిట్లనియె. " మీకుఁగాని మీధనధాన్యములకుగాని యేవిధమైన భయమునులేదు. ఇష్టమున్నయెడల ముందటిచందముననే మీయాస్తులతో నుండవచ్చును, ఇష్టములేనియెడల మీయాస్తులను గైకొని మీయిచ్చవచ్చినకడకుఁ బోవచ్చును.' అనియభయహస్తమీయఁగా వారలెల్లరును జేతులు జోడించుకొని సాష్టాంగనమస్కారము లాచరించి తమ్ము నావిధముగా దయార్ద్రదృష్టితోఁజూచి సంఘలకు నాతనివేయివిధంబుల వినుతింపమొదలుపెట్టిరి. ఇట్లుజరుగుచుండఁగా రాయలసైనికులు పౌరులధనకనకవస్తువాహనాదులఁ జూఱఁగొనుచున్నారని రాయలతోఁ గొందఱువచ్చి చెప్పిరి. రాయలువెంటనే వారలనువారించి వారివస్తువులమఱలవారలకిప్పించి యట్టిచెడుగులు జరుగకుండఁ గట్టికట్టడగావించెను. అయినను బెక్కుస్థలములయందుదోపిడులుజరిగెనుగాని కృష్ణరాయలుపేక్షచేయక యట్టివారలనెల్లరను గఠినముగా శిక్షించెను. కొద్దికాలములోనే ఏడిల్‌షా పరాజితుఁడై పాఱిపోయెనని యెల్లదేశములలోను వ్యాపించెను. ఏడిల్‌షానిజముగా ఘనపరాక్రమవంతుఁడగుట చేతను, ఈవిధముగా రాయల జయింపలేక యొంటరియై పాఱిపోవుటయు నెల్లరకు నద్భుతముగాఁ గనుపడి కృష్ణరాయలన్నపేరు హిందూదేశములోని రాజులకు మాత్రమేగాక పాశ్చిమాత్యులకు సయితము వెఱపు కలిగించెను. ఈవిజయవార్త నైజాంషా, బరీదుషా, ఇమ్మదుషా, కుతుబ్షా మొదలుగాఁగల దక్కను సుల్తానులు వినితమకంటె బలవంతుఁడగు నేడిల్షాకు పరాజయముగలిగి నష్టము కలిగినందుల కెంత సంతసముగా నున్నను ప్రబలమగు విద్యానగరరాజ్యమునకిట్టి కీర్త్యధికా



రములు కలుగుట సంతాపమును గలిగించుచుండెను.

అప్పుడాసుల్తానులు కృష్ణరాయలవద్దకు రాయబారులను బంపిరి. వారలువచ్చి యట్టిబలాఢ్యమగు దుర్గమును రాయలువశపఱచుకొనుట కాశ్చర్యము నొందుటయేగాక రాయలసైన్యమును నాతని యౌన్నత్యమును నధికారమును జూచి యంతకంటె నచ్చెరువందుచు రాయలకుఁదాముదెచ్చిన జాబులను బంపిరి. కృష్ణరాయలిదివఱకు జయించినదానితోఁ దృప్తినొంది యుండవలసినదనియు. యుద్ధమును మఱలఁబ్రారంభింపక ఏడిల్‌షావద్దనుండి గైకొన్న భూములను వస్తువాహనాదులను మఱలనాతనికిచ్చిదయచూపవలసినదనియు అట్లుచేసినయెడలదామెప్పుడును రాయలయుత్తరవుననుసరించి భృత్యులమైయుందుమనియు ఈపనిచేయుటకిష్టపడనియెడలఁదాము బీజపుర సుల్తానుతో నేకీభవించి రాయలతో యుద్ధముచేయవలసివచ్చుననియు అందువలనజయించినదేశమును దాముతిరుగస్వాధీనముచేసికొనుట తటస్థమగునేమోయనియు మొదలుగాగలసంగతులాయుత్తరములలో వ్రాయఁబడియుండినవి. అవియన్నియుఁజూచుకొని కృష్ణరాయలు వారలుతనకుఁజేసిన హితోపదేశమునకై వందనములాచరించుచున్నాననియుఁ దానుఏడిల్‌షా విషయమున నడపినచర్యకాతఁడుతగియున్నాఁడనియు ఆతనివద్దనుండిగైకొన్నదానిని దిరిగినాతనికీయవలసిన కారణములేదనియు తానట్లుచేయననియు తాముబీజపుర సుల్తానుతోనేకీభవించికష్టపడితనవద్దకురానక్కఱలేకుండఁ దమకుధైర్యముండి సమ్మతించి సెలవిచ్చినయెడలఁదమసన్నిధానమునకుఁ దానే వచ్చుచున్నాననియు మఱలజాబువ్రాసియాదూతలకిచ్చి వారలకు బహుమానములుచేసిపంపెను. పెక్కండ్రుజనులు రాచూరువిడిచిపోయిరి. ఇచట కృష్ణరాయలుకొన్నిదినములుండిపురపాలనమున కావశ్యములగుపనులను జేయించుచుండెను.

పట్టణప్రాకారములను బాగుచేయించి తద్దుర్గసంరక్షణార్థమై కొంతసైన్యమునుంచి తనసేనలతోఁగూడి విజయనగరమునకు మరలెను. విజయనగరములోని ప్రజలెల్లను నాతని నెదుర్కొని మిక్కిలి సంతోషముతో శ్లాఘించుచు నానాఁడు విందులు వినోదములు మొదలగునవి చేసికొనిరి. కృష్ణదేవరాయలును దేవతోత్సవములు మొదలగునవిగావించి సైనికులకెల్ల అనుబహుమానములిప్పించెను. తరువాత రాయలీయుత్సవములన్నిఁటిని ముగించి నూతనముగాఁ గట్టిన నాగలాపురమున నివసించియుండెను. ఏదిల్‌ఖాను వద్దనుండి దూతవచ్చి యున్నాఁడని రాయలకు వర్తమానము దెలియవచ్చెను. అంతకుఁబూర్వమె రాయల కాసమాచారము దెలియునుగాని తానెఱుఁగనట్లు నటించుచుండెను. దూతవచ్చినతోడనే సన్మానించుట రాజునకాచారముకాదు. ఆదూత రాయలుక్రొత్తపట్టణములో నున్నాఁడని యెఱుఁగునుగాన దనపరిజనులచే నగరమునకు సమీపముగాఁజేరియుండునట్టుల మున్నెన్నఁడు నెవ్వరు నిర్మింపనట్టియు శృంగారము గలిగియున్నట్టియు విలువగలిగియున్నట్టియు నొక డేరానుగట్టించుకొనియుండెను. అతఁడు నూటయేబదిగుఱ్ఱములను పెక్కులు కంచరగాడిదెలను ఎడ్లను ఒంటెలను పెక్కండ్రు పరివారజనులను దీసికొని వచ్చెను.

అతఁడు తానువచ్చినతోడనే తనరాకనుగుఱించి రాయలకుఁ దెలుపుచుఁ దనకుప్రభుదర్శనమిప్పించి తనమనవియాలించి యాలస్యములేకుండ సెలవొసంగి పంపివేయవలసినదని వేఁడికొనెను. తొందరపడవలదనియు, కాలమాసన్నమయినప్పు డాతని మనవి గైకొనఁబడుననియు వేచియుండవలసినదనియు రాయలు ప్రత్యుత్తరమంపెను. అంమవలన నాతఁడా పట్టణములో నెలదినములుండవలసివచ్చెను. అంతపర్యంతము రాయలాతనికి దర్శనమీయక పోవుటయేగాక యెందులకువచ్చెనోగూడ నారయకుండెను. ప్రతిదినమీరాయబారి తప్పక దర్బారునకుఁ బోవుచువచ్చుచు రాయలు



తనకు నాజ్ఞయిచ్చుపర్యంతము నూరకుండునని నిశ్చయించుకొనెను. అయినను రాజభవనమునకుఁబోయి ప్రభువరులతో మాట్లాడుచుండుటమాత్రము మానలేదు. ఒకనాఁడు రేపటిదినము శుభదినముగావున దూతవచ్చినకార్యమునువిని యుత్తరమొసంగెదమని రాయబారికిఁ దెలియఁజేయఁబడెను. ఆమఱునాఁడు రాయబారి దేశాచారమునననుసరించి నగరములోని తురుష్కులను వెంట నిడికొని వాద్యఘోషములతో రాయల సన్నిధానమునకుఁ బోఁగా రాజబంధువులవలనను మంత్రులవలనను సన్మానింపఁబడి మొదటిద్వారమువద్ద రాయలయనుజ్ఞకై వేచియుండిరి. శీఘ్రముగా రాయలవద్దనుండి దూతనుపంపుటకాజ్ఞవచ్చెను. తనదేశాచారముననుసరించి రాయబారి కృష్ణదేవభూపాలునకు నమస్కారాది కృత్యములు గావించి రాయలయాజ్ఞానుసారముగ నివ్విధమునఁ దానుదెచ్చిన రాయబారము వినుపించెను.

“మహాప్రభూ! నాప్రభువగు ఏదిల్‌షా నన్ను మీవద్దకుఁ బంపినాఁడు. న్యాయమును దయచేయుఁడని తన ప్రార్థనగా నన్ను మిమ్ములఁ బ్రార్థింపుమని చెప్పినాఁడు. ప్రపంచములోనెల్ల సద్ధర్ముఁడును సత్యవంతుఁడును పరాక్రమవంతుఁడును నగు ప్రభువునెడ నెట్లో యట్లే మీపట్ల మంచిహృదయము గలిగియున్నాఁడు. అనేక సంవత్సరములనుండి మీపూర్వులచేతను, మీచేతను, నాతనియెడఁ గనుబఱచు స్నేహభావమును వదలి సఖ్యతను జెఱచుటకుఁ గారణములేదు ఏకారణముచేత మీరలు మీరాజ్యమును వదలి యిటువంటి యుద్ధమునేల చేసిరో కారణమారయఁజాలకున్నాఁడు. మీరు రాచూరుదుర్గమును ముట్టడించిచుట్టునుండు దేశమును బాడుచేయుచున్నారని మాప్రభువునకుఁ దలియ వచ్చినపుడు మొట్టమొదట నమ్మలేదు. అట్టివర్తమానము నిజమనినమ్మినతరువాత దుర్గసంరక్షణార్థమై సేననుగూర్చుకొనివచ్చెను. అతనిమంత్రులు మొదలగువారలు చంపఁబడుటయు, ఆతనిసర్వస్వమును మీయధీనము

గుటయు మీ రెఱింగినదే గదా! అతని పిరంగులను, గుఱ్ఱములను, ఏనుంగులను, డేరాలను, పరివారజనమును రాచూరుదుర్గమును మఱలం దనకిప్పించవలసినదని ప్రార్థించుచున్నాఁడు.

అతఁడు ప్రార్థించిన ప్రకారము నతని సొత్తులు తృప్తికరముగు నటుల నిప్పించిన యెడల నాతఁ డెప్పుడును రాజభక్తిగల మిత్రుఁడుగా నుండును. అట్లు కానియెడల మీరు చేసిన కృత్యము మీకు సంతోషముగా నున్నను దుష్టకృత్యముగా నుండును" అని విని పించి మఱియొండు పలుకు పలుకక మిన్నకుండెను. కృష్ణరాయలంతయు విని మర్యాద ననుసరించి పట్టుత్రాఁడును మఱికొన్ని వస్త్రములను బహుమానము జేసి రేపు సెలవీయఁబడునని యాతనిఁ బంపివేసెను. మఱునాఁడు రాయలు వానినిరప్పించి మాట్లాడవలసిన విషయములను మాట్లాడి సుల్తానువచ్చి తన కాళ్ళు పట్టుకొన్న యెడల నాతఁడు కోరిన ప్రకారము సమస్తము నొసంగఁబడునని చెప్పెను. అంతరాయబారి రాయలవద్ద సెలవుగైకొని తన బసకు వెళ్ళి యీ వృత్తాంతమును సుల్తానునకుఁ దెలియఁబఱచెను. సుల్తాను రాయలు కోరిన ప్రకారము చేయుటకుఁ దనకు సంతోషముగా నున్నది కాని యదెట్లు సమకూరునో దెల్పవలసినదని మఱల వ్రాసెను. రాయబారి రాయలకుఁ దెలుపఁగా నాతఁడు సుల్తానును తన సరిహద్దునకు రప్పించిన యెడలఁ దానుగూడ నచ్చటకు వచ్చెద ననియు నచట నా పని జరిగింపవచ్చుననియు నుపాయముఁ జెప్పెను. అట్లనే చేయించెదనని రాయబారి సెలవుగైకొని బీజపురమునకుఁ బోయెను. తాను చెప్పిన ప్రకారము రాయలు సేనాసమేతుఁడై సరిహద్దులో నున్న ముదిగల్లు (*Mudgal*) దుర్గమునకుఁ బోయియుండెను. అచట నుండఁగా నేడిల్‌షా వచ్చుచున్నాఁడను వర్తమానమును విని యెదురుగా బోవలెనని బయలుదేఱెను. ఏడిల్‌ఖానునకు రాయలను గలసికొనుటకు ధైర్యము లేకపోయెను. తుదకు 'ఇదిగో అదిగో' యని రాయలను బీజపురము వఱకుఁ దోడ్కొనిపోయెను. సుల్తాను



పాఱిపోయెనే కాని రాయలను దర్శింపలేదు. నానావిధములగు ఫలవృక్షములతో నిండియున్న శృంగారారామములును రమ్యహర్మ్యములును గలిగి సొగసుగుల్కెడు నాపట్టణమునఁ గొంతకాలముండి సుల్తాను చేసిన మోసమును దలంచి యతఁడు దొరకునేని యాతని జంపించి పగఁదీర్చుకో నిశ్చయించెను. కాని ఏడిల్‌ఖానుఁడు రాకపోయెను. తానచట మఱికొంతకాలము నివసించుటకు జలము లేనందున వీలు లేకపోయెను. ఆపట్టణమున రెండు పెద్ద చెఱువులు గలవు. అయ్యవి వర్షజలముచేఁ బూరింపఁబడుచుండును. రాయలు శీఘ్రముగాఁ బట్టణము విడిచిపోవుటకై తురుష్కులా చెఱువు కట్టలు తెగఁదీసిరి. అందువలన రాయల సైనికులకుఁ ద్రాగుటకు నీరు చిక్కకుండెను. ఆ కారణమున రాయలా పట్టణమును విడువవలసి వచ్చెనుగాని రాయల సైనికులవలన నా పురమంతయు భీభత్సము చేయఁబడెను.

రాయల సైనికులకు వంటచెఱకు దొరకనందున రాయల సమ్మతిపుచ్చుకొనకయే యిండ్లనేకములు పాడుచేయఁబడి యిండ్లకలప వంటచెఱకుగా నుపయోగపడుచుండెను. ఈ దుఃఖవృత్తాంతమును సుల్తాను విని తన ప్రజలేమి యపకృతి గావించినారని మీరలిట్టి యకృత్యమునకుఁ దొడంగి తన భవనములు దక్క తదితరగృహంబులన్నియుఁ గూల్చుట ధర్మమేనా యని రాయలకు వ్రాసెను. రాయలు తానట్టి యుత్తరవు చేయలేదనియు నా విషయములోఁ దన యాజ్ఞ చెల్లనేరదు గానఁ దా నూరకుంటిననియు తనదోషము లేదనియుఁ బ్రత్యుత్తరమిచ్చెను. రాయలా పట్టణమును విడిచి ముదిగల్లు చేరినతోడనే సుల్తాను వచ్చి బీజపురముఁ బ్రవేశించెను. తన పట్టణమునకుఁ దటస్థించిన దురవస్థనంతను గన్నులారఁ జూచి తనవలననే యిట్టిపని జరుగుటకుఁ గారణంబయ్యెననియు తాను రాయల చెంతకుఁ బోయిన యెడల నిట్టిపని జరుగకుండును గదా యనియు రాయలతో విరోధమును గొని తెచ్చుకొంటినిగాని మైత్రిగలిగియున్న యెడలఁ దనకా

జ్యము చెడిపోక వృద్ధిపొందియుండునుగదా యని పశ్చాత్తాపము నొందుచుఁ జింతించుచుఁ దన వజీర్లతో నాలోచించుచుండఁగా బెల్గామునకు ప్రభువుగానున్నట్టియును అతిదుర్మార్గుఁడును టక్కరియునగు "అసాదుఖానను" వాఁడు లేచి దేవరవారాజ్ఞ యిచ్చినయెడల నిమిషములో రాయల చిత్తమును గరగించి మీయెడఁ గల ద్వేషమును మరలింపఁజేసి సఖ్యత నొనగూర్తునని వేడికొనుచు విన్నవింపఁగా విచారసాగరమున మునింగి యేమియుఁ దోచకయున్న ఏదులషా యందులకు సమ్మతించెను.

అసాదుఖానుఁడు సుల్తానునెడఁ గల భక్తిచే నీరాయబారమును బూనలేదు. తనకు సలాబత్ఖానునెడ గల యీర్ష్యచే నీరాయబారమున కొప్పుకొనెను. ఈ యసాదుఖానుని ప్రోద్బలము వలననే ఏడిల్‌ఖానుఁడు పాఱఁగా దురుష్కసైన్యమునకు విపత్తు దటస్థమయ్యెనని సలాబత్ఖానుఁడు పలువురతోఁ జెప్పఁగా నీతఁడు విని వీనిని చెఱనుండి వదలించిన దనకు శత్రువై తన్ను నాశనము చేయకమానఁడని యూహించి రాయలచే వీని నిజంపింపవలెనని నిశ్చయించి కపటవృత్తితో నీరాయబారమును బయిని పెట్టుకొనెను. ఏడిల్‌ఖానుచే నాజ్ఞాపింపఁబడి అసాదుఖానుఁడు సపరివారముగ ముదిగల్లు నగరమునకు వచ్చి కొంతకాలము రాజువర్తమానము పంపువరకు వేచియుండి తరువాత రాయల యనుమతిని బొంది యాతని దర్శించి పెక్కువిధముల స్తోత్రపాఠములు చేసి యేడిల్‌ఖానుఁడు రాయల యుత్తరవు ప్రకారము నడువకపోవుటకుఁ గారణము సలాబత్ఖానుఁడు రాయలకు మ్రొక్కవలదని సుల్తానునకు వ్రాయఁగా నాతఁడాతని మాట విశ్వసించి రాలేదనియు లేనిపోని మాటలు కల్పించి రాయలకాతని యెడ ద్వేషమును బుట్టించెను.

రాయలు వాని మాటలు నిజమనియు, రాజకుటుంబమునఁ బుట్టి ప్రభువుగానున్న యాతఁడసత్యవచనములు పలుకఁడని నమ్మి చెఱలోనున్న సలాబత్ఖానునిఁ జంపుటకు నుత్తరువిచ్చెను. దుర్మార్గుఁ



డగు నీతని మాటలు విశ్వసించి రాయలు బీజపురసుల్తానుని సేనాధ్యక్షుఁడగు సలాబత్ఖానునిఁ జంపించెను. తనపని పూర్తియైన తరువాత తన కపటతంత్రము బయలుపడినయెడలఁ దనకుఁ జేటువాటిల్లునని నిశ్చయించి యొకనాఁడు రాత్రి రాయల యనుమతి గయికొనకయే పాఱిపోయెను. వీని కపటతంత్రము బయలుపడి రాయలు తాను చేసిన పనికిఁ బశ్చాత్తప్తుఁడయ్యెను. అసాదుఖానుఁడీవిధమునఁ బాఱిపోయి ఏదులషాకు రాయలు సలాబత్ఖానునిఁ జంపించెననియు, తన్నుగూడ జంపనూహించుచుండఁగాఁ దానుదప్పించుకొని వచ్చితిననియుఁ గల్లలాడి చెప్పి తనదేశమునకుఁ బోయి బెల్గాముకి దుర్గమును బలపఱచుకొనుచుండెను. తరువాత నీకపటతంత్రమంతయు సుల్తానునకుఁ దెలిసి తనదర్బారునకు రమ్మని యసాదుఖానున కాజ్ఞాపింపఁగాఁ దిరస్కరించి యాతఁడు రాకయుండెను.

కృష్ణరాయలు సుల్తాను పంపిన రాయబారి తన్నిట్లు మోసముచేసి పాఱిపోయెనుగదా యన్న క్రోధముతోఁ దనసేనలను దరలించుకొనిపోయి కలుబరగి (*Culburga*) నగరముపై దండెత్తిపోయి ముట్టడించి యాదుర్గమును నేలపాలుచేసి నగరమంతయు ధ్వంసము చేయుటయేగాక పెక్కుపట్టణములను నిర్మూలించెను. అంతటితోఁ దృప్తినొందక రాయలింకను శత్రువుల దేశమునఁ దాండవమాడుచుండవలెనని యూహించి ముందుకు సాగెనుగాని మంత్రులు మొదలగువారు వలదని వారింపఁగా శాంతినొంది జలసమృద్ధిలేని కాలమును దేశమును నగుటచేత నంతటితోఁ దృప్తినొంది వెనుకకు మరలెను. కలుబరగి నగరసుల్తాను కొడుకులను మువ్వురను ఖైదీలనుగాఁ బట్టుకొని జ్యేష్ఠపుత్రునికి రాజ్యాధిపత్యమిచ్చి తక్కిన కొడుకుల నిర్వురను దీసికొనివచ్చి వారలో నొక్కొక్కనికి సంవత్సరమునకు నేఁబదివేల పర్డావుల నిప్పించుచు నవాబుబిడ్డలను జూచినట్లుగానే గౌరవించుచుండెను. ఈయుద్ధవార్త కృష్ణరాయ విరచితమగు నాముక్తమాల్యదలో నీక్రిందిపద్యమునఁ జెప్పబడినది.

"గీ. తిరుగు హరిపురి, సురతను-సురల మరిగి।
బహుళ హళహళి భరిత క-ల్బరగి నగర।
నగర పురవర పతిబృంధ-జవన యవన,
పృతన భవపసి ననిఁదెగి కృష్ణరాయ॥"

## పదునాఱవ ప్రకరణము.

---

పేయసు విజయనగరమునకుఁబోవుట— ధార్వాడ— అందలి దేవళములు— వారకాంతలు— విజయనగరము ప్రవేశించుట— దుర్గములును ద్వారములును— కొండలవరుసలు— నగరప్రాకారములు— నీళ్ళకాలువలు— చెఱువు త్రవ్వించుట— బ్రాహ్మణులు— నాగలాపురము— రాజు— రాజుప్రవర్తనము— రాజుభార్యలు— వానిగృహకృత్యములు— ప్రభువుల సన్మానించు విధము— రాయలదినచర్య— ఫిగరీడో రాయబారము— నగరవీధులు— దేవళములు— బజారులు— రాజమందిరము— నగరవైశాల్యము— నగరవర్ణనము— బజారువస్తువులు— తుంగభద్ర— ఆనెగొంది— తట్టపడవలు— విఠ్ఠలస్వామియాలయము— విరూపాక్షాలయము— మహానవమిపండుగ— ఉత్సవములు— అలంకారములు— జయమందిరము— రాయలమండపము— బలులు— వారకాంతలు— ఆటలు— మల్లయుద్ధములు లేక కుస్తీలుపట్టుట— తిమ్మరుసుమంత్రి— రాయలసైన్యము— మహాప్రభువులు— శ్రీరంగపట్టణపురాజు— బాణసంచు— రథోత్సవములు— రాణులయుత్సవములు— వారలయలంకారములు— నవరాత్రములు— రాణువలఁబరీక్షించుట— హయములు సామజములు మొదలగువాని యలంకారములు— ఆయుధములు— ఫిరంగులు— సేనావ్యూహములపద్ధతి— ధనాగారము—

కృష్ణరాయలు రాచూరు (*Raichore*) దుర్గమును వశపరచుకొని విజయనగరము ప్రవేశించిన తరువాత నతని యాస్థానమునకుఁ బోర్చుగీసువారిచేఁ బంపఁబడిన రాయబారి క్రిస్టోవాడె ఫిగరీడో (*Christovao de Figueiredo*) వచ్చినపుడాతనితో డామింగోసు పేయసను (*Domingas Paes*) నాతఁడు గూడవచ్చియుండెను. అతఁడు వ్రాసినచరిత్రమును బట్టికూడఁ గృష్ణరాయలప్రభుత్వమహిమయు, నాతనిరాజ్యవిస్తీర్ణతయు, విజయనగరవైభవమును గొంతవఱకుఁ బ్రఖ్యాతము నొందుచున్నవి. అతఁడుతానుజూచిన విషయములనుగుఱించి వ్రాసినచరిత్రమును సంగ్రహముగా నిటఁదెలుపుచున్నాఁడను. గోవానగరమును విడిచినతరువాత సముద్రతీరమునుండి నరసింహరాష్ట్రమునకు (విజయనగరరాజ్యము) ప్రయాణముచేయఁ దలఁచినయెడల నారాజ్యము సరిహద్దునకును సముద్రప్రాంతప్రదేశములకును మధ్యనున్నయొక కొండలవరుస మీరలుదాటవలసియుండును. ఈపర్వతపంక్తి పశ్చిమతీరము పొడవుననువ్యాపించియున్నది. ఆపర్వతపంక్తినిదాటి దేశమధ్యమునకుఁబోవుటకు మార్గములుగలవు. తక్కిన ప్రదేశమంతయు శిలామయమై సాంద్రారణ్యావృతమైయుండును. సముద్రతీరమునందానరసింహరాజ్యములోఁ జేరినపట్టణములు పెక్కులుగలవు. ఆపట్టణములతోనెమ్మదిగా వ్యాపారము చేయుచుండుటయెగాక పెక్కుస్థలములయందు కార్ఖానాగృహములనుగూడఁ గట్టియున్నారము



ఈకొండలవరుసకుఁ బైనవిశాలమగునట్టి పీఠభూమిగలదు. అందుకొండలవరుసలు లేవుగాని చిన్నవియగు గుట్టలుమాత్రమందందుఁగలవు. తక్కినదేశమంతయు,పోర్చుగలుదేశములో "సాంటారమ్" లోని (*Ssantarem*) బయళ్ళవలెనుండును. భటకల్లునుండి నూటయిరువదిమైళ్ళ దూరమునందున్న సందూరునకుఁబోవుబాటలోమాత్రమే యరణ్యావృతములగుకొన్ని పర్వతపంక్తులుగలవు ఆబాటప్రక్కను జలపూర్ణములయిన ప్రవాహములు పెక్కులు ప్రవహించుచున్నవి. అందువలన భటకల్లునందు వాణిజ్యమునకుగాఁ బ్రతిసంవత్సరమును నయిదారువేల యెడ్లుసరకులను మోచుకొనివచ్చుచుఁబోవుచున్నవి. ఈపర్వతపంక్తులకడఁదక్క దేశమునందెచ్చటనొగాని యడవులు దట్టముగాలేవు ఒక్కొక్కచోట మూడునాలుగుక్రోసులదూరము చెట్లగుంపులమధ్యనుండి మీరు పోఁగలరు. నగరములలోను పట్టణములలోను పల్లెలలోను మా

మిడిచెట్లు పనసచెట్లు చింతచెట్లు మొదలగు నానావిధఫలవృక్షములుగలవు. అయ్యవి ప్రయాణముచేయు వణిక్కులకు విశ్రమస్థానములుగానున్నవి. రేకలమనుపట్టణమున (ఈపురమెద్దియోదెలియరాకున్నది) గొప్పవృక్షమొకటి (మఱ్ఱిచెట్టుకాఁబోలు) చూచితిని ఆధాత్రీరుహముక్రింద మూఁడువందల యిరువది హయములను గుఱ్ఱపుశాలలో గుఱ్ఱములను గట్టురీతిగాఁగట్టితిమి. దేశమునందంతటఁ జిన్నవృక్షములను మాత్రమేయనేకములను జూడఁగలరు.

ఈభూములు సారవంతములయినవయి చక్కఁగ వ్యవసాయముచేయఁబడునవిగా నున్నవి. పాడిపంటల కనుకూలములగు గోవులు, వృషభములు, దున్నలు, గొఱ్ఱెలు మొదలగు జంతువులు చాలినన్నిగలవు. అరణ్యములలోను నగరములోను గూడనుండునట్టి నానావిధములగు పక్షులు మనదేశముననున్న వానికంటె నధికముగాఁగలవు. మనభూములయందు పండనిపలువిధధాన్యములును కాయధాన్యములును దేశమునందంతట సమృద్ధముగానున్నవి. ధాన్యములలో మనుష్యభక్షకములగునవి మాత్రమేగాక యశ్వములకుఁ బనికివచ్చునవి కూడగలవు. మనదేశములోని బార్లిధాన్యమువంటి జాతిలేదు. గోధుమలుమంచివి పండుచున్నవి. దేశమంతయు నగరములతోను పట్టణములతోను పల్లెలతోను దట్టముగా నల్లుకొని జనసమృద్ధమైయున్నది. ప్రజలుతామునివసించు ప్రదేశముచుట్టును మట్టిగోడలను బెట్టుకొనుటకు రాజుసమ్మతించును. ఏదైననొక్కనగరము దూరముగా సరిహద్దుకడనున్నయెడల నానగరముచుట్టునుమాత్రము ఱాతిగోడకట్టుకొనుటకు రాజనుమతించునుగాని పట్టణములకు మాత్రమంగీకారమీయఁడు. కనుక వారలు నగరములలోఁ గోటలనునిర్మించెదరుగాని పట్టణములలో నిర్మింపరు. ఈదేశము సమభూమిగా నుండుటచేత నితరస్థలములకంటె నిచట వాయువెక్కువగా వీచుచుండును. అచట విత్తులను జల్లిపండిన తరువాత కోసి గానుగలలో నాడించి చము



రుతీసెదరు. ఈదేశము విశాలమైనదగుటచేత జలాధారములు తక్కువగానున్నవి. ప్రవాహములు కొన్నిగలవు. అందువలనఁ జెఱువులను త్రవ్వించుకొని కట్టలేర్పఱచి వర్షకాలమున జలమునిండించి కాపాడుకొని వానివలనఁ బ్రదుకుచుందురు. ప్రవాహములు ప్రవహించెడు చెఱువులవలన వారలు జీవించుచున్నారు. కొన్నిచెఱువులువర్షజలమేయాధారముగాఁగలవయియున్నవి. ఎందువల్లననగాఁ నెండిపోయినచెఱువులను మేమనేకములను జూచితిమి ప్రజలాచెఱువుల గర్భములయందు నడచుచునచ్చటచ్చట గొంచెమూఱిననుజాలునని నీళ్ళకై గుంటలు త్రొవ్వుచుండిరి. జలాభావమైయుండుటకుఁగారణమేమనిన మనప్రదేశములందువలె నిచట వర్షకాలము లేనందువలనఁ గలుగుచున్నది. ఒకసంవత్సరముకంటె మఱియొకసంవత్సరము భయంకరములైన గాలివానలు మాత్రము మెండుగాఁగలుగుచున్నవి. ప్రవాహముల జలములేక కేవలము వర్షాధారములయిన చెఱువులలోని జలము దాదాపుగానంతయు బురదగానుండి త్రాగుట కనుకూలముగాని స్థితిలోనుండును. అంత మడ్డిగానుండుటకుఁ గారణంబేమని యోజింపఁగా బలముగావీచెడు వాయుశక్తివలన దేశములోని దుమ్ముకొట్టుకొని వచ్చి యీచెఱువులలోఁబడుటయు, ఎడ్లు, దున్నలు, గుఱ్ఱములు, ద్విపములు మొదలగుజంతువులు నీరుత్రాగుటకువచ్చి త్రొక్కుచుండుటయు నని స్పష్టమగుచున్నయది. ఈభూమిలో నిచటిప్రజలుగోవులనుగాని యెడ్లనుగాని వధింపరని మీరు తెలిసికొనవలెను ఎడ్లు భారవాహకములగు జంతువులుగానున్నవి వారుగోవులను పూజింతురు. వారలదేవాలయములలోఁ జిత్రింపఁబడిన ఱాతిగోవులును ఱాతియెడ్లునుగలవు. వారలీదేవాలయముల కర్పించిన యెడ్లుపెక్కులుగలవు. అయ్యవి (ఆఁబోతులు) ప్రజలవలననెట్టి హానియుఁ బొందకయే నగరవీధులలో దిరుగుచుండును. ఇంతియగాక యీదేశములలో గాడిదెలుకూడనున్నవి. అయ్యవిచిన్నవి

గానుండి స్వల్పప్రయోజనమునకుమాత్రమే యక్కఱకువచ్చుచున్నవి. బట్టలు బాగుచేయువారలా బట్టలను వీనిపైవైచి గొనిపోయెదరు. నరసింహరాజ్యమునందుతొమ్మిదివందలమైళ్ళు సముద్రతీరముగలదు. భటకల్లునుండి యుత్కలరాష్ట్రమువఱకు దూరము పదివందల నలువదియెనిమిదిమైళ్ళు గలదు.

గ్రంధవిస్తరభీతివలన నేనుజూచిన నగరములను బట్టణములను పల్లెలను వర్ణించుటనుమాని యొక్కధార్వాడనగరమును వర్ణించెదను. ఈపట్టణమున జ్ఞాపకార్థముగాఁగట్టిన కట్టడమొకటి గలదు. అట్టిదిమఱియెందునుగానరాదు. ఈపట్టణముచుట్టునుంగలమట్టిగోడ వలన సంరక్షింపఁబడుచున్నది. వెనుక చెప్పినటువంటిహేతువచేత ఱాతిగోడలేదు. దానికిఁబశ్చిమభాగమున రమ్యమైనది యొకటిగలదు. ప్రాగ్దిక్కునవిశాలమైన బయలుగలదు. మట్టిప్రాకారముచుట్టునుకందకముగలదు. ఈధార్వాడపట్టణమున నొకదేవాలయముగలదు. ఆదేవాలయమునకుమిగుల రామణీయకమగు గోపురముగలదు. ఆగోపురమునుబోలిన సొగసయిన గోపురము మఱియొకటిమిక్కిలిదూరమునకుఁబోయినఁగాని గానరాదు. ఆగుడియేకశిలతోఁజేయఁబడినదని యెఱుంగవలయును. దేవాలయద్వారము చిత్రశాస్త్రమునకనుగుణ్యములగుపనులతో నొప్పియున్నది. దేవాలయముచుట్టును జిత్రింపఁబడిన విగ్రహములుగలవు ఆదేవాలయపుఁబని రోమకదేశపురీతినిఁ బోలియున్నయది. ఇంతియ్యగాక స్తంభములమీఁద నొకవిధమైనచిన్నతలవాకిటి వసారగలదు. ఱాతితోఁజేయఁబడినయీస్తంభములు పీఠములపైఁజక్కఁగానమర్పఁబడి యిటాలియా దేశమున నిల్పఁబడురీతిగా నున్నవి.

స్తంభములకడ్డముగా వేయఁబడినవి ఱాతిదూలములేగాని బల్లలుగాని కఱ్ఱలుగానికావు. భూమిపైవెలుపలను లోపలనుగూడ నొకేవిధమగు ఱాతిపలకలతోఁ జప్టాచేయబడియున్నయది. దీనికంతకును పాలగచ్చుచేయఁబడిన బలముగల చుట్టుగోడగలదు.



దానికి మూఁడుద్వారములుగలవు. ఆద్వారములు పెద్దవియు సొగసయినవియుగానున్నవి. ఇందులో నొకటి తూర్పుముఖముగలిగి గర్భముననున్న యాలయద్వారమున కెదురుగా నుండియున్నది. ఈద్వారమున కానుకొని గర్భాలయమున కెదురుగా వసారాలుగలవు. వానిలోయోగులు కూర్చుండెదరు. ఈయావరణములో పలఁజిన్నదేవాలయములు పెక్కులుగలవు. అవన్నియు నెఱ్ఱనివర్ణములుగలవయి యున్నవి. ఈయాలయములలో వారలుగొల్చెడు విగ్రహములుగలవు ఈవిగ్రహము లనేక విగ్రహములుగానున్నవి. పురుషులను స్త్రీలను, వృషభములను కోతులనుబోలినవిగానుండుటయేగాక మఱికొన్ని సుంద్రముగా గుంపులనుబోలియున్నవి. ఈదేవాలయములో నొక విగ్రహము మనుష్యశరీరమును ఏనుగు మొగమునుగలిగి యొక్కొక్కప్రక్క మూఁడేసిచేతులను గలిగియుండెను*(వినాయకుఁడయి యుండవలెను). నాలుగుచేతులావఱకె యూడిపోయినవఁట! తక్కినవన్నియు నెప్పుడు పోవునో యప్పుడు ప్రపంచము నశించిపోవునని చెప్పిరి. ఈవిషయమున వారికిగట్టినమ్మకముగలదు. ఆవిగ్రహమునకు వారు ప్రతిదినమాహారముపెట్టెదరు. ఆవిగ్రహముతినునని వారుచెప్పెదరు ఆవిగ్రహ మాహారము భుజించుచుండఁగా నాయాలమునకు సంబంధించినస్త్రీలు విగ్రహమున కెదురుగా నృత్యము సేయుచుండిరి. వీరలకుఁబుట్టిన బాలికలందఱు నీదేవాలయమునకు సేవచేయవలసినవారలని చెప్పుదురు. ఈస్త్రీలుతుచ్ఛప్రవర్తనముగలవారలై నగరములోని మంచివీధులలో నివసించెదరు. వారలుమిక్కిలిగౌరవముగాఁ జూడఁబడుచుండిరి. వారలు మర్యాదగల తరగతులలోఁజేర్పఁబడియుండిరి. వారలుకొందఱు దండనాయకులకునుంపుడుకత్తెలుగానుండిరి. ఎట్టి గౌరవముగలవాఁడును వారలయిండ్లకుఁబోయినపుడు నిందార్హుఁడుగాఁ జేయఁబడఁడు. ఈస్త్రీలు రాజభార్యలవద్దకుఁ బోవుటకు సయితము నధికారము గలిగియుండిరి.

వీరలు వారితోఁ గలసి తాంబూలచర్వణము చేయుదురు. ఆపని మొట్టిగొప్పవాఁడును జేయరాదు. ఈదేశమునఁ బెక్కండ్రు తమలపాకులనువక్కలను నమలెదరు. కొందఱు మాంసమును భుజింతురు,

అన్ని విధములయిన మాంసములను భుజింతురుగాని గొడ్డుమాంసమును పందిమాంసమును భుజింపరు కాని యొక్కదినమయినను తములపాకులునమలకుండనుండలేరు. ఈపట్టణమును విడిచి వెళ్ళినతరువాత నిచటకునేఁబదినాలుగుమైళ్ళ దూరముననున్న విజయనగరముఁ జేరితిమి. ఆవిజయనగరము నరసింహరాజ్యమునకు రాజధానిగనుండెను. అందు రాజెపుడు నివసించుచుండును. నగరములును గ్రామములును బెక్కులుగలవు. నగరమున కాఱుమైళ్ళకీవలనే యడ్డముగాఁ గొండలవరుసగలదు. దానిగుండామార్గములుగలవు. వానికేద్వారములనిపేరు. ఆద్వారములగుండఁబోవలయునేగాని నగరములోనికిఁబోవుటకు వేఱుమార్గములు లేవు. ఈకొండలవరుస డెబ్బదిరెండుమైళ్ళపొడవుగలిగి యీమహానగరమునుజుట్టియున్నది. ఈపంక్తికిలోపలనంటి చుట్టుకొనియున్న యితరపంక్తులనేకములుగలవు. ఈపంక్తులలోనెచటనయిన సమభూమియున్నయెడల నచటబలాఢ్యమగు గోడకట్టబడియున్నవి. ఈరీతిగాఁ గొండలన్నియు మూసివేయబడియున్నవి. జనులునడచుటకు బాటలేర్పఱుపఁబడి యీబాటలీద్వారములగుండఁబోవును. ఈద్వారములకడఁ జిన్నగుహలుగలవు. ఈగుహలలోనుండి రక్షకభటులు ద్వారములను సంరక్షించుచుందురు. ఈయావరణములలోపల వరిమొదలగుధాన్యములు పండు బయళ్ళును, నిమ్మలు, నారింజలు పనసలు, మామిళ్లు మొదలగు ఫలవృక్షములతోనున్న తోటలునుగల సారవంతములయిన భూములునుగలవు. ఈకొండలవరుసలకు మధ్య జలాశయములు పెక్కులుగలవు. వానియాధారములవలననే పయినుదహరించినభూములు సాగుబడి చేయఁబడుచున్నయవి. ఈపంక్తులలో నడవులుగాని చిన్నపొదల మాసికలుగాని



లేవు. ఇంతియగాక పచ్చగానున్న మఱియేమొక్కయును లేదు. ఈకొండలు మేమెన్నఁడు చూడనివింతలుగానున్నవి. ఇవన్నియుఁ దెల్లనిఱాళ్ళతోనిండియున్నవి. ఒకదానికొకటి సంబంధము లేకుండ నొకదానిపై నొకదానినమర్చి శిల్పివ్యాపారకౌశలమును జూపుచున్నట్లుగా గండశైలములు గుప్పతిప్పలుగాఁ బడియున్నవి. విజయనగరమీకొండల మధ్యనిర్మింపఁబడి వీనిచేఁ జుట్టుకొనఁబడియున్నది ఈకొండలవరుస దక్కనురాష్ట్రము వఱకును, ఏడిల్‌ఖానుని రాజ్యపుసరిహద్దువఱకును వ్యాపించియున్నది. వీనిమీఁదపూర్వము నరసింహరాజ్యమునకుఁ జెందిన రాచూరుదుర్గముగలదు. ఈదుర్గముకొఱకు నెడతెగనియుద్ధములు జరుగుచుండెను

విజయనగరపురాజు (కృష్ణరాయలు) ఏడిల్‌ఖానునుండి దీనినిగైకొనినాఁడు కనుక యీవరుసలు రెండు రాజ్యములను గలియకుండ నిరంతరమును బోరాడునట్లు చేయుచున్నవి. ఉత్కళరాష్ట్రముప్రక్కను సయితము కొండలవరుసలు గలవుగాని యవివేఱుగానున్నవి. ఈవరుసలు పల్లముగానుండి వీనిమధ్య విశాలములగు బయళ్ళనుగలిగియున్నవి. గోవానగరమునుండి వచ్చిన బాటయొకటి మొదటికొండలవరుసలోఁగల ద్వారములలోనొకద్వారముగుండ నగరములోఁ బ్రవేశించుచున్నది. పడమటిప్రక్కనిదియే ప్రధానమైన ద్వారమగుటచేత గోడలచేతను బురుజులచేతను సురక్షితమై యొప్పెడుపట్టణమొకటి (నాగలాపురము) రాజుచే మొదటి పంక్తిలోపలఁ గట్టఁబడినది. ఈద్వారమునకుండు తలుపులును బురుజులును మిక్కిలిబలాఢ్యములయినవి. ఇతరనగరములలోని గోడలు వంటివిగాక యీగోడలుపాలగచ్చు చేయఁబడి వేఱెచ్చటను గానరానట్టివిగానున్నవి. లోపలమిద్దెటిండ్లవలె బల్లపఱుపుగానున్న కప్పులనుగలట్టి సొగసయినకట్టడములచే నిరుపార్శ్వములయందలంకరింపఁబడినవీధుల పంక్తులు రమ్యముగానున్నవి. ఈప్రదేశము జలసమృద్ధిగలిగియుండుటచేతను రాజుయొక్క ప్రో

త్సాహముచేతను గౌరవార్హులగు వర్తకులు పెక్కండ్రు వచ్చి యిచటఁ గాపురముండియున్నారు.

ఇంతియగాక యీభాగమునందు రాజొకగొప్పచెఱువుత్రవ్వించియున్నాఁడు. ఇయ్యది రెండుకొండల ముఖద్వారమున నిరుపార్శ్వములనుండివచ్చెడు జలమచ్చటఁజేరునట్లుగాఁద్రవ్వింపఁబడినది. మఱియుఁగొండలవరుసకావలిభాగమునందలి పల్లపు ప్రదేశములలోనినీరు తొమ్మిదిమైళ్ళదూరమునుండివచ్చిపడునటులఁ గొట్టములమర్పఁబడియుండెను. ఈజలముపొంగి యొకచిన్ననదివలెఁబ్రవహించునొకచెఱువునుండి తెప్పింపఁబడుచున్నది. ఈచెఱువులో సొగసుగాబొమ్మలతోఁజిత్రింపఁబడిన మూడుస్తంభములుగలవు. ఇయ్యవి గొన్నిగొట్టములతో సంధింపఁబడియుండుటచేత వరిపొలములను తోటలను సాగుబడిచేయవలసివచ్చినపుడు జలమును లాగుకొనుచుండును. ఈచెఱువును ద్రవ్వించుటకు పైనుదహరింపఁబడినరాజు (కృష్ణరాయలు) చెఱువు నావరించుకొనియున్న భూభాగమునుగప్పియున్నకొండను బ్రద్దలుగాఁగొట్టించెను ఆచెఱువులోఁబనిచేయుచున్న పదునైదు లేకయిరువదివేల జనులను నేనుజూచియున్నాను. వారునడిచెడు భూమికనుపింపకుండుటచేత వారెల్లఱునుజీమలనుబోలియున్నారు.

రాజీచెఱువును తనసేనానాయకులకు విభాగించియిచ్చి వారలకు నియమింపఁబడినభాగములను కూలీలచేఁద్రవ్వించి పూర్తిచేయించుటకు వారినినుత్తరవాదులనుగాఁ జేయుట వలన శీఘ్రకాలములోనె పూర్తిఁజేయఁబడినది. ఈచెఱువు రెండుమూడుసారులుబ్రద్దలయిపోవుటవలన నేమికారణమనిరాజు (కృష్ణరాయలు) తనకులగురువులగు బ్రాహ్మణులతో నాలోచింపఁగా వారలుజలదేవతకాగ్రహమువచ్చినదనియు మనుష్యులను, హయములను, దున్నలనుజంపి వానిరక్తమునుబలియిచ్చినఁగాని కార్యకారికాదనిచెప్పినందువలన నాతఁడుదేవాలయముఖద్వారమున నఱువదిమనుష్యు



లను, గుఱ్ఱములను, దున్నలనుసఱికింప నుత్తరువుచేసెను. ఆ ప్రకారముజరిగింపఁబడెను. (ఇట్లునూన్యెనీజకూడ వ్రాసియున్నాఁడు) ఈబ్రాహ్మణులు మనలో [క్రైస్తవులలో] సన్యాసుల వంటివారుగానున్నారు వారువారిని శ్రోత్రియులనుగాఁ జూచెదరు. నేను బ్రాహ్మణ పురోహితులను గుఱించియు, దేవాలయములకు సంబంధించిన పూజారులను గుఱించియు మాట్లాడుచున్నాను. ఎందువల్లనఁనగా అనేకబ్రాహ్మణులనురాజుకలిగియున్నాఁడు. వారెల్లఱును నగరములలోనుబట్టణములలోను రాజకీయోద్యోగీయులుగానున్నారు. కొందఱువర్తకులుగానున్నారు. మఱి కొందఱు స్వార్జితమువల్లను వ్యవసాయమువలనను వారలతోటలలోఫలించు ఫలవిక్రయములవలన జీవించువారుగానున్నారు. దేవతార్చనములను సలుపువారుపండితులుగానున్నారు. వారుమాంసములనుగాని మత్స్యములనుగానిభుజింపరు. పయిన నేనుదహరించిన యితర బ్రాహ్మణులుగూడ మాంసములనుగాని మత్స్యములనుగానిభుజింపక బియ్యమును శాకములను ఫలములనుభుజింతురు వారెల్లరును వివాహములను జేసికొన్నవారు. వారిభార్యలు శృంగారవతులయియున్నారు. వారిభార్యలుగృహములను దఱుచుగావదలిరాక నెమ్మదిగాఁగాలముగడపువారుగానుండిరి స్త్రీలు ప్రకాశమయినవర్ణముగలవారుగానున్నారు. ఈబ్రాహ్మణజాతిలోఁ జక్కని స్త్రీపురుషులున్నారు ఇతరజాతులలోఁ జామనచాయఁగలవారు కొందఱున్నను వారువిక్కిలి తక్కువగానున్నారు

ఈకొత్తనగరము (నాగలాపురము) తనభార్యయందుఁగల ప్రేమాతిశయముచేఁగట్టించినాఁడు. (ఆమెపేరు చిన్నాదేవి యని వ్రాసియున్నాఁడు. నాగలాపురమని పేరెందుకుపెట్టెనో తెలియరాకున్నయది.) ఈనగరముబయలులోనున్నది. దీనిచుట్టు పౌరులు తోటలనుబెంచినారు. ఈనగరములోరాజు విగ్రహములనేకములుగలగుడియొకటినిర్మించినాఁడు. అదివిక్కిలిసొగసైన వస్తు

వుగానున్నది. చక్కఁగాఁగట్టఁబడిన బావులుకొన్ని గలవు. అందలిగృహములుమనగృహములవలె నంతరువులఁగలిగియున్నవి కావు వారివి బల్లపఱపుకప్పులనుగల మిద్దెలుగాను గోపురములనుగలవిగానునుండి మనగృహములను భేదించియున్నవి. రాజభవనములచుట్టునుగోడగలదు. ఆగోడకులోపల నిండ్లవరుసలు పెక్కులు గలవు. రాజునివసించుమందిరమునకుఁ బోవుటకు ముందు రెండు ద్వారములనుదాటిపోవలెను. ఆద్వారములను నాయుధపాణులగు భటులనేకులుగాచుచుందురు. వారలుసేనానులను,పనిగలిగినవారినిమాత్రమే పోనిచ్చెదరుగాని యితరులను బోనీయరు. ఈరెండు ద్వారములకుమధ్యను వసారాలను జుట్టునుగలిగియున్నసభామంటపముగలదు. ఇచటసేనానులునుగౌరవార్హులగు నితరప్రజలనురాజాజ్ఞనునిరీక్షించుచు వేచియుందురు.

ఈరాజు [కృష్ణదేవరాయలు] మిక్కిలిపొట్టియును పొడవునుగాక సామాన్యపెత్తుగలిగి సొగసుగులుకు ముఖవర్చస్సును స్థూలకాయమునుగలిగి సుందరాకారముతో నొప్పుచుండెను. వాని ముఖముమీఁద స్ఫోటకపు మచ్చలుగలవు. అతఁడుభయమును గలిగించునట్టియు పూర్ణప్రజ్ఞఁ గలిగియున్నట్టియు సంతోషస్వాంతుఁడుగా నున్నట్టియు, మిక్కిలి యుల్లాసము గలట్టియు రాజుగా నుండెను. విదేశీయులనుసన్మానించుటకును వారలదయతోనాదరించుటకును వారిస్థితిగతులెట్టివైనను వారి వ్యాపారములను గుఱించి తెలిసికొనుటకును నపేక్షించువాఁడుగానున్నాఁడు. అతఁడున్యాయబుద్ధిగల గొప్పప్రభువుగా నున్నాఁడుకాని యొక్కొకప్పుడాకస్మికముగా నురహంకారమును బొందు చుండును. ఇతనికి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, శ్రీకృష్ణదేవమహారాయలని బిరుదములనేకములుగలవు. సేనలోగాని రాజ్యములోగాని యాతనికన్న నధికముగాఁ గలవాఁడు మఱియొకఁడులేనందునను, సమస్తవిషయముల యందును



పరిపూర్ణ సామర్థ్యముగలవాఁడయి యుండుటవలనను, అట్టిబిరుదములను వహించియుండెను. ఈరాజుత్కల (*Uria*) దేశపు రాజుతో నిరంతరమును యుద్ధముచేయుచుండును. ఇతఁ డాతని దేశముపయి దండెత్తిపోయి పట్టణములను పల్లెలను రూపుమాపి వానిసైనికులను ఏనుఁగులను నోడించి వాని పుత్త్రుని ఖైదిగాఁ బట్టుకొని విజయనగరమునఁ బెక్కుదినములుంచెను. అతఁడచ్చటనే చనిపోయెను. ఉత్కలదేశపురాజు తనకూఁతు నీరాజునకిచ్చి వివాహముచేసి సంధిచేసికొనినందువలన సఖ్యతగలిగియుండెను. ఈరాజునకు శాస్త్రీయముగా వివాహముచేసికొన్న భార్యలుపన్రెండుగురుగలరు. అందుమూవురు తమ పుత్త్రులు రాజ్యాధిపత్యము వహింపనర్హులుగావున వారలను బట్టపుదేవులందురు. తక్కినవారి పుత్త్రులకట్టి యధికారములేదు. ఈమూవురులో నొకతె యుత్కలదేశపురాజు కొమార్తె. మఱియొకతె రాజునకులోఁబడిన శ్రీరంగపట్టణప్రభువుగానున్న వానికొమార్తె. మూఁడవభార్యరాజుసింహాసనము వహించుటకుఁబూర్వము తానుప్రేమించిన యొకవారాంగనాపుత్త్రిక. (ఈమెయే చిన్నాదేవి) రాజు సింహాసనము వహించినపుడు తన్నుభార్యఁగా గ్రహింపవలసినదిగాఁగోరి యారీతినినాతనిచే నామెవాగ్దత్తమును పొందినదిగావున వారాంగనాపుత్త్రిక పట్టపుదేవియయ్యెను.

ఆమె యెడఁగలప్రేమచే రాజు నూతననగరమును గట్టించినాఁడు. (పేరుదహరింపఁబడలేదు.) ఈభార్యలలో నొక్కొక్కతెకు నొక్కొక్క గృహముకట్టఁబడి యీయఁబడెను. వారలకు చెలికత్తెలు (వివాహములేని కన్యలు) దాసీజనములు, ఆడు నౌకరులు, రక్షకురాండ్రు మొదలగు పరివారము గలదు. అందఱును స్త్రీలేగాని పురుషులు గారు. వారుండు స్థలములకుఁ బురుషులు పోరాదు. కొజ్జాలు వారలను సంరక్షించుచుందురు. ప్రభువునాజ్ఞను బడసి గొప్ప కుటుంబమున జనించిన యేవృద్ధుఁడైనను ఈ

యంతఃపురస్త్రీలను జూడవచ్చునుగాని యితర పురుషుఁడెవ్వఁడును జూడరాదు. వారు బయలకుఁ బోఁదలంచిరేని యొకులకుఁ గానరాకుండ సవారులలోనఁ గూరుచుండఁబెట్టఁబడి బురకాలు వేయఁబడి మూఁడు నాలుగు వందల్ల కొజ్జాలు చుట్టును నుండి కావలి గాచుచుండఁగాఁ గొనిపోఁబడుచుందురు. జనులందఱును దూరముగాఁ దొలఁగుచుందురు. ఒక్కొక రాణియొద్ద నమితధనమును, జవాహిరియును, రత్నములును మొదలగునవి యుండునని వారు చెప్పినారు. నవరత్నఖచితములై యమూల్యములగు నాభరణములను ధరించిన కన్య లరువదివఱకు నొక్కొక్క పట్టపుదేవికిఁ గలరని తెలియవచ్చినది. వీరలను దరువాత మేముచూచి విస్మయముఁ బొందినారము. వీరలను మేము కొన్ని యుత్సవములలోఁ జూచితిమి. ఆయుత్సవమునుగుఱించియు, వారలు వచ్చిన రీతిని గుఱించియు ముందు దెలిపెదను. లోపల నీకన్యలతోఁ గూడఁ బండ్రెండువేల స్త్రీలున్నారని వారు చెప్పుచున్నారు. కత్తులు కటారులు ధరించుస్త్రీలును, మల్లయుద్ధముచేయు స్త్రీలును, బాకాలూఁదు స్త్రీలును, ఇంక నితర యంత్రములమీఁద పనిచేయు స్త్రీలునున్నారని మీరు తెలిసికొనవలెను. మఱియు వాహనములు మోచువారలు, బట్టలు బాగుచేయువారలు, ద్వారములు గాచువారలు స్త్రీలుగానుండిరి. ఈపట్టపురాణులొకరికంటె నొకరు మిన్నగాకుండునటుల సమానస్థితియందుంపఁబడిరి. అందువలన వారల కొండొరులయెడ నసూయలులేవు వారందఱు సఖ్యతఁ గలిగి యుండిరి. తన యంతఃపురమందిరమున రాజు నివసించుచుండును. తన భార్యలలో నెవతె తనవద్దనుండుటకు నిశ్చయించునో యప్పుడొక కొజ్జాను బంపి యామెను బిలిపించుకొనుచుండును. కొజ్జా యామెయున్న స్థలమునకుఁ బోక యక్కడ కావలిగాచుచున్న రక్షకురాండ్రకుఁ జెప్పఁగా వారలు పోయి రాయలవద్దనుండి వర్తమానము వచ్చెనని చెప్పుదురు.



అంతట చెలికత్తెవచ్చి యామెకు కావలసిన దానినిచ్చును. పిమ్మట రాణి రాజునొద్దకుఁబోవునులేక రాజు రాణివద్దకువచ్చును. ఇటుల నితరభార్యలకుఁ దెలియకుండఁ దనకునిచ్చవచ్చినరీతి నామెతోఁగాలము గడుపును. ఈకొజ్జాలలో రాయలచేమిక్కిలి స్నేహభావముతోఁ జూడఁబడువారు కొందఱుగలరు రాజెచటనిద్రించునో వారచటనిద్రింతురు. వారల కెక్కువ జీతములీయఁబడును. ఈరాజు సూర్యోదయమునకు ముందుగాఁ బ్రతిదినము కొంచెమించుమించుగా సోలెడునువ్వులనూనె త్రాగుటకలవాటుపడినవాఁడు. ఆనువ్వులనూనెతోనే దేహమంతయు నలముకొనును. తరువాతనడుమునకొకచిన్న గుడ్డకట్టుకొని మంటితోఁజేయఁబడిన బరువులను భుజములమీఁదనుంచుకొనును. అటుపిమ్మట కత్తి తీసుకొని చమురంతయు దేహముననింకుపర్యంతము సాము చేయుచుండును. తరువాత తనవస్తాదులలో నొకనితోఁగుస్తీ పట్టుపట్టును. ఈపనిజరిగించినతరువాత నశ్వారూఢుండై తెల్లవాఱువఱకు విశాలమగుబయలులో నొకప్రక్కనుండి మఱియొకప్రక్కకు సవారు చేయుచుండును సూర్యోదయమునకుఁబూర్వముననే యింతపనియుఁ బూర్తిచేసికొనును. తరువాత స్నానము చేయుటకుఁబోవును.

అప్పుడు మిక్కిలి భాగ్యవంతుఁడును తనకిష్టుఁడును, అతనివలనఁబవిత్రుఁడుగా జూడఁబడువాడునగు నొక బ్రాహ్మణునివలన స్నానము చేయింపఁబడును. స్నానముచేసిన తరువాత నంతఃపురములోపలనున్న దేవాలయమునకుఁ బోయి కులాచారము ననుసరించి ప్రార్థనాదికర్మములను గావించుకొనును. పిమ్మట గోడలులేక తలవాకిటవసారను బోలియున్న కట్టడములోనికిఁ బోవును. ఆకట్టడమునందు తలపైవఱకు వస్త్రములచేఁ జుట్టఁబడిన స్తంభములనేకములుగలవు. గోడలకుఁ జక్కఁగా రంగుపూతపూయఁబడియుండెను. ఆభవనమున కిరుపార్శ్వములయందుఁ జక్కఁగాఁ జి

త్రింపఁబడిన రెండేసి స్త్రీవిగ్రహములు గలవు. అటువంటి భవనమునఁ దనరాజ్యమున నున్నతోద్యోగములం బడసినవారలతోఁ గలసి రాజకీయ వ్యవహారములను బరిష్కరింపుచు నగరములను బరిపాలించుచు తనకిష్టులగువారితో ముచ్చటించుచుండును. అతనికిష్టులగువారిలో ముఖ్యుఁడు తిమ్మరుసు (మంత్రియగు సాళువతిమ్మరాజుగారు) నా నొక్క వృద్ధబ్రాహ్మణుఁడు గలఁడు.

అతఁడే గృహనిర్వాహకభారము సమస్తమును వహించినెఱవేర్చుచుండును. ప్రభువులెల్లరును రాజుపట్లనేరీతిగా సంచరించెదరో యాతనిపట్లఁగూడ నట్లే ప్రవర్తింతురు. వీరలతోఁ దనకిచ్చవచ్చిన ప్రసంగమును జరిపినతరువాత రాజు ప్రభువులును సేనాధిపతులును వచ్చుటకనుజ్ఞయిచ్చు. వారలు రాజునకు వందనముచేయుటకు శీఘ్రముగ రాజసమ్ముఖమునకు వచ్చెదరు. వచ్చినతోడనే రాజునకు వందనములాచరించి దూరముగా ఘుండుగోడలపొడుగునను నిలువంబడుదురు. వారలొకరితో నొకరు మాట్లాడరు. తాంబూలచర్వణముఁ జేయరు. వారలు తమచేతులను చొక్కాయిజేబులలో నుంచుకొని కన్నులదృష్టి భూమిపై నిగుడఁదలవాంచి నిలువంబడియుందురు. రాజెవనితోనైన మాట్లాడఁదలఁచినయెడల రెండవమనుష్యునిద్వారా మాట్లాడుచుండును. రాజెవనిఁ బలుకరించునో యాతఁడు కన్నులెత్తి రాజడిగిన ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరములిచ్చి మరలనెప్పటివలె నిలువంబడును. రాజుసెలవిచ్చుపర్యంతము వారచటనే నిలువంబడియుందురు. తరువాతనతని యుత్తరువునుబొంది యతనికి నమస్కరించియావలకుఁబోవుదురు.

వారిలో నధికమర్యాద సూచకమై యనుశ్రుతముగా వచ్చుచున్న నమస్కారమనఁగాఁ జేతులు రెండును దగ్గఱగాఁ జోడించుకొని సాధ్యమగునంతవఱకుఁ దలకుపైఁగా నెత్తుటగానున్నయది. మేమీదేశమునకు వచ్చినప్పుడు రాజీనూతననగరమున (నాగలాపురమున)నున్నందున సుందరవస్త్రాలంకారభూషితులమై తనతోవ



చ్చినపోర్చుగీసువారమగు మమ్ము వెంటబెట్టుకొని క్రిస్టోవాడెఫిగరీడో (Christovao de Figueiredo) రాజును దర్శించుటకుఁబోయెను. రాజువానినిదయతో నాదరించి యతనియెడ సుహృదయుఁడై యుండెను. తనస్వజనమును జూచినట్లుగానేచూచి రాజుమిక్కిలి సంతోషముగలవాఁడయియుండుటయేగాక యతనితోఁ గూడవచ్చిన మాపట్లఁగూడ సాదరహృదయముగలవాఁడై తనసంతోషమును దేటపఱచెను. రాజుమమ్ము స్పర్శించునంతసమీపములోనుంటిమి. అంతట క్రిస్టోవాడెఫిగరీడో గోవాపరిపాలకుఁడును సేనాధ్యక్షుఁడునునగు "రైడిమెల్లో" (Ruy de Mello) వద్దనుండి తెచ్చినజాబులను, అతనికొఱకుఁ దెచ్చిన నజరానాలును రాజునకు సమర్పించెను. అయ్యవిగైకొని రాజుమిక్కిలిసంతసించెను. అందులో నతఁడు తెచ్చిన సంగీతమును పాడుయంత్రములను ఆటవస్తువులను గాంచి యమితసంతోషమునుబొందెను.

రాజు సువర్ణమయములగు గులాబీపుష్పములతోఁ జిత్రింపఁబడిన శ్వేతాంబరములను ధరించియుండెను. అమూల్యమయినట్టి వజ్రములపతకమును మెడలో నలంకరించుకొనియుండెను. సొగసయిన పట్టుతోమూయఁబడియున్న గెలీసియాదేశపు శిరస్త్రాణము (Galiciah helmet) వంటి రీతుగానున్న సరిగె బుట్టావేసిన పట్టుకుళ్లాయి శిరస్సునధరించియుండెను. అతఁడు పాదరక్షలులేకయేయుండెను. ఎవ్వఁడును పాదరక్షలు తొడుగుకొనియాతనిసన్నిధానమునకు రారాదు. దేశములోఁ బెక్కండ్రు పాదరక్షలులేకయే తిరుగుచుందురు. రాజు సెలవిచ్చిపంపునపుడు 'క్రిస్టోవాడెఫిగరీడో' కు సరిగెబుట్టావేసిన పట్టుయుడుపొక్కటియును కుళ్లాయియొక్కటియును బహుమానముచేయుటయేగాక మాలో నొక్కొక్కనికిసుందరవిగ్రహములతో నచ్చొత్తఁబడినవస్త్రములను బహుమానముచేసెను. తమయాచారమర్యాదల ననుసరించియు, మాయెడఁగల స్నేహము ప్రేమమును దలంచియు రాజిట్టి బహుమానములను

గావించెను. క్రిస్టోవాడైఫిగరీడో రాజువద్దసెలవుగైకొని విడిచి పెట్టఁబడినతరువాత నీనూత్ననగరమునకు మూఁడుమైళ్ళ దూరముననున్న విజయనగరమునకుఁ బోయితిమి. మేమచటనివసించుటకు రాజుమంచిగృహములనిప్పించెను.

రాజుపక్షమున ప్రభువులును సేనాధిపతులును ప్రతిదినము వచ్చి "క్రిస్టోవాడై ఫిగరీడో" గారితో మాటలాడి పోవుచుందురు. రాజు వానికి గొఱ్ఱెలను, కోళ్ళను, వెన్నయును, తేనెయునుగలపాత్రములను, ఇతరములగు భోజ్యవస్తువులను బెక్కులుపంపించెను, అవన్నియు నాతఁడు తనతోవచ్చిన కాలిబంటులకును జనులకును వెంటనె పంచియిచ్చెను. రాజువానితో సాదరపుంబలుకులు పలుకుటయేగాక పోర్చుగల్ దేశపు రాజుస్థితినిగురించియు నింకను జనకుసంతోషకరములగు నితరవిషయములను గుఱించియు నడిగితెలిసికొనెను. ఇఁక విజయనగరమునుగుఱించి ముచ్చటింతము నాగలాపురమునుండి విజయనగరమునకు నొకవీధిపోవుచున్నది. ఆవీధికినిరుప్రక్కలను నిండ్లవరుసలు చక్కఁగాదీర్చియున్నవి బాటసారులకు నీడనిచ్చుటకై వృక్షములు రెండుప్రక్కలను నాటింపబడియున్నవి. ఈవీధిలో సమస్తవస్తువులను విక్రయించు నంగడులుగలవు. ఈవీధిలో రాజుసుందరమైన యనంతశయన దేవాలయమును గట్టించెను. ప్రభువులును సేనానులునుగట్టించిన దేవళములుగూడఁ గలవు. ఈనగరముచుట్టును బరువుగల పెద్దరాళ్ళతోఁ గట్టఁబడిన గోడగలదు. అదిమిక్కిలి బలాఢ్యమైనదిగాని ప్రస్తుతము కొన్నిచోట్ల శిథిలమైయున్నది. అందు సురక్షితములైయున్న దుర్గములుగలవు. ఈగోడకుప్రక్కను నచ్చటచ్చట పల్లపుప్రదేశములందు నీటిచేనింపఁబడిన కందకములుగలవు. దానికివెలుపలగానట్టిదే మఱియొకగోడగలదు. మనుష్యునిఱొమ్ముఁ దాకునంతయెత్తుగలిగి మొనలుతేలియున్న ఱాళ్ళుపాతఁబడియున్నవి. ఈగోడకొండలకుమధ్యనున్న పల్లపుప్రదేశములం దెత్తుగాఁ బెట్టఁబడి కొండలవఱకు వ్యాపిం



చియున్నది. ఈగోడమొదలుకొని నగరముప్రవేశించుటకు మధ్యనెక్కువదూరముగలదుగనుక నాప్రదేశములయందు వరిపొలములును తోటలును దొడ్లును నీళ్ల కాలువలునుగలవు. ఈగోడయొక్క మొదటిపంక్తిగుండనీరుప్రవహించుచున్నయది. ఏళ్ళుపాఱుచుండుట వలనఁ జెఱువులుజలపూర్ణములై యున్నవి. ఇచట ఫలవృక్షముల తోఁగూడిన తోటలును, ఒకచిన్న తాళ్ళగుంపును, అనేకగృహంబులునుగలవు. నగరముయొక్క మొదటిద్వారముకడకు వచ్చుటకు ముందు మీరొక నీటికాల్వనుదాటి మలుపుతిరిగిన బలాఢ్యముగు నొకఱాతిగోడవద్దకు వచ్చెదరు. ఈద్వారమున కిరుప్రక్కలనుండు రెండుబురుజులును దానినిగాపాడుచున్నవి. ఆద్వారముమిక్కిలి సొగసయినట్టియు, పెద్దదగునట్టిదియునై యున్నది. ద్వారమును దాటి లోపలకుఁబోవఁగానే రెండుచిన్న దేవళములు గనుపించును. ఒక దేవాలయ ప్రాకారములోపల వృక్షములును మఱియొక దేవాలయ ప్రాకారములోపల నిండ్లునుగలవు. ఈమొదటి ద్వారమునఁగలకుడ్యము నగరమునంతనుజుట్టివచ్చుచున్నది. మఱి కొంతదూరముపోయినతోడనే మఱియొకద్వారమును గోడయుఁ గానుపించును. ఈగోడయును నగరమునంతను జుట్టివచ్చుచున్నది. ఇచటనుండి రాజభవనాంతఃపురము వఱకుఁగల మధ్యభూమియందు వీథులును, ఇండ్లవరుసలు, సేనానులయొక్కయు ప్రభువరుల యొక్కయు నందములగుమందిరములును గలవు. చూచుటకు వినోదకరములగు విగ్రహములతోనలంకరింపఁబడిన యిండ్లవరుసలు మనోజ్ఞములై యొప్పుచున్నవి. ముఖ్యమయినదగునట్టి పెద్దవీధిగుండ వెళ్ళునపుడు రాయల యంతఃపురభవనమునకెదుటనున్న గొప్ప మైదానమునకుఁ గొనిపోవుద్వారముగల ప్రధానమైనట్టిమార్గమొకటికలదు. దీనికెదురుగమఱియొక మార్గమునగరముయొక్క రెండవభాగమునకుఁ బోవుచున్నది. నగరమధ్యమున నుండి మిక్కిలి యుపయోగముగలది యగుటచేత నామైదానము గుండ సరకులు

మొదలగు వానినెక్కించుకొని బండ్లునడుపఁబడుచుండును. లిస్బొను [Lisbon] నగరమర్ధ [పోర్చుగల్ దేశపురాజధాని] మెంతస్థలమాక్రమించుకొనెనో యంతకంటెనెక్కువ స్థల మాక్రమించుకొనిరాయల మందిరముబలాఢ్యమై సురక్షితమైయున్న ప్రాకారముగలిగియున్నది.

ఇంకను గొంతదనుక నడచి యావల ద్వారముకడకుఁ బోయినదానితో సంబంధించి యిరుపార్శ్వముల రెండు దేవళములు గలవు. ఈరెండింటిలో నొకదాని ద్వారముకడఁ బ్రతిదినమును గొర్రెలను బెక్కింటిని జంపుచుందురు. ఈదేవాలయ ద్వారము కడఁదక్క నగరములో నెచ్చోటను హిందువుల యాహారము కొఱకుఁగాని బాజారులలో నమ్ముటకొఱకుఁగాని గొఱ్ఱెలను జంపరు. వానిరక్తముతో దేవళములోని విగ్రహమునకు బలులుసమర్పింతురు. గొఱ్ఱెకు నొక్కొక్కదానికి ఫార్థింగునకు (Farthing) సమానమగునట్టి నాణెమును సమర్పించి వానింజంపి తలలు దేవళములోని విగ్రహమునకు వదలి మొండెములు దాము గ్రహింతురు. ఈమృగసంహారకాలమునందు దేవాలయమునకు సంబంధించిన యోగి లేక గురువు (అర్చకుఁడు కాఁబోలు) తానచట నుండి గొఱ్ఱెతల నరుకఁబడిన వెంటనె విగ్రహమాబలిని గ్రహించెనని సూచించుటకుఁగా నొక కొమ్ముబూరా యూదును. ఇటు తరువాత నీయోగులు లేక జోగు లెటువంటివారో తెలియఁజెప్పెదను. (చరిత్రకారుఁడాసంగతిని మఱచిపోయి తరువాత వ్రాయనేలేదు.) ఈదేవళములకు దాపునఁ జిత్తరువులు చెక్కఁబడినట్టియు విగ్రహములతో నలంకరింపఁబడినట్టియు జయసూచకమయినరథమొకటి గలదు. సంవత్సరమున కొకసారి దేవతోత్సవము నాఁడు నగరవీధులగుండ రథమునూరేగింతురు. అదిమిక్కిలి పెద్దదగుటవలన మూలలఁ దిరుగనేరదు. ఇంకను ముందునడువ విశాలమును సొగసునుగలిగి, యిరుపార్శ్వములందు సుందరములగు గృహము



లవరుసలను గలిగియున్న నేనిదివఱకు పైననుదహరించి వర్ణించిన వీథులంబోలిన దొకవీథిగలదు. ఆవీథులలోనిగృహములు భాగ్యవంతులకు నివాసములయి యొప్పుచున్నవి. ఈవీథిలో వణిక్కులు పెక్కండ్రు నివసించుచున్నారు. ఇందు పెక్కురకముల కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు, మొదలగు రత్నములును, వస్త్రములును, ఇంకనుబ్రపంచములో దొరకునట్టి ప్రతి వస్తువును విక్రయింపఁబడుచుండును. ప్రతిసాయంకాలము నొక సంతజరుగును అచటసామాన్యములయిన గుఱ్ఱములు, గుఱ్ఱపుటట్టులు మొదలగు జంతువులుమాత్రమేగాక నబ్బపండ్లు, నిమ్మపండ్లు, నారింజపండ్లు, దాడిమపండ్లు మొదలగు ఫలవర్గము విక్రయింపఁబడుచుండును.

ఆవీథి కొనయందు మఱలనొకద్వారము గోడయును గానుపించును. ఆద్వారములోనుండిపోయిన యెడల నావల నొకవీథి గానుపించును. అచట కర్మకరులు (పంచాణులు) పెక్కండ్రునివసించుచున్నారు. వారలనేక వస్తువులను విక్రయించెదరు. ఇచట రెండుచిన్న దేవళములుగలవు ప్రతివీథియందును దేవాలయములుగలవుగాని ప్రధానములయినవియు గొప్పవియునగు దేవాలయములు నగరమునకు వెలుపలి ప్రక్కనేగలవు. ఈ వీథిలోనే క్రిస్టోవాన్డెఫిగరీడో (Christovao de Figuiredo) బసచేసియుండెను. ప్రతిశుక్రవారమునచటనొకగొప్పసంతజరుగును. అందుపందిపిల్లలు, కోళ్ళు, పక్షులు, ఎండుచేపలు మొదలగునవి విక్రయింపఁబడుచుండును. నగరములోఁ బ్రతిదినమునేదోయొకవీథిని యిట్టిసంతలుజరుగుచునేయుండును. ఈవీథికిఁ జివరమూరులను తురుష్కులనివాసస్థలముగలదు. ఇయ్యదినగరమునకుఁగూడఁ జివరనున్నది. ఆమూరులలోఁబెక్కండ్రు స్వదేశజులయి రాయలవలన వేతనములను బొందుచు నాతని రక్షకసైన్యములోఁ జేరిన వారుగా నుండిరి. వజ్రములు మొదలగునమూల్య మణులయొక్కయు నితర

వస్తువులయొక్క వర్తకమువిరివిగా జరుగుచుండుటచేత నామహానగరమున నన్నిజాతుల మనుష్యులునుగలరు. ఈనగర విస్తీర్ణతనుగురించి నేనువ్రాయను. ఏలయననయ్యది యొక ప్రదేశమున నుండి చూచుటకుఁగానరాదు. నేనొకకొండనెక్కి యెక్కువ భాగమునుజూడఁగలిగితినిగాని పెక్కుకొండలపంక్తులకుమధ్యనగరమంతయు నిమిడియుండుటచేతఁ గొంతభాగము గనుపించ లేదు. అచటి నుండి చూడఁగా నాకుఁ గనుపించిన భాగము రోమకపురి (*Rome, the capital of Italy in Europe*) యంత పెద్దదిగానుండి చూపునకు మిక్కిలిసుందరముగాఁ గానుపించినయది. దానిలోపలఁ జెట్లగుంపులనేకములు గలవు. ఇండ్లకుఁజేరినతోటలలో నీళ్ళకాలువలును నచటచటఁ జెఱువులునుగలవు. రాజు తనయంతఃపురమందిరమునకు సమీపమునఁ దాళ్ళవనమును, నానావిధఫలవృక్షములతోఁగూడిన తోఁపులను గలిగియుండెను. మూరులనివాసభూమికి దిగువనొక చిన్ననదియును, మామిడి తోటలు, పోకతోటలు, పనసతోటలు, జామితోటలు, నిమ్మతోటలు, నారింజతోటలు మొదలగుతోటలుదట్టముగానుండి పెఱుగుచు మహారణ్యమువలె నల్లుకొనియున్నవి. తెల్లద్రాక్షలుకూడ విశేషముగా గలవు. నగరములోనికివచ్చునీరంతయు మొదటి ప్రాకారమునకు వెలుపలనున్న వయిననేనుదహరించిన చెఱువులనుండి తేఁబడుచున్నది. ఈనగరములోనిజనసంఖ్య లెక్కించుటకలవిగానిదిగానుండుటచేతను నేనుదహరించినఁ గల్పితముగాను నతిశయోక్తిగానునుండునను భీతిచేత నుదహరింప మానినాఁడను.

ఇయ్యది (విజయనగరము) ప్రపంచములో సమస్తవస్తుసముదాయముచేతను నిండియున్న మంచి నగరముగా నున్నయది. గోధుమలు, వడ్లు, ఆనుములు, మినుములు, పెసలు, కందులు, ఉలవలు మొదలగుధాన్యములును, ప్రజల కాహారమై యీదేశములోఫలించు నితరధాన్యములును సమృద్ధిగాఁజేర్పఁబడి మిక్కిలిచౌకగాఁ విక్రయింపఁబడుచున్నవి. ఇతరధాన్యములవలె గోధుమలు మూరులచేఁ దక్క తదితరులచే నంతగా భుజింపఁబడుచుండలేదు. అందువలనఁ దక్కువగా నుండును. తప్పించుకొనిపోవుటకు వీలులేనంతదట్టముగా బరువులువేయఁబడిన యెడ్లు వీధులలోను బాజారులలోను లెక్కింప శక్యముగాక క్రిక్కిరిసియుండును. కోళ్ళు మొదలగుజంతువులు పెక్కులుగలవు. ఫణమునకు మూడు పక్షులు నగరములోను నగరమునకువెలుపల నాలుగుపక్షులును విక్రయింపఁబడుచుండును. కౌఁజుపిట్టలనేకము లీదేశములోఁగలవుగాని మనదేశములోనివంటివిగావు. ఈపక్షులన్నియును పందెపుజంతువులును మిక్కిలి చౌకఁగా బ్రతికియుండఁగానే విక్రయింపఁబడుచుండును. ఫణమున కాఱెనిమిదివఱకును కౌఁజుపిట్టలును, రెండు వఱకును కుందేళ్ళను విక్రయింపఁబడుచుండును



గువ్వలు, పావురములు మొదలగు పక్షులింకను నెక్కువగానే విక్రయింపఁబడుచుండును. పందిమాంసమును, గొఱ్ఱెమాంసము మొదలగు మాంసములనుగూడ విక్రయించెదరు. ఒక పందిపిల్ల వెల నాలుగయిదు ఫణములుండును. ఇవియును గాక నిమ్మలు, నారింజలు, అడవి వంగలు మొదలగు ఫలశాకవర్గములు ప్రతిదినము దేఁబడుచుఁ గుప్పతిప్పలుగా వేయఁబడి విక్రయింపఁబడుచుండును. వెన్న, పాలు, నెయ్యి, నూనె మొదలగునవికూడఁ బ్రతిదినమును నధికముగా విక్రయింపఁబడుచుండెను. ఫణమునకు మూఁడుగుత్తుల ద్రాక్షపండ్లును, పది దాడిమపండ్లును విక్రయింపఁబడుచున్నవి. ఈనగరమున కుత్తరముగా గొప్పనది (తుంగభద్ర) యొకటి ప్రవహించుచున్నయది. ఈనదికుత్తరపుటొడ్డున 'ఆనెగొంది' యను పట్టణము గలదు. అది పూర్వము రాజధానిగా నుండెనని చెప్పుదురు. అచట కొద్ది ప్రజలు మాత్రమే యిపుడు నివసించుచున్నారు. ఇప్పటికిని మంచి గోడలు గలిగి బలాఢ్యమై రెండుకొండల పక్కలమధ్య రెండు ద్వారములను గలిగి

చక్కఁగ నిర్మింపఁబడి యున్నది. ఇచట రాజకోటకు నొక సేనాధిపతి నివసించి యుండును. లోపల బెత్తముతో నేయఁబడి వెలుపల తోలు మూయఁబడిన తట్టపడవలలో నదిని దాటుచుండిరి. ఒక్కొక్క పడవలో నిరువండ్రు గూరుచుండఁగలరు.

అగత్యమైనయెడల గుఱ్ఱములును ఏనుఁగులునుగూడ నా పడవలనుండియే దాటింపఁబడుచుండునుగాని సాధారణముగా నయ్యవియీఁదుకొనిపోవుచుండును. నదులున్న ప్రదేశమునందెల్ల నీరాజ్యములోనిట్టి పడవలేగాని వేఱొండువిధములగు పడవలుగానరావు. అవితిన్నఁగాఁబోవక గుండ్రముగా జుట్లు తిరుగుచుండును. గొఱ్ఱెలు, మేకలు, పశువులు, దున్నలు మొదలగు జంతువుల సంఖ్యాకములుగా దేశమునందంతట గలవు. బాలురనేకులు గొఱ్ఱెలపై సవారిచేయుచుందురు.

ఉత్తరమున నగరప్రాకారములకు వెలుపల సుందరతమంబులగు మూడుగొప్పదేవళములుగలవు అందొకటి విఠలస్వామియాలయము. ఆనెగొందిపురమునకెదురుగాఁ గట్టఁబడియున్నయది. రెండవది హంపిదేవాలయమని సుప్రసిద్ధిఁగాంచిన విరూపాక్షాలయము. యాత్రికులచే నిది మిక్కిలిమహిమగలిగినదిగాఁ జూడఁబడుచున్నది. ఈదేవాలయములోఁ దూర్పుగానున్న ముఖద్వారమునకెదురుగా మిక్కిలిసుందరమగువీధి యింపుగాగట్టఁబడిన ఇండ్లును వసారాలునుగలిగి రమ్యమైనట్టిదియొకటిగలదు.

ఆయిండ్లలో యాత్రికులునివసించుచుందురు పెద్దతరగతుల జనులు నివసించుటకుఁగూడ నిండ్లుగలవు. ఆవీథిలోనేరాజా కమందిరమునుగట్టించెను. దేవాలయమునకు వచ్చినపుడు రాజచట నివసించును. ఈమొదటిద్వారముమీఁద నొకస్త్రీవిగ్రహము చిత్రింపఁబడియున్నది. ఈద్వారముపైనఁ బొడవైనగోపురముగలదు. ఆగోపురముమీఁద స్త్రీపురుషవిగ్రహములవరుసలును, వేటకృత్యాదిసూచకవిగ్రహములును ఇతరవిగ్రహములునుగడు ర



మ్యముగాఁ జిత్రింపఁబడియున్నవి. గోపురముపయికిఁ బోను పోను సన్నమగుచుండుటచేత విగ్రహముల పరిమాణముగూడ తగ్గింపఁబడుచువచ్చెను. ఈమొదటిద్వారము దాటినతోడనే యిట్టిదేమఱియొకద్వారముగల యావరణమొకటి గానుపించును. రెండవది మొదటిదానికంటెఁ గొంచెముచిన్నదిగానుండును. ఈరెండవద్వారముదాటినతోడనే ఱాతిస్తంభములమీఁద వసారలనుగలిగియున్నగొప్ప మండపముగానుపించును. ఆమండపమునకు మధ్యమున విగ్రహమున్నయాలయము (గర్భాలయము) గలదు. ముఖద్వారమునకెదుట నాలుగు స్తంభములుగలవు. వానిలోరెండుబంగారుపూతపూయఁబడినవిగాను రెండురాగివిగాను గానుపించినవి. కడపటివిచిరకాలము జరుగుటచేత బంగారుపూతపోయినవిగా నేనూహించితిని. తక్కిన స్తంభములురాగివిగానున్నవి. గర్భాలయద్వారమునకుసమీపముననున్నట్టిది యిప్పుడు ప్రభుత్వముచేయుచున్న కృష్ణరాయలచే నీయఁబడినదియుఁ దక్కినవియాతని పూర్వులవల్లను నీయఁబడినవిగానున్నవి.

గర్భాలయద్వారమునకు వెలుపలిభాగమంతయుఁ బైకప్పువఱకు రాగితోమూయఁబడి బంగారుపూత వేయఁబడినది కప్పునకిరుప్రక్కలఁ బెద్దపులులు మొదలగు మృగములయొక్క విగ్రహములు చెక్కఁబడి బంగారుపూత వేయఁబడినవి. గర్భాలయములోపలఁ బ్రవేశింపఁగానే ప్రతిస్తంభమునకును దీపపుగూండ్లుగలవు. ఆగూండ్లలోఁ బ్రతి రాత్రమును చమురుదీపములు వెలిగింపఁబడుచుండును. అట్టిదీపములు రెండువేలయేనూఱు లేకమూఁడువేలవఱకుఁగలవు. విగ్రహమున్నగుడిలోఁ బ్రవేశించుటకుమూఁడుద్వారములను దాటిపోవలెను. బ్రాహ్మణులనేగాని యితరులను జొనీయరు. నేను కొంత వారికి ముడుపుచెల్లించినందువలన వారలు నన్ను రానిచ్చిరి. ఆవిగ్రహ మాకారములేని గుండ్రనిరాయి (లింగము) గానున్నది. వారలావిగ్రహమునెడ నమితభక్తిఁగలిగి

యుందురు. ఈకట్టడముయొక్క వెలుపలిభాగమంతయు రాగితో మలాము చేయఁబడియున్నది.

* * * * * * * * *

విగ్రహారాధన పరులగు హిందువులలో మనలో వలెనే వారలపండువులను మహోత్సవముతో సలిపెడు దినములు కొన్ని గలవు. మఱియు నుపవాసవ్రతములను సలిపెడు దినములును గలవు. ఆదినములలోఁ బగలంతయు భుజించుటమాని నడిరేయి భుజింతురు.

ప్రధానపర్వదినము రాఁదటస్థించినకాలమున రాయలు క్రొత్తనగరమునుండి (నాగలాపురము) విజయనగరమునకు వచ్చి యయ్యది రాజ్యమునకంతకు రాజధానిగావున నచట సమావేశమై యెల్లఱితోఁ గలసి యాచారవిధుల ననుసరించి విందులు మొదలగు వినోదములను జరిగించును. ఈయుత్సవదినములకు రాజ్యములోనుండెడు నాటకస్త్రీలనెల్లఱను రప్పించెదరు. మఱియు రాజులను, మహాప్రభువులను, సేనానులను వారల రాణువలతోడను, పరివారముతోడను గూడ రప్పించెదరు. యుద్ధముచేయుటకై పంపఁబడినట్టియు, రాజ్యములో దూరముగా నున్నట్టియు, ఉత్కల రాజ్యము యొక్కయు, బీజపుర రాజ్యముయొక్కయు సరిహద్దుల కడనున్నట్టియు సేనానులుమాత్రము రప్పింపఁబడరు. ఆయుత్సవములలోఁ జేరిన నవరాత్రోత్సవములు (దసరాపండుగ) నేనానగరమున నుండినపుడు రాజభవనమున మిక్కిలి వైభవముతో జరుపఁబడినవి. రాజభవనమీతీఱున నున్నది. రాజభవనమునకు నేనిది వఱకుఁ బైన నుదహరించిన బయలునకుఁ బోవుటకై ద్వారమొకటి తెలుపఁబడియున్నది. ఈద్వారముపైన నితర గోపురములకు వలెనే వసారలను గలిగి కొంచెమెత్తుగల గోపురము గలదు.

ఈద్వారములకు వెలుపల రాజభవనమునుజుట్టివచ్చిన ప్రాకారపుగోడ ప్రారంభించుచున్నది. ద్వారము కడ డాలులను కత్తు



లను బూనినద్వారపాలురు పెక్కండ్రు కలరు. సేనానులను ప్రభువులను రక్షకసైన్యాధికారివద్ద నుత్తరువుఁబొందినవారినిదక్క తదితరులనులోపలకుఁబోనీయక నిలిపెదరు. ఈద్వారముదాటి వెళ్ళినతోడనే విశాలమగు బయలుగలదు. మొదటిదానివంటిదే మఱియొక ద్వారము కొంతవఱకుఁబోయినపిమ్మటగనుపించును ఆద్వారమునుగూడ రక్షకభటులు గాచుచుందురు. దీనిదాటి లోపలికిఁబోయినపిమ్మట నొకబయలు గనుపించును. దానిప్రక్కలనువసారాలు గట్టఁబడియున్నవి. వానిలో సేనానులును ప్రభువులునుగూర్చుండి పండువుదినములలో వేడుకలను జూచుచుందురు. ఈబయలున కుత్తరభాగమ్ములకు నెడమప్రక్కను నొక్కయంతరువుగల కట్టడము గలదు. ఈకట్టడముమధ్యభాగమునగోడలులేక విశాలముగా నుండి యేనుఁగరూపములుగల స్తంభములమీఁదఁ గట్టఁబడినది. త్రాతిచీడీలమీఁదుగా దానిపైకిఁబోవుదురు. దానిచుట్టును లోపలను త్రాతిచెక్కములుగల చప్పరముగలదు. అందుండి ప్రజలు మైదానమున జరుగువేడుకలనువీక్షించుచుందురు.

ఉత్కలదేశపురాజగు ప్రతాపరుద్రగజపతిని జయించివచ్చినతరువాతఁ గట్టఁబడినదిగావున నీకట్టడమునకు “ జయమందిర ” మని పేరుపెట్టఁబడినది. ఈబయలునకుఁ గుడిప్రక్కనే సన్ననిపరంజాలుగలవు అవికఱ్ఱతోఁ జేయఁబడి గోడకుఁబయిన నెత్తుగానున్నవి. వానికిఁ గ్రిందినుండి పయినఱకును కెంపువన్నెగుడ్డలును, పచ్చనిమొకమలుగుడ్డలును, మిక్కిలిసొగసయినగుడ్డలును నలంకరింపఁబడియున్నవి. అవిబొచ్చుతో నేయఁబడిన గుడ్డలనియెవరునుదలంపరాదు. ఏలయనదేశములో నెచ్చటను బొచ్చు బట్టలు లేవు. అయ్యవిమృదువైన మంచి దూదితో నేయఁబడిన వస్త్రములుగానున్నవి. ఆపరంజాలునిరంతరమునుండునవిగావు. ఈమహోత్సవములకుఁ బ్రత్యేకమునిర్మింపఁబడినవిగానున్నవి. అవి పదునొకండుగలవు. ఈద్వారములకెదుట రెండువలయములు గలవు. వాని

లోసువర్ణాభరణములతోడను వజ్రమాణిక్యాద్యనేక మణిమయ భూషణంబులతోడను నలంకరించుకొనఁబడిన యాటకత్తియలు గలరు. ఆబయలుముందుప్రదేశమునకుఁ దూర్పుప్రక్కనున్న ద్వారమునకెదురుగాను దానిమధ్యమునను జయమందిరమును బోలిన రెండుకట్టడములుగలవు.

ఈకట్టడములలో నగిషీచేయఁబడిన చప్పరములుగలవు. వినోదములను వీక్షించుటకువచ్చిన రాయలకిష్టులగు ప్రభువుల పుత్త్రిలును, ఒకప్పుడు క్రొజ్జాలును నాచప్పరములపైఁ గూరుచుందురు. రాజునకు సమీపముగా నెత్తైనచప్పరముమీఁద వారితోఁగలసి రాజునాజ్ఞానుసారముగా ఫిగరీడో గూరుచుండియుండెను. అక్కడినుండి చూచినయెడల వినోదములెల్లఁ జక్కఁగాఁ గానుపించును. రాజుభవనమునకును జయమందిరమునకును మార్గముగలదు. అంతఃపురములోపల ముప్పదినాలుగు వీధులుగలవు. ఈ జయమందిరములోపల నొకమండపమును ఆమండపములోపల నవరత్నఖచితమగు సింహాసనమును, ఇష్టదేవతా విగ్రహములును గలవు. ఈయుత్సవదినములలో రాజచటఁ గూరుచుండి యాటపాటలనుగనుచు వినుచుండును. ఉదయముకాఁగానే రాజుబయలువెడలి జయమందిరమునకువచ్చి తానుపూజింపవలసిన విగ్రహముండుగదిలోనికిఁ బోయి బ్రాహ్మణుల సమ్ముఖమునఁ బ్రార్థనాదికకర్మలను గావించును. జయమందిరమునకు వెలుపలనాతని యిష్టులుగూరుచుండి వీక్షించుచుండఁగా నెదురుగాఁ జౌకములోపలనాటకత్తియలునాట్యమును సలుపుచుందురు. చౌకమునకుఁజుట్టునున్న నసారాలలోపల సేనాధిపతులును గొప్పవారునగు ముఖ్యజనులు గూరుచుండియుందురు. ఇంటియొక్కయుపరిభాగమునకు సమీపముగానున్న నేలమీఁదఁబడునొక్కొండు గుజ్జములుచక్కఁగా నలంకరింపఁబడిన నలంకారములతో నొప్పియుండెను. వానివెనుక నలంకార



భూపిలములగు నాలుగుచక్కని యేనుఁగలు గూడనుండెను. రాజు లోపలఁ బ్రవేశించినవెంటనే తెల్లగులాబీపూలుగలతట్టను చేతిలోనుంచుకొన్న బ్రాహ్మణునితో వెలుపలకువచ్చిమూఁడుగుప్పెడుల పూలను దీసికొని రాయలు గుజ్జములపై వైచును. అట్లు వైచిన తరువాత నత్తరువులను, సుగంధద్రవ్యములను దీసికొని యత్తరువులనుజల్లి సుగంధద్రవ్యములను ధూపమువేయును. ఈపని ముగించినతరువాత బ్రాహ్మణుఁడాతట్టను దీసికొని యందులోనుండెడు పుష్పముల నన్నిఁటిని నశ్వముల తలలపై నుంచి రాజునొద్దకుఁ బోవును. రాజు తిరిగి యిష్టదేవతకడకుఁ బోవును. అప్పుడు తెర వేయఁబడును. ఆదేవతకు నిరువదినాలుగు దున్నలను, నూటయేఁబది గొఱ్ఱెలను బలియిచ్చుట వీక్షించును. ఈజంతుసంహారమును జరిగించు మనుష్యుఁడొక్క దెబ్బతో శిరస్సు తెగిపడునట్లుగఁ గొట్టఁగలఁడు. ఈ పశుమారణకర్మము ముగిసినతరువాత రాయలు బ్రాహ్మణులానటికాక్రమించుకొనియున్న యితరమందిరములకుఁ బోయినప్పుడు వారిలాతని పైనఁ బదిపండ్రెండు గులాబీపుష్పములను జల్లుదురు. ఆపని రాజు సమీపమున నున్నవారుమాత్రమే జరిగింతురు. తరువాత రాజు మందిరముపయికెక్కి శిరస్సు మీఁదనున్న కుళ్ళాయిదీసి విగ్రహమున్న వైపునకుఁదిరిగి సాష్టాంగ నమస్కారంబు లాచరించును. పిమ్మట కట్టడములోనికిఁ బోయి యాయావరణములోపలనున్న తోటలో నొకచోట హోమగుండములోని యగ్నిహోత్రమున వజ్రములు, ముత్యములు మొదలగువానియొక్కయు, సుగంధద్రవ్యములయొక్కయు పొడిని హోమము చేసి దేవాలయములోనికిఁ బోయి యచటకొంతసేపు విశ్రమించును. అచట నుండఁగా రెండవద్వారమునకుండు మిత్రులు నాశ్రితులునగువారు వచ్చి రాజునకు నమస్కరింతురు. మొదట దానేప్రదేశమునుండి పుష్పములను నశ్వములపయిఁజల్లెనో యాప్రదేశమునకు రాఁగానే సేనాధిపతులును ప్రభువులు మొదలగు

వారు వచ్చి నమస్కరింతురు. కొందఱు కానుకలను జెల్లింతురు. తరువాత నెల్లవారును నిష్క్రమింతురు. రాయలు తన యంతఃపురమునకుఁ బోవును.

రాయలు వెళ్ళినను నాటకత్తియలు దేవాలయములోని విగ్రహముముందు నాట్యముసలుపుచునేయుందురు. ఇట్లు తొమ్మిది దినములలోఁ బ్రతిదినము ప్రాతఃకాలమునజరుగుచుండును. "మధ్యాహ్నము మూడుగంటలు వేయునప్పటికిఁ బ్రతిమనుష్యుఁడును రాజభవనమునకు వచ్చుచునుగాని యెల్లఱనురానీయరు. ద్వారములకు మధ్యనున్న బహిరంగప్రదేశమునకు మమ్ము రానను జ్ఞనొసంగిరి. కుస్తీలుపట్టువారును, ఆటకత్తెలును, శృంగారాలంకారభూషితములగు సామజములును, మంచియుడుపులనుధరించి కత్తులను చిన్నయీటెలనుధరించి యేనుఁగులపై నెక్కివచ్చినవారునుమాత్రమే యభ్యంతరమునులేక లోనికిఁబోవుదురు. * * * *

* * * * * * * * * * * * * *

సాముగరిడీల వ్యాపారమునందును ముఖ్యముగా నీనవరాత్రమహోత్సవములలోఁ బెత్తనమువహించి సమస్తకార్యములను నిర్వహించునాతఁడు సాళువతిమ్మరాజుగారు (తిమ్మరుసుమంత్రి) రాజును పెంచి పెద్దవానిని జేసి రాజ్యమిప్పించినవాఁడగుటచేత రాజుతిమ్మరుసును తండ్రితోసమానునిగాఁ జూచుకొనుచుండును. అందువలననే, రాజుతిమ్మరుసును బిలువవలసివచ్చినప్పుడు "అప్పాజీ" యని పిలుచుచుండును. * * * * *

* * * * * * * * *

ఈపనిముగిసిన తరువాత సింహాసనము మొదలగునవి యున్నయాస్థానమంటపమునకుఁబోయి రాజు కూరుచుండి యుండఁగా లోపలనున్న వారెల్లఱునువచ్చి యాతనికినమస్కరింతురు. నమస్కరించినతరువాత జెట్టీలునేలమీఁదఁగూరుచుందురు. వీరలుదక్కమఱియెట్టిమహాప్రభువయినను రాజునాజ్ఞఁబడయునిదే గూరుచుండ



రాదు. వీరలుతములపాకులు నమలెదరు. అట్టిపని యితరులుచేయరాదు. ఆటకత్తియలగువేశ్యలు చేయవచ్చును. వారలు రాయల సమ్ముఖముననే తాంబూలమునమలుచుందురు. రాజుతాను గూరుచున్నతోడనే తనజాతివారును బంధువులగువారిని ముగ్గురు నలుగురు ప్రభువులను గూరుచుండనియమించును. వారు రాజులును భార్యలకుఁదండ్రులునైయున్నారు. వారిలోముఖ్యుఁడు శ్రీరంగపట్టణపురాజగు కుమారవీరయ్యయను నామాంతరముగలకుమారవీరశ్యామరాయలు. * * * * *

రాజుకూరుచున్నతోడనే యదివఱకు రాకయచట నేచియున్న సేనాధిపతులు మెల్లమెల్లనయొక్కరొక్కరే వరుసగావచ్చిరాజునుసమీపించి నమస్కరించి పిమ్మటపయిననేనుదహరించిన వసారాల గృహములలోని తమతమస్థానములలోనికిఁబోయి గూరుచుండి యుందురు. అటుపిమ్మట నానావిధసైన్యాధిపతులు మొదలగువారు వచ్చి యేనుఁగలకుముందు సాముచేయురంగస్థలమునకుఁ జుట్టును గూరుచుండియుండి రాజునకురక్షకసైన్యముగానుందురు.

అట్టిస్థలమునకుఁగాని రాజుసమీపమునకుఁగాని యాయుధముతోనెవ్వఁడునుబోరాదు. ఈయుద్ధభటులు తమతమస్థానముల గూరుచున్నతరువాత స్త్రీలు నృత్యముసేయ మొదలుపెట్టెదరు. ఈస్త్రీలలంకరించుకొన్న యలంకారముల వైభవముయొక్క యాధిక్యమును మీకెవ్వరుచక్కఁగావర్ణించిచెప్పగలరు? వజ్రములతోను కెంపులతోను ముత్తెములతోను బొదుగఁబడిన బంగారుపతకములును బుజబంధులును నడుములకు నొడ్డాణములును చేతులిముఱుగులు ముఱిడీగొలుసులును పాదములకు నందెలు మొదలగునవిగలవు. ఈస్త్రీలలోఁగొందఱకు భూములుగలవు. కొందఱకు పల్లకులును చెలికత్తెలు మొదలగువారునుగలరు. ఈనగరములో నూరువేల పర్దావులనుగలిగియున్న స్త్రీయొక్కతె గలదనినేనువినియున్నాను. వారలస్థితిగతులనుగని పెట్టిన సేనాసంగతినిసమ్ముమ

న్నాను. పిమ్మట మల్లులు తమయాటను బ్రారంభింతురు. వారు చేయుమల్లయుద్ధములు (కుస్తీలు) మనదేశములోనివంటివి గావు. పండ్లనూడఁగొట్టునట్టియు నేత్రములను బోఁగొట్టునట్టియు మొగములయందమును జెరచునట్టియు దెబ్బలనుగొట్టుకొనెదరు. స్మృతి దప్పిపడియున్న వారిని వారిస్నేహితులు గొనిపోయెదరు.

ఒకప్పుడొండొరులను జంపుకొనుటయుఁగలదు. రంగస్థలమున మల్లులను సమానస్థితిలో నిలువంబెట్టుటకును, గెల్చినవారికి బహుమానములుచేసి న్యాయమునునిష్కర్షించుటకును సేనాధిపతులును న్యాయాధికారులను నియమింపఁబడియున్నారు. ఈ పగటిభాగములోనంతయును మల్లయుద్ధములుచేయుటతోను, భోగస్త్రీలాడుటతోను ముగియును. ప్రొద్దుగ్రుంకినతోడనే కాగడాలు పెక్కులువెలిగింపఁబడినవి పగటివలె బ్రకాశముగా నుండునటుల సాముచేయు రంగస్థలముచుట్టును, గోడలుపొడవునఁ బైవఱకును కాగడాలెత్తఁబడినవి. కాగడాలంతటను వెలిగింపఁబడినతరువాత సుందరమైనయాటలను టక్కువిద్యలును బ్రదర్శించువారలు రాజు సమీపమునకువచ్చి తమతమ నైపుణీవిశేషముం జూపిపోవుచుండిరి. తరువాత గుఱ్ఱములపైనుండి యుద్ధములుచేయువారును, వలలుపన్ని చేపలంబట్టునటుల గంగస్థలములోనున్న మనుష్యులను బట్టుకొనువారునువచ్చి వినోదములను జూపుచుందురు. ఈవినోదములన్నియు ముగిసినతరువాత నాకాశబాణములను (తారాజువ్వలు) లంకాపురులుమొదలగు బాణసంచులనుఁ దగులంబెట్టుటకుఁ బ్రారంభించిరి.

ఈ బాణసంచుల వినోదములు ముగిసినపిమ్మట సేనానులయొక్క జయసూచకములైన రథములు రప్పింపఁబడినవి. కొన్ని విదేశములలో యుద్ధము చేయుచున్న సేనాధిపతులు పంపినవిగానున్నవి. ఒకదానివెనుక నొకటి వచ్చినవి. ముందు సాళువతిమ్మ



రాజుగారి రథము వచ్చెను. భోగపుస్త్రీలయొక్కయు, నితర మనుష్యులయొక్కయు, విగ్రహములు వేయఁబడిన విలువగల గుడ్డలు రథములకుఁ జుట్టఁబడినవి, ఈరథములు రాజువద్దకు వచ్చి వెళ్ళిన తరువాత గులాబీపూలతోను, ఇతరములగు పూలతోను గూర్పఁబడిన మాలికలచే శిరస్సులను, కంఠములను నలంకరింపఁబడినట్టియు, చిత్రవిచిత్రములగు రంగులు వేయఁబడిన మృదువులగు వస్త్రములతోను నితరములగు నలంకారములతోను నలంకరింపఁబడినట్టియు, బంగారు ములామాచేయఁబడిన కళ్ళెములు దగిలింపఁబడినట్టియు గుఱ్ఱములనేకములు వచ్చినవి. ఈయశ్వములకు ముందటఁ దక్కినవానికన్న నెక్కువగా నలంకరింపఁబడి రాయల రాజ్యసంబంధమైన ఛత్రములను వహించిన యశ్వము నడచివచ్చినది. దీనికి నెదుట మఱియొకటి చిత్రమైన యాటనాడుచు కదమునడక నడచుచు, దుముకులాడుచు వచ్చియుండెను. ఛత్రములను వహించివచ్చిన యశ్వమే రాజునశ్వముగానున్నది.

ఈగుఱ్ఱముపయినెక్కి రాజు ప్రమాణముచేయును. అట్లుచేసినవారిని రాజుగానంగీకరింతురు. అతనితరువాతవచ్చినవారు కూడనట్లేచేయుదురు. ఆయశ్వము మరణమునొందినప్పుడాస్థానమున మఱియొకయశ్వమునునుంచెదరు. ఏరాజయినగుఱ్ఱమునెక్కి ప్రమాణముచేయుటకు మెప్పుకొనకపోయినయెడల దానితో సమానముగాఁజూడఁబడుచున్న సామజముపయిఁ గూరుచుండఁబెట్టి ప్రమాణముఁజేయింతురు. ఈయశ్వములు పయిననుడివిన ప్రకారముపోయి సాముచేయు రంగస్థలముచుట్టును రెండుమూరులు ప్రదక్షిణము చేయింపఁబడి రంగస్థలములోనయి దాఱుపంక్తులుగానిలువంబెట్టింపఁబడినవి. వీనికన్నిటికిముందురాయలగుఱ్ఱముండెను. అన్నియు నురాజువయిపునకుముఖములుపెట్టినిలుచుండియున్నవి. అన్నియు నిట్లునిలువంబెట్టఁబడినతరువాత రాజునొద్దనున్న వారిలో మాననీయుఁడగునొకబ్రాహ్మణుఁడు మఱిద్దఱుబ్రాహ్మణులతో నొక కొబ్బరి

కాయయును గొంచెముగా బియ్యమును పుష్పములను గిన్నెయు నుదీసికొనిరాగాఁ గూడవచ్చినయిరువురును నీళ్ళకడవనొకదానిఁదెచ్చిరి. వారలురాజువయిపునకు ముఖములుపెట్టియున్న యశ్వముల వెనుకనుండి తాముచేయవలసిన కర్మనుముగించి యంతఃపురమునకు మరలిపోయిరి.

ఈపనిజరిగినతరువాత భుజములమీఁద కొరడాలుంచుకొని చేతులతో బెత్తముపట్టుకొని యిరువదియైదుగురు లేక ముప్పదుంద్రు ద్వారపాలకురాండ్రువచ్చెదరు వారిని వెన్నంటి కొజ్జాలనేకులువచ్చెదరు. వారలువచ్చినతరువాత స్త్రీలనేకు బాకాలూదుచుగొందఱును, డోళ్ళు వీరణములు మొదలగు వివిధ వాద్యముల మ్రోగించుచుఁ గొందఱునువచ్చెదరు. వీరలవెనుక నిరువండ్రు ద్వారపాలకురాండ్రు వెండితోఁ మూయఁబడిన బెత్తములను బట్టుకొనివచ్చెదరు. వారలవెనుకవచ్చిన స్త్రీలీవిధముగానుండిరి. వారలమూల్యములగునట్టియు సుందరములయినట్టియుఁ బట్టువస్త్రములనుధరించియుండిరి. శిరస్సుల నెత్తుగానుండెడుకుళ్ళాయీలనుధరించియుండిరి. పెద్దముత్యములతోఁ జేయఁబడిన పుష్పములతోనీకుళ్ళాయీలలంకరింపఁబడినవి: పచ్చలతోను వజ్రములతోను కెంపులతోను మౌక్తికములతోను బొదుగఁబడిన బంగారుపతకములను కంఠములయందు ధరించియుండిరి. ఇంతియగాక ముత్యాలహారములనుగూడధరించియుండిరి. మురుగులు మురిడీగొలుసులు మొదలగునాభరణములను మణికట్టులందును అమూల్యములగు రత్నాభరణములను భుజములందును రత్నఖచితములగు పటకాలును బంగారపుటొడ్డాణములునుకటిప్రదేశములందును ధరించికొనియుండిరి.

ఇంతింతనరాని యమూల్యమణులచేఁ జెక్కఁబడినయందెలు మొదలగు నాభరణములను పాదములందునుధరించికొనియుండిరి. చిన్నసీటిపీపాలంతయుండు సువర్ణపాత్రములను హస్తముల



తోఁబట్టుకొనివచ్చిరి. ఈపాత్రములకు లోపలముత్యములతోఁ జేయఁబడియుంగరమువలెఁ జుట్టుకొనియుండు దారపుమడతవంటిదొకటి మైనముతో నంటింపఁబడియుండెను. వీనిలోదీపములు వెలిగింపఁబడియుండెను. వారలొక్కరొక్కరే వరుసగావచ్చియుండిరి పదునాఱు సంవత్సరములు మొదలుకొని యిరువది సంవత్సరముల లోపల వయస్సుగలిగి శృంగారవతులగు పడుచులఱువదివఱకుఁ గాఁబోలునుండిరి! వారలుతిన్నఁగా నిలువంబడియుండలేనంత భారములగు రత్నాభరణములను సువర్ణాలంకారములను ధరించుకొనియున్నవారలగుటచేత వారలతోఁగూడవచ్చిన స్త్రీలు భుజములక్రిందఁబట్టుకొని నడిపించుచుండఁగా వారలుముమ్మాఱు లీయశ్వములచుట్టునుదిరిగి యంతఃపురమునకుఁబోయిరి. ఈస్త్రీలు పట్టపుదేవులయొక్క చెలికత్తెలుగానుండిరి. తమతమవంతుల చొప్పునఁ బ్రతిదినమొక్కొక్క రాణి తనచెలికత్తెలను బంపుచుండును. *

* * * * * * * *

ఈ స్త్రీలు నిష్క్రమించిన తరువాత నశ్వములుగూడ వెడలిపోయెను తరువాత సామజములువచ్చి యుచితవందనములుజేసి వెడలిపోవును. సామజములువెడలిపోయినతరువాతీరాజు మందిరమునకుఁ జివరనున్న యొకచిన్నద్వారముగుండ వెడలిపోవును. పిమ్మట బ్రాహ్మణులొకవిగ్రహమునుగొనిపోయి వెనుకనేనుదహరించిన జయమందిరములోని గుడ్డతో నలంకరింపఁబడిన గదిలోనికిఁజేర్తురు. వెంటనేరాజువిగ్రహమున్న కడకుఁబోయి ప్రార్థనాదికకర్మనుజేయును. వెనుకటివలెనే దున్నలను గొఱ్ఱెలను బెక్కింటినిగొనివచ్చి బలిపెట్టుదురు. తరువాతభోగస్త్రీలాటలాడుదురు. రాజుజంతువులను బలియిచ్చినతరువాత రాత్రిభోజనమునకు వెడలిపోవును ఈ నవరాత్రోత్సవదినములలోఁ బగటిపూటల నుపవాసవ్రతమును బూని యాహారమును గైకొనక రాత్రములందుమాత్రమే రాజు భుజించుచుండును. ఆటకత్తియలుదీర్ఘకాలము నృత్యముసేయుచు

నేయుందురు. ఈవిధముగాఁదొమ్మిదిదినములు మిక్కిలి వైభవము
తోఁగడుపఁబడును. కడపటిదినమున రెండువందలయేఁబదిదున్నలు
ను నాలుగువేల యేనూఱు గొఱ్ఱెలనుజంపుదురు. ఈయుత్సవము
లు ముగిసినతరువాత రాజుతనసైన్యములనన్నిఁటినిఁబరీక్షించెను.
నగరమునకు మూఁడుమైళ్ళదూరముననియమిత స్థానమున మెక్కా-
మొకమలుగుడ్డతోఁ నేయఁబడినతెరడేరానునిర్మించుటకురాజుత్తరవు
చేసెను. ఈయుత్సవములన్నియు నెద్దానినిమిత్తముచేయఁబడినవో
యట్టివిగ్రహమును నాగుడారములోనుంచిరి. ఈడేరామొదలుకొ
ని రాయలయంతఃపుర మందిరమువఱకుఁ గలమధ్యప్రదేశమునం
దు సేనాధిపతులు తమతమ తారతమ్యములనుబట్టి తమసైన్యము
లతోనిలిచియుండిరి. సైనికులునుపంక్తులుదీర్చి నిలువంబడి యుం
డిరి. కొన్నిస్థలములయందొక్క పంక్తిమాత్రమేగాక రెండుమూ
డుపంక్తులుగూడఁగలవు. ఆప్రదేశమునందొక చెఱువుగలదు. ఆ
చెఱువుచుట్టును సైన్యమునిలిచియుండెను. సైన్యములేనిబయలు
గాని కొండలుగాని యేప్రదేశమునగానరావు. ముందుకాల్బలము
ను, ఆవెనుకగుఱ్ఱపుదళమును, ఆవెనుకసామజములును నిలుచుం
డియుండెను. నగరములోనున్న సేనాధిపతులు తమసైనికులువెలు
పలనున్నవారికిఁ గనుపించులాగున వీధులకడ్డముగాఁ బరంజాలను
గట్టించి యందునిలిపియుంచిరి. వారి యాయుధములెట్టివో వారి
యలంకారములెట్టివో నేనిచటవర్ణింపవలసియున్నది. వివిధముల
యినవస్త్రములతో నలంకరింపఁబడిన యశ్వములపయి రౌతులు గూ
రుచుండియుండిరి. వానిమోములను పెక్కురంగులు వేయఁబడిన
పట్టుజాలరులను గలిగియున్న వెండిబిళ్ళలును బంగారుపూఁతవేయఁ
బడిన బిళ్ళలునుగలవు. వానికళ్ళెపువాఱులు సయిలెముపట్టుత్రా
ళ్ళతోఁ బురిఁబెట్టఁబడినవిగానున్నవి.

కొన్నిఁటికి మెక్కా-మొకమలు (Mecca Velvet) గుడ్డ
తోఁజేయఁబడిన యలంకారములుగలవు. ఆమొకమలుగుడ్డలు



కుచ్చులు నలంకారములుగలిగి పెక్కురంగులను గలవిగానున్నవి.
కొన్నిఁటికి నొకవిధమైనపట్టుతోఁజేయఁబడిన యలంకారములును
రంగులులేకుండ నేతతోఁజేయఁబడిన బుట్టాలుగల సెల్లాలతోఁ
గూర్పఁబడిన యలంకారములునుగలవు. మఱికొన్నిఁటికిఁబారశీక
ము, చీనాదేశములనుండి దెప్పించినసరిగె బుట్టావేసిన పట్టుతో గూ
డిన యలంకారములునుగలవు. ఆరౌతులలోఁ గొందఱికిఁ బెద్దవియు
విలువగలట్టియుఁ బెక్కుత్రాళ్ళతోఁ గూర్పఁబడిబంగారు బిళ్ళలుగ
లవు. వానియంచులకుఁ జిన్నత్రాళ్ళతోఁగూర్పఁబడిన జల్తారుపను
లు చేయఁబడియున్నవి. ఈగుఱ్ఱములలోఁ గొన్నిఁటికి మొగముల
మీఁద మిక్కిలిపనివానితనమును జూపెడు సర్పములయొక్కయు
వివిధజాతుల మృగములయొక్కయు శిరస్సులుచక్కఁగా నలంకరిం
పఁబడియున్నవి. ఆరౌతులుసరిగెబుట్టావేసినపట్టుతోను, మొకమలు
తోను, నానావిధములగు పట్టులతోనుఁ గుట్టఁబడిన యుడుపులను,
బొంతయుడుపులను ధరించి యుండిరి. (తొడుగుకొని యుండిరి) ఈ
బొంతయుడుపులు మిక్కిలిదృఢములయినట్టియు, క్రొత్త వయినట్టి
యుఁ జర్మపుపొరలతోఁ జేయఁబడినవిగానున్నవి మిక్కిలిదృఢము
గానుండుటకై యింకను నినుపబిళ్ళలతోఁ జేర్పఁబడినవిగాఁగూడ
నున్నవి. వీనిలోఁగొన్నిటికి లోపలను వెలుపలనుగూడ బంగారు
మాలాముచేయఁబడియుండెను. కొన్ని వెండివిగానున్నవి. వారి శిర
స్త్రాణములు కంఠమునుగప్పెడు నంచులుగల యినుప కుళ్ళాయల
నుబోలియున్నవి. ఒక్కొక్కదానికి మొగమునుగాపాడుటకయిభా
గములుగలవు. అయ్యవితొడుగుకొనెడు నుడుపులవిధముగానున్న
వి. వారుకంఠకవచములను ధరించియుండిరి. కొందఱు పట్టుతోఁ
జేయఁబడి బంగారుతోను వెండితోను జేయఁబడిన పలకలుగూర్పఁ
బడిన కంఠకవచములను ధరించియుండిరి. కొందఱుదర్పణమువలెఁ
బ్రకాశమయినయుక్కుతోఁ జేయఁబడిన కంఠకవచములను ధరిం
చియుండిరి. వారికటిప్రదేశములయందుఁ గత్తులను ముద్గరముల

ను (గండ్రగొడ్డలులను) ధరించి యుండిరి. బంగారుతోను వెండితోను మూయఁబడినపిడులుగల చిన్నయీటెలను చేతులతోఁ బట్టుకొనియుండిరి. అందఱును నశ్వములమీఁద ముకమలుతోను రంగులులేకుండ నేతలోఁజేయఁబడినబుట్టాలుగల సెల్లాలతోను శృంగారింపఁబడిన ఛత్రములుగలవు.

వారెల్లరును తెల్లనివియు రంగులువేయఁబడినట్టియు గౌరవముతోఁజూచునట్టియు సురటీలనుగలిగియుండిరి. అయ్యవి గుఱ్ఱముల తోఁకలుగానున్నవి. సామజములుసయితము గుఱ్ఱములవలెనె ముకములులతోను బంగారుతోనుజేయఁబడి కుచ్చులుగల గుడ్డలతోను నానావిధములయిన రంగులతోనేయఁబడినట్టియు విలువగలట్టియు వస్త్రములతోను భూమిప్రతిధ్వని యిచ్చునట్లుగా మ్రోగెడుగంటలతోను నలంకరింపఁబడియున్నవి. వానితలలమీఁద రాక్షసులయొక్కయు పెద్దమృగములయొక్కయు మొగములు రంగుతోవేయఁబడియున్నవి. ప్రతిసామజముమీఁదను బొంతయుడుపులనుదొడుగుకొని డాలులను ఈటెలను ధరించి దేశమునుకొల్లగొనుటకైబయలుదేఱువారివలె ముగ్గురులేకనలుగురుమనుష్యులుగూరుచుండియుండిరి. ఇఁక కాల్బలములయొక్కభటులనుగుఱించి విమర్శింపఁగాఁ గనములలోను కొండలమీఁదను బయళ్ళలోను నెచ్చటఁజూచినను వీరలేగనంబడుచుఁ బోల్చుటకుఁ బ్రపంచములో నీడగువస్తువులేకయుండిరి. మిక్కిలివిలువగలదుస్తులనువారలుధరించికొనియుండిరి. అవియెచ్చటనుండి తెప్పింపఁబడియెనో నాకుతెలియదు. వారెన్ని రంగులను గలిగియుండిరో చెప్పవాఁడొకఁడును లేడు. డాలులుపూసినవారిలోఁ గొందఱికేడెములమీఁద సువర్ణ రజితపుష్పములు గూర్పఁబడియున్నవి. కొందఱికేడెములమీఁద వ్యాఘ్రములు మొదలగు మృగములయొక్క విగ్రహములు గలవు. కొందఱివి మిక్కిలిసొగసుగాఁజేయఁబడి వెండిపర్ణములతో మూయఁబడినవిగానున్నవి. కొందఱివి రంగులువేయఁబడియున్న



వి. కొందఱివి యద్దమువలె స్వచ్ఛముగాఁగనుపించునట్లు మెఱుఁగుపెట్టఁబడి నల్లనివైయున్నవి. వారలకత్తులు మిక్కిలిచక్కఁగా నగిషీచేయఁబడినవిగానున్నవి. విలుకాండ్రయొక్క విల్లులు బంగారుతోను వెండితోను ములాముచేయఁబడియున్నవి. వారియమ్ములునునుపుగాను శుభ్రముగానునున్నవి. బంగారు వెండి పిడులుగల కటారులను ముద్గరములను గటిప్రదేశములయందు ధరించియుండిరి. దట్టములగు నుడుపులనుధరించి పెద్దతుపాకులను చిన్నతుపాకులనుబూని తుపాకులనుగాల్చువారు చూచుటకింపగునట్లు వరుసగానిలుచుండిరి. తరువాతి మూరులు (తురుష్కులు) గూడ డాలును కటారులను, కత్తులను, ఈఁటెలను, బల్లెములను, తురుష్కదేశపు విల్లులను బూనియుండిరి. ఈయాయుధములతోఁ బనిచేయఁగల సామర్థ్యముగలవారుండిరి. మిక్కిలివిలువగల యనేకశ్వేతాంబరములతోఁ గప్పఁబడినట్టియు, అమూల్యాభరణములతో నలంకరింపఁబడి కెంపువన్నెముకమలుగుడ్డతోఁ జేయఁబడిన కెందుఛత్రములతో శృంగారింపఁబడిన యశ్వముపైనెక్కి యంతఃపురమందిరము వెడలి రాజుసైన్యములం బరీక్షింపబయలుదేఱెను.

* * * * * * * *

రాజునకు ముంగలసామజములనేకములు సుందరవస్త్రాలంకారభూషితములై నడచుచుండెను. రాజు తనరాజ్యముయొక్క వైభవము తేటపడునట్లుగాఁ దనముందట నిరువదియశ్వములు సువర్ణముతోను రత్నములతోనుజేయఁబడిన బుటేదారిపనులతో నొప్పిన వస్త్రాలంకారములతో నలంకరింపఁబడి జీనులుగట్టఁబడినవి నడిపించునట్లుచేసెను. రాజునకు సమీపముననే రాగితోనో వెండితోనోచేయఁబడిన వాహనమొకటి పదునాఱుగురుజనులచే మోయఁబడుచు నడిపింపఁబడుచుండెను. అదిబంగారు పూతపూయఁబడి పెద్దదిగానున్నది. అందులో నేనిదివఱకుదహరించిన విగ్రహములగలవు. ఈప్రకారముగా రాజుబయలువెడలి వచ్చుచున్నప్పు

డు సైనికులు దమసంతోషమును దెలుపుచు హెచ్చరికలు చేయుచుండిరి. కొందఱు చప్పట్లుకొట్టుచుండిరి. డాలులనుగొట్టుచుండిరి. గుఱ్ఱములు సకిలించుచుండెను.

ఏనుఁగులు ఘీంకృతులు సలుపుచుండెను. అంతయు నద్భుతముగా నుండి ప్రపంచమంతయు నచట గుమిగూడినట్లుండెను. వీనినన్నిఁటినిఁ బరీక్షించుచు నీవిధముగా రాజు తనకొఱకు నేయఁబడిన గుడారము వద్దకు వచ్చి యందు ప్రవేశించి ప్రార్థనాదికకర్మలను నెఱవేర్చెను. రాజు వెళ్ళినతోడనే సేనలు తమ స్థానములను విడిచిపోయినవని మీరు తలంపరాదు. రాజు తనకర్మలను ముగించివచ్చిన మార్గమున నగరమునకు మరలిపోవుటకును వారలు కదల మెదలకుండ నిలువంబడియుండిరి. రాజు మరలిపోవునపుడు విసుగులేకుండ సైనికులు సంతోష సూచకములగు చప్పటులను గొట్టుచునేయుండిరి. రాజు మరలి నగరమునకుఁ బోయినతరువాత సేనలు కదలుటకు నారంభించినవి. నిజముగా నామహోత్సవమును గన్నులారఁజూడఁగా నాకు స్వప్నదర్శనముగా నుండెను. నేను స్వప్నములోనున్నట్లుగానుండెను. తరువాత సైనికులు బయళ్ళలో వేయఁబడియున్న తమతమ గుడారముల లోనికిఁ బోవుచుండిరి. సేనాధిపతులు రాజునుసాగనంపుటకై రాజభవనమువఱకును బోయి యచటనుండి విశ్రాంతికై వెడలిపోయిరి. ఈ రాజునకు యుద్ధముచేయుటకుగాను పదిలక్షలసైన్యములు గలవు. వానిలోఁ గవచధారణముగలిగియున్న ముప్పదియైదువేల గుఱ్ఱపు దళముగలదు.

ఈసేనలకన్నిఁటికి రాజుజీతమిచ్చుచుండును. ఆగత్యమైనప్పుడు తానే ప్రదేశమునకుఁ బంపఁదలఁచినను పంపుటకేసమయమందయినను సిద్ధముగానుండును. అతనివద్దసామజములనేకములుగలవు. తనరాజ్యముచుట్టునుండు శత్రురాజులకుఁ దనపరాక్రమమును జూపవలసివచ్చినప్పుడిరువదిలక్షల సైన్యమునయినను



యుద్ధభూమికిరప్పింపగల సామర్థ్యముగలవాఁడని చెప్పుదురు. ఆ కారణమువలననే యీరాజునుజూచిశత్రురాజులును నెల్లవారునుభయపడుచుందురు. ఇంతసైన్యమును రాజుదీసికొనిపోయినపుడు దేశమునఁ బ్రజలులేరని దలపరాదు. దేశముజనభూయిష్ఠమైయుండుటచేత నేవ్యాపారములకును భంగముకలుగనేరదు. వృత్తులకుభంగములేకుండఁ జేయువారనేకులుగలరు. ఇంకనునీరాజ్యమున బ్రాహ్మణులనేకులుగలరు వారలుచావునుగలిగించెడు సేవనికిని దూరముగానుందురు. వారలాయుధములనుధరించి యుద్ధము చేయరు. "ఈరాజునకు వచ్చునాదాయమెంత? ఇంతసైన్యమునకు జీతమిచ్చుటకీతనిధనాగారమెంతటిది?" అని యెవరయిననడుగ వచ్చును. అధికముగావరుమానములు వచ్చెడుప్రభువులనేకులీతనికి లోబడినవారలయికప్పము గట్టుచున్నవారలు పెక్కండ్రుగలరు.

ఈప్రభువులకు నగరములు పట్టణములు పల్లెలు మొదలగునవి పెక్కులుగలవు. పదిపన్నెండులక్షల పర్డావులయాదాయముగాఁగల సేనాధిపతులున్నారు. నూరువేలపర్డావులయాదాయముగలవారు కొందఱును, రెండు, మూడు, నాలుగు, అయిదునూర్లవేల పర్డావుల వరుంబడికలవారు కొందఱునుగలరు. రాజు నియమించినప్రకారము కాల్బలమును, గుఱ్ఱపుదళమును, సామజములను బోషింపుచు రాజునకుఁ బన్నులుగూడఁ గట్టుచుందురు. ఈసేనలెప్పుడును సిద్ధముగానుండి యెట్టికాలమునం దెక్కడకుఁ బంపినను బోవలయును. ఈరీతుగా రాజుపదిలక్షలసైన్యము యుద్ధముచేయుటకు నెల్లప్పుడును సిద్ధముగానుండునట్లుఁ జేసికొనెను. ప్రతిసేనాధిపతియుఁ దనక్రిందనుండుసైనికులకుఁ దానేజీతమిచ్చుగావున మంచివారిని ధైర్యశాలులను జేర్చుచుండును. ఈసేనలలో నాకెక్కడను నొక్కపిఱికివాఁడయినను గానుపించలేదు. ఈసేనలనుబోషించుటయేగాక ప్రతిసంవత్సరము రాజునకు సేనాధిపతులగు ప్రభువులు కప్పముగట్టుచుండవలయును. ఇవిగాక రాజుస్వంత

సైన్యమునుంచుకొని వారలకు జీతబత్తెములు దానే యిచ్చుచుండును. ఎనిమిదివందల యేనుఁగులను, అయిదువందల గుఱ్ఱములను స్వంతముగానుంచుకొని వానికొఱకు నగరములో నివారిచేఁ గైకొనఁబడుపన్నులను వెచ్చఁబెట్టుచుండును. ఈజంతువులకును వీని నౌకరులకును నెంతసొమ్ము వ్రయమగునో మీకుఁ దెలియును. దీనినిబట్టియే యీమహానగరము చెల్లించెడు పన్నెంతయుండునో సులభముగా నూహించుకొనవచ్చును. ఈరాజునకు కొడుకుగాని కొమార్తెగాని జన్మించుటతటస్థించినపుడు రాజునకులోఁబడిన ప్రభువులు విశేషద్రవ్యమును, ఆభరణములను కానుకలుగాసమర్పింతురు. ఈయుత్సవదినములు ముగిసినతరువాత ననఁగాఁ బదునొకండుదినములుగడచినతరువాతఁ బ్రజలును ప్రభువులును విందులుచేసికొని నూత్న వస్త్రములను ధరించుకొని వినోదించుచుందురు. సేనాధిపతులు తమసైనికులకుమంచిబట్టలను బహుమానముఁ జేసెదరు. ఆనోజుననే యీప్రభువులు రాజునకు విశేష ద్రవ్యదానమును జేయుదురు. ఆనోజునరాజునకుఁ జెల్లింపఁబడుమొత్తము పదునయిదులక్షల బంగారుపర్దావులుండునని చెప్పుదురు. * * * *

* * * * * * * * * * * * * *

ఈయుత్సవములన్నియు ముగిసినతరువాత రాజు నూత్న నగరమునకు (నాగలాపురమునకు) వెడలిపోవును.

ఆనగరముతానుగట్టించివృద్ధిపఱచినదగుటచేత రాజునకానగరమునందెక్కువ మక్కువగలదు. ఆనగరమునురాజు రెండుసంవత్సరములలోఁ గట్టించెను. రాజానగరముఁ బ్రవేశించినపుడు ప్రజలుమిక్కిలిమహోత్సవముతో నెదుర్కొనిరి. రాజిచటతన స్వంతసైన్యమును బరీక్షించి వారలకుజీతములిప్పించెను. సైనికులకెల్లఱకు సంవత్సరమునకొకసారి జీతములిచ్చువాడుకగలదు. ఆప్రకారమురాజువారలకు జీతములిప్పించెను. రాజకీయోద్యోగీయులు ప్రతిసైనికుపేరును వానిమొగముమీఁదనుగానిశరీరముమీఁదను



గానియున్నమచ్చలనువ్రాసికొనిరి. సైనికులలో వారి వారి తారతమ్యములను బట్టి జీతము లేర్పడియుండెను. వేయి, ఎనిమిది వందలు, ఆఱువందలు పర్దావులనుబడయువారలుగూడ నాసైన్యమందుండిరి. రాజుయొక్క యైదువందల గుఱ్ఱపు రౌతులును నాయుధపాణులయి యంతఃపురముచుట్టును వెలుపలగాచియుండి సంరక్షణముసేయుచుందురు. తరువాతతనయజమానియగు క్రిస్టోవాన్డిఫిగరీడో రాజాజ్ఞనుబొంది యంతఃపురమునుజూడఁబోయినవృత్తాంతమును జరిత్రకారుఁడు వర్ణించియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచేత నంతగా ముఖ్యాంశములు లేకుండుటచేతనునాభాగమును విడిచి పెట్టితిని.

---

## పదునేడవప్రకరణము.

కృష్ణరాయల కాంధ్రభోజుఁడని ప్రఖ్యాతివచ్చుట — ఇతఁడు విష్ణుచిత్తీయమను నామాంతరముగల యాముక్తమాల్యదయను మహాప్రబంధమును రచించుట — సంస్కృతభాషలోఁ బెక్కుగ్రంథములను రచించుట — అష్టదిగ్గజములు — ఆముక్తమాల్యద పెద్దనార్యవిరచితము కాదని నిరూపించుట — మనుచరిత్రమునకు దరువాతనేఁ బదేండ్లకుఁ బైనఁగాని వసుచరిత్రము ప్రకటింపఁబడలేదని — బట్టుమూర్తి రాయలయాస్థానకవిగాఁడని — ఆముక్తమాల్యద కృష్ణరాయవిరచితమని — ఆముక్తమాల్యదకంటె మనుచరిత్రము ముందురచింపఁబడినదని — అల్లసాని పెద్దన చరిత్రము — పెద్దనకవికి రాయలకడఁగల గౌరవము — కోకటాగ్రహారము వైష్ణవులకిచ్చుట — పెద్దనకవి యనసూయాపిశాచగ్రస్తుఁడుకాఁడని చెప్పుట — రాయలయాస్థానముఁ బెద్దనకవియాశుధారగా నుత్పలమాలికనుజదువుట — రాయలు కవిగండపెండేరమును పెద్దనకవిపాదమునఁ దొడుగుట —

పూర్వకాలమునందు మాళవదేశాధిపతి యగు భోజమహారాజు సంస్కృతభాషనెట్లాదరించెనో యట్లే యీకృష్ణదేవరాయలాంధ్రభాషనాదరించి కవులనుసన్మానించి గ్రంథరచనము చేయించుటచేత నీతనికాంధ్రభోజుఁడని ప్రఖ్యాతివచ్చినది. ఇతఁడుకవుల

నాదరించి కావ్యములను జేయించుటమాత్రమేగాక సంస్కృతాంధ్రములయందసాధారణ పాండిత్యముగలిగి యుభయ భాషలయందు గ్రంథములురచించుటకు సమర్థుఁడయి యుండెను. ఈతఁడు సంస్కృతమునరచించిన గ్రంథములేవియు నిప్పుడుగానరాకున్నను గవులనుప్రోత్సాహపఱచి కావ్యములను జేయించియుఁ దాను జేసియు నాంధ్రభాషకు మహోపకారమును జేసి యున్నాఁడు. ఈతఁడు తెలుఁగున రచించినగ్రంథము విష్ణుచిత్తీయమను నామాంతరముగల యాముక్తమాల్యదగానున్నది. ఇతఁడు సంస్కృతమున బహుగ్రంథములను రచించినట్లు విష్ణుచిత్తీయమునందలి యీ పద్యమునందుఁ జెప్పఁబడినది.

“ సీ. పలికితుత్ప్రేక్షోప-మలజాతి పెంపెక్క-
దనిసుతౌఁగను దా-లసచరిత్ర।
భావధ్వనివ్యంగ్య-సేవధిగాఁగఁ జె,
ప్పితివిసత్యావధూ-ప్రీణనంబు।
శ్రుతిపురాణోపసం-హితలేర్చికూర్చితి,
సకలకథాసార-సంగ్రహంబు।
శ్రోత్రఘుచ్ఛటలువి-చ్చుగరచించితిసూక్తి,
నైపుణిజ్ఞానచిం-తామణిక్కృతి।
గీ. మఱియురసమంజరీముఖ్య-మధురకావ్య।
రచనమెప్పించుకొంటిగీ-ర్వాణభాష।
నంధ్రభాషయసాధ్యంబె-యందునొక్క।
కృతివినిర్మింపుమిఁకమాకుఁ-బ్రియముగాఁగ। ”

ఈపై పద్యమునం దుదహరింపఁబడిన సంస్కృత గ్రంథములేవియునిప్పుడుగానరావు. ఈతనికాలముననే ప్రబంధ రచనము క్రొత్తగానారంభమైనది. అవఱకుండెడునాంధ్రకవులు సంస్కృత భాషాగ్రంథములను మృదుమధురశైలిని నాంధ్రీకరించియున్నారు. మొట్టమొదట ప్రబంధరచనకు దారితీసినవాఁడు కృష్ణరాయలయాస్థానకవులలో సుప్రసిద్ధుఁడగు నల్లసానిపెద్దనామాత్యుఁడు. “ అల్లసాని పెద్దన, (ముక్కు) నందితిమ్మన, మాదయగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, పింగళి సూరనామాత్యుఁడు, రామరాజభూషణుఁడు, తెనాలిరామకృష్ణుఁడు, అని యెనమండ్రుకవులు నాతనియాస్థానమున నష్టదిగ్గజములని పేరొందినట్లు చెప్పుదురుకాని కడపటనుదహరింపఁబడిన కవులు మువ్వురునుగృష్ణరాయని కాలములోనున్నారనిచెప్పుటకు సత్యములయిన ప్రమాణములుగానరావు ఒకవేళనున్నను మిక్కిలి బాల్యదశయందుండి యుండవలెనేగాని యాతని యాస్థాన కవులుమాత్రము కాఁజాలరు. అందునుగురించి దెలిపెడు కథలు విశ్వాసపాత్రములు కావు. కృష్ణరాయ విరచితమగు విష్ణుచిత్తీయములో మనుచరిత్రములోని పద్యములవంటి పద్యములుండుటచేత నాముక్తమాల్యద పెద్దనార్యునివిరచితమని కొందఱు తలంచెదరుగాని యది యెంతమాత్రమును సత్యముకాదు.



కృష్ణరాయవిరచితమగు నాముక్తమాల్యదయు నల్లసాని పెద్దనార్య విరచితమగు స్వారోచిషమను సంభవమను మనుచరిత్రమును జక్కఁగాఁ జదివిపరిశీలించిన యాంధ్రపండితుఁడెవ్వఁడును రెండుగ్రంథము లేక కవివిరచితములని సిద్ధాంతీకరింపఁజాలఁడు ఎన్నికుయుక్తులుపన్ని వాదించినను విష్ణుచిత్తీయగ్రంథము కృష్ణరాయవిరచితమని చెప్పుటకులేశమాత్రమును సందియములేదు ఆముక్తమాల్యద పెద్దనార్యకృతమనిచెప్పుట కృష్ణరాయలు కవిత్వమునందు సమర్థుఁడుకాఁడనిగదాయర్థమగుచున్నది. నందితిమ్మనార్య విరచితమగు పారిజాతాపహరణములోని యీక్రిందిపద్యములోని “ కవితాప్రావీణ్యఫణీశ ” యనువిశేషణమునుబట్టి కృష్ణరాయలు కవిత్వమునందు నిపుణుడనియేయూహింపవచ్చును.

“ క. శ్రీవేంకటగిరివల్లభ।
సేవాపరతంత్రహృదయ-చిన్నమదేవీ।
జీవితనాయక కవితా।
ప్రావీణ్యఫణీశ-కృష్ణరాయమహీశా! ”

ఆముక్తమాల్యదయందుఁ బైనుదహరించిన సీసపద్యములోఁ గృష్ణరాయవిరచితములగు సంస్కృతగ్రంథములఁ గొన్నిఁటిని జేర్కొనియుండుటచేతను కవిత్వమునందు సమర్థుఁడని యాస్థానకవులు శ్లాఘించియుండుటచేతను ఈతఁడు సంస్కృతాంధ్ర భాషలయందత్యంతాభినివేశముగలవాఁడై కవులఁ బ్రోత్సాహపఱచుచు నగ్రహారములు మొదలగునవియిచ్చి సన్మానించుచువచ్చినవాఁడగుటచేతను గృష్ణరాయలు పండితకవియనియును విష్ణుచిత్తీయప్రౌఢప్రబంధరచనాకుశలుండనియును జెప్పుటకు లేశమాత్రమును సంశయింపంబనిలేదు. ఇతనికిఁ దెలుఁగుదేశమునందును దెలుగుభాషయందును నత్యంతాభిమానముగలదని యాముక్తమాల్యదలోని యీక్రిందిపద్యమువలనస్పష్టమగుచున్నది.

"ఆ. తెలుఁగదేలయన్న - దేశంబు తెలుఁగేను।
తెలుఁగువల్లభుండఁ - దెలుఁగొకండ।
యెల్లనృపులుగొలువ - నెఱుఁగవే బాసాడి।
దేశభాషలందుఁ - దెలుఁగు లెస్స॥"

అసంబద్ధోక్తులు కొన్నిఁటినిఁ బన్ని కల్పనా కథలను రచించుటయందు మనయాంధ్రకవులను బోలినవారుండరనియూహింపఁజాలను. కృష్ణదేవరాయలల్లసాని పెద్దనార్యుని రామరాజభూషణుని ప్రబంధములను రచించితెమ్మని యాజ్ఞాపించెననియుఁ, తదాజ్ఞానుసారముగా నాయిరువురుకవులును గ్రంథరచనము జేసి తమ కావ్యములను గొనిరాఁగా రాయలుచూచి వసుచరిత్రమునకంటె మనుచరిత్రము లేఁతపాకమునబడినదనియభిప్రాయమును దెలుపగానందుమీఁదసిగ్గుపడి పెద్దన్నగారు "ఆముక్తమాల్యద" యను పేర విష్ణుచిత్తునిచరిత్రమును రచియించితీసికొనివచ్చిచూపినముదురుపాకమునంబడియెననియభిప్రాయమిచ్చెననియుఁ గొందరపూర్వబుద్ధిమంతులుచెప్పుచుందురుకాని యట్టిదివారిస్వకపోలకల్పితమని మనమూహింపవలయునేకాని యందుకొంచెమైనను సత్యముండకపోదని భావింపరాదు.



మనుచరిత్రము రచింపఁబడిన తరువాత నేఁబదేండ్లకుఁగాని బయలుకురాని వసుచరిత్రము ప్రశంసచేయుట హాస్యాస్పదము కదా! రామరాజభూషణుఁడనుబిరుదాంకముగలభట్టుమూర్తి కృష్ణరాయలయాస్థానమునందు లేఁడని ప్రబలదృష్టాంతములుగలవు. మనుచరిత్రము కృష్ణరాయలదిగ్విజయయాత్రకుఁ దరువాతను ప్రసిద్ధచారిత్రముగల రాచూరుముట్టడికిఁ బూర్వమునను విరచింపఁబడినదనుట స్పష్టము. అనఁగాఁ గ్రీస్తుశకము ౧౫౧౬వ సంవత్సరమునకును ౧౫౨౦వ సంవత్సరమునకును మధ్యకాలమున రచింపఁబడియుండెను. వసుచరిత్రమన్ననో క్రీస్తుశకము ౧౫౭౭ వ సంవత్సరమునకావలగాని బయలుకురాలేదనుట వసుచరిత్రమునుబట్టియే సిద్ధాంతీకరింపవచ్చును. వసుచరిత్రకృతిభర్తయైన తిరుమలదేవరాయలు ౧౫౬౭ వ సంవత్సరమునందు నరాజధానిని పెనుగొండకు మార్చుకొనెను. ఈతఁడు పెనుగొండను రాజధానిగాఁ జేసికొన్న తరువాత మహమ్మదీయులతోఁ జేసినయుద్ధవార్తను వసుచరిత్రములో నీవిధముగఁగవి చెప్పియున్నాఁడు.

"చ. తిరుమలరాయశేఖరుని - ధీరసమద్భట రాజియాజిభీ।
కరయవనేశ్వరప్రహిత - ఖానబలంబులఁ జక్కుసేయని।
దరఁ బెనుగొండకొండలుమ - దద్విపచర్మకపాలమాలికా।
పరికరభూషితంబులయి - బల్విడిఁ గాంచెగిరీశభావముల్॥"

ఇంతియగాక తిరుమలదేవరాయలు తనపెద్దకొడుకయిన రఘునాథరాజు కాలధర్మము నొందినపిమ్మట రెండవకుమారుఁడయిన శ్రీరంగరాజులకు యువరాజ్యపట్టము నొసంగి రాజ్యభారమునుమోపినవృత్తాంతమునుగూడ భట్టుమూర్తి వసుచరిత్రమున నీక్రిందిపద్యములోఁ సూచించియున్నాఁడు.

"చ. హరిపదభక్తశీలుఁడగు - నారఘునాథనృపాలమూర్తిసో।
దరుఁడు సిరంగరాయవసు - ధావరుఁడాత్మగుణప్రమోదవ।
త్తిరుమలరాయశేఖరవి - తీర్ణమహాయువరాజపట్టబం।
ధురుడయి సర్వభూభువన - ధూర్వహశక్తివహించు నెంతయున్॥"

మఱియు మూఁడవకొడుకయిన వీరవేంకటపతిరాయలు తండ్రివృద్ధుఁడై రాజ్యభారమునంతను దనమీఁదవేసియున్న తరువాతఁదానుబీజపురసుల్తానగు అలీఏడిల్‌షాతో యుద్ధముచేసిపరాజితుడయి క్రీస్తుశకము ౧౫౭౭ వ సంవత్సరమునందు రాజధానిని చంద్రగిరికిమార్చినసంగతినిగూడఁ గవి యీక్రిందిపద్యమునందు సూచించియున్నాఁడు.

"మ. హరుఁడా తారకశైలదుర్గమున-ధ్యాసీనుఁడై రాజశే।
ఖరవిఖ్యాతివహించుఁజంద్రగిరిదు-ర్గంబందుశ్రీవేంకటే।
శ్వరుఁడొప్పెన్‌బహురాజశేఖరసదా-సంసేవ్యుఁడై యారయ।
దరబంటేటికవాసితద్ద్వయములకున్-దద్వల్లభశ్రీలకున్॥"

క్రీస్తుశకము ౧౫౭౭ వ సంవత్సరమునం దురుష్కులు తిరుమలదేవరాయని పెనుగొండనుండి చంద్రగిరికిఁ దరిమినట్లుగా మహమ్మదీయులు వ్రాసినచరిత్రమునందుఁ జెప్పఁబడియున్నది. కాఁబట్టివసుచరిత్రము ౧౫౨౦ దవ సంవత్సరమునకుఁ దరువాతనే ప్రారంభింపఁబడి ౧౫౭౭ వ సంవత్సరమునకుఁ దరువాతగాని ముగింపబడలేదనుట యిందువలన స్పష్టమగుచున్నది. కావున నోపండితోత్తములారా! ఆంధ్రకవులారా! మనుచరిత్రము బయలుఁ బడిన యఱువదిసంవత్సరములకుఁగాని వసుచరిత్రము ముగింపఁ బడలేదనియు, వసుచరిత్రమునురచించిన రామరాజభూషణుఁడను మాఱుపేరుగల భట్టుమూర్తి కృష్ణరాయల యాస్థానకవి కాఁడనియు, కృష్ణరాయల కాలమునాటికి వసుచరిత్రకృతికర్త పసివాఁడుగా నుండవచ్చుననియు బోధపడినదా లేదా? మనుచరిత్రముకన్న వసుచరిత్రము శ్లాఘ్యమైన గ్రంథమని యాదరించి కృష్ణరాయలు వసుచరిత్రమును వదలి మనుచరిత్రము కృతినొందెననుట హాస్యాస్పదమైన సంగతియని యిప్పుడయినమీకు బోధపడినదా లేదా? కృష్ణరాయలు వసుచరిత్రమెట్టిదో స్వప్నములోనైన నెఱుఁగఁడు సుడీ! మనుచరిత్రముకన్న వసుచరిత్రము గాని యాముక్తమాల్యద గాని గుణాఢ్యములయినవిగావు వసుచరిత్రముసంగతి మనకప్ర



స్తుతము గాన దానిని విడిచి యాముక్తమాల్యదను మనుచరిత్రమునువిమర్శింపుఁడు. మనుచరిత్రము మృదుమధుర పదభూయిష్ఠమైనది. ఆముక్తమాల్యదో కటుపదభూయిష్ఠమైనది. శైలియందు విశేషభేదముకలవగుటచేతను, పెద్దనార్యునికవిత్వములోలేని యికారసంధులును, తత్సమశబ్దములం దకారసంధులును, క్త్వార్థకసంధులును ఆముక్తమాల్యదయందుఁ గనుపించుచుండుటచేతను, ఆముక్తమాల్యద పెద్దనార్యకృతముగాదని విస్పష్టమగుచుండఁగా నేలొకో కొందఱు భ్రమపడుచు పెద్దనార్యకృతమనియే వాదించుచున్నారు? అయ్యో! ఏమియీమూర్ఖత! అట్లు వాదించుటకు వారికిఁగల యాధారమేమిగలదని యోజింపఁగా నాముక్తమాల్యదలోఁ గృత్యాద్యవస్థయందు వంశావళిలో మనుచరిత్రములోని పద్యములే కానఁబడుచుండుట. ఇంతమాత్రముచేతయుక్తాయుక్తవిచారమును జేయనేరక దున్నపోతీనినదన దూడను గట్టుమను సామ్యముగా నాముక్తమాల్యద పెద్దనార్యకృతమని చెప్పువారి బుద్ధివిశేషము నేమనివాగడవచ్చును?

ఇట్టిభ్రమచేత నేకాఁబోలు నెవ్వఁడో యొకకవి తనవాదమునకుపబలముగా నీక్రిందిసీసపద్యమును రచించి తనయవివేకమును లోకమునఁ బ్రకటించియున్నాఁడు.

"సీ. కృష్ణరాయలపేరు-నిడినీవురచియించి, తివిరితొల్తవిష్ణుచి-త్తీయమనఁగ।
కాఠిన్యమర్థంబు-గాదుసాధారణం, బకనిభూధవుండుబలుకఁ।
దరువాతమనుచరి-త్రమునొనరించితు, త్తమకావ్యముమహో-త్తముగఁబిదప।
బెక్కు-కావ్యంబులు-పెంపెక్క విరచించి, మంటివిరాజస-న్మానమునను।
భంగమందినవారలరామ-లింగముఖులు।
సాటిరాఁగలవారనీ-తోటినార।
యాంధ్రకవితాపితామహ-యల్లసాని।
పెద్దనార్యవిశేషవి-వేకధుర్య॥"

మనుచరిత్రము రచియింపఁబడినతరువాత నాముక్తమాల్యద రచియింపఁబడినదికాని యీపయిపద్యములోఁ జెప్పఁబడినట్లుగా

నాముక్తమాల్యదతో లుతను తరువాత మనుచరిత్రమును రచియిం పఁబడలేదని యీరెండు గ్రంథములనుబట్టియే మనము సులభము గానూహింపవచ్చును. మనుచరిత్రములోఁ గృష్ణరాయలు రాచూరుముట్టడించి ఏదిల్ షాను జయించిన సంగతినుదహరింపకఁబోవుటయును రాయలు బీజపురసుల్తానుదేశముమీఁదనుదండెత్తి కలుబరగి సాగరు మొదలగు పట్టణములను గైకొని తురుష్కులనుజయించినసంగతి చెప్పియుండకపోవుటయును ఆముక్తమాల్యదలో నాయుద్ధవృత్తాంతములను చెప్పియుండుటయును జూడఁగా నాయుద్ధములకుఁబూర్వమునందు మనుచరిత్రమును తరువాతను నాముక్తమాల్యదయు రచింపఁబడినట్టుస్పష్టమగుచున్నది. మనుచరిత్రము నిర్దుష్టమయిన గ్రంథము. మనుచరిత్రమువంటి నిర్దుష్టమయిన గ్రంథమును రచించిన పెద్దనవంటి సర్వలక్షణవేత్త వ్యాకరణదోషయుక్తమైన యాముక్తమాల్యదను రచించెననుట యుక్తికిని ననుభవమునకు విరుద్ధమై పండితులు నమ్మఁదగినదిగాఁ గనుపించదు. మఱియు సీసపద్యమునందు "భంగమందిన యలరామలింగముఖులు। సాటిరాఁగలవారె నీకోటిసేయ॥" యని పెద్దనార్యుని సంబోధించుటచూడఁగా నీపద్యము విమర్శజ్ఞానములేని యెవనిచేతనో రచింపఁబడినది. కాని పెద్దనార్యుని కాలమునాఁటిదిగాదని స్పష్టమగుచున్నది. వీరవేంకటపతిరాయల కాలముననున్న రామకృష్ణుని (రామలింగము) పేరెత్తుటయెట్లుసంభవించును? కావున నీచాటువును విశ్వసింపరాదని యీపద్యమె తెలుపుచుండఁగా నది ప్రమాణముగాఁ గైకొనువారి బుద్ధినేమనికొనియాడవచ్చును? కృష్ణరాయలుపూర్వదిగ్విజయయాత్రకు వెడలి విజయవాటికయందుఁ గొన్నిదినంబులుండి కృష్ణామండలములోని శ్రీకాకుళము నందలి యాంధ్రవిష్ణుదేవుని సేవింపంబోయిన హరివాసరమునాఁటిరాత్రి యాదేవుఁడు స్వప్నములోఁ గనుపించి వేంకటేశ్వరుని కంకితముగాఁ దెనుఁగుగ్రంథమును జేయుమనఁగా విష్ణుచిత్తీయమును రచియించి



నట్లు కవి తనగ్రంథమునం దీవిధముగఁ జెప్పుకొని యున్నాఁడు, "......కళింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్ర మధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున.

* * * * * * * * *

'క. అంకిత మోయనవీకల।
వేంకటపతియిష్టమైన- వేల్పగుటఁదదీ।
యాంకితము జేయు మొక్కఁక।
సంకేతము కాకతఁ డెర- సన్నేఁగానే॥"

ఈగ్రంథము పెద్దనకవనమువలె మృదుమధురపదకల్పితమైనదియు నల్లికగలదియుఁగాక కటుపదభూయిష్ఠమై యున్నది. అందందు వ్యాకరణస్ఖాలిత్యములున్నను, శ్రుతికటువుగా నున్నను మొత్తముమీఁద విష్ణుచిత్తీయముయొక్క కవనమిక్కిలి ప్రౌఢమై అర్థగాంభీర్యము కలదిగాను, స్వభావవర్ణనాలంకారబహుళమయినదిగాను నున్నయది. పెక్కుపద్యములు మృదుమధురపదగుంభితములై కూఁడనున్నవి.

కృష్ణరాయలీగ్రంథరచనయందు దనయాస్థానకవులగు నల్లసాని పెద్దనార్యునియొక్కయు నందితిమ్మనార్యునియొక్కయు సహాయమును బొందియున్నాఁడు. గ్రంథాదియందు వంశవర్ణనమును స్వవర్ణనమును దనయంతదాను జేసికొనినఁ బరిహాసాస్పదముగాను నాత్మస్తుతిగాను నుండునని యూహించి తనచేత మిక్కిలి గౌరవముతోఁ జూడఁబడు పెద్దనవిరచితమగు మనుచరిత్రములోని యవతారికపద్యములను దనగ్రంథములో వేసికొనియున్నాఁడు। విష్ణుచిత్తీయమునందెముఖ్యముగా నయిదవ యాఱవయాశ్వాసముల యందు మనుచరిత్రములోనిపద్యములవంటి "యల్లికజిగిబిగి" పద్యములును నందితిమ్మనార్యపద్యములవంటి "ముద్దులుగులుకు" పద్యములును బెక్కులుగానంబడుచుండుటచేతఁ గృష్ణరాయలు గ్రంథమును

త్తాను జేయగా దదాస్థానకవులు కొన్ని పద్యములను మార్చియు కొన్ని పద్యములనుదమవి చేర్చియు నుందురు. అంతమాత్రముచేత గ్రంథకర్తృత్వముఁ బెద్దనకు నారోపించుట న్యాయముకాదు. కృష్ణరాయలే కృతికర్తయని యాశ్వాసాంతములయందును గ్రంథావతారికయందును జెప్పబడుటయేగాక "పలికితుత్ప్రేక్షోపమలజాతి" యిత్యాదిపద్యములోనుదహరింపఁబడిన తద్రచితసంస్కృతగ్రంథనామములును తత్కర్తృత్వమును స్థాపించుచున్నవనునాంధ్రకవిచరిత్రగ్రంథకారులగు రాయబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులవారియభిప్రాయముతోడనే నేకీభవించుచున్నాడను.

కవిజీవితగ్రంథకారులగు బ్రహ్మశ్రీగురుజాడ శ్రీరామమూర్తి పంతులవారుకూడ నాముక్తమాల్యద పెద్దనార్య కృతముగాదని యానని వాదించువారి వాదమును ఖండించియున్నారు. ఇఁక విష్ణుచిత్తీయప్రశంసనుముగించి కృష్ణరాయాస్థానకవులలో ముఖ్యుఁడును, నాంధ్రకవితాపితామహుండను బిరుదాభిధానము గలవాఁడును, సర్వతోముఖపాండిత్యమును గలవాఁడునగు నల్లసాని పెద్దనార్యుని చరిత్రము ముంగుసంగ్రహముగా నిట దెలిపెదను. ఈతఁడు నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు; చొక్కయామాత్య పుత్త్రుఁడు; బళ్ళారిప్రాంతములందున్న దూపాడు పరగణాలోని దోరాల గ్రామమీతని జన్మస్థలము. ఇతఁడు స్మార్తుఁడగు నియోగి యయినను వైష్ణవమతంబవలంబించినవాఁడు. కృష్ణరాయల యాస్థానమునం దీతనికంటె గౌరవాధిక్యముగలకవి మఱియొక్కఁడుగానరాఁడు ఇతఁడుసామాన్యుఁడని చెప్పరాదు. కృష్ణరాయఁడీతని నిట్లు సంబోధించుచున్నాఁడు.

'హితుఁడవు చతురవచోనిధి।
వతులపురాణాగమేతి-హాసకథార్థ।
స్మృతియుతుఁడవంధ్రకవితా।
పితామహుఁడవెవ్వరీడు-పేర్కొనఁ నీకున్॥'



కృష్ణరాయలంతటి ప్రభువుచే "హితుఁడవ" ని యనిపించుకొనువాఁ డెట్టి యౌన్నత్యమును బొందియుండునో వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఇంతమాత్రమేగాదు. కృష్ణరాయలు మృతి నొందినతరువాత నితఁడుచెప్పిన జాలినిబుట్టించు నీక్రింది పద్యమువలనఁ గూడ నీతనియాధిక్యత వెల్లడియగుచున్నది.

"సీ. ఎదురైనచోఁదన-మదకరీంద్రముడిగ్గి,
కేలూఁతయొసఁగియె-క్కించుకొనియె।
మనుచరిత్రంబందు-కొనువేళఁ బురమేఁగఁ,
బల్లకిఁదనకేలఁ-బట్టియెత్తె।
బిరుదైనకవిగండ-పెండేరమునకీవె,
తగుదనితానె పా-దమునఁ దొడిగెఁ।
గోకటగ్రామాద్య-నేకాగ్రహారము,
లడిగినసీమల-యందునిచ్చె।
నాంధ్రకవితాపితామహ-యల్లసాని।
పెద్దనకవీంద్రయనినన్నుఁ-బిలుచునట్టి।
కృష్ణరాయలతో దివిఁ-కేఁగలేక।
బ్రతికియుండితిజీవచ్ఛ-వంబవగుచు॥"

చక్రవర్తియు విద్యాచక్రవర్తియు నగు కృష్ణరాయలవలన నిట్టిసమ్మానములు 'కవితాయద్యస్తి రాజ్యేనకిం' మ్మని పెద్దనార్యుఁ డెట్టి మహాకవిగాకుండిన నతనికిసులభములయి ప్రాప్తించునా? రాయలకాలమునఁ బుట్టిన ప్రబంధములలో మనుచరిత్రము కంటె నతనికిమనోహరమయిన కావ్యము మఱియొండు లేదనియుఁ బెద్దనకంటె గౌరవాధికుండయిన కవియతనికి వేఱొకఁడు లేఁడనియుఁ దెలియంజెప్పుటకు నింతకన్నఁ బ్రబలాధార మేమికావలయును? ఇట్టియుత్తమకవి చారిత్రమును దెలుపుసందర్భమున నల్లసాని పెద్దనార్యుఁ డసూయాపిశాచగ్రస్తుఁడని తోఁచునట్లుగా సూచించెదు నప్రస్తుతకథను కవిజీవితగ్రంథకారుఁ డాతని తలకుఁ జుట్టఁబెట్టుచున్నాఁడు. పెద్దనకవిప్రసిద్ధినివిని నరసింహాకవియనునాతఁడు కవికర్ణరసాయనమను ప్రబంధమును రచించి పెద్దనకవిని నాశ్రయించి

తనకావ్యమునుజూపి రాయలకడకుంగొనిపొమ్మని కోరెనఁట! పెద్దనకవి యామహాప్రబంధమును సావకాశముగఁజూచి విశేషసన్మానమా కవికింగలుగునని యూహించి యాతనికిరాజదర్శనముగాకుండ నుపాయమారయుచుండెనఁట! ఎంతకాలము వేచియున్నను దుదకు రాయలదర్శనము లభింపకుండుటయు, చేతనున్నధనము కొంచెమును వ్యయమగుటయుఁ దలపోసి చేయునదిలేక తనకావ్యములోనిపద్యముల నాల్గింటినిఁదీసి తనపరిచారకునిచేతికిచ్చి యంగడికిం బంపి విక్రయించిరమ్మనెనఁట! అందులోనొక పద్యమును గృష్ణరాయలకొమార్తె వానినిఁగొని పఠియించెనఁట! కవికర్ణరసాయనగ్రంథకర్తయెంతకాలమున్నను రాయలదర్శనము గాకుండుటంజేసివగచిధనాశచే నిట్టికృతి మనుజులకిచ్చుట తుచ్ఛంబనినెంచి యటనుండిలేచిపోయి శ్రీరంగముఁజేరి రంగనాథునికిఁ గృతియిచ్చెనఁట!

ఒకనాఁడు రాయనికొమార్తె తనతండ్రితోఁ జతురంగమునాటనాడఁదొడంగెనఁట. అపుడొకపేదబంటు రెండుపెద్దజంతువుల నడుమంబడినఁగనియాచిన్నది " ఉద్ధతులమధ్యమునఁబేదకుండఁదరమె " అనిచదివెనఁట. అదివినిరాయలు పద్యమంతయుంజదువుమని పుత్త్రినడుగగా నామె కవికర్ణరసాయనములోని మూడవయాశ్వాసమునందలి యీపద్యమునుజదివెనఁట.

" గీ॥ ఒత్తుకొనివచ్చుకటికుచో-ద్వృత్తిఁజూచి।
తరుణితనుమధ్య మెచటికో-తొలఁగిపోయె।
నుండెనేనియుఁగనఁబడ-కున్నె యహహ।
యుద్ధతులమధ్యమునఁ బేద-కుండఁదరమె॥

అప్పుడారాయలాపద్యముయొక్క చమత్కృతికినలరి యదియేనారికవిత్వమనుచు నాచిన్నది తాఁగవినెఱుంగననియు దానువానివిలిచితిననియుఁజెప్పిననాతఁడు విస్మితుండై దిగ్గునలేచియాస్థానమునకువచ్చి యీకవిత్వమెవ్వనిదనియడుగఁగా నరసింహాకవికృతమగు కవికర్ణరసాయనములోనిదని యీకవివృత్తాంతమంతయుంజెప్పిరట.



రాయలాకవికివర్తమానముచేయఁగా నాతఁడు తనకృతి రంగనాథునకు సమర్పించితినని ప్రత్యుత్తరమంపెనఁట. అట్టియుత్తమగ్రంథమునకు దానుగృతిపతియగు భాగ్యముపట్టదయ్యెనని చింతించితానట్టి గ్రంథంబురచించినంగాని తనవిచారంబుపోదని నిశ్చయించి యాముక్తమాల్యద విరచించెనని కొందఱియభిప్రాయమఁట. తనపేరట రచియించిప్రకటించుటయే పెద్దనకు దగుశిక్షగానూహించి యాతనిచేదనపేరట నాముక్తమాల్యద రచియింపఁబడినట్లు నియమించెనని కొందఱియభిప్రాయమఁట.

ఆహా! ఏమీయీకల్పనాసామర్థ్యము! అల్లసాని పెద్దన్న యింతయసూయాగ్రస్తుఁడగుటకుఁ దగిన కారణము గానరాదని కవిచరిత్రకారుఁడు వ్రాసినదానికి సంగీకరింపక కవిజీవితములం బ్రకటించిన బ్ర॥ శ్రీ॥ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారపూర్వహేత్వాభాసములంజూపి పెద్దనకవి యసూయాపిశాచగ్రస్తుఁడై కవికర్ణరసాయన గ్రంథకర్తకు రాయల దర్శనము గాకుండఁ జేసెనని రాద్ధాంతీకరించుట వింతగానున్నది. కవికర్ణరసాయన ముత్తమ కావ్యమేయైనను మనుచరిత్రకన్న గుణాతిశయము కలదికాదని పెక్కండ్ర పండితుల యభిప్రాయము. అయినను లోకులయొక్క రుచులు భిన్నముగనుండునుగదా! పంతుల వారికి మనుచరిత్రముకన్నఁ గవికర్ణరసాయనమును వసుచరిత్రమును శ్లాఘ్యతరకావ్యములుగాఁ గానుపింపవచ్చును. కాని నిర్హేతుకముగ నేయాధారములేకుండ నల్లసాని పెద్దనార్యుని నిందార్హునిఁగాఁ జేయుట కవిజీవితగ్రంథకారునకు న్యాయమైనపనికాదని నుడువుటకుమిక్కిలి చింతిల్లుచున్నాఁడను. ఆంధ్రభోజుఁడని ప్రఖ్యాతిఁగాంచిన కృష్ణరాయలంతటి చక్రవర్తి పెద్దనయెడ నెట్టి ప్రేమతనకుఁ గలిగియున్నను నిట్టియక్రమవృత్తినిఁ గనియువినియు సైరించునా? రాయలయాస్థానమునకు వచ్చుపండితకవులలో నితఁడొక్కఁడే కాఁడు.

పెక్కండ్రుగలరనియు, వారలు నిత్యమును రాయలను సందర్శింపుదురనియు నెల్ల వారెఱుంగుదురు. అల్లసానిపెద్దనయె యింతటి కుటిలమార్గమునకు దారితీసినమాట వాస్తవమగునేని తక్కినవారలెట్టులయినను నరసింహకవియొక్క వృత్తాంతమును రాయల చెవినివేయక మానరు రాయలేరీతినైన నామహాకవిని రప్పించి సత్కరింపక మానఁడు. రాయలనగరమునఁ దనకిట్టియవమానము జరిగినందులకుఁ గోపించి నరసింహకవి తనమాంధాతృచరిత్రమునందు నీవిధముగా రాజ్యపాలకదూషణమును జొప్పించెనని చెప్పుదురు.

సీ. ఆందోళికలయందు-నంతగఁచదురైన,
సవికృతాకృతులపి-శాచజనులు!
పరకరాళంబులై-ప్రార్థింపఁగనుఁగోక,
వాయుక్తసుందుజీ-వచ్ఛవములు!
ఫాలవీజనములఁ-గ్రాలుచునీఁగకు,
నంటీనిఖరవర్తు-లాండసములు!
వేత్రపరంపరా-విలకంటకావృతిఁ,
జేరఁగారానిబ-ర్బూరతతులు!
శంఖనాగస్వరస్వర-శ్రవణసమద!
విస్ఫుటచ్ఛత్రవిస్ఫారి-తస్ఫటాక!
విష్టవిషవైద్యవశవర్తి-దుష్టఫణులు!
ప్రభుదురాత్ములనెవ్వఁడు-బ్రస్తుతించు॥

రాయలవలన సన్మానముకలుగలేదని నరసింహకవి నిజముగాఁ గృష్ణరాయల కాలమునాఁటి వాఁడేయైన నిట్టి ప్రభుదూషణమును జేసి మనఁగలఁడా? నరసింహకవి మనుచరిత్రమును జూచి యీకవికర్ణరసాయనగ్రంథమును రచించియుండవచ్చునుగాని కవికర్ణరసాయన కావ్యమునుమాత్రము కృష్ణరాయలుగాని తదాస్థానకవులుగాని చూచినారనుమాట విశ్వసింపరాదు.

కృష్ణరాయలు పెద్దనకనేకాగ్రహారములిచ్చెను. అందుముఖ్యమగునది కోకటాగ్రహారము. ఈయగ్రహారమునకు శఠగోప



పురమని తనగురువు పేరుపెట్టెను. ఈయగ్రహారమును గూర్చిన యంశము నీక్రింది శాసనమువలన విపులముగాఁ దెలియఁగలదు.

" అల్లసానిపెద్దయ్యంగారు బ్రాహ్మణుఁడు ; నందవరీకుఁడు ; చొక్కరాజుగారి కొమారుఁడు ; కోకట గ్రామమును శ్రీకృష్ణదేవరాయలవారికవీశ్వరునకియ్యఁగా నతఁడు వైష్ణవమునుపుచ్చుకొని యీగ్రామము శ్రీవైష్ణవులకగ్రహారముచేసియిచ్చెను. అప్పుడు దానికిఁబెట్టినపేరు శఠగోపపురము. ఈకవి శాలివాహనశకవర్షములు ౧౪౪౦ బహుధాన్యసంవత్సర వైశాఖ శు౧౫లు నాఁడు ఈగ్రామమునందుండు సకలేశ్వరస్వామికి నైవేద్యదీపారాధనలకై రెండుపుట్లచేను ధారపోసియిచ్చి సదరుదేవాలయములో శిలాశాసనము వేయించినాఁడు పరిసంవత్సరము కార్తీక శు౧౨ల నాఁడు చన్నకేశవస్వామికి నాలుగున్నరపుట్లభూమి ధారపోసి శాసనము వేయించినాఁడు. కృష్ణదేవరాయలతరువాత సదాశివదేవరాయలకాలములోను, రామరాయల కాలములోను, నంద్యాలరాజయిన మట్ల అనంతరాజుకాలములోను కోకటాగ్రహారము బ్రాహ్మణులకుఁ జెల్లెను." ఇట్టి వైష్ణవపక్షపాతియైన భక్తాగ్రేసరుఁడు భట్టపరాశర శిష్యుఁడై వైష్ణవమతాభినివేశముగల భక్తుఁడగు నరసింహకవియెడ నసూయతగలవాఁడగునా?

పెద్దనకవికృష్ణరాయల యాస్థానములో సకలకవీశ్వరులు నుండఁగా రాయలకోరికమీఁద నుభయభాషాపాండిత్యము స్పష్టమగునట్లుగా నొక యుత్పలమాలిక నాశుకవిత్వముగాఁ జెప్పిసభ్యులనందఱిని మెప్పించి బిరుదందె వేసికొన్నవాఁడు. రాయలు కవిగండపెండేరమును బంగారుపళ్ళెరమున నుంచి సంస్కృతాంధ్ర భాషలయందు సమానముగాఁ గవిత్వముచెప్ప సమర్థతఁ గలవారు దీనిని ధరింపనర్హులని పలికినప్పుడు పెద్దనామాత్యుఁడు లేచి యీక్రిందియుత్పలమాలికనుజదువఁగాఁ గృష్ణరాయలుసంతోషించి తానే యాక

వికటకవి పెంజేరమును కవిపాదమునఁ దొడిగెనఁట! వహ్వా! భాషాభిమానమనఁగా నిట్లుగదా యుండవలయును! ఎందఱు ప్రభువరులు పుట్టిగిట్టలేదు! కృష్ణరాయలఁ బోలె నాంధ్రభాషాపోషణముఁ జేయనేర్చిరే? జన్మమనఁగా నాతనిదే గద!

"ఉ. పూతమెఱుంగులుం బసరు-పూపబెడంగులుఁ జూపునట్టివా
కైతలు జగ్గునిగ్గునెన-గావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్।
రాతిరియుం బవల్ మఱపు-రానిహొయల్ చెలియారజంపుని
ద్దాతరితీపులంబలెను-దారసిలన్వలెలోఁదలంచినన్।
బాతిగఁ బైకొనన్వలెను-బైదలికుత్తుకలోని పల్లటీ
కూఁతలనన్వలెన్సొగసు-కోరుల-లు రావలెనాలకించినం।
జేతికొలందిఁ గాఁగిటను-జేర్చనఁ గన్నియచిన్నిపొన్నిమే
ల్పూఁతలఁ జన్నుదోయివలె-ముచ్చటగావలెఁ బట్టిచూచినన్।
దాతొడనున్న మిన్నులమి-టారపుముద్దులగుమ్మకమ్మనౌ
వాతెఱదొండపండువలె-వాచవిగావలెఁ బంటనూదినన్।
గాతలఁ దమ్మిమూలిదొర-కైవసపుం జవరాలిసిబ్బెపున్।
మేతెలియుబ్బురంపుజిగి-నిబ్బరపుబ్బుగుబ్బిగుబ్బపొం।
బూఁతలనున్న కాయసరి-సోఁడిమికిన్నెర మెట్లబంతిసం।
గాతపుసన్నబంతిబయ-కారపుఁగన్నడగౌళవంతుకా।
పాతతతానతానలవ-సందివుటాడెడుగోటమీటు బల్।
ప్రోఁతలు నుంబలెన్ హరువు-మొల్లముగావలె నచ్చతెన్గులీ।
రీతిగ సంస్కృతంబు పచ-రించినపట్టున భారతీవధూ।
టీతపనీయగర్భనిక-టీభవదానవపర్వసాహితీ।
భౌతికనాటకప్రకర-భారతభారతసమ్మతప్రభా।
శీతనగాత్మజాగిరిశ-శేఖరశీతమయూఖరేఖికా।
పాతసుధాప్రపూరబహు-భంగఘుమంఘుమఘుంఘుమార్భటీ।
జాతకతాళయుగ్మలయ-సంగతిమించు విపంచికామృదం।
గాతతతేహితత్తహిత-హాధితధంధణుధాణుదింధిమి।
వ్రాతనయానుకూలపద వారకుహూద్వహహారికింకిణీ।
నూతనఘల్లుఘల్లుచరణ-నూపురఝూళఝుళీమరందసం।
ఘాతవియద్ధునీచకచ-కద్వికచోత్పలసారసంగ్రహా।
యాతకుమారగంధవహ-హారిసుగంధవిలాసయుక్తమై।
చేతము చల్లఁజేయవలె-జిల్లనఁ జల్లవలెన్ మనోహర।



శ్వేతకగోస్తనీఫలమ-ధుద్రవగోఘృతపాయసప్రసా।
రాతిరసప్రసారరుచి-రప్రతిమంబుగ సారెసారెకున్॥"

పెద్దనార్యుఁడు స్వారోచిషమనుసంభవమును రచించి కృష్ణరాయల కంకితము చేయుటయేగాక హరికథాసారము మొదలగు ప్రబంధములను గూడఁ జేసియున్నాఁడుగాని మనుచరిత్రమువలె నాగ్రంథములు వ్యాపింపకుండుటయేగాక యిప్పుడు నామమాత్రావశిష్టములై యున్నవి.

నందితిమ్మనకవి పారిజాతాపహరణమను ప్రబంధమును రచియించి కృష్ణదేవరాయని కంకితము చేసెను. ఇతఁడు రాయని యాస్థానకవులలోఁ బ్రసిద్ధిఁగన్నవారిలో నొక్కఁడు. ఇతఁడు తనపారిజాతాపహరణగ్రంథములో నీక్రింది విధమునఁ జెప్పుకొనియున్నాఁడు.

"సీ. కౌశికగోత్రవి-ఖ్యాతుఁడాపస్తంబ,
సూత్రుఁడార్వేలప-విత్రకులుఁడు।
నందిసింగామాత్య-నకు ముదిమ్మాంబకుఁ,
దనయుండు సకలవి-ద్యావివేక।
చతురుఁడు మలయమా-రుతకవీంద్రునకు మేఁ,
నల్లుండు కృష్ణరా-యక్షితీశ,
కరుణాసమాలబ్ధ-ఘనచతురంతయా,
నమహాగ్రహారస-నాథయుతుఁడు।
తిమ్మయార్యుండు శివపరా-ధీనమతియ।
ఘోరశివగురుశిష్యుండు-పారిజాత।
హరణమను కావ్యమొనరించె-నాంధ్రభాష।
నాదివాకరతారాంశు-ధాకరముగ॥"

ఈపద్యమునుబట్టిచూడఁగా నితఁడు కౌశికగోత్రుఁడనియు, ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడనియును, ఇంటిపేరు నందివారనియు, ఈతనితండ్రిపేరు సింగనయనియును, తల్లిపేరు తిమ్మాంబయనియును, ఇతని మేనమామపేరు మలయమారుతకవియనియును స్పష్టమగుచున్నయది. ఇతని తాత యగు మల్లయ్యయు మేనమామ మలయమారుతాహ్వయుండగు ఘంటసింగయ్యయుగలిసి

వరాహపురాణమునురచియించి కృష్ణరాయల తండ్రియగు నరసరాజునకంకితముచేసిరని తొమ్మిదవ ప్రకరణమునందు నుదహరించియున్నాఁడను.

అంతులకు విరుద్ధముగా బ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారి కవిజీవితములయందు వ్రాయబడియున్నది. ఈ సందర్భమున వీరువ్రాసినవ్రాతలు చరిత్రాంశములకు భంగమును గలిగించునవిగాన నవ్వానిని నొకించుకయిటజర్చించినఁగాని యందలిసత్యముబయలుపడనేరదు. పారిజాతాపహరణ గ్రంథకర్తయగు తిమ్మనకవికి నందిమల్లయ్య సవతితమ్ముండనియును మలయమారుతకవియగు సింగయ్య సవతిమేనల్లుండనియును తిమ్మనకవి మేనమామయగు మలయమారుతకవి యీమలయమారుతకవికిదండ్రి తండ్రి (తాత) యనియును వరాహపురాణమును గృతినందిన నరసరాజు కృష్ణరాయలతండ్రిగాడనియును కృష్ణదేవరాయల తాతయగు నీశ్వరరాజు వరాహపురాణకృతినందిన నరసరాజు తండ్రియగు నీశ్వరరాజును నొక్కరుగాక యిరువురుగానుండిరనియును ఈశ్వరనారసింహరాజు కృష్ణరాయనికాలమునకు బూర్వపువాడుకాడనియును జెప్పియాంధ్రకవులచరిత్రములోని సత్యాంశములను మొదలంట ఖండించి చరిత్రముతలక్రిందుగాఁజేసి లేనిపోనిశంకలెన్నియోగల్పించుకొని వృథాగానాయాసపడుటయెల్ల నేలవిడిచి సాముచేయుటవంటిదిగానున్నది.

వెనుకతర్కశాస్త్రిపండితుఁడొకఁడు బజారునకుబోయియొకయిత్తడిపాత్రములో నేయిగొనిపోసికొనివచ్చుచు మార్గమధ్యమున ఘృతమునకుఁబాత్రమాధారమా లేక పాత్రమునకు ఘృతమాధారమైయున్నదాయని శంకకల్పించుకొని పరీక్షించినంగాని సత్యముగానరాదని యాపాత్రమునుబోర్లించి ఘృతమునంతయునుబోగొట్టుకొనెనట. ఆతర్కశాస్త్రిపండితునివలెనే మనయీపంతులవా



రును లేనిపోనికుశ్శంకలుగల్పించుకొని యందున్నసత్యాంశములను గూడఁగోలుపోయిరి. "చంద్రవంశపురాజ" ని వరాహపురాణపీఠికయందుఁ జెప్పఁబడిన సాళువ నరసింహరాజును శ్రీకృష్ణదేవరాయని మంత్రియగు సాళువతిమ్మరాజును నిరువురు నొక్కవంశములోనివారేయని కవిజీవితములయందు సూచించుట గొప్ప పొరబాటుగానున్నది. బ్రాహ్మణుఁడయిన సాళువతిమ్మరాజు (తిమ్మరుసు)ను క్షత్రియుండని స్యూయల్ దొరగారు మున్నగువారు భ్రమపడినట్లుగానె మన యీపంతులవారును క్షత్రియుఁడయిన సాళువనరసింహరాజు బ్రాహ్మణుఁడని భ్రమపడి యుండవచ్చును. శ్రీరామమూర్తిపంతులుగారు కవిజీవితములలో "కావున నీశ్వరనారసింహరాజు కృష్ణరాయనికాలమునకుఁ బూర్వపువాఁడనిగాని అందునూలముగ నతని కవీశ్వరులగు నందిమల్లయ్య, మలయమారుతకవులు కృష్ణరాయనికంటెగాని అతనితండ్రియగు నరసింగరాయనికంటెఁగాని పూర్వులు అయినట్లుగాగాని యించుకస్థిరపడదు." అని వ్రాసియుండుటవల్ల వరాహపురాణమును గృతినొందిన యీశ్వరనారసింహరాజు కృష్ణరాయల తండ్రియగు నీశ్వరనారసింహరాజు కాడనియును, ఈయీశ్వరనారసింహరాజు కృష్ణరాయల కాలమునకుఁ బూర్వపువాఁడు కాఁడనియు స్పష్టమగుచున్నది గదా! ఇప్పుడు శ్రీరామమూర్తిగారివాదమునకు గొప్పచిక్కు తటస్థమైనది. పంతులవారి సిద్ధాంతముప్రకారము సాళ్వవంశములోనొక్క తిమ్మరాజును ఆతిమ్మరాజునకు నీశ్వరరాజను పుత్త్రుఁడొకఁడునుఅయీశ్వరరాజునకు నారసింహరాజను పుత్త్రుఁడొకఁడునునున్నట్లును ఆరీతిగానే తుళువవంశములోనొకతిమ్మరాజును ఆతిమ్మరాజునకు నీశ్వరరాజును ఆయీశ్వరరాజునకు నారసింహరాజును పుత్త్రులైయుండినట్లును వేద్యమగుచున్నది. ఇది యెంత విరుద్ధముగా నున్నదో చూడుఁడు.

కృష్ణరాయలతండ్రియగు నరసరాయలు విద్యానగరాధీశ్వరుండయిన సాళ్వనరసింహరాజునొద్దఁదనతండ్రియగు నీశ్వరరాజునకుంబిమ్మట సేనాధిపతిగానుండి సాళ్వనరసింహరాజు మృతినొందినపిమ్మట నాతనిద్వితీయ పుత్త్రునిం జంపించి విద్యానగరరాజ్యమును గైకొనినట్లుగా న్యూనీజుమొదలగు విదేశీయచరిత్రకారులెల్లరును వ్రాసియుండుటయేగాక యాంధ్ర ప్రబంధములయందు సైతము నరసరాజు విద్యానగరమును గైకొనినట్లుగా సూచింపఁబడియేయున్నయది. పారిజాతాపహరణగ్రంథములో నివ్విధముగ వ్రాయబడియున్నది.

"సీ. కుంతలేశ్వరుఁడుచిక్కుపడంగ విద్యాపురంబుఁ గైకొని నిజప్రౌఢినెఱపు" అని వ్రాయఁబడియుండుటంజేసి విద్యానగరరాజ్యము కృష్ణరాయల పూర్వులదిగాక రాయలతండ్రియగు నరసరాజువలన నాక్రమింపఁబడినదిగాఁ గన్పట్టుచున్నదిగదా! ఇంకవరాహపురాణమును గృతినొందిన యీశ్వరనారసింహరాజునుగురించి తత్పురాణమునందే దెలుపఁబడియున్నది. వరాహపురాణకృతియందు సాళువనరసింహరాజుయొక్క వంశాభివర్ణనము చేయబడినతరువాత నానృసింహరాజువద్ద వరాహపురాణమునకు కృతీశ్వరుఁడైన సాళువనరసింగరాజు (నరసరాజు) తండ్రియైనయీశ్వరరాజు సేనానాయకుఁడైయుండినట్లును వీరిదితుళువాన్వయమైనట్లును జెప్పియున్నారు. "అట్టినరసింగరాజరత్నంబుచేతమున్న సవడసి సైన్యనాయకపట్టభద్రత్వంబునసిర్నిద్రవిజయలక్ష్మీమహత్వంబున మదవదభియాతిభయదసత్వంబున దీర్ఘాయురైశ్వర్యధుర్యుండయిన యీశ్వరనాయకునకుం బ్రియతనూభవుండు నరసవసుధాధ్యక్షుండు నిర్వంచితానుగ్రహంబునం బరిగ్రహించిన యిమ్మహాప్రబంధంబు." అనిచెప్పఁబడియుండుటంబట్టి యీనరసరాజుకృష్ణరాయల తండ్రియగు నరసరాజుగాక వేఱొకఁడని చెప్పినయెడల సాళ్వనరసింహరాజునొద్ద నీశ్వరరాజులిద్దఱు సేనాధిపతులుగానుండిరనియును, ఆయిరువురకు నరసరాజులను పేరులుగల యిరువురుపుత్త్రులుండినట్లుగా సిద్ధాంతీకరింపవలసియుండునుగాని సత్యమదిగాదు. శ్రీరామమూర్తిపంతులుగారు వరాహపురాణమును జూచియుండకపోవుటచేతను విద్యానగరరాజ్య చారిత్రమప్పటికి వారికంతగాఁదెలియకుండుటచేతను, ఆంధ్రకవిచరిత్రకారుని యెడఁగలయసూయతకవిచరిత్రకారుని సదభిప్రాయములను మొదలంటఖండింపఁబురికొల్పుటచేతను తప్పుడుత్రోవఁద్రొక్కవలసివచ్చినది.

ఈసందర్భమునందేమి మఱికొన్నిసందర్భములయందేమి నా గ్రంథమునఁ జూపించిన వాక్యరత్నములను నిష్పక్షపాతబుద్ధితో విమర్శించిచూచినవారలకుఁ గవిచరిత్రకారునియెడఁ గవిజీవితగ్రంథకారునకెట్టియసూయతకలదో వేద్యముకాగలదు. చరిత్రములు లేనికాలములోనివారలచరిత్రములను వ్రాయఁబూనువారి గ్రంథముల భ్రమప్రమాదాది దోషములు తటస్థించుట సత్యమేగాని యొకరియెడఁగల యసూయతచే వారుచేసిన సిద్ధాంతమును బూర్వపక్షము చేయవలెనను తలంపుమాత్రమే గలిగియున్నచోఁ జరిత్రకారుల సంకల్పమెట్టులీడేఱగలదు? ఇంతకును నందితిమ్మకవి తనగ్రంథములోఁ దన పితామహునిపేరుదహరింపకపోవుటచేత శ్రీరామమూర్తిపంతులుగారికి సందు దొరికినదిగాని యెన్నివిధములచేతఁ బ్రయత్నించి సాధింపఁజూచినను వారి సిద్ధాంతము నిలువఁజాలదు. వరాహపురాణములో నీశ్వరరాజునుగుఱించి చేయబడిన వర్ణనావిశేషములు మనుచరిత్ర పారిజాతాపహరణగ్రంథములలోఁ జేయంబడకున్నంతమాత్రముచేత నాయీశ్వరరాజునకు నీయీశ్వరరాజునకు సంబంధములేదని సిద్ధాంతీకరించుట (ఒక్కరుగారనిచెప్పుట) యతిసాహసకృత్యమని నేను దృఢముగాఁ జెప్పుచున్నాఁడను. కృష్ణరాయల పితామహుఁడగు నీశ్వరరాజుయొక్క ప్రతాపము కృష్ణరాయల కాలములోనున్న పెద్దనాదులకంటె సకాలీనులుగా నుండి గండ్లారఁజూచుచున్న మల్లయమలయమారుతకవులకు నెక్కువ యు

నుభవనీయమైన విషయముగదా! "నందిమల్లయకవికి ముక్కుతిమ్మనమనుమఁడని కాని, యిందులోఁ జెప్పంబడిన మలయమారుతకవియు, తిమ్మకవి మేనమామయగు మలయమారుతకవియు, నొక్కఁడేయనిగాని చూపుటకు గ్రంథదృష్టాంతములు లేవు." అని శ్రీరామమూర్తిగారు వ్రాసిరి "ముక్కుతిమ్మనకు మల్లయకవి సవతి తమ్ముండనియును, సింగనకవి సవతిమేనల్లుండనియుఁ దేలినది." అనికూడ శ్రీరామమూర్తిగారు వ్రాయుటకు గ్రంథదృష్టాంతములు లేవేయని హెచ్చరించుచున్నాఁడను. "సాళువవంశములోనివారం దఱును ప్రత్యేకముమండలాధిపతులైనగాక అంతకంటెను తక్కువస్థితిఁగల సామంతప్రభువులయియున్నట్లు కానుపించును.

కాఁబట్టి వీరివంశములోనుండు వారుమండలాధీశ్వరులని గ్రంథదృష్టాంతములగపడువఱకును వీరుకృష్ణరాయవంశస్థులకు బూజ్యులనిచెప్పవలనుపడదు. అదినిశ్చయమగునఱకును ఆవంశములోని వారికాలనిర్ణయము నాసిద్ధాంతముపైని నిర్ణయింపఁగూడదు" అనివ్రాసిన దానికీవిధముగాఁ బ్రత్యుత్తరమిచ్చుచున్నాఁడను. సాళ్వనరసింహరాజు విజయనగరరాజులకడ సేనానాయకుఁడుగానున్నయొకసామంతప్రభువైయున్నను తనబాహుబలిమిచేతఁ బలురాజ్యములాక్రమించితుదకు విజయనగరమను నామాంతరముగల విద్యానగరమునుగైకొని కర్ణాటత్రిలింగదేశములను బాలించినవాఁడగుటచేతను, ఆతనియనంతరము నాతనికడ సేనాధిపతిగానుండి యధికప్రఖ్యాతిగాంచిన యీశ్వరరాజుతనయుఁడును కృష్ణరాయలతండ్రియునునగు నరసరాజుపై సాళ్వనరసింహరాజుతనయునిఁజంపించి విద్యాపురంబుఁగైకొనినవాఁడగుటచేతను ఈవృత్తాంతములను న్యూనీజు మొదలగుపెక్కండ్రుచరిత్రకారులును స్వదేశగ్రంథములును శాసనాదులును జెప్పియుండుటచేతను వారుమండలాధిపతులేయనియును వారుస్వప్రజ్ఞలచేతనట్టిపదవులను గాంచిరనియు నందువలనవారలు కృష్ణరాయవంశస్థులకుఁబూజ్యులని తేటప



డుచున్నందునఁబంతులవారిసిద్ధాంతమునకాధారములేదనియును ఏతత్కారణమువలన వారిసిద్ధాంతమును బూర్వపక్షముచేయుటకు నేయభ్యంతరములేదనియును నేనుదృఢముగాఁజెప్పుచున్నాఁడను.

మరియునీపంతులుగారు తిమ్మకవిచారిత్రమును బ్రకటించి యాతనినియోగిశాఖాబ్రాహ్మణుఁడని సిద్ధాంతీకరించి యున్నారుగదా అట్టితిమ్మకవి సాళువనరసింహరాజువంశములోనివాఁడని వ్రాయుట సాళ్వనరసింహరాజుబ్రాహ్మణుండనియా? తిమ్మకవిక్షత్రియుండనియా? అయ్యో! ఇదేటిసిద్ధాంతము! కావునఁగవిచరిత్రకారునివాక్యములే యాదరణీయములని దెలుపుచున్నాఁడను. ఏతద్విషయకమగుచర్చనిఁకవిరమించి తిమ్మకవిచరిత్రమునకుఁ గడంగుచున్నాఁడను. ఈకవిజన్మభూమి గణపవరమని యొకరుచెప్పుచున్నారుగాని దానికిందగిన యాధారమేదియుఁగానరాదు. మఱియునీకవిని రాయలభార్యపుట్టినింటి యరణపుఁగవిసిగాఁదెచ్చెనని చెప్పుదురుగానియదియుసత్యముగాదు.

ఈతనిపూర్వులు విద్యానగరరాజులవద్ద విద్వత్కవులుగానుండి కృతులిచ్చియుండుటచేత నితఁడచ్చటివాఁడేయని చెప్పుటకు సంశయింపంబనిలేదు. ఈకవిశిరోమణి తానురచించిన పారిజాతాపహరణప్రబంధమును కృష్ణరాయలకంకితము చేసినప్పుడు రాయలు చతురంతయాన మహాగ్రహారములును మణికుండలములునుబహుమానముచేసెనఁట. ఈకవిరాయలతోఁ జతురంగమును నాటనాడుచు రాయలవద్ద మిక్కిలిచనువుగలిగియుండెను. కామలాపురమునకు రెండుపరువులదూరమున నాగ్నేయదిగ్భాగముననున్న కొప్పోలురనుగ్రామమును రాయలీతిమ్మకవికి నగ్రహారముగానిచ్చి సన్మానించెను. ఈవిద్వత్కవి వితరణాదులనుగూర్చినకథలనేకములుగలవు. ఈతఁడుశివభక్తుఁడు. అఘోరశివగురుని శిష్యుఁడు ఈతనిముక్కుపెద్దదిగానుండుటచేత ముక్కుతిమ్మన్నయనిజనులచేఁ బిలువంబడుచుండెను. ఇతనికవిత్వముశ్రుతికటువుగాక యర్థగాంభీర్యమునుప

డలాలిత్యమునుగలిగి సలక్షణమయినదయి ముద్దులుగులుకుచుండు నదిగానున్నది. రాయలకోరికననుసరించి యాతఁడు తామరాకులోని నీటిబొట్టునుదిరస్కరించుచుఁ జెప్పినపద్యము నీక్రింద నుదహరించుచున్నాఁడను.

‘ ఉ. స్థానవిశేషమాత్రమునఁ-దామరపాకున నీటిబొట్టుఁ గన్ ।
బూనికమౌక్తికంబనుచుఁ-బోల్చినమాత్ర నిగర్వమేటికిన్ ।
మానవతీశిఖామణుల-మాలికలందును గూర్పవత్తువో ।
కానుకలియ్యవత్తువో వి-కాసము కెత్తువో మేలు దెత్తువో ॥’

3 ధూర్జటికవి:— ఇతఁడు పాకనాఁటి యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు; భరద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శివభక్తుఁడు; కాళహస్తిపురనివాసుఁడు. ఇతఁడు కాళహస్తిమాహాత్మ్యమను నాలుగాశ్వాసములుగల పుస్తకమును కాళహస్తీశ్వర శతకమునురచించి కాళహస్తీశ్వరునకంకితముచేసెనుగాని రాయల కంకితము చేసినగ్రంథమొక్కటియుఁగానరాదు. ఈమహాకవికవిత్వమాధుర్యమున కాశ్చర్యపడి శ్రీకృష్ణదేవరాయలొకనాఁడు సభలోఁగూరుచుండి తనయాస్థానకవులకు:—

‘ చ. స్తుతమతియైనయాంధ్రకవి-ధూర్జటిపల్కులకేలకల్గెనో ।
యతులితమాధురీమహిమ— ’

అనిసమస్యనిచ్చినట్లును వారిలోనొకరు క్రింది రీతిని సమస్యాపూరణము చేసినట్లును చెప్పుచున్నారు.

చ. స్తుతమతియైనయాంధ్రకవి ధూర్జటిపల్కుల-కేలకల్గెనో ।
యతులితచాతురీమహిమ ?-హాతెలిసెన్ భువనైకమోహనో ।
ద్ధతసుకుమారవారవని-తాజనతాఘనతాపహారిసం ।
తతమధురాధరోదితసు-ధారసధారలఁ గ్రోలుటంజుమీ ॥

పయినుదహరించిన పద్యమునుబట్టిచూడఁగా నఖండశివపూజాధురంధరుఁడగు ధూర్జటికవి సంతతవేశ్యాప్రియుఁడయిన రసికపురుషుఁడుగాఁ గనుపించుచున్నాఁడు

4 మాదయ్యగారిమల్లనకవి:— ఇతఁడు కృష్ణరాయలయాస్థానకవులలో నొకఁడనిచెప్పుదురు. ఇతఁడురాయలు పూర్వదిగ్విజయయాత్రకు బయలువెడలినపుడు వెంబడించి వచ్చెనని కుమారధూర్జటి తనకృష్ణరాయని విజయమునందీ క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.



‘ గీ. అతులజయలక్ష్మిఁ గైకొని-యరులకరుల ।
హరులధనపంక్తులనుదన-పరముచేసి ।
వెలయుశ్రీకృష్ణరాయని-విభవగరిమ ।
కాంచికన్నులపండువు గాఁగనపుడు ॥
గీ. సరససాహిత్యరచనావి-స్ఫురణమెఱయు ।
సారమధురోక్తిమాదయ-గారిమల్ల ।
నార్యుఁడలయల్లసానిపె-ద్దార్యవరుఁడు ।
ముక్కుతిమ్మనమొదలైన-ముఖ్యకవులు
క. వినిపించిరపుడు హాతికిఁ,
ఘనకాంబరభూషణములు-ఘనతనొసఁగియా ।
జనవరుఁడప్పాజిఁగనం ।
గొనియిట్లనిపలికెనపుడు-కౌతుకింబలరన్ ॥’

ఇతఁడు రాజశేఖరచరిత్రమను ప్రబంధమును రచించి తిమ్మరుసు జామాతయగువాదిండ్ల యప్పామాత్యున కంకితము చేసెను. ఇతఁడుశైవబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రసంజాతుండు కొండవీటిపురనివాసి. అయ్యంకిపురాగ్రహార విభవాకరుఁడని యీక్రింది రాజశేఖరచరిత్రములోని పద్యమువలనఁ దెల్లమగుచున్నది.

ఉ. శంకరపాదసేవనవశంవదమానసపంకజాతని ।
శ్శంకవచోవిలాసరుచి సారవినిర్జితపూర్ణపూర్ణిమా ।
శాంకదురక్షురానసభయంకరి కౌశికగోత్రపాత్రయ ।
య్యంకిపురాగ్రహారవిభ వాకరమాదయమల్లసత్కవీ ॥

అయ్యంకి కృష్ణామండలములోని చల్లపల్లి సంస్థానములో మచిలీపట్టణమునకు (బందరు) పదునాలుగుమైళ్ళ దూరము గలదు. ఇతఁడు లాక్షణికుఁడైన గొప్ప కవి.

5 తాళ్ళపాకచిన్నన్న:— "అష్టమహిషీకళ్యాణ" మను ద్విపదకావ్యమును నిర్దుష్టముగాను, మనోహరముగాను రచియించిన యీకవి కృష్ణదేవరాయలకాలమునందున్న వాఁడని చెప్పుదురు.

౬ అయ్యలరాజు రామభద్రకవి:—ఇతఁడారువేల నియోగిబ్రాహ్మణుఁడు; తిప్పయార్యుని ప్రపౌత్రుఁడు; పర్వతన్నమనుమఁడు; అక్కయార్యుని కుమారుఁడు కడపమండలములోని యొంటిమెట్ట యీతనిజన్మస్థానము. ఈమహాకవికృష్ణదేవరాయల యంతిమదశలో విజయనగరములోఁ బ్రవేశించిరాయనిచేతఁ దద్విరచితమగు సకలకథాసార సంగ్రహమను గ్రంథమును తనదురదృష్టవశమున గ్రంథముముగింపకమునుపే రాయలు పరమపదమునుబొందినందున గ్రంథమునాతనికంకితముచేయుక కృష్ణదేవరాయల ప్రార్థనచేతఁదా నాగ్రంథమును వ్రాసితినని మాత్రముదనయవతారికయందు వ్రాసియున్నాఁడు. ఇతనిగుఱించి కవిజీవితములయం దుదహరింపఁబడినకథలు విశ్వాసపాత్రములు కాకపోవుటచే నయ్యవి యిందు నుదహరింపఁబడలేదు. ఈప్రౌఢకవి రామాభ్యుదయ మను ప్రబంధమునురచించి కృష్ణరాయలయల్లుఁడగు రామరాయలయొక్క మేనల్లుఁడయిన గొబ్బూరినరసరాజున కంకితముచేసెను. రాయలతర్వాత నీతఁడేఁబదిసంవత్సరములవఱకు జీవించియుండెను. ఈకవిశిఖామణి చిరకాలముజీవించి బహుసంతానవంతుఁడయి దారిద్ర్యముచేత బాధనొందుచు పిల్లల రామభద్రయ్యయను పేరజనులచేఁ బిలువఁబడుచుండెను.

పింగళిసూరనామాత్యుఁడు రామరాజభూషణుఁడుఁ తెనాలి రామకృష్ణకవి మొదలగువారు రాయలకాలములోనివారుకాని హేతువుచేత వారిచారిత్రములిచటఁ దెలుపఁబడలేదు.

## పదునెనిమిదవ ప్రకరణము.

కృష్ణరాయలసంతానము—తిమ్మరుసు మంత్రికుమారుడు రాయలపుత్త్రునకు విషము బెట్టించిచంపుట—రాయలుతిమ్మరుసును చెఱసాలం బెట్టించుట—తిమ్మరుసుకొడుకు పాఱిపోయి రాయలపైధ్వజమెత్తుట—రాయలు తిమ్మరుసుకొడుకు నుబట్టితెప్పించుట—రాయలు తిమ్మరుసు మొదలగువారికండ్లు పెఱికించుట—తిమ్మరుసు మరణము—రాయలురోగగ్రస్తుడగుట—మడిల్ సాదండెత్తివచ్చుట—రాయలు వాని నెదుర్కొనఁబోవుట—బీజపురసుల్తాను పలాయనుఁడగుట—రాయల మరణము—కృష్ణరాయనిమతము—



శ్రీకృష్ణదేవరాయని చరిత్రములో నీప్రకరణమే మిక్కిలి దుఃఖమును కలిగించునదిగాను నిరంకుశాధికారమువలనఁ గలుగుచెడుగులను దెలుపునదిగాను నున్నయది. తొలుదొల్తఁ గృష్ణరాయని సంతానమునుగూర్చియించుక చర్చించి యటుపిమ్మటనాతనియవసానదశంగూర్చి ముచ్చటింతును. కృష్ణరాయలకు పురుషసంతానములేదని బహుగ్రంథములయందు వ్రాయబడినదిగాని సకాలీనులగు చరిత్రకారులు వ్రాసినవార్తలయందాతనికిఁబురుషసంతానముగలదని వ్రాయఁబడియున్నది.

అందు నూన్యీజు వ్రాసినచరిత్రము మనకు ప్రమాణమని చెప్పనచ్చును. కృష్ణరాయలకు స్త్రీసంతానము బహుళముగా నున్నట్టు గ్రంథదృష్టాంతములు గనుపించుచున్నవి. నరపతివంశజులలో సుప్రసిద్ధుఁడై విద్యానగరరాజ్యచరిత్రమునఁ బేరెన్నికఁగాంచిన రామరాయలు కృష్ణరాయలకూతుఁ దిరుమలాంబను బెండ్లియాడెను. అయ్యలరాజురామభద్రకవి విరచితమగు రామాభ్యుదయమునందు నీక్రింది.

‘ఉ. ఆపటుకీర్తి రామవసు - ధాధిపచంద్రుఁడుకృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమ - దుహితృప్రియుఁడైవితతప్రతాపసం
తాపితశత్రుఁడైయలస - దాశివరాయనిరంతరాయవి
ద్యాపురరాజ్యలక్ష్మికిని - ధానముదానయిమించెనెంతయున్॥’

పద్యమునందును,

‘మ. దివిజేంద్రాభుఁడుకృష్ణరాయ - ధరణీదేవేంద్రుజామాత శ్రీ-
ధవపాదాంబుజబంధురంబునగు - మేధావేధ రామప్రభో।
త్రిశికంఠాంతరరక్షకీకరస - మిద్దారోర్త్రిరౌతిఖ।
ద్గవనీకీర్తిలతాంతగంధిల - హరిత్కాంతాకచాభోగుఁడై॥’

అనిరామరాజు రంగప్పరాజు విరచితమగు సాంబోపాఖ్యానములోని పయిపద్యమునందును రామరాయలు కృష్ణరాయలజామాతయని దెల్పఁబడినది. రామరాయలసోదరుడగు తిరుమలదే

వరాయలు కృష్ణరాయలపుత్త్రికయగు వెంగళాంబను బెండ్లియాడెనని స్యూయలుదొరగారు వ్రాసిరి. ఈమెయే చిన్నాదేవిపుత్త్రిక. మట్ల అనంతభూపాలుని పూర్వులలో నొక్కఁడగు వరదరాజనునతఁడు కృష్ణరాయనికల్లుఁడైనట్లు కాకుస్థవిజయమునందలి యీక్రింది

'చం॥ వనజదళాక్షశంకరులు-వారికిఁ బ్రదికిఁ బోలెఁ గృష్ణరా।
యనికిని నంగుటల్లుఁ-డటులైతనరుణ్ వరదక్షమాధవుం।
డనిమిష వాహినీముని-గజాశ్వమహీరుహధేనుభీమవా।
హనమకుటావతంసకు-ధరాభరణాదిక హేతుకీర్తియై।'

అను పద్యమునఁ దెలుపఁబడినది. ఇంతియగాక కుతుబ్షాహితవారిక్ చరిత్రలో బసవరాజులేకశిన రాజనునతఁడు కృష్ణరాయల కల్లుఁడైనట్లు దెలుపఁబడినది. కృష్టరాయలకింకను కొమార్తెలుగలరనియు, ఇందఱల్లుండ్రుగలరనియు నిర్ధారణముచేయుట కింతకన్న ప్రబలాధారములుగానరావు. రామరాయలనుగుఱించి మఱొకప్రకరణమునందు దెలుపఁబడునుగావునఁ బ్రస్తుతమచ్యుతరాయల యంత్యదశంగూర్చి మాత్రమే దెలుపుచున్నారము. రాయలుదిగ్విజయమునుముగించి సమస్తవాంఛితములనుదీర్చుకొని విరక్తిజనింపఁగాఁ దనతరువాత రాజ్యమునకునెవ్వరు ప్రభువులగుదురోయను భీతిచేతఁ దానుజీవించియుండఁగానె యాఱేండ్లవయస్సుగల దనపుత్త్రునిఁ బట్టాభిషిక్తునిఁగాఁ జేయనిశ్చయించికొమరుని సింహాసనమెక్కించి తానుమంత్రియై తిమ్మరుసును కార్యనిర్వాహకునిగాను, ఆతనిపుత్త్రుని దళవాయిగాను నేర్పఱచి రాజ్యమునందంతట నుత్సవములుసలుపఁగట్టడచేసెను. ఎనిమిదిమాసము లీవిధముగా వేడుకలుజరుపఁబడెను. అంతటరాయలపుత్త్రునకు నేదోజాడ్యమంకురించి యాతఁడుమృతినొందుట సంభవించెను. తిమ్మరుసుకొడుకు తనతనయునకు విషముఁబెట్టిచంపించెనని రాయలకుఁ దెలియవచ్చెను. అయ్యది నిశ్చయమగుట దెలిసికొని క్రోధావేశపరవశుఁడై తిమ్మరుసును, అతనిపుత్త్రుని, నగరపాలకుఁడును తిమ్మరుసుసోదరుఁడునునగు గోవిందరాజును, వారలబంధువులను, ప్రభువరులను, దండనా



యకులను, నెల్లవారినిరప్పించికొలువుదీర్చి తిమ్మరుసు మొగముగాంచియిట్లుపలికెను. "నిన్ను ప్రాణమిత్రునిగా నెప్పుడును జూచుకొనుచుంటిని, ఈనలువదిసంవత్సరములనుండి నీవునాకిచ్చినయీరాజ్యమునకంతకును బాలకుఁడవుగానుంటివి, అయినను అంతలకు నేను విశ్వాసమునుజూపఁజాలను. ఎందువల్లననఁగా నీకు విధ్యుక్తమయిన కార్యమును నెఱవేర్చుటయందుమాని, ప్రతికూలముగాఁ బ్రవర్తించితివి.

నీప్రభువగు నాయన్నగారునానేత్రములను తీయించివేయవలసినదని నీకాజ్ఞయిచ్చినప్పుడు వానియాజ్ఞకునీవులోఁబడవలసినవాఁడవైయున్నావు. అయినను ఆతనియాజ్ఞనుజెల్లింపలేదు. ఆతనికివిధేయుఁడవుగాలేదు. పైగామేకకండ్లుపెరికించి తెప్పించి మోసపుచ్చినావు. అందువలననీవును నీతనయులును రాజద్రోహులుగాఁబరిగణింపఁబడుచున్నారు. ఇప్పుడునీవును నీతనయులును నాకుమారునకు విషముఁబెట్టిచంపించినారని తెలిసినది. అందుకొఱకేమిమ్ములను ఖైదీలనుగాఁ జేసియున్నాఁడను. అనిపలుకుచులేచి చేతులుచాచి వారలంబట్టుకొని తనకును తనరాజ్యమునకును నేయపాయమునుగలుగకుండఁ బోర్చుగీసు వారినిసాయముఁ జేయుఁడని వేడికొనెను. ఇట్లుతిమ్మరుసు మొదలగువారు రాయలచేబంధింపఁబడి మూఁడుసంవత్సరములు చెఱసాలయందుండిరి. తనతండ్రియాజ్ఞానుసారముగా సాళ్వనరసింహరాజు పుత్త్రునిఁ బెనుగొండలోని యొకతోటలో గృత్రిమముగాఁ జంపించిన కొండారెడ్డిపుత్త్రునిఁ దనకు మంత్రినిగా నియమించుకొనెను. తరువాత దళవాయియగు తిమ్మరుసుపుత్త్రుఁడు చెఱసాలనుండితప్పించుకొని దాఱిదోపిడిగాండ్రకు నివాసభూమియగు నొకపర్వతప్రాంతప్రదేశమునకుఁ బాఱిపోయి యచట నొకదుర్గములో నివసించెడు తనబంధువగుదళవాయినిఁ జేరుకొనెను. ఆదళవాయిమిత్రునినాదరించి తానుజేయఁగలిగినంతవరకుఁ దోడ్పడెను. అందుండియాతఁడు కృష్ణరాయలతో యుద్ధముఁజేయ సన్నద్ధుఁడ

య్యెను. అంకువలన రాయలధికసైన్యములాతనిమీఁదికిఁబంపియు ద్ధములోనోడించిపట్టితెమ్మని మంత్రికినాజ్ఞాపింపనాతఁడునట్లుప్రక్క లనుర్గమునాక్రమించి వానింబట్టుకొని ఖైదిగాఁగొనివచ్చి రాయల ముంగలనుంచెను. రాయలువానియొక్కయు వానితండ్రియగు తిమ్మరుసుయొక్కయు పినతండ్రియగుగోవిందరాజుయొక్కయు నేత్రములనుదీయించివేయనాజ్ఞాపించెను. తిమ్మరుసు చెఱసాలయందుండగానే మరణమునొందెను. విజయనగరమిట్టిదురవస్థలో నుండుటగని బీజపురసుల్తానగు ఏడిల్‌షా తనపగదీర్చుకొనుటకిదియె సమయమని నిశ్చయించి సేనలఁగూర్చుకొని రాచూరుదుర్గముపై దండెత్తివచ్చెను. ఈవార్తచెవినిబడినతోడనే తనసేనానాయకులకుఁజెప్పకయే యశ్వారూఢుడై శ్రీకృష్ణదేవరాయనృపతి రాచూరుమార్గమునఁబరుగిడుచుండెను. వెనుకనుండి సేనలువానిని వెంబడించెను గాని ఏడిల్‌షాకృష్ణరాయలు వచ్చుచున్నాడనువర్తమానముదెలియరాగానే భయకంపితాత్ముఁడై దుర్గమునువదలి బీజపురమునకు స్వసైన్యముతోఁ బాఱిపోయెను. రాయలురాచూరు దుర్గములోనుండి "రెండుసారులుమాటదప్పి ప్రవర్తించితివనియు, ఇంకనునీవు నీవాగ్దత్తమును నెఱవేర్చనందున నీతోయుద్ధముచేసి కదనరంగమునమోడించి నిన్నుస్వాధీనునిగాఁ జేసికొనినీనుండి బెల్గాముదుర్గమునుగైకొన్నఁగాని నిన్నువిడవననియు,, సుల్తానునకు రాయబారముపంపెను.

ఇంతలో శీతకాలమాసన్నమైనందున ముందునకుసాగక వెనకకుమరలి విజయనగరమునకువచ్చి సమరసన్నాహములను సమకూర్చుచుండెను. ఈయుద్ధములోఁ దనకుఁదోడ్పడుటకై గోవానగరపాలకున (Governor ofGova) కు వర్తమానముపంపెను. 'తానొకటితలఁచిన దైవమువేఱొండుచేసె' ననురీతి నింతలోదేశముయొక్క దురదృష్టముచేత కృష్ణరాయలు వ్యాధిగ్రస్తుఁడై యిదివరకు విజయనగరరాజులు తఱచుగానే వ్యాధివలనఁ మృతినొందుచుండి



రోయట్టి 'గజ్జలలోని నొప్పుల' నెడువ్యాధివలన దేహవియోగమునుగాంచెను. ఇతనిదానశాసనములు ౧౫౩౦ దవసంవత్సరము వఱకు గానుపించుచున్నందున నీతఁడా సంవత్సరమువఱకు జీవించి యుండెనని శాసనములను బరీక్షించినవారలు దెలుపుచున్నారు. ఈతని మరణమునుగూర్చిన పెద్దనవిరచితమగుచాటుపద్యము వ్యాపకములోనున్నదాని నీక్రిందనుదహరించుచున్నాను.

ఉ. భోరనయాచకప్రతతి-భూరివిపద్దశనొందుచుండఁగా।
నారయశాలివాహన-శకాబ్దములద్రియుగాబ్ధిసోములం।
దారణవత్సరంబునని-దాఘదినంబున జ్యేష్ఠశుద్ధష।
ష్ఠీరవివాసరంబునను-సింహాసనికృష్ణుఁడు చేరెస్వర్గముం।
ద్వారకనున్నకృష్ణుఁడవ-తారసమాప్తమునొందుకైవడిన్॥

ఈపద్యమునుబట్టి శకాబ్దములు ౧౪౪౭ కి సరియయిన హూణశకము ౧౫౨౫ వ సంవత్సరమునఁ గృష్ణరాయలంతరించినట్లు గాన్పించుచున్నను ఇదియంతఁగా విశ్వాసపాత్రమైనదిగాదు. ఈతనిమరణవార్తనువిని యుత్కలదేశపురాజగు గజపతిదండెత్తి రాఁగా నల్లసానిపెద్దనకవి యీక్రిందిసీసపద్యమునువ్రాసిపంపెనఁట.

సీ. రాయరావుతుగండ-రాచయేనుఁగువచ్చి,
యారట్లకోటగోడాడునాఁడు।
సంపెటనరపాల-సార్వభౌముఁడువచ్చి,
సింహాద్రిజయశిలఁ-జేర్చునాఁడు।
సెలగోలసింహంబు-చేరిధిక్కృతిఁగాంచు,
తల్పులఁగదలడీ-కొల్పునాఁడు।
ఘనతరనిర్భర-గండపెండేరమిచ్చి,
కూఁతురాయలకును-గూర్చునాఁడు॥
గీ. నోడతెఱుంగవొచ్చితో-యుర్విలేవొ।
చేరఁజాలకతలచెడి-జీర్ణమైతొ।
కన్నడంబెట్లుచొచ్చెను-గజపతీంద్ర।
తెఱచినిలుకుక్కచొచ్చిన-తెఱఁగుతోఁప॥

ఈపద్యమును వ్రాసిపంపఁగా నతఁడుసిగ్గుపడి మరలిపోయెనని చెప్పుచున్నారు.

కృష్ణరాయలు వైష్ణవమతమునం దభిమానము గలవాఁడని తద్విరచితమగు నాముక్తమాల్యదయే వేయివిధములఁ జాటుచున్నయది. అట్లని పరభిమానముకలవాఁడుకాఁడు శైవులను వైష్ణవులతో సమముగా నాదరించుటయేగాక మతాంతరులనుగూడ నాదరించుచువచ్చెను. ఘూర్జరమునందును, ఉత్తరహిందూదేశమునను వైష్ణవమతమును వ్యాపింపఁజేసిన వల్లభాచార్యులవారు కృష్ణరాయలకాలమునందే దర్బారులోఁ గృష్ణరాయలవలన నధికసన్మానములను గాంచెను. విష్ణ్వాలయములకును శివాలయములకును సమముగానే భూదానములను జేయుచువచ్చెను. మహమ్మదీయమతమునందును క్రైస్తవమతమునందును ద్వేషములేనివాఁడయి వారలను దనసైన్యములోఁ జేర్చుకొనియుండుటయే నిదర్శనము. ఇతఁడెప్పుడును విదేశీయులగు క్రైస్తవులకుమిత్త్రుఁడై వారలవలన వర్తకము వ్యాపించునట్లు కట్టుదిట్టములు చేసెను.

పందొమ్మిదవప్రకరణము.

# అచ్యుతదేవరాయలు

౧౫౩౦ - ౧౫౪౨

అచ్యుతదేవరాయలు సింహాసనమునకువచ్చుట — ఏడిల్‌షా ఉమ్మదుషా బరీదుషాలతో దండెత్తివచ్చుట — రాచూరు ముదిగల్లుదుర్గములను తురుష్కులు స్వాధీనముచేసికొనుట — రాయలుధనమునకై ప్రభువులను బాధించుట — కృష్ణప్పనాయకుని భార్యలనుచంపుకొని రాయలయెదుట విషముద్రాగిచచ్చుట — రాయలు వాని యాస్తినంతయుఁ గైకొనుట — ఏడిల్‌షా కుతుబ్షాతో యుద్ధముచేయుట — రాయలు సుల్తానుకుఁ దోడ్పడుట — ఇస్మాయిల్ ఏడిల్‌షా మరణము — మాలూ సింహాసనమెక్కుట — మాలూ రాజ్యపదభ్రష్టుఁడగుట — ఇబ్రహీము ఏడిల్‌షా సింహాసనమునకువచ్చుట — రాయలు తిన్నెవెల్లి జయించుట — సామంతప్రభువులు గప్పములు చెల్లించుట — హిందూస్త్రీలసహగమనము —

శ్రీకృష్ణదేవరాయలు మరణమునొందునప్పటికి నాతనికిఁ బదునెనిమిది మాసములవయస్సుగల పుత్త్రుఁడొకఁడుండెనని న్యూనీజు వ్రాసియున్నాఁడు ఆతనిగతి యేమయినదో తెలియరాదు. వీర



నరసింహరాయలపుత్త్రుఁడును, రాయలసవతితమ్ముఁడయిన యచ్యుతదేవరాయలును, చంద్రగిరిదుర్గములో నుండిరి. ఏమికారణముచేతనో రాయలుతనయనంతరము విద్యానగరసింహాసనమధిష్ఠింపవలసినవాఁడు తనసవతితమ్ముఁడగు నచ్యుతరాయలని మరణశాసనము వ్రాయించెను. ఆశాసనానుసారముగా నచ్యుతదేవరాయలు సింహాసనమునకు వచ్చెను. ఈరాయలు కృష్ణరాయనివంటి పరాక్రమముగలవాఁడుకాఁడు. పండితుఁడునుగాఁడు, సమర్థుఁడునుగాఁడు, దయారసమును గలవాఁడునుగాఁడు, ఈతఁడు రాజ్యమునకువచ్చినవెంటనే చిరకాలము శ్రమపడి తనపూర్వులయిన కృష్ణరాయాదులు సంపాదించిన రాచూరు ముదిగల్లు దుర్గములను బోఁగొట్టుకొనెను. ఇతనిగుఱించి సకాలికుఁడైన న్యూనీజు బహుకఠినముగాఁ బ్రస్తాపించియున్నాఁడు, ఇతనిపరిపాలనము విద్యానగరరాజ్యము నశించుటకుఁ ద్రోవచూపినది. ఈఅచ్యుతదేవరాయలు సింహాసనమునకు వచ్చినతోడనే తనబావమరదుల యిష్టప్రకారము పరిపాలనము చేయఁ బ్రారంభించెను. ఇతనిమంత్రులలో సలకము తిమ్మయప్రాముఖ్యత వహించియుండెను.

తనమంత్రులయొక్క దురాలోచనలను బాటించి దుష్పరిపాలనము చేయుచుండెను రాజ్యములోని ప్రభువులును సేనానాయకులును రాయలపరిపాలనమునుగుఱించి పలువిధములఁ జెప్పుకొనుచు మిక్కిలి విసుగుదలతో నుండిరి. సమర్థుఁడైన కృష్ణదేవరాయలు గతించుటయు ఆతనియనంతర మట్టిబలహీనుఁడయిన రాజుసింహాసనమునకువచ్చుటయు విని బీజపురసుల్తానుతనపగదీర్చుకోఁ దలఁచి ఉమ్మదుషా బరీదుషాలతోఁ గలసి విజయనగరముపై దండెత్తివచ్చెను పండ్రెండువేలకాల్బలమును ముప్పదివేలగుఱ్ఱపుదళమునుగల సైన్యముతో తురుష్కులుదండెత్తివచ్చినను అచ్యుతరాయలాస్వల్పసైన్యమునునోడించి సుల్తానునుబట్టుకొన శక్తిగలవాఁడయ్యును భీతచిత్తుఁడై సమరముసలుప నిష్టములేనివాఁడై తనసైనికులు యు

ద్ధముచేయ ననుజ్ఞ యిమ్మని యెన్నివిధములఁ బ్రార్థించినను వారిమనవుల నాలింపక ఏడిల్‌షా విధించినప్రకారము పదిలక్షల హొన్నుల ద్రవ్యమును రాచూరు ముదిగల్లు దుర్గముల నిచ్చుటకు నొప్పుకొని యొడంబడిక చేసికొని యొడంబడిక విధులను జెల్లించి యెల్లవారికిని దుఃఖమును కలిగించినవాఁడయ్యెను. కృష్ణరాయని సైనికులు వెనుక బీజపురమును ముట్టడించి పట్టణమెట్లు నిర్మూలించిరో యావిధముగా విజయనగరములోని నాగలాపురమును దురుష్కులు నాశనముఁ జేసిరి.

ఈదేవరాయలు బీజపురసుల్తానునకు నొసంగినద్రవ్యమంతయును ధనికులగు ప్రభువుల హింసించి యాఱుమాసములలో మఱల సంపాదించెను. కృష్ణప్పనాయకుఁడను నొకదళవాయి రాయలడిగిన ద్రవ్యమీయనని తిరస్కరించినందున నొకనాటిరాత్రి వా తనింబట్టి కొనఁదల్వారులఁ బంపగా నతఁడు తానులోఁబడుటకు ముందు రెండువందల భార్యలను జంపుకొని రాయల యెదుట దాను విషమును ద్రాగి ప్రాణత్యాగము చేసికొనెను. ఎందువల్లననఁగా రాయలానాయకుని పుత్త్రుని వాని యెదుటఁ జంపఁగోరెను. మూఁడువేలపర్దావుల విలువగల వాని యాస్తియంతయును రాయలు గైకొనెను ఈరీతిగా దేవరాయలు రాజ్యములోని ప్రముఖులైన ధనికులను బాధించి ధనాగారము నెప్పటియట్లు పూరించెను. అందువలన నెల్లవారును రాయలను మనస్సులోను ద్వేషించి యాతని రాజ్యపదభ్రష్టుని జేయ సమయమునకై వేచియుండిరి. ఈతనిచరిత్రమును మహమ్మదీయచరిత్రకారు లొకతీరుగాను హిందువు లొకవిధముగాను పోర్చుగీసుచరిత్రకారులు వేఱొకవిధముగాను దెలిపియుండిరిగావున నయ్యవి పరస్పరవిరుద్ధములయి నిజమైనవృత్తాంతమును దెలిసికొనుటకు మిక్కిలి చిక్కును గలిగించుచున్నయవి.

రాచూరుమండలమును జయించినతరువాత నిస్మాయిల్ ఏదులషా అహమ్మదునగర సుల్తానగు నిజామును జయించి మూఁడు సంవత్సరములకావల ౧౫౩౪ వ సంవత్సరమున గోలకొండనబాబగు కూలీకుతుబ్షా స్వాధీనములోనున్న యొకదుర్గమును ముట్టడించుచుండఁగా జ్వరపీడితుఁడై మరణము నొందెను. ఈయుద్ధములో విజయనగరసైన్యములు బీజపుర సుల్తానునకుఁ దోడ్పడెను. తురుష్కుల కలహములలో హిందువులు ప్రవేశించుటకిదియే ప్రథమముగానున్నది. ఇట్టిచర్యమే తరువాత హిందూరాజ్య వినాశనమునకు హేతువయినదని పెక్కండ్రుచరిత్రకారులు దెలిపియున్నారు. ఇస్మాయిలు తరువాత మాలూయను వాఁడు బీజపురసింహాసనమెక్కెను. బెల్గాముదుర్గమునకు పాలకుఁడుగానున్న మాయలమారియగు అసాదుఖానుఁడు మంత్రిగానుండెను. తరువాత సుల్తానుతోఁబడక అసాదు తనపనివదలుకొని బెల్గామునకుఁబోయెను. మాలూదుర్మార్గుఁడగుటచేత నారునెలలు పరిపాలించినతరువాత ముత్తవ్వయాజ్ఞచే నంధుఁడుగాఁజేయఁబడి సింహాసనమునుండి తొలగింపఁబడెను. తరువాత ౧౫౩౫ దవ సంవత్సరమున మాలూ కనిష్ఠసోదరుఁడయిన ఇబ్రహీమను వాఁడు రాజ్యభారమును వహించెను.

తరువాత గోవాసరిహద్దు భూములనుగుఱించి పోర్చుగీసువారికిని అసాదుఖానునకును యుద్ధములు జరిగి మహమ్మదీయులు పలుసారులోడింపఁబడినను తుదకు నసంఖ్యాకులునగు మహమ్మదీయులముందర నిలువలేక పోర్చుగీసువారు తొలఁగిపోయిరి ఇంతలో గోలకొండనబాబగు కూలీకుతుబ్షా కప్పముగట్టనందున గొండవీటిపై దండెత్తిపోయి యాదుర్గమును వశపఱచుకొని యందొకకోటను గట్టించెనఁట. అచ్యుతదేవరాయలు తిన్నెవెల్లిమండలమువఱకుగల దేశమును జయించెనని కాంచీనగరమునందలి రెండుశాసనములు వివరింపుచున్నవి కాని యాయుద్ధయాత్రకు రాయలు స్వయముగాఁబోయియుండలేదు. ఇతనికాలమున హిందూదేవాలయములకు భూదానములనేకములు చేయఁబడి పెక్కుశిలాతామ్రశాసనములు వ్రాయఁబడినవి. ఇతనివద్దమంత్రులుగానున్న వారిలో

నొక్కఁడగు రామయభాస్కరుండను, నాతఁడు మిక్కిలిసుప్రసిద్ధిఁ గాంచెను. ఈమంత్రివరుఁడు తిమ్మరుసువలెనే యాంధ్రనియోగి శాఖా బ్రాహ్మణుఁడై యున్నాఁడు ఈమహారాజుల మందిరములవాడుకొనఁబడు పాత్రములు మొదలగు వస్తువులెల్ల సువర్ణమయములయినవి. రాయలునురాణులును పండుకొనుమంచములపట్టెలు కాళ్ళు మొదలగునవి సువర్ణముతోఁ జేయఁబడినవి. మెత్తలుపట్టుతో జేయఁబడినవి దోమతెఱలు వెండితీగెలతోఁ జేయఁబడినవి ఈ యచ్యుతదేవరాయలకు నయినువందలభార్యలును నాలుగువేలదాసీలునుగలరు రాయలుతనయాహారమునకై తనద్రవ్యమును వేఱుగవెచ్చింపనక్కరలేదు. రాజ్యములోనుండు ప్రభువులేవంతుల ప్రకారము భోజనపదార్థములను బంపుచుందురు. ఇతనిపాకగృహమును రెండువందలు రక్షకభటులు గాచుచుందురు. వారలకు నాయకులు పెద్దనాయకుఁడును. అజానాయకుఁడునను వారలుగా నుండిరి. వీరలకు నాలుగయిదుద్వారములవఱకె పోవుటకధికారముగలదు కానిలోనికిఁబోవనధికారములేదు అచటకొజ్జాలును స్త్రీలునుగాచియుందురు. ఈరాయలకు నేబదివేలసైన్యముగలదు. ఇదియేయంగరక్షకసైన్యమని చెప్పఁబడును ఇందులోనాలువేలవాతు లంతఃపురపాలకసైన్యములోని వారుగానున్నారు. ఇదియును గాక యీటెలనుధరించు భటులిరువదివేలుగలరు వీరలుగాకకమ్మరులు వడ్రంగులు రజకులు మొదలగు సేవకులు వేలకొలదిగలరు వారలకెల్లఱకు రాయలుతనసొమ్ములోనుండియే జీతములిచ్చుచుండును. ఇతనివద్దమల్లయుద్ధముచేయువారును, జోస్యముచెప్పువారును, సోదెచెప్పువారును, స్త్రీలు పెక్కండ్రుగలరు

అంతఃపురములోని యాదాయవ్యయములను గూర్చినలెక్కలు వ్రాయుస్త్రీలుగలరు. రాచఱికపువ్యవహారములను గూర్చినచరిత్రములను వ్రాయుస్త్రీలు కొందఱుగలరు. సంగీతమునేర్చినస్త్రీలును పెక్కండ్రుగలరు. రాయలభార్యలగు రాణులుసైతము సంగీతవిద్యయందు ప్రవీణురాండ్రయి యుండిరి. ఈరాజ్యమునందు నేరములు చేయువారికి శిక్షలీక్రిందనుదహరించిన విధముగా విధింపఁబడుచుండెను. ఎట్టిచిన్నదొంగతనము చేసినను చోరునియొక్క యొకచేయియు నొకకాలును విఱుగఁగొట్టింతురు. వారిదొంగతనము పెద్దదయిన యెడల గడ్డముక్రింద గాలముగ్రుచ్చి చంపింతురు, గౌరవనీయులగు సంసారస్త్రీలను జెఱిచినవారికిఁ గూడనట్టి శిక్షలే విధింపబడుచుండును ప్రభువులలో రాజద్రోహులయిన వారికి కొఱ్ఱుశిక్ష వేయఁబడును. తక్కువవారయినయెడల బాజారుస్థలములలో శిరస్సులు తెగవ్రేయఁబడును. ఒకొక్కప్పుడు రాయలకాగ్రహమువచ్చినయెడల ద్రోహులను ఏనుఁగలకాళ్ళతోఁ ద్రొక్కింతురు శిక్షలీవిధముగా నుండుటచేత నేరములు గూడ బహుస్వల్పముగానుండుచువచ్చినవని యాకాలపుచరిత్రకారులే తెలుపుచువచ్చిరి. ఇతనికాలమున రాజ్యమంతయు రెండునూఱులసామంత ప్రభువులకు భాగింపబడి వారల యధికారమునకు లోఁబఱుపఁబడి వారలచే గప్పములుగైకొనఁబడుచుండెను.



వారిలోఁ బ్రధానులగు వారినిగొందఱిని న్యూనిజుపేర్కొనియున్నాఁడు. వారిలో ముఖ్యుఁడును ప్రధానియగు సాళువతిమ్మయ. ఇతఁడు చోళమండలము, నాగపట్టణము, తంజావూరు, దేవిపట్టణము, తిరుకోవెలూరు మొదలగు ప్రదేశములకు ప్రభువుగానుండెను. ఈపట్టణములన్నియు సింహళద్వీపమునకు సమీపమునను న్నవి. వీనివలన నాతనికిఁ బదునొకండులక్షల బంగారపు పర్దావుల రాబడివచ్చుచుండెను ఇందులో మూడవభాగము రాయలకు గప్పముగట్టుచుండును. ఇతఁడు రాయలకొఱకు ముప్పదివేల కాల్బలమును, మూడువేల గుఱ్ఱపుదళమును ముప్పదియేనుఁగులను బోషింపవలసియుండును. తనరాబడిలోఁ గప్పముపోగా రెండువంతులలో నీసైన్యమునకగు వ్యయమంతయును బోగామిగిలినదిమాత్రమే యాతనియాదాయముగాఁబరిగణింపఁబడును. రాయలకునా

గ్రహామువచ్చినయెడల నీయాస్తినంతయును స్వాధీనముఁ జేసికొనఁ గలఁడు. ఉదయగిరి, కొండవీడు, పెన్నకొండ, కనిగిరి, సిద్ధవటము మొదలగుప్రదేశములకధికారియగు తిమ్మప్పనాయకునకు నెనిమిదిలక్షల పర్దావులయాదాయమువచ్చుచుండెను. ఇరువదియైదు వేల కాల్బలమును, పదునైదువేల గుఱ్ఱపుదళమును నలువదియేనుంగులును బోషించుచు రాయలకు మూఁడులక్షలపర్దావుల పన్నుగట్టుచుండును. బీజపురసరిహద్దుభూముల కధికారిగానున్న గోపనాయకునకు నాలుగులక్షలపర్దావులరాబడి కలిగియుండెను. ఇరువదివేల కాల్బలమును రెండువేలయేనూఱు గుఱ్ఱపుదళమును, ఇరువదియేనుఁగులనుబోషించుచు రాయలకు లక్షయునేబదివేలపర్దావులు గప్పముగట్టుచుండెను. వెంగాపురదుర్గమునకధికారియగు లేపప్పనాయకునకు మూఁడులక్షలపర్దావుల యాదాయమువచ్చుచుండెను. ఇరువదివేలకాల్బలమును పండ్రెండువందలగుఱ్ఱపుదళమును, ఇరువదియెనిమిదియేనుఁగులను బోషించుచు రాయలకుఁ నెనుబదివేలపర్దావులు గప్పముగట్టుచుండెను. విజయనగరసమీపదేశమున కధికారిగానున్న నరవరనాయకునకు నాలుగులక్షలపర్దావుల యాదాయమురాఁగాఁ బండ్రెండువేలకాల్బలమును, ఆఱువందలగుఱ్ఱపుదళమును, ఇరువదియేనుఁగులను బోషించుచు రాయలకు రెండులక్షలపర్దావులు గప్పముచెల్లించుచుండును. కొచ్చిమొదలగుదేశముల కధికారిగాను చిన్నప్పనాయకునకు మూఁడులక్షలపర్దావుల యాదాయమువచ్చుచుండెను. పదివేలకాల్బలమును ఎనిమిదివందలగుఱ్ఱపుదళమును బోషింపుచు రాయలకు లక్షపర్దావులు గప్పముగట్టుచుండును. కృష్ణప్పనాయకుఁడను వానికి నిరువదివేలపర్దావులు రాఁబడికలిగియుండెను. ఏడువందలకాల్బలమును, అయిదువందలగుఱ్ఱపుదళమునుబోషింపుచు రాయలకు నేడువేలపర్దావులు పన్నుచెల్లించుచుండును. మళయాళదేశమునకధికారిగానున్న వాజప్పనాయకునకు మూఁడులక్షలపర్దావుల యాదాయమువచ్చుచుండెను



పదివేలకాల్బలమును, ఎనిమిదివందల గుఱ్ఱపుదళమును, పదునైదేనుంగులనుబోషింపుచు పదివేలపర్దావులురాయలకు గప్పముగట్టుచుండును. కోలారుమండలములోని అవతిదుర్గమున కధికారిగానున్న మల్లప్పనాయకుఁడనువానికి పదునైదువేలపర్దావుల యాదాయమువచ్చుచుండెను. ఆఱువేలకాల్బలమును, నాలుగువందల గుఱ్ఱపుదళమును బోషింపుచు రాయలకు నయిదువేలపర్దావులు గప్పముచెల్లించుచుండెను గుత్తిమండలమున కధికారిగానున్న ఆదెప్పనాయకుఁడను వానికి మూఁడులక్షలపర్దావులాదాయమువచ్చుచుండెను ఎనిమిదివేలకాల్బలమును, ఎనిమిదివందలగుఱ్ఱపుదళమును, ముప్పదియేనుఁగులనుబోషింపుచు నలువదివేలపర్దావులు రాయలకుగప్పముగట్టుచుండెను ముదిగల్లుదుర్గమున కధికారిగానున్న మఱియొకవాజప్పనాయకునకు నాలుగులక్షలపర్దావులాదాయము వచ్చుచుండెను. పదివేలకాల్బలమును వేయిగుఱ్ఱపుదళమును ఏబదియేనుఁగులను బోషింపుచు లక్షయు నేబదివేలపర్దావులను రాయలకుగప్పముగట్టుచుండును

ఈరీతితిగా రెండువందలప్రభువులకు దేశముపంచిపెట్టబడి వారలక్రిందనుండు భూములయొక్క వైశాల్యమునుబట్టియు, ఫలస్థితినిబట్టియు, గప్పములును వారలు పోషింపవలసినసైన్యములయొక్క సంఖ్యయునిశ్చయింపఁబడ, యీబలముయొక్క యౌన్నత్యమువలన విజయనగరరాష్ట్రము రాయలనెడు సింహాసనచక్రవర్తులచేఁ బరిపాలింపఁబడుచువచ్చినది ఈనిర్ణయప్రకారము ప్రభువులుగప్పములుగట్టక యుపేక్షించినయెడల వారలయాస్తులుగైకొనఁబడును. ఈ రాయలకు నిరువదివేలతమ్మలును పల్లకులునుగల వు స్త్రీలసహగమనమునుగూర్చి న్యూనిజువ్రాసిన వృత్తాంతము నొకింత యిటదెలిపి యచ్యుతదేవరాయలచరిత్రమును ముగించుచున్నాను. ఈదేశమునందు స్త్రీలు తమభర్తలు మరణమునొందినప్పుడు వారలతోఁగూడ దాముతగలంబడుట వాడుకగానుండుటయే

గాక యందువలనఁబుణ్యముకలుగుననియు, గౌరవమువచ్చుననియు నమ్ముచున్నారు. వారిలభర్తలుచనిపోయినపుడు బంధువులతోఁగలసిదుఃఖింతురు- భార్యమేరమీఱిదుఃఖించినయెడల నామెకుభర్తతోడ సహగమనముచేయఁగోరికలేదనితలంతురు. ఏడ్పులు ముగిసినతరువాత వారలబంధువులు సహగమనముచేయవలసినదనియు, కులమునకపకీర్తినిఁదేవలదనియుఁ బ్రోత్సాహపఱతురు. తరువాత వారలుపోయినమనుష్యుని శవమునుకొమ్మలతోఁగూర్పఁబడిన మేలుకట్టుపైఁబరుండబెట్టి పూలతోఁగప్పివేయుదురు. వానిభార్యను నొకపనికిమాలిన గుఱ్ఱము వీపుమీఁదఁ గూరుచుండఁబెట్టెదరు. ఆమె తనకున్నయలంకారములనన్నిఁటిని ధరించుకొనును. గులాబీపూలతో నలకరింపఁబడును. ఒకచేతితోనద్దమును రెండవచేతితోఁబూలమాలయుఁబట్టుకొని పెక్కువాద్యములతోను, సంతోషసాగరనిమగ్నులగు బంధుబృందముతోను, ప్రేతభూమికిఁనూరేగుచుఁబోవును. ఒకమనుష్యుఁడు చిన్నమద్దెలను వాయించుచు నామెభర్తను జేరఁబోవుచున్నదని యూనొత్తిఁబలుకును. ఆమెయు నట్లుచేయుచున్నానని పాటలుపాడుచుఁబలుకును. ఈరీతిగా దహనభూమికివచ్చెదరు. అచటమృతునియొక్క కళేబరము కట్టెలతోఁ నింపఁబడి పెద్దగోతిలోఁబెట్టెదరు. అప్పుడు మృతునియొక్క సమీపబంధువు శిరస్సునజలకలశము నొకదానినుంచుకొని చేతితోనిప్పుకట్టె నొకదానిబట్టుకొని గోతిచుట్టును మూఁడు ప్రదక్షిణములు చేసి కలశమునకుజుట్టుతిరిగినపుడెల్ల నొకచిల్లి వేయుచుఁ గడపటగుండపగలఁగొట్టి చితికినిప్పుదాకొల్పును. మృతునిశవము పూర్ణముగాఁదగులంబడిన తరువాతమృతుని భార్యపరమానందముతోవచ్చి కాళ్ళుకడుగుకొని నిలుచుండును.

అంతటనొకబ్రాహ్మణుఁడువచ్చి తమశాస్త్రప్రకారము మంత్రములనుబఠించును. ఈకర్మకాండ ముగింపఁబడినతరువాత నామె తనచేతితోదానుధరించుకొనిన యాభరణములనుదీసి వైచిబంధు



వులయినస్త్రీలకుఁ బంచియిచ్చిదానధర్మములుచేసికొని పుత్త్రులుగలిగియున్నయెడలఁ బెద్దలకువప్పగించును. ఆమెధరించుకొనిన మంచివస్త్రములను సైతమువారలు గైకొనినతరువాతఁ బసుపుబట్టలనుగట్టుకొని తనబంధువులొకచేయి పట్టుకొనఁగా రెండవచేతితో రొట్టగైకొని గోతివద్దకుఁ బాటలుపాడుచు పలుకులిడుచు వచ్చి గోతిచుట్టును మూఁడు ప్రదక్షిణములుచేసి యొందరినిఁ గట్టిన తిన్నెపైకెక్కి నిప్పుగనుపించకుండఁ గండ్లకడ్డముగాఁ జాపకట్టఁబడియుండఁగానిలువంబడియుండును. ముందుగానాగోతిలో బియ్యముమూటగట్టఁబడిన వస్త్రమును తమలపాకులు, మువ్వెనయు అద్దమునుమూటఁగట్టబడిన వస్త్రమును రెండింటినివానిలో వైచెదరు; తరువాతనామెయెల్లవారివద్దను సెలవుగైకొని తలనిండచముదునిముడుకొని యద్భుతములగు ధైర్యసాహసములతో గోతిక్రిందికి దుముకును, దుమికినవెంటనే బంధువులుకట్టెలతో నామెనుగప్పెదరు. దహనమైనతరువాతఁ బెద్దపెట్టుననేడ్తురు. ఒకప్రభువు పోయినయెడల నిదేశీయున వానిభార్యలెల్లరును సహగమనము చేయుదురు. రాయఁబమృతుఁడైనయెడల రాణులెల్లరు నిటులనే చేయుదురు. దేశమునందంతట నీదురాచారమే ప్రబలియున్నది. మఱియుఁ దెలగాలను మఱియొకజాతివారు దహనముచేయుటకు బదులుగా బ్రదికియున్నభార్యలను భర్తల శవములతోఁబూడ్చివేయుదురు. భర్తశవమునునొకప్రక్కను బ్రదికియున్న భార్యను వేఱొకప్రక్కను (అనఁగా వరుసగా) గూరుచుండబెట్టి కొద్దికొద్దిగా మన్నుగప్పుచుందురు. ఈరీతిగాఁ గప్పినతరువాత వారలు భర్తలతో మరణమునొందెదరు. ఇట్టిదురాచారమును దుష్కృత్యమును మాన్పిన బ్రిటిషుదొరతనమువారికి మనమెంత కృతజ్ఞులమైయున్నమంత శ్రేయోదాయకముగదా?

## ఇరువదవ ప్రకరణము.

---

అచ్యుతదేవరాయల మరణము — వెంకటరాయలు సింహాసనమునకు వచ్చుట — సలకము తిమ్మయ రాజ్య మాక్రమించుకొనుట — రాయల మరణము — రామరాయాదుల తిరస్కారము — ఏడిల్ షా దండెత్తి వచ్చుట — ఏడిల్ షా మరలిపోవుట — రామరాయలు కోట ముట్టడించుట — సలకము తిమ్మయ కోటలోని సర్వస్వము నాశనము చేయుట — తిమ్మయ బలవన్మరణము నొందుట — రామరాయలు సదాశివరాయలను సింహాసన మెక్కించుట — ఏడిల్ షా ఆదవాని దుర్గముపై దండెత్తివచ్చుట — వెంకటాద్రి తురుష్కులను తరుముట — అసాదుఖానుండు వెంకటాద్రి శిబిరమును ముట్టడించుట — వెంకటాద్రి పలాయనుండగుట — రామరాయలు తమ్మునికి సైన్యమును బంపుట — వెంకటాద్రి సుల్తానుతో సంధి చేసికొనుట — అసాదుఖానుండు కుతుబ్షాపై దండెత్తిపోవుట — కులీకుతుబ్షా మరణము — జామ్షీదు రాజ్యమునకు వచ్చుట — జామ్షీదు అన్నగారి కండ్లు పెరికించుట — ఇబ్రహీమ్షా పాఱిపోవుట — ఇబ్రహీము విజయనగరము చేరి రామరాయల శరణుచొచ్చుట — రామరాయ లాతనికి జాగీరిచ్చుట — అంబరుఖానుండు ఇబ్రహీమును దూషించుట — ఇరువురు ద్వంద్వయుద్ధము చేయుట — ఇబ్రహీము అంబరుఖానుని వానిసోదరుని జంపుట — ఇబ్రహీము ఆంధ్రకవుల నాదరించుట — కృతులనొందుట — రాజులు బిరుదులు గద్దియములు చదివించుకొనుట —

అచ్యుతదేవరాయలు ౧౫౪౨ వ సంవత్సరమున మరణము నొందెను. ఆతని మరణానంతరము విజయనగర రాజ్యభారమును వహించుటనుగుఱించి మహాసంక్షోభము పుట్టెను. అచ్యుతరాయలకు వరదాదేవివలన జనించిన వేంకటరాయలను పుత్త్రుఁడొకఁడు గలఁడు. అచ్యుతరాయలకు శ్రీరంగరాయలను సోదరుఁడొకఁడుండెను. వీరిరువురును నరసరాజునకు నోబాంబికవలన జన్మించిరి. అచ్యుతదేవరాయలయనంతరము వేంకటరాయలను పురుషశిశువు సింహాసనమునకు వచ్చెను. ప్రభువులలో ముఖ్యులగు వారిలో సలకము తిమ్మరాజును కృష్ణదేవరాయలయల్లుఁడగు రామరాజును చెరియొక పక్షమునఁ జేరి రాజ్యమాక్రమించుకొనవలెనని ప్రయత్నించుచుండిరి. సలకము తిమ్మయపక్షమునఁ బెక్కండ్రు ప్రభువులు చేరి యుండుటచేత నాతనితోఁ బోరాడలేక రామరాయలు విసుగునొంది తాను



తొలఁగి తనమండలమ్మునకు వెడలిపోయెను. తరువాత తిమ్మయ తానే రాజ్యమాక్రమించుకొని రాయలను జంపి పరిపాలనము చేయనారంభించెను. రామరాయలయందుండెడు నసూయతవలనఁ బ్రభువరులెల్లను నాతని దౌష్ట్యమును సహించి తిమ్మయనే రాయలనుగా నంగీకరించిరి. మఱికొంతకాలమునకు వారలు తిమ్మయ చేయు క్రూరకృత్యములను సహింపఁజాలక తాము చేసినపొరపాటును దెలిసికొని రామరాయలను దిరుగ రప్పించిరి. ఈ రామరాయ లార్వీటి బుక్కరాజుకొమరుఁడైన శ్రీరంగరాజునకు మూఁడవకొమారుఁడు. ఇతనికి కోనరాజు, తిమ్మరాజనను నిరువు రన్నలును, తిరుమలరాజు వెంకటరాజు నను నిరువురు తమ్ములును గలరు. తమ్ములలో నతిరుమలరాజు (తిరుమలదేవరాయలును) వెంకటరాజు (వెంకటాద్రి) నుదానును విజయనగర సంస్థానమునందు కృష్ణరాయల కాలమునాటనుండి సేనాధిపతులుగా నుండి ప్రసిద్ధిగాంచియున్నారు. రామరాయల తండ్రియగు శ్రీరంగరాజుయొక్క ప్రతాపము నరపతివిజయమను గ్రంథమునందు నీక్రిందిపద్యమున నీవిధముగా వర్ణింపఁబడినది.

సీ. కడువిజాపురవర-కామినీగర్భముల్,
ఛేదించునెవ్వని-భేరిరవము।
దాడిఁబోయిని-జాముపట్టణముల,
ధూళిగాఁజేయు నే-ఘోటబలంబు।
గోలకొండవజీర్ల-కోటల కాయముల్,
చించునేరాజేంద్రు-చేకత్తి।
సకలభూపాలకా-స్థానసన్నుతిఁగాంచి,
వలయు నెవ్వాని-విజయలక్ష్మి॥
గీ. యతఁడు కేవలనృపతియో-యాఘువిమార।
చక్రిఁడాశ్రితరక్షావి-చక్షణుండు।
జీర్ణకర్ణాటభూపున-ర్జీవనుండు।
రమ్యగుణశాలి శ్రీరంగ-రాయమౌళి।

ఈ యార్వీటి బుక్కరాజు పశ్చిమచాళుక్యులకు రాజధానియగు కళ్యాణపురాధీశ్వరుఁడై, లింగాయతమతస్థాపకుఁడయిన బసవని

చేఁ జంపఁబడెను, బిజ్జలమరేసరపతులని వ్యవహరింపఁబడుచుండిరి. ఈ రామరాయలు మొదట గోలకొండనవాబగు కుతుబ్షావద్ద సేనానిగానుండి బీజపురసుల్తానుతో జరిగినయుద్ధములలో నొకదానిలో నోడిపోయినందున, కుతుబ్షాయాగ్రహమునకుఁ బాత్రుఁడై లేచివచ్చి కృష్ణదేవరాయలకడఁ బ్రవేశించి సైన్యాధిపత్యమును వహింపనాతఁడు రామరాయలకుఁ దనకూఁతునిచ్చి పెండ్లిచేసియాగవానిదుర్గము నాతనికిఁ గట్నముగా నిచ్చెను. ఇతనిప్రతాపము నరపతివిజయమునందుఁ జక్కఁగా వర్ణింపఁబడినది. ఈగ్రంథమునకే రామరాజీయమను నామాంతరముగలదు. ఆయ్యాదియుంగుగల వెంకయకవిచే విరచింపఁబడినది. సామంతప్రభువులచేఁ బ్రేరేపింపఁబడి రామరాయలు విజయనగరమునకురాఁగానే సలకముతిమ్మయ కలవరింపడి తనకువిపత్తుకలుగునని యూహించి బీజపురసుల్తానగు నిబ్రహీమ్ ఏడిల్షా కడకుఁ దనకుఁ దోడుచూపవలసినదని కానుకలిచ్చి రాయబారులను బంపెను. మఱియు విజయనగరరాజ్యము బీజపురిరాజ్యమునకు పశాఖగానుండునని కూడ వర్తమానము పంపెను. ఈరాయబారమునకు సుల్తాను సంతోషించి తనకుఁ బ్రియపుత్రుఁడగు నసాదుఖానుతో నాలోచించి సఖ్యతకునంగీకరించి నిజసైన్యములతో రాజధానినివదలి విజయనగరమునకువచ్చెను. సలకము తిమ్మయ సుల్తాను నెదుర్కొనితోడ్కొనివచ్చి రాయలగద్దియపై గూరుచుండఁబెట్టి యేడుదివసములవఱకు వేడుకలుజరుపుచుండెను. ఇదిచూచి సహింపలేక రామరాయాదులు రాజ్యము సురక్షితముగానుంచుటకు సుల్తానును వెంటనే పంపివేయవలసినదనియు, అట్లుచేసినయెడల నాతనియధికారమునకుఁ దాములోఁబడియుందుమని ప్రమాణములు చేసిరి. అందులకు సలకముతిమ్మయ సమ్మతించి సుల్తానుతో నవసరము లేదని యెంచి యాతని మఱలిపోవఁ బ్రార్థించెను. తానునొప్పుకున్న విశేషద్రవ్యమును పెక్కుబహుమానములను సమర్పించి మెల్లగసాగనంపెను. ఇబ్రహీమ్ఏడిల్షా కృష్ణానదిదాటకమునుపే



రామరాయాదులు నగరములోని సైనికులకులంచములిచ్చి తాము చేసినప్రమాణములను పాటింపక నగరముప్రవేశించి తిమ్మయను జంపుటకు నిశ్చయించిరి. తానుమోసపోతినని తిమ్మయ తెలిసికొని చేయునదిలేక పిచ్చియెత్తినవాఁడయి కోటలోదూరి కవాటములు బంధించి శత్రులకుపయోగింపకుండునటుల నశ్వములయొక్కయు గజములయొక్కయు, దోకలునరికించుటయగాక కండ్లుగూడఁ బెఱికించెను. అనేకశతసంవత్సరములనుండి కూడఁబెట్టిన వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ మరకతమాణిక్యాది మణులను తిరుగండ్లలోఁ బెట్టించి దుమ్ముగావించి నేలపైఁ జల్లించెను. తానొకగదిలోదూరి కత్తిభూమిలోనాటి తానుచచ్చునట్లుగా దానిపైఁబడ నాఖడ్గముకడుపులోనుండి వీపుపయికిరాఁగానే యాతఁడుమృతినొందెను, రామరాయలెదిరించువారులేకయే కోటనాక్రమించుకొనెను. ఈవిజయమును బ్రస్తాపించుచు నరపతివిజయమునందీరీతిగా వర్ణింపఁబడినది.

“ ఉ. ఎలమిని రామరాజవసు- ధేశుప్రతాపమువార్కమైమహిన్ ।
జెలువుగ నిండఁబర్వశశి- శేఖరదివ్యమహోశితాశుగ ।
జ్వాలనశిఖాసముత్కరము- చందమునందమునొందెనంతయున్ ।
సలకయతిమ్మయప్రముఖ- శత్రుపురంబులనెల్లనారయన్ ॥
గీ. సలకవిభుతిమ్మరాజు నే- నలమద్రుంచి ।
గుత్తిపెనుగొండనుజేగండి- కోటకంద ।
నాలుపురమాడ వేసవ- లీలగెలిచి ।
తొలుదొలుతరామనృపతిదో- ర్బలముమెఱసి ”

ఈప్రకారముగా రామరాయలు విజయనగర సింహాసనముగయికొని బాలుఁడయిన రంగారాయల పుత్రుఁడగు సదాశివదేవరాయలను ౧౫౪౨ వ సంవత్సరమునకు సరియయిన శుభకృత్ సంవత్సర జ్యేష్ఠమాసంబున సింహాసనమెక్కించి సదాశివరాజ్య సంస్థాపకుఁడని పేరొంది పేరునకు సదాశివరాయఁడే రాజయినను తానే నిజమైనయధికారమునంతయు వహించి రాజ్యపాలనము చేయనారంభించెను.

ఈవృత్తాంతమును దెలుపుచరిత్రములలో మహమ్మదీయుల వలన వ్రాయబడినగ్రంథములేమి, పోర్చుగీసువారు మొదలగువిదేశీయులవలన వ్రాయఁబడినగ్రంథములేమి పరస్పరవిరుద్ధములుగా నున్నయవి. ఈచరిత్రములన్నిటిని బరిశోధించిన స్యూయలు దొరగారునయితము నిజస్థితినిగనిపెట్టలేక భ్రమప్రమాదములకు లోఁబడిరని తలంచుచున్నాను. ఫిరిస్టా మొదలగు మహమ్మదీయచరిత్రకారులు పయివృత్తాంతమంతయు నచ్యుతరాయలకాలమున ననఁగా క్రీస్తుశకము ౧౫౩౫-౧౫౩౬ వ సంవత్సరములో జరిగినదని వ్రాసియుండుటయు నయ్యది స్యూయలు దొరగారామోదించుటయుఁ జూడఁగా వారలకు నిజస్థితిఁ బోధపడలేదని స్పష్టమగుచున్నది. సలకముతిమ్మయ యచ్యుతదేవరాయల మరణానంతరము రాజ్యమాక్రమించుకొనఁ బ్రయత్నించియుఁ గొనసాగక బీజపురసుల్తాను సహాయమునుగోరి వానిని విజయనగరమునకు రప్పించెనుగాని యచ్యుతరాయలు బ్రదికియుండఁగాఁ గాదు. మహమ్మదీయచరిత్రకారులు వ్రాసినయసంబద్ధోక్తులన్నియు నిటనుదహరించినందువలన గ్రంథము విస్తరింపఁజేయుటయెగాని యందువలనలేశమాత్రమును బ్రయోజనములేదు. సలకముతిమ్మయప్రాణత్యాగము చేసికొనుటయు, రామరాయలు విద్యానగరసింహాసనమాక్రమించుటయును బీజపురసుల్తానగు ఇబ్రహీమ్‌ఆదిల్‌షా విన్నతోడనే ఖిన్నకుండక ప్రియమిత్రుఁడగు నసాదుఖానుని (Asada Khan) బిలిపించి విజయనగరరాజ్యములోని యదవానిదుర్గమును (The Fort of Adoni) ముట్టడించి స్వాధీనముఁ జేసికొనవలసినదని కొంతసైన్యమునిచ్చిపంపించెను. రామరాయలావృత్తాంతమంతయును జారులవలనవిని తనతమ్ముఁడును రణశూరుఁడునునగు వెంకటాద్రికిఁ గొంతసైన్యమునిచ్చి తద్దుర్గసంరక్షణార్థముఁ బంపించెను. వెంకటాద్రివచ్చుచున్నాఁడనువర్తమానమువినరాఁగానే మహమ్మదీయసేనాధిపతి ముట్టడించుటమాని స్వసైన్యముతో హిందూసేనాధిపతిని నెదుర్కొనఁబోయెను. రెండుపక్షములవారికిని యుద్ధముప్రారంభమయి కొంతకాలము జరగగానే అసాదుఖానుఁడు తనకపజయముకలుగునని నిశ్చయించి యసంఖ్యాకులునగు హిందువులముందర నిలువలేక తనసైన్యమును మెల్లగవెనుకకు మరలించుకొనిపోయెను. వెంకటాద్రిమహమ్మదీయులను బదునాలుగుమైళ్ళవఱకు వెంబడించి తఱుముకొనిపోయి మహమ్మదీయసైన్యములకు రెండుమైళ్ళదూరములో దండువిడిసి మఱునాఁడు తఱుముకొనిపోవచ్చునుగదాయనుతలంపుతో విశ్రాంతిని బొందుచుఁ గొంచెమజాగ్రత్తగానుండెను.



అట్టిస్థితివచ్చువఱకు నిరీక్షించుచున్న మాయలమారియగు నసాదుఖానుఁడు మఱునాఁడు సూర్యోదయమగుచుండఁగా నాలుగువేలగుఱ్ఱపుదళములో నాకస్మికముగా వెంకటాద్రిసైన్యముపైఁ బడెను. వెంకటాద్రికిఁ బ్రాణము దక్కించుకొని పాఱిపోవుటయె దుర్భరమయ్యెను. ప్రొద్దెక్కినతరువాత చెదరిపోయినసేనలం గూర్చుకొని వెంకటాద్రియసాదునిఁ దలపడి యుద్ధముచేయనామాననాయని యోజించి యొకవేళపరాజయము తటస్థమైనయెడలఁ దనకుటుంబమునకు హానికలుగునేమోయని దీర్ఘాలోచనచేయుచు సేనలకొఱకు రామరాయలకు తద్వృత్తాంతమును దెలుపుచు వ్రాసెను. రామరాయలు కావలసిన సేననుబంపి హాస్యముగాఁ దమ్మునికిట్లు జాబులువ్రాసెను. "ఆదవానిదుర్గమునకు లోఁబడియున్న జమీందారుల యొక్క ప్రేరేపణమువల్ల సుల్తానువచ్చియుండునుగాన యేదోవిధమున సంధిచేసికొని తురుష్కులనుసాగనంపుట శ్రేయోదాయకము." ఈపద్ధతికి వెంకటాద్రియొప్పుకొని తురుష్కులకుఁజిక్కియున్న తనభార్య మొదలగువారికి హానిరాకుండ విడిపించుటకు మంచిమార్గము నియోజించి రాయబారమును నడపి తురుష్కులప్రేమమునకుఁ బాత్రుఁడై సంధిచేసికొనెను. యుద్ధమును ముగించి తురుష్కులుస్వస్థానమునకేగిరి. ఈయుద్ధముముగిసినతరువాత అసాదుఖానుఁడు గోలకొండదేశముమీఁదికి దండెత్తిపోయి యాదేశపుసుల్తానగు

కూలీకుతుబ్షాతో ద్వంద్వయుద్ధముచేసి వానిమోముగాయపఱిచెను అందువలననాతఁడు మరణమునొందెను. ఈకుతుబ్షాకిలి పరాక్రమవంతుఁడు దక్షిణహిందూస్థానమునందు భామినీవంశీయ తురుష్కరాష్ట్రావసాన దశయందు స్వతంత్రుఁడై గోలకొండరాజ్యమును స్థాపించి హిందువులనుమాత్రమేకాక మహమ్మదీయులను సహితమనేకులనుజయించి తనరాజ్యమును వ్యాపింపఁజేసెను. కృష్ణదేవరాయలు తెలుగుదేశమంతయుజయించి ౧౫౧౬ వ సంవత్సరమున నుత్కలదేశపురాజగు గజపతిపుత్త్రికను బెండ్లియాడి యాదేశమంతయు గజపతులకిచ్చెను. అతనిమరణానంతరము కూలీకుతుబ్షాదండెత్తివచ్చి కృష్ణామండలమునఁ గొండపల్లివద్ద హిందువులనోడించి కృష్ణాగోదావరీ మధ్యదేశమనఁగా వేంగిదేశమంతయునాక్రమించుకొనెను.

ఈయంశమునే అద్దంకిగంగాధరకవికృతమగు తపతీసంవరణములోని "కటకేశ్వరునిఁ దోలి కైవసంబుగఁజేసెఁ గొండంతజయముతోఁ గొండపల్లి„ యనునీసపాదము దెల్పుచున్నది. కుతుబ్షా విజయములను గూర్చిపూర్వోక్త గ్రంథములోనే యేతత్కవి యిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. పసమటనుసవాయి-బసవనిగాఁజేసి,
యిచటగొయ్యలకొండ-నావరించె।
దమదిమల్లాఖాను-దక్షిణంబుఁగొట్టి,
హరియించె బొానగ-లాదిగిరులు।
నుత్తరంబునబరీ-దోడిపాఱఁగఁదోలి,
మెతుకుదుర్గంబాక-మించిమించె।
ప్రథమదిక్కునఁనొడ్డి-పాత్రసామంతుల,
ఘట్టించికంబము-మెట్టఁగొనియె॥
గీ. నతనిఁబోగడఁగఁదగదెయా-చతురసీతి।
దూఢిగిరిదుర్గలుంఠన-ప్రౌఢతేజు।
వాహశిఖరాధిరోహరే-వంతమూర్తి।
కుతుబశాహినిస్తాపాలు-గుణవిశాలు॥



ఇతనియనంతరమున ద్వితీయపుత్త్రుఁడైన జామ్షీదురాజ్యమునకువచ్చి క్రీస్తుశకము ౧౫౪౩ సంవత్సరమున మొదలుకొని ౧౫౫౦ వసంవత్సరమువఱకును బరిపాలించెను.

జామ్షీదుకుతుబ్షా మహాక్రూరుఁడై రాజ్యార్హుఁడైన దనయన్నగారి నేత్రములను దీయించివేసి యాతనినంధునిగాఁజేయుటవలన నిప్పాపాత్ముని దుష్టస్వభావమునకు భయపడి కుతుబ్షాచతుర్థపుత్త్రుఁడైన యిబ్రహీమ్షా తనయన్నగారి మరణపర్యంతము విజయనగరములో రామరాయల సంరక్షణముగోనుండుటకై నిశ్చయించుకొని యట్లొనరించెను. రామరాయలు మహమ్మదీయసంస్థానములనుండి పాఱివచ్చిన మహమ్మదీయులనెల్లరను నాదరించి వారలకు విజయనగరమున నొకపేటగట్టించి దానికి తురుక మొహలా (Turki Mohala) యనిపేరుపెట్టెను. మహమ్మదీయులచట మసీదులు మందిరములు గట్టించుకొని స్వేచ్ఛగాఁ దమమతాచారముల చొప్పున నడచుకొనుచు సుఖముగాజీవించుచుండిరి. అటులనే యీ యిబ్రహీమ్ కుతుబ్షా రామరాయలను శరణుజొచ్చినపుడాదరించి యిదివఱకు నబ్బీనియాదేశస్థునికిచ్చిన జాగీరుస్వాధీనముఁజేసికొని యయ్యది యిబ్రహీమ్ కుతుబ్షాకు జీవనార్థమిచ్చెను. తనజాగీరు నీవిధముగా రామరాయలు లాగుకొని యిబ్రహీమునకిచ్చినందున నొకనాఁడంబరఖానుఁడు విజయనగరవీథులలో నాతనిం గలిసికొనునపుడు క్రోధావేశపరవశుఁడై దూషింపసాగెను.

తమసొత్తునుదమయిచ్చవచ్చినట్లు వినియోగించుకొనుటకు మహారాజులకు సర్వస్వాతంత్ర్యముగలదు గావునవిజయనగరపురాజు జాగీరుతనకిచ్చెనని సమాధానముచెప్పెను. ఇబ్రహీముసమాధానముచెప్పి తనదారినిపోవుచుండగా నంబరఖానుఁడు వానింజూచి "యోరిపిఱికిపందా? పోయెదవేల? ఇదిగో కత్తిపోరాడి నీబిరుదు నిలుపుకొమ్ము? అనిపిలిచెను. ఇబ్రహీముతగదని మెల్లగమందలించెనుగాని యంబరుఖానుఁడు బహుకఠినముగా నాతనిదూషించుచుం

డెను. అందుమీఁద నిబ్రహీముషా గుఱ్ఱముమీఁదనుండి దుమికి కత్తిదూసి నిలువంబడెను. అంబరుఖానుఁడు వానిపైఁబడి ద్వంద్వయుద్ధమునకుఁడీకొనెను. ఇబ్రహీముషా అంబరుఖానుకంటె శాంతస్వభావము గలిగియున్నవాఁడుగావున నాతనికంటె మేలుచేయగలవాఁడయి తనశత్రువును సులభముగాఁ జంపివేసెను. ఇదంతయును బ్రక్కనుండి చూచుచున్న అంబరఖానుని సోదరుఁడుగూడ నాతనిం దాఁకెను. వాఁడుగూడ నిబ్రహీముషాఖడ్గముపాలయ్యెను. ఈయిబ్రహీముషాను ఇభరామ్‌షాయని మనవారలు పిలుతురు. ఇతఁడు విజయనగరముననున్న కాలములో రామరాయల యాస్థానపండితులగు భట్టుమూర్తిమొదలగు నాంధ్రకవుల సహవాసమువలన సంస్కృతాంధ్ర సాహిత్యమును సంపాదించి కవిత్వమునందభిరుచి కలవాఁడయి యాంధ్రకవులనాదరించి పెక్కుకృతులనొందెను. ఇతని వద్దనే అద్దంకిగంగాధరకవి యాస్థానకవిగానుండి తపతీసంవరణమను ప్రబంధమంకితమిచ్చెను. ఇతఁడుతాను ౧౫౫౦ వ సంవత్సరమున రాజ్యమునకువచ్చినదిమొదలుకొని హిందువులతోమైత్రిగలిగిహిందూరాజులను వారివారికవీశ్వరులతోఁడఁగూడఁ దనయాస్థానమునకు రప్పించి తఱచుగాఁ బండితగోష్ఠిని గాలముపుచ్చుచుండెను. ఇతఁ డొకసారి తనయాస్థానమునకు మట్లఅనంతభూపాలుని, వేరమల్లారెడ్డిని, పెమ్మసానితిమ్మానాయనిని, బంగారేచమనాయనిని, అనంతపురపుహండెయప్పయను రప్పించి వారికవీశ్వరులు వారినిస్తుతించినపద్యములను వినుచుండఁగాఁ గాపువాఁడయిన మల్లారెడ్డికవీశ్వరుఁడు చదివిన నీక్రిందిపద్యమును విన్నప్పుడు రాజులందఱు యుద్ధసన్నద్ధులు కాఁగా నిభరామ్‌షా వారలను వారించెనఁట ? కవీశ్వరులు చదివినపద్యములీక్రింద నుదహరించుచున్నాను.

ఉ. చాలుగుఱాలుమాళిగడి- సంగిడిరాజులుగొల్వఁ రండహో।
హాలపుహోగ్రఫాలదహ- నాత్మునిమంతటిధాటివాఁడునా।



తాలిక వేంకటాద్రిశిఖర- శీకునితమ్ముఁడుఁ బెమ్మసానిభూ।
పాలుఁడు హెచ్చుధాత్రిఁగల- పారిపురెల్లను లోఁచ్చువీనికిన్॥
ఉ. మట్లకరాడు బెట్టుతికి- మన్నె కుమారులసీమధూళిగాఁ।
గొట్టకమానఁడేగదయ- కుంతలసింహతలాధిరాయఁడీ।
పెట్టినదండుఁ నీదురణ- భీష్ముఁడు హండెయప్పశౌరికిం।
బెట్టుఁడు వేగదండములు- బింకము లేటికి శత్రుభూపతుల్॥
ఉ. కొద్దినిరాఁడు దిండుతికి- కోటలు కొమ్మలు గొన్నశూరుఁడా।
గద్దఱిగబ్బిరాచపులి- గండరబాలుఁడు మట్లనంతుఁడే।
ప్రొద్దున వైరిభూభుజుల- పొంకము దంపనే పుట్టినాఁడు మీ।
పెద్దతికాలుసాగవిఁకఁ- బేలకుఁడీగడి మన్నెభూపతుల్॥
ఉ. కొన్కఁ గొండతోఁ దగరు- డీకొనితాఁకిన జోకగాక యీ।
చిక్కపకీరు మన్నెసరి- చేసిదొరల్ మొనలందు నిల్వనా।
నిక్కవు బంగరేచనృప- నీపురణస్థలి మాహరించినన్।
బిక్కను లోకముల్ వగిలి- పాఱువెకూలవెదిగ్గజంబులున్॥

ఈపైపద్యములనువిని మల్లారెడ్డికవీశ్వరుఁ డీక్రింది పద్యమును జదివెను.

చం. బలరిపుభోగకన్యకర- పాలుని పేరకుమారమల్లమా।
కలితయశఃప్రభావములు- కన్గొనలేక లకట్టుమన్నెముల్।
కలుతలలొల్లగోచిరుదు- గద్దియమూఁక చదివించుకొందురే।
కొలఁదిగెయుంగఁ జాలకల- కుక్కలు ముక్కలఁ జూచితాయవే॥

## ఇరువదియొకటవ ప్రకరణము.

నిజాము బీజపురముపై దండెత్తుట — రామరాయలు తోడ్పడుట — వెంకటాద్రి రాచూరుమండలమును గైకొనఁబ్రయత్నించుట — ఆసాదుఖానుఁడు సంధిచేయుట — అబ్దుల్లా యిబ్రహీమును దిరస్కరించి రాజ్యమును గైకొనఁబూనుట — ఇబ్రహీము అబ్దుల్లాను తంత్రముగ నిల్పెట్టుట — అబ్దుల్లాపాఱిపోయి పోర్చుగీసువారిని శరణుచొచ్చుట — ఆసాదుఖానుని మరణము — పోర్చుగీసువారబ్దుల్లాకుఁదోడ్పడుట — ఒడంబడికలు — ఎయినల్‌ముల్కు ఇబ్రహీమునోడించుట — బురహాను నిజాముషామరణము — వెంకటాద్రి ఎయినల్‌ముల్కును సలాబతుఖానుని నోడించుట — రామరాయలు మైలాపురమునకు దండెత్తిపోవుట — రామరాయలు ఆలీఆదిల్‌షాతోఁ గూడి హుస్సేను నిజాముషాపై దండెత్తిపోవుట — హిందూసైనికులదౌర్జన్యములు — మలబారుతీరమునఁ గ్రైస్తవుల దుష్కృత్యములు — మక్షయాళీమునందలి యుద్ధము — పోర్చుగీసు సేనాధిపతి దుర్మార్గము —

క్రీస్తుశకము ౧౫౪౩ వ సంవత్సరములో నహమ్మదునగరసుల్తానగు బురహాన్‌నిజామ్ శాహిరామరాయలతోను జామ్షీదుకూలీకుతుబ్షాతోను సంధిచేసికొని బీజపురసుల్తానగు ఏడిల్‌షాపై దండెత్తిపోయెను. బీజపురసుల్తాను చిక్కులలోనుంటఁ గని పెట్టి రామరాయలుతనతమ్ముఁడగు వేంకటాద్రిని రాచూరుమండలమునుస్వాధీనముఁజేసికొమ్మని పంపెను. ఈప్రకారము బీజపురరాజ్యమును మూడుప్రక్కలను ముగ్గురురాజులచే ముట్టడింపఁబడి మిక్కిలి యపాయకరమగు స్థితిలోనుండెను. బీజపురసుల్తాను భయపడి అసాదుఖానునిరప్పించి వానితోఁ దనమరవస్థఁదెలుపుకొని సంధిగావింపుమని వేడికొనెను. ఆసాధుఖానుఁడు భాగ్యవంతమగు షోలాపురమండలమును బురహానునకిచ్చి సంధిగావించుకొనెను. రాయబారులనుబంపిరామరాయలతో నొడంబడికచేసికొనెను. తరువాత గోలకొండదేశముపై దండెత్తిపోయి కూలీకుతుబ్షాతో యుద్ధముచేసి వానిని గాయపఱచెను. ఈవృత్తాంతము వెనుకటిప్రకరణమందుఁ దెలుపబడియుండెను. ఈకాలములోనే గోవాపరిపాలకుఁడగు అప్ఫోంసో డిసోజాయనువాఁడు కప్పముచెల్లించలేదను కారణముతోభటకల్లుదుర్గముపై దండెత్తిపోయి పట్టణముతగలంబెట్టి రాజ్యముపాడుచేసి వేలకొలది హిందువులమచ్చ్వమాపి యాదుర్గమునుబాలించురాణినిలోఁబఱచుకొనియెను.

౧౫౪౪ వ సంవత్సరమున రామరాయలచేఁబ్రేరేపింపఁబడి బురహాన్‌నిజామ్‌శాహి బీజపురముపై దండెత్తిపోయి ఇబ్రహీమ్ ఏడిల్‌షావలన నోడింపఁబడిమరలివచ్చెను. ఈవిజయముతటస్థింపఁగానే గర్వోన్మత్తుఁడై ఇబ్రహీమ్‌షా నిజామ్‌షా రాయబారులను బంపగా వారలను పరిభవించుటయెగాక తనప్రజలను సామంతప్రభువులను నిచ్చవచ్చినట్లుగా బాధింపుచువచ్చినందున నాతనిడలనుప్రజలు రాజద్రోహులై ధొరతనమునెడ నతృప్తిగా[illegible]యుండిరి. మరల బురహాను బీజపురదేశముపై దండెత్తిరాగానాదే



శములో సుల్తానునకు ద్వేషులుగానుండువారు సుల్తానుసోదరుఁడగు అబ్దుల్లానుసింహాసనమెక్కింపనిశ్చయించిరి. ఈకపటతంత్రమువెల్లడి కాగానే అబ్దుల్లాగోవానగరమునకు బాఱిపోయెను. ఇబ్రహీమ్‌వానినిపట్టియిచ్చినయెడల సాల్సెట్టి (Salsetti) బర్డీసు (Berdes) పట్టణములను పోర్చుగీసుదొరతనమువారికిచ్చెదననియు అసాదుఖానుఁడు బెల్గాముదుర్గమునఁగూడఁబెట్టినధనమును దనకులంచమిచ్చెదననియు నప్పటిగోవానగరపాలకుఁడగు డిసోజాకువ్రాసెను. డిసోజా యీనిబంధనలకు లోబడిలంచమునురాబట్టగలిగినంతవరకురాబట్టి అబ్దుల్లాను కన్ననూరువరకు దీసికొనిపోయిమరల గోవానగరమునకు గొనిపోయెను.

మఱుసంవత్సరాంతమున డిసోజాకుబదులుగా డికాస్ట్రోపాలకుఁడుగావచ్చెను. డికాస్ట్రోతన్నుశరణువేఁడిన యబ్దుల్లానుస్వాధీనముచేయుమని తిరస్కరించెను. అందులకుగోపించిసుల్తాను తద్రాజ్యమునకు సేనలనుబంపెనుగాని ౧౫౪౭ వసంవత్సరమునవాసేనలనన్నిటినిగోవాపాలకుఁడుతఱిమివేసెను. తరువాతడికాస్ట్రో ౧౫౪౭ వసంవత్సరమున సెప్టెంబరు ౧౯ వ తేదీని సదాశివరాయలతో నొడంబడికచేసికొనెను. ఆసంవత్సరములోనే అహమ్మదునగరసుల్తానుతోగూడ నక్టోబరు ౬ వ తేదీనిసంధిచేసికొనెను. ఈయొడంబడికవలన రెండురాజ్యములవారు నన్యోన్యమైత్రిగలిగియుండవారల మిత్రులకుమిత్రులుగాను శత్రువులకుశత్రువులుగాను నుండవలసినదనియు, యవనపారశీకదేశములనుండి తెప్పింపఁబడినహయములను యుక్తకాలములోన్యాయమైన ధరలనుచెల్లించినయెడల విజయనగరపురాజులకె విక్రయించుటకును బీజపురమునకుఁబంపకుండుటకును. విజయనగరరాజ్యములోని వర్తకులెల్లఱును తమసరకులను పోర్చుగీసువారివాణిజ్యశాలలకుఁ బంపవలసినదిగానిబీజపురరాజ్యములోని రేవులకుఁబంపకుండునట్లుగారాయలుచట్టమేర్పఱచుటకును సురాకారము మొదలగువస్తువులనుపోర్చుగీసువారివా

ణిజ్యశాలలనుండియే హిందువులుకొనవలసినదిగాని బీజపురమునకు సంబంధించిన రేవులనుండి దెప్పింపఁగూడదని కట్టడిచేయుటకును, విజయనగరపురాజు తనరాజ్యములోని యేరేవునకునుమూరులయోడలు రాఁగూడదనియు, అట్లువచ్చినవానినిఁబట్టికొని పోర్చుగీసువారికి నొప్పగించుటకును, ఉభయపక్షములవారునుగలసి ఏదిల్ షాతోయుద్ధముచేయుటకును, వానినుండిగైకొన్న దేశమంతయు విజయనగరమునకుఁ జెందుటకును, పడమటికనములకుఁ బశ్చిమముననుండు భాగములనఁగా నుత్తరమునబాండా మొదలుకొని దక్షిణమునఁ, జింతకోరవఱకునుండు దేశమునుమాత్రము పోర్చుగీసువారికిచ్చుటకును నిశ్చయింపఁబడియెను.

మఱికొంతకాలమునకుఁ దరువాత బీజపురసుల్తాను సైన్యములుపట్టుదలతో గోవాప్రాంతభూములను స్వాధీనముఁజేసికొనవలెనని ప్రయత్నించెనుగాని తుదకుసుల్తాను సైన్యాధిపతులలోనొక్కఁడు ప్రాణముఁగోల్పోవుటసంభవించెను ౧౫౪౭వ సంవత్సరమున గోవాపురపాలకుఁడు బీజపురమువారితోను భటకల్లురాణీగారితోడను సంధిగావించుకొనెను. డిసోజా అసాదుఖానులుకుట్రచేసి అబ్దుల్లానుసింహాసనమున నిలుపుటకుఁ బూనుకొనిరనియును అసాదుఖానుఁడు పోర్చుగలురాజునకు బీజపురరాజ్య మంతరించినతరువాత కొంకణదేశమునంతె నిచ్చుటకును వాగ్దత్తమును జేసెననియును పోర్చుగీసుచరిత్రకారులు వ్రాసియున్నారు రాజద్రోహియగువానివాగ్దత్తమునకు సమ్మతించి గోవానగరమునందలి రాజప్రతినిధి తనమనస్సునుమార్చుకొనెనఁటగాని యింతలో వానికి (అసాదుఖానునకు) మరణముతటస్థించి వారిప్రయత్నములన్నియువిఫలములయిపోయినవి. ౧౫౫౦వసంవత్సరమున బీజపురసుల్తానగు అమీరుబరీదుషాతో నొడంబడికచేసికొనెను. ఈకాలమునందు రామరాయలు నిజాముషావలనఁ గానుకలువడసి యాతనితో నొడంబడిక చేసికొనెను. ఈవార్తను ఇబ్రహింషావిని క్రోధావేశ



పరవశుఁడై విజయనగరమునుండివచ్చిన రాయబారులను బాఱఁదోలఁగా బ్రాణములనుగాపాడుకొని తిరిగివచ్చిరి. రామరాయలందులకుఁగోపించి బురహాన్ నిజామ్షాను ఇబ్రహీమ్షాపై దండెత్తఁబురికొల్పెను. అంతటబురహాన్ నిజామ్షా దండెత్తివచ్చి కళ్యాణదుర్గమును ముట్టడింపఁగా నిబ్రహీముబురహానునిదగు దుర్గమునొకదానినిగూడఁ దానుముట్టడివేసెను.

పిమ్మటబురహాను రామరాయలతో బహిరంగముగా నొడంబడికచేసికొని యిరువురునుగలిసి ౧౫౫౧వ సంవత్సరమున రాచూరుదుర్గమును ముట్టడించుటయేగాక ముదిగల్లుదుర్గమునుగూడఁబట్టుకొని స్వైవశముఁజేసికొనిరి. రాచూరుమండలమంతయు మఱలనొకసారి హిందువుల యధీనమాయెను. ఈకాలములోనే రామరాయలసోదరులగు తిరుమలదేవరాయలును వెంకటాద్రియు రామరాయలను దిరస్కరించి యాతఁడురాజధానిని విడిచియున్నకాలమున నాదవేని (Adoni) దుర్గమునాక్రమించిరనియును, అందుమీఁదట రామరాయలుకు తుష్ఠా ఇబ్రహీమునుప్రార్థించి యాతనితో ద్వాఁబతో నాదవేనిముట్టడించి యాఱుమాసములకు స్వాధీనముఁజేసికొనెననియును, సోదరులు క్షమింపఁబడిరనియును, మహమ్మదీయచరిత్రకారుఁడొకఁడు వ్రాయుచున్నాఁడు. ౧౫౫౩వ సంవత్సరమునబురహాన్ నిజాముషా మృతినొందగాఁనాతనికుమారుఁడు హుస్సేనునిజామ్షాసింహాసనమునకువచ్చెను తరువాతకొంతకాలమువరకునిరువురుసుల్తానులు మైత్రిఁ గలిగియుండిరిగాని యీయనుబంధముచిరకాలమునిలచినదికాదు. ఇబ్రహీము సుల్తాను విజయనగరపురాజుతోనుత్తరప్రత్యుత్తరములు జరుపుచుండుట సహింపలేక నిజాముకలహించి బీజపురముతో షోలాపురమువద్ద యుద్ధముచేసియిబ్రహీమునునోడించెను. ఇబ్రహీముతనక్రింది సర్దారగు 'ఎయినుల్ముల్కు' (Ainul Mulk)ను దురహంకారుఁడయి కృతఘ్నుఁడయియవమానించుచున్నందునఁనాతఁడునిజసైన్యములతోఁదిరుగఁబడి

యెను. సుల్తాను పారిపోయి బీజపురమున దాగొనెను. ఇట్టి పరాజయమును సహింపజాలక సుల్తాను తెంపుచేసి రామరాయలను తోడ్పడుమని వేడికొనెను. అప్పుడు రామరాయలు శత్రువును సుల్తాను దేశమునుండి తరిమివేయవలసినదని తన రెండవ తమ్ముడగు వేంకటాద్రిని కొంత సైన్యముతో బంపెను. ఈముల్కుగారసాదఃఖానుని మార్గమవలంబించి యేమరించి యాకస్మికముగా వచ్చి వేంకటాద్రి సైన్యముల పయిం బడ నిశ్చయించెనుగాని యితని యుద్దేశ్యముల సంపూర్ణముగా నెఱింగిన వేంకటాద్రి తగినంత జాగ్రత్తతోఁ గాచుచుండుటకై తన సైనికుల కాజ్ఞచేసెను. పొడవుగల కాగడాలను దెప్పించి కొనల జముకుగుడ్డల జుట్టబెట్టించి రాత్రివేళ శత్రువులు వచ్చి పైబడినపుడు శత్రుసైన్యమంతయు గనుపించునట్లుగా నీ కాగడాలను బైకెత్తవలసినదిగా గట్టుదిట్టము చేసెను. ఎయినాల్ ముల్కు నాటిరాత్రి రెండు వేల సైనికుల దీసికొని తన పన్నుగడ కొనసాగింపఁ దలఁచి సలాబత్ఖానుతో బయలు వెడలి వచ్చి వేంకటాద్రి సైన్యములో బ్రవేశించెనుగాని యెవ్వరును నెదుర్కొనలేదు. అంతట శత్రువులు వచ్చిన వార్త దెల్పగానే వేంకటాద్రి యుత్తరువు ననుసరించి యీ కాగడాల కొత్తురి సైన్యమంతయుఁ గనుపించునట్లుగాఁ బైకెత్తబడెను. అదివరకు దన సైనికులతో సిద్ధముగానున్న వేంకటాద్రి శత్రువులను మార్కొని శత్రువుల చ్చెరువు గలుగునట్లుగా పోరాడఁ దొడంగెను.

ఇట్లు శత్రుసైనికుల కళేబరములు లయిదువందలు భూమిపైఁ బడువఱకు తురుష్క సైనికులు చెల్లాచెదరై పోవుటయును, ఎయినాల్ ముల్కు, సలాబత్ఖానులు బహుకష్టముమీఁదఁ దప్పించుకొని పోవుటయును దటస్థమయ్యెనుగాని యారాత్రి దారి తెలియక సైనికులు నలుదెసలకుఁ బాఱుటవలన నాతఁడు చనిపోయెనని యాతని స్కంధావారమున వదంతి పుట్టి యాతని సైన్యమంతయుఁ గలవరంబడుచు నిలువలేక పాఱిపోవుటయుఁ గూడఁ దటస్థమాయెను. ముల్కు రెండువందల ఫౌజుతోఁ దెల్లవారువఱకు స్కంధావారప్రము



వేశింపఁగా నయ్యది జనశూన్యమై యుండుటఁ జూచి భయఁపడి హుస్సేన్ నిజాంషా దేశమునకుఁ బాఱిపోయెనుగాని తరువాత నా సుల్తానుకపటతంత్రమువలన వారలు చంపఁబడిరి. ౧౫౧౫ వ సంవత్సరములో నబ్దుల్లాను బీజపుర సింహాసనమునఁ గూర్చుండఁ బెట్టిన యెడలఁ దాము చేయఁబోవు బహుమానముల యొక్క విలువకు విదేశీయు లచ్చెరువునందుచుఁ బోర్చుగీసువారాతని సింహాసన మెక్కింపఁ గృతనిశ్చయులైరి.

వారి ప్రతినిధియగు పెడ్రోడిమాస్కారెన్హాసు(*Pedro-de Mascarenhas*) వానిని పోండా (*Ponda*) వద్దఁ బట్టభద్రునిగావించి యావార్త దేశమునఁ బ్రకటించెను. మాస్కారెన్హాసు చనిపోఁగా వానికి బదులుగా వచ్చిన ఫ్రాన్సిస్కో బారెటో అబ్దుల్లాను పోండాలో సింహాసన మెక్కించి దేశములో సుంకము జమచేయుటకుఁ బ్రారంభించెను. ఇబ్రహీము ఏదిల్ షా యొక్క దళవాయితో ననేకపర్యాయములు యుద్ధము చేసి వానిని నోడించుచు వచ్చెను. ఇంతలో నిబ్రహీము సదాశివరాయని సైనికులఁ బదునైదువేలు గైకొని యబ్దుల్లాతో యుద్ధము చేసి వానిఁ బట్టుకొని పోర్చుగీసు వారితోఁ బోరాడుచుండెనుగాని యపజయమే కలుగుచుండెను. తరువాత కొంతకాలము యుద్ధము నిలుపుచేయఁబడినది. అటుపిమ్మట నవ్వగా ౧౫౫౭ వ సంవత్సరమున నిబ్రహీమ్ ఏదిల్ షా మరణము నొందెను. అతఁడు రోగగ్రస్తుఁడై యున్న కాలమునఁ దన రోగమును నివారింపలేని వైద్యులను గొందఱి నిడలలు నఱికించియు మఱికొందఱిని నేనుఁగుల చేఁ ద్రొక్కించియు నిట్లు క్రౌర్యమును జూపుటచేతఁ బెక్కండ్రు వైద్యులు ప్రాణభీతిచేత దేశమును విడిచి పాఱిపోయిరి. అతని యనంతరము పెద్దకొడుకు ఆలీ ఏదిల్ షా యను వాఁడు సింహాసనమునకు వచ్చెను. ఆలీ ఏదిల్ షా సింహాసనమునకు వచ్చినతోడనే రామరాయలతోను హుస్సేను నిజాముషాతోను సంధిచేసికొనఁ గోరి రాయబారులను బంపెనుగాని హిందూదొరతనము వారికడకు బోయిన రాయ

ఖారులు సన్మానింపఁబడుటయు నిజాముషాదర్బారునకుఁబోయిన రాయబారులవమానింపఁబడుటయుఁ దటస్థముకాఁగా నాతఁడు హిందూదొరతనమువారితో శాశ్వతమైనయొడంబడిక చేసికొని యారాజ్యాంగమువారితో నెప్పుడును మైత్రిగలిగియుండవలెనని నిశ్చయించుకొనియెను. రామరాయలతో స్నేహమును సంపాదించుకొని తనతండ్రిపోగొట్టుకొన్న రాజ్యమునంతయు మరల రాబట్టుకొనఁగోరి రామరాయలకొడుకొకఁడు చనిపోవుటకారణముగా నాతనికుపచారవాక్యములు దెలుపుమిషయొకటి కల్పించుకొని స్వల్పసైన్యముతో విజయనగరమునకు బోయెను.

రామరాయలు వానినిమిక్కిలి గౌరవముతో నాదరించెను. మిత్రునికంటె నెక్కువగా సుల్తాను దుఃఖోపశమనవాక్యములు పలికి నాతనినోదార్చుచుఁ గొన్నిదినములుండెను. తరువాత రామరాయలువద్ద సెలవుగైకొని బయలువెడలెనుగాని రామరాయలు పురము వెలుపలకుఁబంపి తానుతిరిగివచ్చెనుగాని పురము వెలుపల నాతని వెంబడింపలేను. అందులకు సుల్తాను తన్నవమానపఱచినట్లుభావించి రామరాయలయెడ నీర్ష్యగలవాఁడై యప్పుడు మాత్రము దనయసంతుష్టభావమును వెల్లడింపకయేపోయెను.

ఇందువలననాతని యుద్దేశమునకు భంగముకలిగి రామరాయలయెడ ద్వేషము ప్రబలమగుచుండెను. రామరాయలునుసుల్తానునుదృణీకరించి గర్వమైయుండెను. క్రైస్తవమతబోధకులు తూర్పుతీరమున హిందూదేవాలయములను బడగొట్టి హిందువులయైశ్వర్యమును జూఱగొనుచున్నారను వర్తమానమురాఁగా రామరాయలు నిశ్చయమనినమ్మి మైలాపురమునకు దండెత్తిపోయెనుగాని యావార్తయసత్యముకాఁగా నచ్చటిప్రజలు రాజభక్తి కలవారగుటచేత వారలనుమన్నించి స్వదేశమునకు మఱలవలసినవాఁడాయెను. ఆలీ ఏడిల్‌షా విజయనగరమునుండి బీజపురమునకుఁ దిరిగి వచ్చినతరువాత కల్యాణపురదుర్గమును షోలాపురదుర్గమును దనకి



చ్చివేయవలసినదిగా హుస్సేనునిజాంషాకు రాయబారముపంపెను. అందులకు హుస్సేను నిజామ్‌షా దురహంకారముతో వినరాని బూతులుతిట్టిపంపెను. అందువలన రెండురాజ్యములకును మఱల పోరాటమారంభమయ్యెను. ఈయుద్ధము ౧౫౫౮ వ సంవత్సరము అక్టోబరునెల ౧౨ తేదీ మొదలుకొని ౧౫౫౯ వ సంవత్సర మక్టోబరు ౨వ తేదీవఱకు జరుగుచుండెను. ఆలీఏడిల్‌షా రామరాయలను జేర్చుకొని యాదేశముపై దండెత్తిపోయి పురంధరము మొదలుకొని ఖైబరువఱకును అహమ్మదునగరము మొదలుకొని దౌలతాబాదువఱకునుగలదేశమునందు నరసంచారము లేకుండఁ దగలంబెట్టిరి.

హిందూసైనికులు చిరకాలమునుండి తమపగదీర్చుకొనుటకై వేచియున్నవారగుటచేత సమయముదొరకెనుగదాయని దయాదాక్షిణ్యశూన్యులై ధనముచూఱగొనుటమాత్రమేగాక మహమ్మదీయస్త్రీలను జెఱపట్టుటయు మసీదులను ధ్వంసముచేయుటయు మొదలగు దుష్కృత్యములను నిరాటంకముగా సలుపఁగలిగిరి. హిందువులయొక్క యీదుర్నయమే దక్కను సుల్తానులయొక్కయు ఆదేశములోనుండు మహమ్మదీయప్రజలయొక్కయు నార్పరానిద్వేషాగ్నిని బ్రజ్వలింపఁజేసి హిందూరాజ్య వినాశమునకుఁ గారణమైనది. ౧౫౫౮ వ సంవత్సరములో డామ్ కాన్‌స్టంటైన్ డిబ్రగాంజాయను నాతఁడుగోవానగరమునకు రాజప్రతినిధిగావచ్చెను. అతని పరిపాలనము క్రౌర్యమునకాలవాలమై దుష్కీర్తికరమైయొప్పుచుండెను. ౧౫౫౯ వ సంవత్సరమున లూయిజ్ డిమెల్లోయనునాతఁడు మలయాళదేశమున నగ్నిహోత్రమును దాకొలిపి యాదేశమును దగ్ధముగావించెను. మంగళూరుపట్టణమును ముట్టడించి యందలిప్రజలను సంహరించి పట్టణమును దగలంబెట్టెను. అరీతిగానే పశ్చిమతీరమునందలి నగరములన్నిటిని నేలపాలుచేసెను. ౧౫౬౦ వ సంవత్సరములోఁ బోర్చుగీసువారు బలాత్కారముగాఁ బ్రజలను క్రైస్తవమతప్రవిష్టులనుజేయనూహించి దుష్కృత్యములనేకా

వింపుచుండిరి. గోవానగరవాసులను తమప్రభుత్వమునకులోఁబడినవారిని క్రైస్తవులుగావలసినదిగా నిర్బంధించుచువచ్చిరి. నిరాకరించినవారిని వేయివిధంబుల హింసించుచువచ్చిరి. ౧౫౫౮ వ సంవత్సరములో మెస్క్విటాయను రాజప్రతినిధి మళయాళీలయోడల నాశము చేయుటకై తనయోడలమూడింటిఁ బంపెను. మెస్క్విటాయొక్కొకసారి రెంటినిమూటిని బట్టికొని నావికులను సంహరించి యోడలను సముద్రములో ముంచివేయుచువచ్చెను. ఈరీతిగా నిరువదినాలుగోడలను రెండువేల నావికులను నాశము చేసెను. ఇందువలన మళయాళదేశమునందు యుద్ధమారంభమై యాదేశపుప్రజలు తెంపుచేసికొని యీశత్రువులను దఱిమివేయ నిశ్చయించుకొని ఘోరయుద్ధములుచేసి భూదేవతకు బలియగుచుండిరి. దేశమునంతను నాశముచేయుటయేగాక పోర్చుగీసు సేనాధిపతి నలువదివేల తాటిచెట్లనుగొట్టించి ప్రజలవృత్తులకు భంగముగలిగించెను. తరువాతసంధిగావింపఁబడెను.

## ఇరువదిరెండవప్రకరణము.

రామరాయలుదక్కనుసుల్తానుల బొమ్మలనాడించినట్లాడించుట — హుస్సేను నిజాముషాసంధిగోరుట — నిజాముషా రాయరనుదర్శించుట — నిజాముషా ఏడిల్‌షాపైదండెత్తివచ్చుట — రామరాయలు ఏడిల్‌షాకుదోడ్పడుట — కుతుబ్షా నిజాముషానువిడనాడి ఏడిల్‌షాప్రక్కను జేరుట — నిజాముషా పాఱిపోవుట — అహమ్మదునగరము ముట్టడివేయుట — హిందువులదౌర్జన్యములు — ఏడిల్‌షా కుట్రచేసి కుతుబ్షాకువర్తమానముచేయుట — హుస్సేను నిజాముషాకడకు ఏడిల్‌షా రాయబారినిపంపుట — షానిజాముషా తనకూతురు చందుబీబీని ఏడిల్‌షాకిచ్చి పెండ్లిచేయుట — ఏడిల్‌షా తనచెలియలిని నిజాముషాపెండ్లికొడుకునకిచ్చి పెండ్లిచేయుట — సుల్తానులేకీభవించి రామరాయలపైదండెత్తివచ్చుట — హిందువుల గర్వము — తిరుమలరాయలు నదినిగాపాడుట — వేంకటాద్రి యుద్ధభూమికేగుట — రామరాయలుయుద్ధసన్నద్ధుడగుట — శత్రువులునదిని దాటుట — సోదరులు రామరాయలనుగలసికొనుట — యుద్ధము — హిందువులోడిపోవుట — రాజకుమారులు సింహాసనమును గైకొని పెనుగొండకుబాఱిపోవుట — విజయనగరముశత్రువులపాలబడుట — దోపిడి —



వెనుకటిప్రకరణమందుఁ జెప్పఁబడినప్రకారము నిజాంషాదేశమంతయు రామరాయలవలనను ఏడిల్‌షావలనను పాడుచేయబడినతరువాత నిజాముషా రామరాయలతో సంధిచేసికొనఁగోరెను. కళ్యాణనగరమును విజాపురరాజ్యమున జేర్చుటకును హుస్సేను నిజాముషా తన్నుదర్శించి తనవలనఁదాంబూలము గ్రహించుటకును సమ్మతించినయెడల సంధికిఁదానొడంబడెదనని రామరాయలు తెలియఁజేసెను. తనదుర్దశననుసరించి హుస్సేను నిజాంషా సమ్మతించి రామరాయలవద్దకుఁ బోయినప్పుడు లేచి రామరాయలు నిజాముషాహస్తమునుబట్టుకొని ముద్దుపెట్టుకొనెనేగాని యెదురుగఁబోయి యాతనిఁదోడ్కొనిరాలేదు. అందులకు నిజాముషా గర్వోన్మత్తుఁడై రామరాయలు ముద్దుపెట్టుకొనుటవలనఁ దనచేయి యపవిత్రమైనదని భావించి చేతులునీళ్ళతోఁ గడుగుకొనెను. రామరాయలీయవమానమునకుఁ గోపించి 'తాను నాకతిథియైరాబట్టిగాని లేనియెడలఁ దానుజేసిన యీయవమానమునకుఁ బశ్చాత్తాపమునొంది యుండునని' తరువాత హుస్సేను కళ్యాణపురముయొక్క బీగములను రామరాయలకు నొప్పగించెను ఏడిల్‌షాయును రామరాయలును శత్రుదేశమును విడిచి స్వదేశములకు బోయినతరువాత హుస్సేను నిజాముషా ఇబ్రహీము కుతుబ్షాతో నొడంబడికచేసికొని వానితోడ్పాటుతో ఏడిల్‌షాపయి దండెత్తిపోయెను.

ఆలీఏడిల్‌షాతిరిగి రామరాయలు ఏఁబదివేల ఫౌజులతోను, విశేషకాల్బలముతోనుబోయి ఏడిల్‌షాసేనలను జేరుకొని కళ్యాణనగరమువద్ద శత్రుసైన్యములను మార్కొనఁగా భయపడికుతుబ్షా హుస్సేను నిజాముషాను వదలిపెట్టి ఏడిల్‌షాతోఁ గలియఁగా హుస్సేను నిజాముషా అహమ్మదునగరమునకుఁ బాఱిపోయెను ఏడిల్‌షాకుతుబ్షాలును రామరాయలును వానినివెంబడించి యహమ్మదునగరమును ముట్టడింపఁగా రాజధానినివిడిచి హుస్సేను నిజాముషాపాఱిపోయెను. ఈనూవుకును శత్రువులును నశముఁజే

సికొని నలుదెసలకు స్వసైన్యములను బంపఁగా హిందూసైనికులు పట్టణములను బల్లెలను దగలంబెట్టుచు మందిరములనుగూల్చుచు మసీదులలో గుఱ్ఱములనుగట్టియు మహమ్మదీయులకుఁ బవిత్రములయినస్థలములలో విగ్రహములనెలకొల్పి పూజించుటయును మొదలగు దుష్టకృత్యములను జేసియుండిరి. ఇంతలోవర్షకాలమువచ్చినందున వర్షములుకురిసియు వెల్లువలు ప్రవహించియు నాహారపదార్థములు తక్కువకాఁగా శత్రుసైన్యములు యుద్ధమును ముగింపవలసినవారలయిరి కుతుబ్షారహస్యముగా హుస్సేనుతో నుత్తరప్రత్యుత్తరములుజరుపుచు రహస్యముగాధాన్యములనుబంపి సహాయముచేయుచుండెను.

యుద్ధము ముగింపఁబడిన తరువాత మూఁపురును సేఁటుపడక పూర్వమే హిందూసైన్యము విజయనగరమునకు వచ్చి చేరుకొనెను. అహమ్మదునగరమున హిందూసైనికులు గావించిన దారుణకృత్యములను గండ్లారఁజూచుచు ఏడిల్‌షామనస్సునొచ్చినవాఁడయ్యును పూన్పశక్తిలేక యూరకుండెను. రామరాయలును దక్కనుసుల్తానులను నిర్లక్ష్యస్వభావముతోఁజూచుచు వారలరాయబారులనుగౌరవింపక యనాదరముచేయుచుండెను. హిందువులుమహమ్మదీయులను బరిహసించుచుఁ దృణీకరించుచుండిరి. రామరాయలు కుతుబ్షాను, ఏడిల్‌షాను భయపెట్టి వారలనుండి బహుదేశములనువశపఱచుకొనెను. రామరాయలిట్లు నిరంతరము సుల్తానులలో వైషమ్యములు గల్పించుచుఁ దానుమహమ్మదీయరాజ్యమునుగొంచెముగొంచెముగా నాక్రమించుచుఁ దనరాజ్యమును పెంపుచేయుచుండెను. గోలకొండ రాజ్యమునుండి ఘనపురముపాంగల నగరములనుగైకొనెను. ఇదంతయును మహమ్మదీయసుల్తానులయైకమత్యమలవరుచుకొనుటకుఁ గారణమాయెను. ఏడిల్‌షామొదలైనఁబగదీర్చుకోవలయునని నిశ్చయించి తనసహచరులతోను మంత్రుల



తోను నాలోచింపఁగా వారలు రామరాయలు బహుపరాక్రమవంతుఁడనియు, రాజ్యతంత్రజ్ఞుఁడనియును, బహుసేనాసమేతుఁడనియును, సమస్తవిషయములయందును దక్కనుసుల్తానులకంటెనధికుండనియు, నాతనిజయించుట యొక్కనికిసాధ్యముగాదనియు, దక్కనుసుల్తానులందఱు నేకీభవించి మహమ్మదీయులందఱునుగలిసి రామరాయలతోఁ బోరాడినఁగాని యాతని జయింపఁజాలరనియును, అందులకుదగిన యుపాయ మాలోచింపవలయుననియుఁ జెప్పిరి. వారిమాటలను మనఃపూర్వకముగా విశ్వసించి యిబ్రహీముకుతుబ్షాకు రహస్యముగారాయబారముపంపెను. ఇబ్రహీమందులకు సంతోషపూర్వకముగా నొప్పుకొని యతని విరోధియైన హుస్సేనునకును ఏడిల్‌షాకును మధ్యవర్తియై కార్యసంధానమునుగావింతునని వాగ్దత్తముచేసెను. ఏడిల్‌షాహుస్సేను నిజాంషా దర్బారునకు నొక్కరాయబారినిఁబంపెను. ఆరాయబారియహమ్మదునగరమునకుఁబోయి సుల్తానుసన్మానమునుబడసి యిట్లుపలికెను. భామినీసుల్తానులకాలములో మహమ్మదీయుల యధికారమంతయు నొక్కనిచేతిలోనున్నందువలన బలదర్పములయందు విజయనగరపురాజులతోఁ దులఁదూఁగుచుండిరి. మహమ్మదీయాధికారమిప్పుడువిభాగింపఁబడినది.

మహమ్మదీయమతమునందు విశ్వాసముగల నవాబులొక్కటిగాఁజేరి యొండొరులయెడఁబీడనియనురాగమును బెంచి మిత్రభావముతోనుండుట రాజ్యనీతిప్రావీణ్యమును దెలుపునుగావున నెల్లరకుసమానుఁడయిన ప్రబలశత్రువుపైఁబడుటను నివారించుకొనుటకును కర్ణాటరాజులనెల్లఁదమయధికారమునకు లోఁబరచుకొన్న విజయనగరపు రాయలయధికారమును తగ్గించుటకును మహమ్మదీయరాష్ట్రములనుండిదూరముగాఁ దొలఁగించుటకును నవకాశము కలుగవచ్చును. భగవదనుగ్రహమువలన మతద్వేషుల బాధలనుండివిముక్తినొంది హాయిగాసుఖనిద్రఁజెందవచ్చును వారలవల్ల

ప్రదేశములును ప్రార్థనమందిరములును (మశీదులు) మతవిరోధులకు నివాసయోగ్యములుగాఁ జేయనక్కరలేదు' అని యిట్లుపన్యసింపఁగా హుస్సేను నిజాముషా సమ్మతించి మంత్రులహితోపదేశము ననుసరించి తనకొమార్తె చాందుబీబీని ఆలీఏడిల్‌షాకునిచ్చి పెండ్లిచేసి షోలాపురమును గానుకగా నొసగుటకును ఆలీఏడిల్‌షా యొక్క తోఁబుట్టువును తన పెద్దకొడుకు మర్తిజా (*Murtiza*) పెండ్లిచేసికొనుటకును నిశ్చయించి విజయనగరరాజ్యవినాశమునకై రెండురాజ్యములవారును సంబంధబాంధవ్యములను నెలకొల్పుకొని శీఘ్రకాలములోనే మతయుద్ధమును జరుపసన్నద్ధులై యుండిరి ఏడిల్‌షా యుద్ధమును జేయుటకుపూర్వము రామరాయలతో విరోధమును బెట్టుకొనవలెను గావునఁ దననుండి గైకొనిన మండలములను దనకిచ్చివేయవలసినదిగా నొకరాయభారిని రామరాయల వద్దకు బంపెను.

తానుతలంచిన ప్రకారమె రామరాయలా రాయబారిని అవమానపఱచి దర్బారునుండి వెడలఁగొట్టించెను. మహమ్మదీయ మతమునకు గర్భశత్రువగు రామరాయలను సాధించుటకై యేకీభవించిన సుల్తానులెల్లరును సమరోన్ముఖులై యుండిరి. విజాపురసుల్తానగు ఆలీఏడిల్‌షాయును గోలకొండసుల్తానగు ఇబ్రహీము కుతుబ్షాయును బీదరుసుల్తానగు ఆలీబరీదుషాయును, అహమ్మదునగరు సుల్తానగు హుస్సేను నిజాంషాయును స్వసైన్యములతో విజాపుర బాహ్యప్రదేశములయందుఁ గలిసికొని ౧౫౬౪ రవ సంవత్సరము డిసెంబరు ౨౫వ తేదీ సోమవారమునాఁడు దక్షిణాభిముఖులై సేనలను నడిపించుకొని వచ్చుచుండిరి. దక్కను దేశములోని యిప్పటి మెరకబయళ్ళమీఁదఁ బ్రయాణము చేయుచు నచటి లేతపంటలమీఁదఁ దమ గుఱ్ఱములను మేపుకొనుచుఁ దురుష్కసైన్యములు హిందూదేశ చరిత్రమునందుఁ బ్రసిద్ధిగల పేరువడసిన చిన్నదుర్గమునకు సమీపమునఁ గృష్ణానదీప్రాంతప్రదేశమును జేరినవి. ఈ తాళికోట కృష్ణ



నదికి నుత్తరముగా నిరువదియైదు మైళ్ళదూరమున నుండుటచేత నిజముగ విచారింపఁగా యుద్ధము తాళికోటవద్ద జరుగనే లేదు. నదికి దక్షిణమునఁ బెక్కుమైళ్ళదూరమున జరిగినది. నదికి దక్షిణభాగమున రామరాయల స్కంధావారమునకుఁ బదిమైళ్ళదూరమున యుద్ధము జరిగిన దనుట సత్యము.

ముదిగల్లు దుర్గమునకు సమీపమున నవగా ముదిగల్లునుండి యింగలిగి గ్రామమునకుఁ బోవు బాటపైనున్న భోగాపురమను చిన్న గ్రామముకడ జరిగియుండునని స్యూయలు దొరగారు వ్రాయుచున్నారు. అదియే సత్యమై యుండవచ్చును. ఈ తాళికోట డోను నదిమీఁద నది కృష్ణలో సంగమించు ప్రదేశమునకుఁ బైఁగాఁ బదునాఱు మైళ్ళదూరమునఁ గట్టఁబడియున్నది. ఇచటికి నరువదియైదు మైళ్ళదూరమున బొంబాయి చెన్నపురి యినుపదారి యీ పెద్దనదిని దాటిపోవుచున్నయది. ఆ దేశమా కాలమునందు సంఖ్యాకములగు సైన్యముల నడిపించుటకు ననుకూలముగా నుండెను. కాలము శైత్యముఁ బ్రకాశములగు నెండలు కాయు దినములతోఁ గూడి చల్లనిగాడ్పులు వీచునట్టిదిగా నుండెను. ఈ ప్రదేశము విజాపురసుల్తానగు ఆలీఏడిల్‌షాదియగుటచేత నిచట నాతడు దక్కనుసుల్తానులకును సైన్యములకును విందులు సమకూర్చుచుండెను. నదిని దాటుటకు వలయు సాధనోపాయముల వెదకుచు చారులవలన దెలిసికొనుచు నా ప్రదేశమున బెక్కుదినములు నిలిచియుండిరి. అచట విజయనగరములో నెల్లవారును తహతహ లేకయే మహమ్మదీయులు తమ్ముతలయెత్తి చూడజాలరను దృఢవిశ్వాసము గలిగియుండిరి తురుష్కులనేకపర్యాయములా మహానగరమునకు హానికలుగ జేయవలెనని ప్రయత్నించియు విఫలమనోరథులగుటయు రెండుశతాబ్దములు గడచినను హిందువులను జయించుమహమ్మదీయులు దక్షిణమునకు రాలేక పోవుటయును గలపోసి యానగరవాసులు తమకే యపాయమును గలుగనేరదని యూహించి కడుపులోని నీరు కదలకుండ నెమ్మదిగఁ జీకుచింత లేక యుండిరి.

ఆనుహానగరమునకు రానున్న దుర్దశ నెరుంగనికతమున భారవాహకములగు నెద్దులు మొదలగునవి దూరదేశములనుండి వర్తకపుసరకుల నుమోచుకొనివచ్చుచుండెను. రామరాయలు నిర్లక్ష్య స్వభావముతో నుసానురాయబారులను సన్మానింపక దూషింపుచు సాగనంపి వారలతోడి విరోధమువలన దనకేమాత్రమును నష్టము కలుగబోదని తలంచియు యూరకుండక తగినపూన్కితో మెలకువగలిగియుండెను.

పెద్దతమ్ముఁడైన తిరుమలదేవరాయలకు ౨౦,౦౦౦ హయములను లక్షసైన్యమును ఏనూరుగజములనిచ్చి కృష్ణానదిశత్రువులు దాటిరాకుండ రేవులన్నిటిని గాచుకొని యుండవలసినదని ముందుగాఁ బంపెను. అధికసైన్యముతోఁ దనరెండవతమ్ముఁడైన వేంకటాద్రినిగూడఁ బంపి విజయనగర రాజ్యములోని సేనలకన్నిటికిఁ దానధ్యక్షుఁడై నడపించుకొని యుద్ధభూమికిబయలుదేరెను. ఈసైన్యములన్నియు ద్రావిడాంధ్రకర్ణాటకమళయాళీలచేఁ గూర్పఁబడి యాఱులక్షలసైనికులను గలిగి లక్షఫౌజుతో నొప్పారుచుండెనని కూటోవ్రాయుచున్నాఁడు శత్రువులసైన్యమిందులో సగభాగముండునని చెప్పుచున్నారు. సుల్తానులు బహుదినములు నదినిదాటుటకు మార్గముగానరాక వేచియుండిరి నదికావలగట్టున నెచటఁజూచిన హిందూసైన్యములు గానవచ్చుచున్నవనియు నదినిదాటుటకు సాధ్యముగాదనియును, ఏరీతినయినమనముందటి రేవునుదాటిపోవుటకే ప్రయత్నింపవలసినదనియు వేగులవాండ్రు వచ్చిచెప్పిరి. ఈరేవు హిందువులస్వాధీనములోనుండి దక్షిణపార్శ్వమునఁ బోతగట్టుపోయఁబడి శత్రువులు రాకుండ నందు పిరంగులమర్పఁబడి దాటుటకు దుస్సాధ్యమైయుండెను. రేవునుగాపాడుచున్న హిందూసైన్యాధిపతి శత్రుస్థానమును గనిపెట్టుచు శతవిధములఁ గాపాడుచుండెను. ఇట్లుండ నొకనాఁడు శత్రువులు తమస్థానమునువిడిచి క్రిందికిఁబోవుచుండుటను గనిపెట్టి యివత



లియొద్దున దానునుబోవుచువారలు నదినిదాటుటకుఁ బ్రయత్నించిన ప్రదేశమునందెల్లను నడ్డుపడుచు శత్రువులను రానీయకుండెను. ఈరీతిగ శత్రువులుమూడుదినములు నడచి టక్కరితనమును జూపి యాకస్మికముగా సుల్తానులధిక సైన్యముతో నొకనాటిరాత్రి వెనుకకుమరలి పూర్వపు రేవుకడకువచ్చిచూచునప్పటికి రేవురక్షణములేకయుండుటను గాంచి వెంటనె నదినిదాటివచ్చిరి ఈసేన బయలుదేరితిన్నగా రామరాయలసైన్యమున కభిముఖమై వచ్చుచుండెను. రామరాయలువింతపడినను భీతిఁబొందక సుస్థిరుఁడై స్వరక్షణమందే మరకయుండెను. ఉదయముకాఁగానే శత్రువులుతిన్నగ పదిమైళ్ళదూరమునన్నున్నారని రామరాయలు దెలిసికొనెను. వేంకటాద్రియును తిరుమలరాయలును సోదరునివచ్చికలిసికొనిరి. మఱునాఁడుమంగళవారమునాఁడనగా ౧౫౬౫ దవ సంవత్సరము జనవరి ౨౩వ తేదీని నుభయసైన్యములకును బోరాటమారంభమయ్యెను. హిందువుల వామపార్శ్వమున దిరుమలరాయలును దక్షిణపార్శ్వమున వేంకటాద్రియు మధ్యభాగమున రామరాయలును నుండిరి. తిరుమలరాయల కెదురుగ విజాపురసైన్యములతో ఆలీఆదిల్షాయును రామరాయల కెదురుగ హుస్సేనునిజాముషా సైన్యములును వేంకటాద్రి కెదురుగ నిబ్రహీముకుతుబ్షా ఆలీబరీదుషాల సైన్యములును నిలిచిపోరాడుచుండెను. హుస్సేనునిజాముషా తనసైన్యమునకు నెదుటపిరంగులను మూడుపంక్తులతో నమర్చియుంచెను. మొదటివరగతితో నివి పెద్దవిగాను తక్కినవిచిన్నవిగాను నుండెను. వీనిని మరగుపరుచుటకై రెండువేలవిలుకాండ్రను పిరంగులయెదుట నిలువబెట్టెను. శత్రుసైన్యము తెరపడగానే యీవిలుకాండ్రు తమవిద్యానైపుణ్యమును జూపుచుండిరిగాని రామరాయలసైన్యము తోసికొనివచ్చి పైబడగానే వెనుకకు తొలగిపోయిరి.

ఫిరంగులు కాల్పఁబడి యాత్రేటులకు రామరాయలసైన్యమంతయు భీభత్సమై చెదరిపోయెను. రామరాయలు తొంబది

యాఱుసంవత్సరములుగల వయోవృద్ధుఁడైనను ముప్పదిసంవత్సరముల వయస్సుగల మహాయోధునివలెఁ బ్రవర్తించెనని కూటో వ్రాయుచున్నాఁడు. అశ్వారూఢుఁడై తానుదూరముగానుండి పోరాటమును గనిపెట్టుచుండవలసినదానికిమాఱుగా తానొక తంజామీఁదనెక్కి తనమంత్రులు వలదనుచున్నను వినక స్వయముగ సైనికులకుఁ బ్రోత్సాహముగలిగించుచుఁ బాఱిపోవలసివచ్చినఁ బాఱిపోవుటకువలనుగాని స్థితిలోనుండెను. అసమానధైర్యశాలు లగు తనసైనికులయెదుట శత్రువులు బిడ్డలవగిది పాఱిపోవుదురని యాతనికి గట్టినమ్మకముండెను. అట్టి నమ్మకముండుటచేతనే యతఁడు హుస్సేనునిజాముషాశిరస్సును ఖండించియును, ఆలీగడిల్‌షాను, కుతుబ్షాను ప్రాణములతోఁబట్టుకొనియును దీసికొని రావలసినదిగాఁ దనసైనికులకుత్తరువిచ్చెనని చెప్పుదురు. ఉభయపక్షములవారును సంకులసమరంబునకుఁజొచ్చి మహోగ్రంబుగాఁ బోరాడుచుండ హిందువులు ఫిరంగులనుండి యగ్నివర్షముం గురిపించుచు శత్రువులనుబరిమార్చుచుండ మహమ్మదీయుల కుడియెడమప్రక్క సేనలు ద్వంద్వయుద్ధమునకుఁగడంగియు నిలువలేక వెనుకకుమరలింపఁబడిరి. ఇరుదెసలఁ బెక్కండ్రు నేలంగూలిరి ఇట్టి సమయంబున రామరాయలు తనసైనికులఁబ్రోత్సాహపఱుపనెంచి తంజానుండి దిగి సువర్ణముతోను, ముత్యపుజాలరులతోను నలంకరింపఁ బడిన కెంపువన్నెగలమొకమలుగుడ్డతో వేయఁబడిన వితానముక్రింద రత్నఖచితమైన సింహాసనమునఁగూరుచుండి కోశాధ్యక్షుని రప్పించి తనముందు ధనరాసులను గ్రుమ్మరింపఁజేసి మేలు చేయగలభటులకు బహుమానములఁ జేయుచుఁ బురికొల్పుచుండెను రెండవసారి విజృంభించి హిందువులు మహమ్మదీయఫిరంగులనుదాఁకినపుడు మహమ్మదీయులు పరాజితులగుదురని తలంపఁబడెను గాని రాగినాణెపుసంచులను ఫిరంగులలోఁబెట్టి పేల్చుటవలన హిందువులను దరికిఁ జేరరాకుండఁజేసి యమితనష్టమునాపాదించి రైమనువేలసైనికుల నే



లంగూల్చిరి ఇట్లగుటచేత హిందువులమధ్యభాగము భిన్నమై చెల్లాచెదరగుటచేత మహమ్మదీయుల రైమనువేలతురగబలము త్రోచుకొని హిందూసైన్యములోఁ జొచ్చి రామరాయలున్న స్థలమునకు వచ్చెను. ఈమహాసంక్షోభములో రామరాయలు తన స్థానమును విడిచిపెట్టి మరలఁ దంజానెక్కినతోడనే నిజామ్‌షాయొక్క యేనుఁగొకటి మదోద్రేకముతోఁ దంజాను రాచుకొనిపోవఁగా బోయీలు భయకంపితగాత్రులై యాతంజాను క్రిందఁ బాఱవైచిరి. అంతట రామరాయలుసర్దుకొని గుఱ్ఱము నెక్కుటకుముందుగానే శత్రుసైన్యమువచ్చి చుట్టుముట్టుకొని రామరాయలను ఖైదిగాఁ బట్టుకొనిరి. రామరాయలు పట్టుపడినదిచూచి హిందువులు కలంగి తత్తఱపాటుతో నేమియుఁదోఁచక పఱుగిడుచుండిరి. హుస్సేనునిజాముషా ఫిరంగులదండునకధికారియగువాఁడు రామరాయలను దనసుల్తానువద్దకుఁగొనిపోఁగా నాతఁడు వానితల వెంటనేనరికించి యాతల బల్లెమునకుఁ గ్రుచ్చి పయికెత్తించెను. అదిచూచి రామరాయల సైనికులుభీతచిత్తులై రణరంగమున నిలువలేక నలుదెసలకుఁబాఱిపోవుచుండిరి. శత్రువులు హిందువులను దఱుముచు దొరకినవారిని నఱికివైచుచుండిరి. లక్షహిందువులీవిధముగాఁ బ్రాణములను గోలుపోయిరి. ఆనాటితో హిందువులజయలక్ష్మి యంతరించిపోయినది. హిందూరాజ్యముయొక్క యౌన్నత్యము నేలం గూలినది. మహమ్మదీయులు పూర్ణజయమునుగాంచిరి. హిందువులు పరాజితులై పాఱివచ్చుటమాత్రమేగాక రాజధానీనగరమునైనఁ గాపాడుకొనలేకపోయిరి. విజయనగరరాజ్యముయొక్క ధనకనకవస్తువాహనాదులను శత్రువులిచ్చవచ్చినట్లుచూఱఁగొనిరి. రామరాయలతల హుస్సేనునిజాముషా తనస్వహస్తముతో నఱికి " ఇప్పుడుగదా నీమీఁది పగఁదీర్చుకొనఁగలిగితిని. దేవుఁడు నాకేమి విధింపనున్నాఁడో విధింపనిమ్ము " అని పలికెనని కూటో వ్రాయుచున్నాఁడు.

రామరాయలమృతికి ఏడిల్‌షా మిక్కిలి చింతించెనట! ఈదుర్వార్త విజయనగరమువరకుం బోయెను. ప్రజలు తమకు రాంబోవుదుస్థితి యెఱుంగకయేయుండిరి. తామేమయింతుమని దృఢ విశ్వాసము గలిగియుండిరి. అయ్యో! పాపము! దుర్వార్త వినవచ్చెను. సేన యోడింపబడినది. ప్రభువులు నేలంగూలిరి సేనలు పాఱివచ్చుచున్నవి అనుపలుకులు నగరమంతయు వ్యాపించెను. చావగామిగిలిన రాజకుమారులు పరుగులిడుచువచ్చి నగరములోం బ్రవేశించి సింహాసనమును భొక్కసమునంతయును సమస్తవస్తువాహనాదులను గైకొని యైదువందలయేనుగులపై నిడుకొని నగరలక్ష్మిని నిర్దయులై శత్రువులకు విడిచిపెట్టిపోయిరి తిరుమలదేవరాయలు సదాశివదేవరాయలను వెంటనిడుకొని యీధనరాసులతోం బాఱిపోయి పెనుగొండదుర్గము ప్రవేశించెను. నగరమంతయు నల్లకల్లోలమయ్యెను నగరవాసులు ఱెక్కలులేనిపక్షులవిధమున దిక్కులేకయుండిరి. మరునాడు లంబాడీలు బ్రింజారులు కురుబాలు మొదలగునడవిజాతివాండ్రు నగరములోం బ్రవేశించి సమస్తమును చూఱగొనిపోయిరి. మూడవనాడు శత్రువులువచ్చిపైబడిరి. అయిదునెలలవరకు నగరలక్ష్మి శత్రువులవలన హింసింపంబడుచుండెను. శత్రువులు దయాశూన్యులై నిరపరాధులగుప్రజలను జంపుచుండిరి దేవాలయములను విడియగొట్టుచుండిరి. రాజభవనముల నేలపాలు చేయుచుండిరి ఇవియవి యననేల పెక్కుకట్టడములను నేలంగూల్చిరి. చిత్రింపుంబనులం జెఱిపివేసిరి. స్త్రీలం జెఱపట్టిరి. ఇంతశీఘ్రకాలములో నింతయాకస్మికముగా నింతటిమహానగరము నాశనముచేయబడినట్లుగా బ్రపంచములో నెచ్చటను నిట్లుజరిగియుండలేదు. నిన్నటిదినము నాగరికమునకు మిన్నయైనసమస్తవైభవములకాటపట్టయి ప్రపంచములోగల నగరములన్నిటిలోను ప్రఖ్యాతము జెందిన ఈమహానగరము నేడు శత్రువులయధీనమై యైశ్వర్యమును గోలుపోయి సమస్తదౌర్జన్యములకు నికిపట్టయి నాశనము చేయబడుటలెలంచుకొనగా నెంతో యద్భుతము



గానుండి యెట్టివానినైన దుఃఖసాగరమున ముంచకమానదు. కటకటా! విధివిధానము నపకడ్డుపడువారుగలరా! విజయనగరప్రాభవ మేటితో యస్తమించినది. శత్రువులు నగరమును పాడుచేసి రాజ్యమును గైకొనుటకైకమత్యములేనికారణమున దేశమును మాత్రము హిందువులకు విడిచిపెట్టి స్వదేశములకుం బోయిరి. రెండు సంవత్సరములకావల నిటాలియాదేశపు బాటసారి సీజరుఫ్రెడరిక్కనువాడు తిరుమలదేవరాయల మహానగరమును పునరుద్ధారణము చేయవలెనని ప్రయత్నించెనుగాని కొనసాగలేదనియును ఆమహానగర వీధులలో వ్యాఘ్రము మొదలగు ఘాతుకమృగములు చెరలాడుచుండగాం దానుజూచితిననియు వ్రాసియున్నాండు. ఏడిల్‌షా విజయనగరమునం జూరగొన్నవస్తువులలో కోడిగ్రుడ్డునుమించిన పరిమాణముగల వజ్రకూడనుండెనట. అదిమొదలుకొని విజయనగరము తిరిగి తలయెత్తనేలేదు నాటితో నేస్వరూపనాశనమైనది ఇప్పుడు పాడువడినచిహ్నములు దక్క వేఱేమియుగానరావు.

## ఇరువదిమూడవప్రకరణము.

రామరాయల వినాశమునకుం గారణము — రామరాజభూషణకవి — వసుచరిత్రమును రచించి తిరుమలదేవరాయల కంకితము చేయుట — పోర్చుగీసువారి వర్తకవ్యాపారము — తిరుమలదేవరాయల ప్రభుత్వము — సదాశివరాయలమరణము — తిరుమలదేవరాయలు పోర్చుగీసువర్తకులను మోసపుచ్చుట — సామంతప్రభువులు స్వాతంత్ర్యమును బ్రకటించుట — ఏడిల్‌షా దండయాత్రలు — ఏడిల్‌షా వెంకటాపురమును జయించుట — ఏడిల్‌షా బెల్లముకొండ మొదలగు దుర్గములను జయించుట — కుతుబ్‌షా హిందువులకుం దోడ్పడుట — కుతుబ్‌షా కొండవీడుదుర్గముపై దండెత్తి జయించుట — తిరుమలదేవరాయలు శ్రీరంగరాయలను పట్టాభిషిక్తునిం జేయుట — ఏడిల్‌షా చంపంబడుట — కుతుబ్‌షామరణము — మహమ్మదుకులీ కుతుబ్‌షా సింహాసనమెక్కుట — హైదరాబాదు నగరనిర్మాణము — వేంకటపతిరాయలు సింహాసనమెక్కుట — రాజధాని పెనుగొండ

నుండి చంద్రగిరికిమార్చుకొనుట— వీరవెంకటపతిరాయలమరణము— మొగలాయీచక్రవర్తులు దక్కనుసుల్తానులను జయించిరాజ్యములుగైకొనుట— మహారాష్ట్రీయు— శివాజీకందనోలుమొదలగునవి జయించుట— వెంకోజీ తంజాపురిజయించుట.

కృష్ణరాయల తరువాత విద్యానగరరాజ్యమును బరిపాలించినవారిలో రామరాయలే కృష్ణరాయలతో సమానుఁడని చెప్పవచ్చును. రామరాయ లెట్టిరాజ్యతంత్రజ్ఞుఁడయినను తాను స్వయముగా యుద్ధభూమికిఁబోయి యుద్ధముచేయఁ బ్రయత్నింపకున్న హిందూరాజ్యమునకింతశీఘ్రకాలములో వినాశనము కలుగకుండును. ఇతఁడు దక్కనుసుల్తానుల వశముఁజేసికొని యొండొరులకు వైషమ్యములను బురికొల్పి వారల వ్యవహారములలో జోక్యము కలుగఁజేసికొని బొమ్మలవలెనాడించుటయే తుదకీతనిచేటునకుఁ గారణమైనది. ఇతఁడు గర్విష్ఠియై శత్రువుల నలక్ష్యముసేయుచువచ్చుటగూడ నీతనియెడ మహమ్మదీయసుల్తానులకుగల ద్వేషాగ్ని బ్రజ్వలింపఁజేయుచువచ్చెను. ఇతఁడు కృష్ణరాయలంబోలె లోకోపకారకార్యములనేకములుగావించెను. ఆంధ్రకవులనుబోషించి భాషాభివృద్ధిఁగలుగఁజేసెను. ఇతని యాస్థానవిద్వత్కవి భట్టుమూర్తి. ఇతని యాస్థానకవియగుటచేతనే రామరాజభూషణుఁడని పేరువచ్చినది. ఈమహాకవి రామరాయల కడపటిదశయందాస్థానకవిగాఁ బ్రవేశించి యాతనిమరణానంతరము తిరుమలదేవరాయలవద్దఁ బ్రవేశించి వసుచరిత్రమునురచించి యాతనికంకితమొనర్చెను. భట్టుమూర్తి వేఱనియు, రామరాజభూషణుఁడు వేఱనియును పండితులు కొందఱు వివాదములు పెట్టుకొనిరిగాని వారిరువు రొక్కరేయని యాంధ్రకవిచరిత్రకారుని యభిప్రాయముతో నేకీభవించుచున్నాను. ఇతఁడురచించిన వసుచరిత్రమను ప్రబంధముతో సరిరాఁదగిన శ్లేషకావ్యము తెలుఁగున మఱియొక్కటి గానరాదు. ఇందలివర్ణనములు మనోహరములుగాను, పదములుకూర్పు సొంపుగాను, శబ్దార్థాలంకారములు హృద్యములుగాను, రసభావములు యథా



యోగ్యములుగాను నుండి యీపూర్వప్రబంధమే నవీనప్రబంధములకెల్ల మాతృకగానున్నయది. ఇతఁడు సాహిత్యమునందుమాత్రమేగాక సంగీతమునందును మిగులఁ బ్రావీణ్యముగలవాఁడు. వసుచరిత్రముగాక నరసభూపాలీయమను గ్రంధమునురచించి రామరాజు తిరుమలదేవరాయలకు మేనల్లుఁడైన నరసరాజునకంకితము చేసెను. ఈనరసరాజుయొక్క మాతామహుఁడయిన శ్రీరంగరాజునకు కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటపతి, (వేంకటాద్రి) యని యైదుగురుపుత్రులును, లక్కమాంబ, ఓబమాంబ, కోనమాంబ అని ముగ్గురుకుమార్తెలు నుండిరి. వారలలో లక్కమాంబకుమారుఁడైన నరసరాజు కావ్యాలంకారసంగ్రహమను నరసభూపాలీయమును గృతినొందెను.

ఓబమాంబకుమారుఁడైన గొబ్బూరినరసరాజు రామభద్రకవికృతమగు రామాభ్యుదయమును గృతినొందెను. కోనమాంబకుమారుడయిన తిమ్మరాజు పరమయోగివిలాసమను సద్గ్రంథమునురచియించెను. కావ్యాలంకారసంగ్రహమునుమాత్రమేగాక హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్యమునురచించి శ్రీరామాంకితముచేసెను. ఇయ్యది పింగళిసూరనామాత్యవిరచితమగు రాఘవపాండవీయమువలె నంతప్రసిద్ధిబొందలేదు. ఇతఁడు రామరాయలవలన రత్నహారహయవేదండాగ్రహారాదిసత్కారంబులఁ బొందినట్లుగా నీక్రిందివసుచరిత్రపద్యమువలనదేట పడుచున్నయది.

“శా. శ్రీరామక్షితిపున్నదగ్రజుజయ-శ్రీలోలునానాకళా।
పారీణుల్ బహుసంస్కృతాంధ్రకృతులం-బల్మారు మెప్పించితి।
తారుణ్యంబున రత్నహారహయవే-దండాగ్రహారాదిస।
త్కారంబందితి రామభూషణః నీ-ధన్యుండవీవన్నటన్ ॥”

రామరాజుయొక్క యనంతరమునఁ దిరుమల దేవరాయలు సదాశివదేవరాయని చెఱగొనిపోయి పెనుగొండఁజేరి రాజ్యమాక్ర

చువచ్చిరి. రాయసము వెంకటపతి లక్ష్మీవిలాసమను ప్రబంధమును రచించి శ్రీరంగరాయలకుఁ గృతియిచ్చెను.

ఈశ్రీరంగరాయలకు పెమ్మసాని తిమ్మరాజు మంత్రిగానున్నట్టు చెన్నమరాజను కవి "శ్రీరంగరాయధాత్రీతలాధ్యక్షుఁ దక్షిణభుజాదండమై చెలఁగినాఁడు" అని చెప్పిన వాక్యమువలన గోచరమగుచున్నది. ఈశ్రీరంగరాయలు ౧౫౮౫ దవ సంవత్సరమున మైసూరురాజులతో యుద్ధము చేసి చనిపోయినందున నీతని తమ్ముఁడైన వీరవేంకటపతిరాయలు సింహాసనమునకువచ్చి రాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకు పరిపాలనము చేసెను. కృష్ణరాయలకును రామరాయలకును దరువాత బహుభూములను జయించి దక్షిణదేశము నంతను బాలించినవాఁడితఁడే. ఇతనియనంతరము విజయనగరరాజ్యముయొక్క యధికారము పూర్ణముగా నడుగంటినది. మైసూరులోనున్న రాజప్రతినిధియును మధుర తంజాపురి నాయకులును స్వాతంత్ర్య ప్రభుత్వములను స్థాపించిరి. దక్షిణహిందూదేశముయొక్క పదునేడవ శతాబ్దచరిత్ర మల్లకల్లోలముగానుండెను. విజయనగర రాజులయొక్క సంతతివారైశ్వర్యమును నధికారమును గోల్పోయి పేరునకు మాత్రము రాజులై యుండిరి. మహమ్మదీయ రాజ్యములు పదునేడవ శతాబ్దాంతమున నొకదానివెంబడి నొకటి మొగలాయీచక్రవర్తుల పాలంబడి యంతరించిపోయినవి. దక్షిణహిందూదేశమంతయు నిజముగా మొగలాయీచక్రవర్తుల యధికారము క్రిందకుఁ దేఁబడినదని చెప్పవచ్చును. ఇట్లుండఁగా మఱియొక నూతన రాజ్యము ప్రబలి క్రమక్రమముగా వర్ధిల్లి యొకప్పుడు హిందూదేశమునంతయును జయించునట్లుగాఁ గన్పట్టినది. ఇదియే మహారాష్ట్రము. శివాజీ ౧౬౭౩ వ సంవత్సరమునఁ గొంకణదేశమునంతయు జయించుటయేగాక కందనూలు, చెంజి, వేలూరు మొదలగు ప్రదేశములందలి చంద్రగిరిరాజుల యధికారమునంతను రూపుమాపెను. ౧౬౭౮ వ సంవత్సరమున నతని సోదరుఁడైన ఏకోజీయనువాఁడు తంజాపురికోటను జయించి ప్రభుత్వమును నెలకొల్పెను. అతని సంతతివారు నూఱు సంవత్సరములాపురమును బరిపాలించిరి. ఇదియొక్కటి దక్క దక్షిణహిందూదేశమున మహారాష్ట్రులు పరిపాలించిన దేశము వేఱొక్కటి గానరాదు.



వీరవేంకటపతిరాయల కాలముననే తెనాలి రామకృష్ణుఁడు మొదలగు ప్రసిద్ధాంధ్రకవులు ప్రబలియుండిరి. మహాపండితులయిన యప్పయదీక్షితులు తాతాచార్యులు మొదలగువారీతని కాలములోనే ప్రఖ్యాతిఁబొందియుండిరి. రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యమను మహాప్రబంధమును రచించి విరూరి వేంకటాద్రికిఁ గృతియిచ్చెను. ఇతనిగుఱించియుఁ బై పండితులనుగుఱించి పెక్కుకథ లాంధ్రదేశమునఁ జెప్పుకొనఁబడుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే నయ్యవి యిటఁ దెలుపలేను. వీరవేంకటపతిరాయలు వృద్ధుఁడై ౧౬౧౪ వ సంవత్సరమున మృతినొందెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము.

వీరవేంకటపతిరాయలు జగ్గరాయలపుత్త్రిక బాయమ్మను వివాహమగుట — సంతానము లేకుండుట — బ్రాహ్మణస్త్రీ బాయమ్మను గర్భిణిగానున్నట్టు నటింపుమని బోధించుట. బ్రాహ్మణయువతి తాను ప్రసవించిన కుఱ్ఱవానిని బాయమ్మకడకుఁ బంపుట — బాయమ్మకుఁ బుత్రజననమైనదని ప్రకటించుట — రాయలు కృత్రిమపుత్త్రునికి వివాహముచేయుట — రాయల యవసానదశ — రాయలు మేనల్లునికిఁ బట్టముగట్టుట — రాయలమరణము. జగ్గరాయలు మొదలగువారు కలహించుట — చిక్కరాయలు ప్రభువులతో ద్వేషపడుట — దండనాయకులు కుట్రచేసి కోటలోఁ బ్రవేశించుట — రాయలు పట్టుపడుట — రాయలు చెఱసాలం ద్రోయఁబడుట — ఏచమనాయకుఁడు కలహించుట — రజకుని వృత్తాంతము — రజకుఁడు రాయలపుత్త్రుం దెచ్చుట — జగ్గరాయలు ఏచమనాయకుని దన ప్రక్కకు రమ్మని బోధించుట — అతఁడు నిరాకరించుట — భటులు చెఱసాలకడ పహరాకు కుదకముత్రవ్వుట — రాజభటులు చూచుట — ఏచమనాయకుఁడు నగరులో నిద్రించువాయికి లంచమిచ్చి రక్షకభటులను జంపించి కోటముట్టడించఁజేయుట — జగ్గరాయలు మోసపడి యాదళవాయిని జంపుట — జగ్గరాయలు క్రూరకృత్యుఁడై

జానువాసికుటుంబమునుజంపించుట — ఏచమనాయకుఁడు యుద్ధముచేయుట — చిన్నరాయలను సింహాసనమెక్కించుట —

వీరవేంకటపతిరాయల మరణానంతరము రాజ్యభారమును వహించుటను గూర్చి విచారకరములగు కొన్ని విషయములను ౧౬౧౬ వ సంవత్సరము డిసెంబరు ౧౨ వ తేదీని కొచ్చిపట్టణమునుండి మ్యాన్యుయల్ బర్రాదాసును (Manuel Barradas నతఁడు వ్రాసిస్వదేశమునకుబంపినదానిని రాబర్టుస్యూయలు దొరగారుభాషాంతరీకరించిరి దానినేయిటదెలుపుచున్నాఁను. వీరవేంకటరాయలు జగ్గరాయలకొమార్తెయగు బాయమ్మనువివాహమయ్యెనుగాని యామెచిరకాలమునుండి సంతానముకొఱకు వేచియున్నను తుదకట్టిసంతానభాగ్యముపట్టినదికాదు. ఈరాణియొక్క పుట్టినింటనుండునొకబ్రాహ్మణయువతి తనరాణికుండువాంఛనెఱిగి దైవమట్టివాంఛనుదీర్పకయుండుటకుఁ జింతించి తానొకనెలనుండిగర్భిణిగానుండుటదెలిసికొని తనరాణికిఁజెప్పి యంతటను బ్రకటింపవలసినదనియును తాను బ్రసవమైనతోడనే యాశిశువునుపరమరహస్యముగా నీకడకు బంపెదననియును నీవుకొడుకుబుట్టినట్లుగాఁ బ్రకటింపవలసినదనియుహితవుగఱపెను. బాయమ్మకిదిహితవుగాఁ గన్పట్టుటచే తనట్లుదానుగర్భవతిగానున్నట్టు నటించుచు వెల్లడించుచుండెను. బ్రాహ్మణస్త్రీప్రసవమైనవెంటనే యాశిశువును రహస్యముగా బాయమ్మకడకు బంపెను. బాయమ్మతనకుకొడుకుపుట్టినట్లుగాఁ బ్రకటింపఁజేసెను.

రాయలకీమర్మమంతయుఁ దెలిసియున్నను రాణియెడఁగల ప్రేమాతిశయముచేత నేమియుననఁజాలక శిశువునకు జాతకర్మాది సంస్కారములుగావించి పుత్రోత్సవమును జరిపించి చిక్కరాయలని నామకరణముచేసెను చిక్కరాయలనఁగా చిన్నరాయలనుట. అయినను రాయలువానిని నిజమైనపుత్త్రునిగా భావించి సన్మానించియుండలేదు. మఱియునాతఁడు వానిని చంద్రగిరిదుర్గములో



ని రాజభవనమునుంచి తనయుత్తరువులేనిదే వానిని వెలుపటికిఁ గొనిపోరాదనియును, అట్లుపోఁదలఁచెనేని రాణికూడఁ బోవచ్చుననియు శాసించెను. వానికిపదునాలుగేండ్లు వయస్సురాఁగానే తనబావమఱదియగు ఓబలరాయలను సంతోషపెట్టుటకై తనమేనకోడలనిచ్చి వివాహముచేసెను. ఈయోబలరాయ లెవరో దెలియకున్నయది (జగ్గరాయలపుత్త్రుఁడేమో?) వీరవెంకటపతిరాయలు తాను మృతినొందుటకు మూడురోజులకుఁబూర్వమే తనపుత్త్రుఁడని ప్రకటింపఁబడిన చిక్కరాయనికిఁగల హక్కునుదిగఁద్రోచి తనమేనల్లుడైన చిక్కరాయలను బిలిపించి రాజ్యములోని ప్రభువర్యులనేకుల యెదుటఁ దనకుడిచేయివానిప్రక్కకుఁ జాచి తనచేతనున్న రాజముద్రికనుగైకొమ్మనియును, రాజ్యభారమునువహింపుమనియుఁ దెలియఁజేసెను. ఇట్లుపలుకుటతోనే యాతఁడుగన్నులనీరు గార్చుచు తానుప్రభుత్వమునుదాల్చుట తనకిష్టములేదనియు, దానినితానెవ్వనికీయవలసియుండునో వానికేయీయవలసినదనియును వయోవృద్ధుడైన యారాయలకాళ్ళుపట్టుకొని యేడ్వసాగెను.

వానినిలేవదీయవలసినదిగాఁజుట్టునుండువారికి సైగచేసెను. వారట్లతనిలేవదీసి రాయలకుడిచేతికందునట్లుగాఁ దీసికొనివచ్చిరి. ముద్రికనుదీసికొనునట్లుగాఁ దనచేయిచాచెను. ఆరాజకుమారుడు తనచేతులుతలపైకెత్తి యాముద్రికనుగ్రహించుటవిధి విధానమేయైనయెడల నయ్యది తనకెట్టికీడుకలుగఁజేయునో తానది గైకొనకుండుటకు క్షమింపవలసినదని గట్టిగావేడికొనెనుగాని రాయలతన ముద్రికను దీసికొని వ్రేలిచివరనుంచి చిక్కరాయలను దీసికొమ్మనిరెండవసారియుఁ గోరెను. దండనాయకులెల్లరును దీసికొనవలసినదని ప్రోత్సాహపఱుపఁగా నెట్టకేలకునాతఁడు దానిని గైకొని శిరస్సుననుంచుకొని తనవ్రేలికిదొడుగుకొనెను పాపమాతడు రాజ్యభారమును వహింతునని సంతోషపడుటకుమాఱుగాఁగంటికి నేలకు నేకధారగానేడ్వమొదలుపెట్టెను రాయలు చిక్కరాయలకు

రెండులక్షలక్రూజడోల విలువగల పతకమును ఆఱులక్షలక్రూజడోలవిలువగల ఘనతరవజ్రమును రెండులక్షలక్రూజడోలు విలువగల చెవులతమ్మంట్లును ఎక్కువవిలువగల తనపెద్దముత్తియములనుబహుమానము చేసి యాతఁడే తనతరువాత రాజ్యభారము వహింపవలసినవాఁడని ప్రకటింపఁజేసెను. కొందఱు సంతోషించిరి. మఱి కొందఱు విచారించిరి. మూఁడుదినముల కావలరాయలు తన ౬౭ వ యేట మృతినొందెను. తరువాతవానిశరీరమునకు మంచిగంధపు చెక్కమొదలగు సువాసనగల వస్తువులతో దహనసంస్కారము రాయల యారామమునందె జరుపఁబడెను. అతనితోఁగూడ రాణులుమువ్వురు సహగమనము చేసిరి. ఒకరాణిరాయలతో సమానవయస్సుగలదియును తక్కినయిరువురును ముప్పదియైదుసంవత్సరముల వయస్సుగలవారుగానున్నారు. వారలుతమకుంగల సువర్ణమణిమయాలంకారముల నలంకరించుకొని ధైర్యముతోఁ జితికడకువచ్చి తమయాభరణములన్నిఁటిని బంధుజనంబులకును బ్రాహ్మణులకును దానముచేసి యెత్తుప్రదేశమునుండి భర్తశవమునుదహింపఁజేయుచున్న యగ్నిగుండము మధ్యకుథయిర్యమచ్చుపడనుటికి తాముగూడఁ బ్రాణములగోలుపోయిరి. శ్రీరంగరాయలను నామాంతరముగల చిక్కరాయలు పరిపాలనము చేయుటకు నారంభించి దండనాయకులను గొందఱిని కోటలోనుండగూడదని యుత్తరువుచేసి కొందఱిని తనప్రక్కనుంచుకొనెను. అందఱునాతనియధికారమునకొప్పుకొనిరిగాని మువ్వురుమాత్రము చిక్కరాయల నురాజుగా నంగీకరింపలేదు.

ఇరువదివేలబలమును రణరంగమునజేర్పగలట్టియును ఆరులక్షలక్రూజడోలురాబడిగలట్టియును జగ్గరాయలనునతఁడు మొదటివాఁడు నాలుగులక్షలక్రూజడోలురాబడిగలట్టియు పండ్రెండువేలబలమునకధికారియునగు తిమ్మనాయకుఁడు రెండవవాఁడు. రెండులక్షలక్రూజడోలు రాబడిగలట్టియును ఆరువేలసేనకధికారియునగు



మేచరాయలుమూఁడవవాఁడుగానుండెను. వీరలుమువ్వురునురాయలకుగప్పముకట్టవలదనియును రాయలపుత్త్రుఁడని చెప్పబడిన జగ్గరాయలమనుమని సింహాసనమెక్కింపవలసియుండుననియు నిశ్చయించుకొని తంత్రములుపన్నుచుండిరి. రాయలనురాజ్యపదభ్రష్టునిఁజేయ వేచియున్నవారలకనువైనసమయముగూడఁ దటస్థించెను. రాయలుతనకు నయిదులక్షల క్రూజడోలుకప్పము గట్టుచు దళవాయిగానున్నవానిని బిలుపించి యాతనిస్వాధీనములోనున్న మూఁడుకోటలను తనయిరువురుకొడుకులకీయవలసినదనియును తన మంత్రినిబిలుపించి మృతినొందినట్టితనమేనమామయగు వృద్ధరాయలవద్దనుండియపహరింపబడినవని చెప్పఁబడు లక్షక్రూజడోలను చెల్లింపవలసినదనియును వృద్ధరాయలబావమరదియగు నారప్పరాయలనురప్పించి యాతనితోబుట్టువిచ్చిన యాభరణములన్నిటిని తనకీయవలసినదనియును నుత్తరువుచేసెను. వారలుమువ్వురును రెండుదినములలో రాయలయుత్తరువును చెల్లింతుమనివేడికొనియిండ్లకుఁబోయి జగ్గరాయలతో దురాలోచనము చేయుచుండిరి. ఒకప్పుడుజగ్గరాయలును తిమ్మానాయకుఁడును మేచరాయలును రాయలకుఁ గప్పముచెల్లించి రాయలనుదర్శింతుమని వర్తమానము చేసిరి దురదృష్టవంతుఁడైన యారాయలందుల కంగీకరించెను. జగ్గరాయలు తనసేనలో నాఱితేఱిన యైదువేల యుద్ధభటులనుదీసికొని తక్కినవారినిఁ బట్టణమువెలుపల నుంచి తాను కోటలోనికిఁ బోయెను. తక్కినయిరువురు నొక్కొక్కరు రెండేసివేల భటులను గైకొని కోటలోఁ బ్రవేశించిరి. ఈకోటకు రెండు ప్రాకారములు గలవు. జగ్గరాయలు మొదటిద్వారముకడ వేయిభటులను, రెండవద్వారముకడ వేయిభటులను నిలిపెను. దళవాయి తక్కిన రెండుద్వారములను స్వాధీనముఁ జేసికొనెను. ఇంతలో గందరగోళము పుట్టి యీకుత్సితులకుతంత్రము వెల్లడియయ్యెను. రాయలు కోటతలుపులుమూయవలసినదిగా నుత్తరువుచేసెనుగాని కలహకా

రులు వానిని సమీపించినతోడనే బ్రద్దలుగాఁగొట్టుచుండిరి. మేచరాయలు తనప్రయత్నములో విజయమునుబొంది కోటలో దూరి రాయలకిట్లువర్తమానముచేసెను. జగ్గరాయల మనుమఁడు గతించిన రాయలపుత్త్రుఁడు గావున నాతనినే రాయలనుగాఁజేసెదమనియును, నీవు మాకులోఁబడినయెడల మీకేవిధమైనహాని మావలనఁ గలుగకుండఁ గాపాడెదనని యొట్టుపెట్టుకొనెదననియుఁ దెలియఁజేసెను

నిర్భాగ్యుఁడైనయారాజు తానునిరాధారుఁడైయుంటనెఱిఁగియంతకన్న వేఱుమార్గముగానరానందున మేచరాయల వాగ్దత్తమునంగీకరించి తానును తనభార్యయును కొడుకులును అంతఃపురభవనమునువిడిచి యుద్ధభటులమధ్యనుండి దారిచేసికొని దీనవదనుఁడై మొగమువాంచి చూపునేలమీఁదికినిగిడించి నెమ్మదిగఁబోవుచుండెను ఆచారమననుసరించి యెవ్వరునునాతనికి నమస్కరింపరైరి. ఆతఁడునునెవ్వనికిని వందనముచేయలేదు. జగ్గరాయలు తనమనుమని సింహాసనముపైఁ గూరుచుండఁబెట్టి ప్రభువులనుమంత్రులను దండనాయకులను నాతనికివిధేయులగునట్లుచేసి రాయల యొక్క సమస్తాభరణములను రాజముద్రికఁగైకొనెను. అతఁడుగైకొనినదానిలో మూఁడుగంపల మణులుగూడఁగలవు వానివిలువయింతనిచెప్పరాదు. రాజ్యమునుగోలుపోయిన రాయలు చెఱసాలయందుఁ బెట్టబడి రక్షకభటులచేఁ జుట్టుకొనఁబడియుండెను. దండనాయకులెల్లరు నాతనివిడిచిపెట్టిరి కాని ఏచమనాయకుఁడను దళవాయిమాత్రము రాజద్రోహమున కొడంబడక రాజభక్తికలవాఁడై జగ్గరాయలతోఁగలియుటకు సమ్మతింపక కోటవెలుపలనేయుండి యీవార్తవిన్నతోడనే తానువెడలిపోయి తనకోటఁజేరి సైన్యములను గూర్చుకొనుచుండెను.

ఈక్రొత్తరాయలకు కానుకలుచెల్లించి నమస్కరింపవలసినదనియును, అట్లు నమస్కరించిలోఁబడనియెడల వానిని ధ్వంసము



చేయఁగలవారమనియును జగ్గరాయలు ఏచమనాయకునకు వర్తమానముచేసెను. తల్లియెవ్వరో తండ్రియెవ్వరో కులమేదో తెలియంబడని కుఱ్ఱవానికిఁ దాను లోఁబడవలసిన యగత్యము లేదనియును, తన్ను ధ్వంసముచేయనిశ్చయించినయెడల నగరము వెడలి వచ్చి కలిసికొనవలసినదనియును, అట్లు చేసినయెడలఁ దనసైన్యముతోఁ దాను వేచియుండెదననియుఁ బ్రత్యుత్తరమంపెను. ఈ ప్రత్యుత్తరమునుబొంది జగ్గరాయలు బిరుదులిచ్చెదననియు, లంచమిచ్చెదననియు వేయి సామవాక్యములుబోధించినను వానిమనస్సు తిరిగినదికాదు. ఇంతియగాక యేచమనాయకుఁడు తన సైన్యములతో రణరంగమును జేరి జగ్గరాయలను యుద్ధమునకు రాఁగోరుచుండెను. ఏచమనాయకుఁడు తనప్రక్కకువచ్చునను మాట వదలుకొని తక్కిన దండనాయకులకు బహుమానములను లంచములనిచ్చి తనప్రక్కకాకర్షించుకొనెను జగ్గరాయలిట్లు దండనాయకులను వశముచేసికొనుచుండఁగా నీతఁడు కారాగృహమునందున్న రాయలనెట్లు విడిపింతునాయని సాధనోపాయములను జింతించుచుండెను. అది సాధ్యముకాకపోవుటచేత వాని కుమారులలో నొక్కనినైనఁ బడయుటకుఁ జేతనైనంతకృషిచేసెను.

ఎట్లనఁగా రాగృహవాసముచేయుచున్న రాయల మలినవస్త్రములను శుభ్రముచేయు రజకునిరప్పించి వానికివిశేషబహుమానములను జేసెదనని యెట్లయినరాయల రెండవకుమారునిఁ దీసికొనివచ్చితనకునొప్పగించవలసినదని గోరెను. అందులకు వాడుసమ్మతించి యట్లచేసెదఁగాని యీసంగతిపరమరహస్యముగా నుంచవలసినదని చెప్పి వెడలిపోయి తనవంతుదినమువచ్చినప్పుడేచమనాయకునివద్దనుండి యొకతాటియాకునుత్తరమునుదీసికొని రాయలవద్దకుఁబోయి యీయుత్తరమునుజూపించి తనకొడుకులలో నొక్కనిదనతోఁబంపవలసినదనికోరెను. రాయలందులకుసమ్మతించెను. పెద్దవాడుపదునెనిమిదేండ్లవయస్సుగలవాడగుటచేత వానింగొనిపోవుట సాధ్యము

గాదనియెంచి పంద్రెండేండ్ల వయస్సుగల రెండవవానిని నొప్పగించెను. రజకుడాపిల్లవానిని మురికిబట్టలలోనుంచిన సహ్యాకరములును దుర్గంధమును బుట్టించునట్టియు మిక్కిలిమలినవస్త్రములను నామూటపైనబెట్టి యామూటతలనిడికొని త్రోలగుండు త్రోలగుండు అనికావలిబంట్లమధ్యనుండి కోటవెలుపలకువచ్చితిన్నఁగాఁదన యింటికిఁబోయి మూఁడుదినములుంచుకొని నాలవనాఁడేచమనాయకునికినొప్పగించెను. ఆతఁడువానిపరివారమును మిక్కిలిసంతసించి యారజకునికిబహుమానములిచ్చిపంపివేసి జగ్గరాయల నోడించి యాచిన్నవానినిసింహాసనమెక్కించుటకై సేనలనుసమకూర్చుకొనుచుండెను.

రాయల రెండవకొమారుఁడు తప్పించుకొనిపోయి యేచమనాయకునివద్దనున్నాఁడని జగ్గారాయలువిని భీతచిత్తుఁడై బెంగపెట్టుకొని చిక్కరాయలను వానికుటుంబమును నచటినుండితప్పించి శత్రువులకు దుస్సాధ్యమగు మఱియొకస్థలమునకుఁజేర్చి మున్నటికన్న ద్విగుణముగా నెక్కువసంఖ్యగల రక్షకభటులను గావలియుంచి ద్వారములనుమూయించి యాతనికిబియ్యమును నాజూకులేనికూరలునుమాత్రమే పంపుచుండవలసినదని యుత్తరవుచేసి వేయికన్నులతోఁజూచుచు నేమరకయుండెను. చిక్కరాయల రెండవకుమారుఁ డేచమనాయకునివద్దనున్నాఁడని విన్నతోడనే జగ్గరాయల దండనాయకులలో నలుగురుపోయి యాతనితోఁగలిసికొనిరి. ఇప్పుడు పదునాఱువేలసైన్యముతో నేచమనాయకుఁడు చిన్నరాయలను సింహాసనమెక్కింపఁగలనుగదా యని యువ్విళ్ళూరుచుండెను. కాఁబట్టితానుచిక్కరాయలను విడిపించుటకై యుపాయములనాలోచించుచుండెను. తుదకుతనభటులలో మంచి తెలివిగలవారిని నిరువదుండ్రను రప్పించి యెటులనైన రాయలనువిడిపించి తీసికొని రావలసినదనికోరెను వారలు రాయలున్నయింటికి భూమిలోపల నుండి కందకమునుద్రవ్వుకొనిపోయి యాతనికి మీయుత్తరముని



చ్చి యాకందకముగుండా దీసికొనివచ్చెదమనిచెప్పి చంద్రగిరికిఁబోయి రాయలున్నచెఱసాలను గాచుచున్నదళవాయివద్దకుఁ బోయి యాతనినాశ్రయించి యాతనివద్దకొలువునకుఁ గుదిరి కొన్నిదినములకుఁదరువాత తాముతలపెట్టినపని ప్రారంభించి రాయలగృహమునకు కందకమునుత్రవ్వుకొనిపోయి యాతఁకిచమనాయకుఁడిచ్చి నజాబునుచూపించిరి

అదిచూచి రాయలద్భుతపడి తాను వారలతో వచ్చుటకు నొడంబడి భార్యాపుత్రులకుఁజెప్పి వారలభయముడిపి శీఘ్రకాలములోనే వారిని చెఱలోనుండి విడిపింతునని వాగ్దత్తముచేసి యదృష్టవిహీనుఁడైన యారాజు బయలుదేరెను. ఇంతలో వానిదురదృష్టవశంబున నారాత్రి నగరుకాచుచున్న భటుఁడొకఁడు తాను బట్టుకొన్నకాగడాతోఁగూడఁ గందకములోఁగూలుట తటస్థించెను. వాఁడుబొబ్బలువెట్టగానే యారక్షకభటులెల్లఱును లేచివచ్చికందకమునుజూచి యద్భుతపడి యెల్లఱును కందకమెచటికిఁబోవునోచూతమని బయలుదేర తుదవఱకుఁబోవునప్పటికి నారాజు కందకములోనికి దిగుచుండెను. వారలాతనింబట్టుకొని జగ్గరాయలకుఁ దెలియఁజేసిరి. జగ్గరాయలుచిక్కరాయలను నాతనికుటుంబమును మిక్కిలియిఱుకయిన మఱియొక కారాగృహమునకుఁ గొనిపోయిమున్నటికన్న నెక్కువకట్టుదిట్టములతోఁ గాపువెట్టియుండెను. ఈయుపాయముగూడ వ్యర్థమైనదిగదాయని చింతించి యేచమనాయకుడుజగ్గరాయలనగరులోని యొకదళవాయికి లంచమిచ్చి యాతని వశముఁజేసికొనెను. ఒకనాఁడుజగ్గరాయలుకోటవిడిచి యొకసామంతప్రభువునెదుర్కొనుటకై బయలకుఁబోయి నపుడు లంచముగ్రహించిన దళవాయినగరుగాచుచున్న రక్షకభటులను నఱికివైచి మూఁడుద్వారము లాక్రమించుకొని వెంటనేవచ్చి కోటఁబట్టుకొనవలసినదని యేచమనాయకునకు వర్తమానమంపెను. జగ్గరాయనార్తవిని తనసేనలతోఁ బఱువెత్తుకొనివచ్చి శత్రువులెఱుంగని

మఱియొకద్వారముగుండ లోపలఁ బ్రవేశించి యాదళవాయిని నాతనియేనూఱుభటులను సంహరించి క్రోధావేశపరవశుఁడై తనతమ్ముఁడగు చిన్నయోబలరాయలనురప్పించి చిక్కరాయలను వాని కుటుంబమును స్వహస్తముతోఁ జంపుకొనునట్లుగా నాజ్ఞాపించి యటులఁ జేయనియెడల వారలనుసఱికివైచి రమ్మని క్రూరకర్ముఁడై యాజ్ఞాపించెను. అనురాత్ముఁడాతని యాజ్ఞఁగైకొని రాయలవద్దకుఁబోయి పిడుగువంటియీవార్త నాతనికివినిపించెను. అయ్యో! పాపము! ఆయదృష్టహీనుఁడు చేయునదిలేక కొంతసేపుభార్యతో మాట్లాడుచు ఖడ్గమును బెఱికి యామెతలఁ ద్రుంచెను తరువాత కడగొట్టుపుత్త్రిని తలద్రుంచెను. అటుపిమ్మట పిన్నపుత్త్రిక తలఁ ద్రుంచివైచెను. తరువాతతనకోడలిని జంపుమని పెద్దకొడుకునకుఁ జెప్పెను. ఆతఁడును తనభార్యనట్లు ద్రుంచివైచెను. నాలుగువ్రేళ్ళు వెడల్పుగలిగి పొడవైనకత్తిఁగైకొని పొడుచుకొని రాయలు ప్రాణములనువిడిచెను. తండ్రినిఁజూచి కుమారుడు నట్లేపొడుచుకొనిచచ్చెను. వారలు చంపలేకవిడిచిపెట్టిన యాడుకూఁతును నా ద్రోహి నిర్దయాత్ముఁడై తెగటార్చెను. ఇట్లుక్రూరసంహారమును ముగించి మనుమనికిఁబగవారు లేకుండ సింహాసనము లభించిన సంగతిని సంతోషముతో నాపాపకర్ముఁడు జగ్గరాయలకడకువచ్చి నివేదించెను.

ఇట్టిదుష్కృత్యమునుగాంచి సహింపలేక సామంతప్రభువులు కొందఱుజగ్గరాయలను విడిచి యేచమనాయకుని పక్షమునఁ జేరి యాపిన్నరాయలను గెలుపించి సింహాసనమెక్కింపవలయునని కృతనిశ్చయులైరి. ఏచమనాయకుఁడీవార్తనువిని మిక్కిలిదుఃఖించి క్రోధావేశ పరవశత్వముతో జగ్గరాయలకిట్లు వర్తమానముచేసెను. "నీవుదుర్మార్గుఁడవై నీరాజును ఆతనికుటుంబమును దెగటార్చితివి నావద్ద నీచిన్నవాఁడొకఁడు మిగిలియున్నాఁడు. బయలుదేఱివచ్చి నాతోయుద్ధముచేసి నన్నునువీనిని జంపినయెడల నీ



మనుమఁడు సురక్షితముగా రాజ్యమేలగలఁడు; రమ్ము." అని వార్తపంపఁగానే జగ్గరాయలు సమరము చేయుట కొడంబడక యుపేక్షించెనుగాని యేచమనాయకుఁడు యుద్ధసన్నద్ధుఁడై కయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండఁగా నూరకుండలేక యిరువదివేలసైన్యముతో నేచమనాయకుని దలఁపడెను యుద్ధరంగమున నిలువలేక యోడిపాఱిపోయెను. ఏచమనాయకుఁడు రాజ్యమాక్రమించుకొని రెండు సంవత్సరములు జగ్గరాయలతోను, మధురనాయకునితోను బోరాడిగెలిచి శ్రీరంగరాయలను బేరుతో నాతనిసింహాసనమున నిలిపి పేరు ప్రతిష్ఠలనుగాంచెను. శాశ్వతమైనకీర్తిఁబడసెను. ఇతఁడిప్పటి వెంకటగిరిరాజులకుఁ బూర్వికుఁడుగానున్నాఁడు.

దామెర వెంకటపతియను కవి తనబహులాశ్వచరిత్రము నందిట్లు యాచమనాయని వర్ణించియున్నాఁడు.

సీ. ఉత్తిరమల్లూరి-యొద్దరావలుపాఱ
విభునిగొట్టిననాఁటి-విజయకలన
చెంగలుపట్టుపై-కెంచిలగ్గలుపట్టి
యాక్రమించిననాఁటి-విక్రమంబు
పాళెముకోటచె-ల్వటపాజియుతిరాళ్ళ,
జరగఁజేసిననాఁటి-శౌర్యపటిమ
తిరుమలఁజేరదా-త్రినిమున్నె రాజులఁ
బొంగఁదోలిననాఁటి-బాహుబలము
మున్నెతోపూరజగ్గ-రాణ్ముఖులనొంచి
మధురదొరఁజెంజిమన్నీ-ని-మదమడంచి
తిరుమనాపల్లెదొరఁదోలు-తేజముగల
మేటివెలుగోటియాచని-సాటిగలరె॥

౧౬౩౯ వ సంవత్సరమున శ్రీరంగరాయలను నతఁడుచంద్రగిరిని పాలించుచుండెను. ఆకాలముననే యాతఁడు సెంటుజార్జికోటకట్టుకొనుటకై యింగ్లీషువారికి భూమిదానము చేసినాఁడు.

అచటపట్టణమునుగట్టి శ్రీరంగరాయలపట్టణమని పేరు పెట్టవలసినదిగా ను త్తరువుచేసినను, ఆప్రదేశమున కధికారిగానున్న నాయకుఁడాపురమునను రాయలపేరు పెట్టక తనతండ్రి చెన్నప్పపేరు పెట్టినకతమునఁ జెన్నపట్టణమని పేరు పెట్టఁబడెను. రామరాయలసంతతిలోనివారును శ్రీరంగదేవరాయలను నామముగలవారును నగునట్టి యొకరాజకుమారుఁ డిపుడానెగొంది జాగీరుననుభవించుచును రక్షితముగానుండియున్నారు.

సంపూర్ణము.

---

Printed at the Manjuvani Press, Ellore.

